శ్రీ

# సీతారామాంజనేయసంవాదము.

పరశురామపంతులు లింగమూర్తి గురుమూర్తి.

---

మద్దూరి శ్రీరామమూర్తికవి

విరచిత తాత్పర్యముతో.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య,

సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

 1935 [వెల 2—8—0.

శ్రీ

# సీతారామాంజనేయసంవాదము.

పరశురామపంతులు లింగమూర్తి గురుమూర్తి.



మద్దూరి శ్రీరామమూర్తికవి

విరచిత తాత్పర్యముతో.

ప్రథమముద్రణ 2000 ప్రతులు.

పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య,

సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1935

 [వెల రు 2—8—0.

శ్రీ రా మ.

# శ్రీసీతారామాంజనేయసంవాదము.

## ప్రథమాశ్వాసము.



### దేవతాస్తోత్రము.

శా. శ్రీమ ద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవించుచున్ భక్తిచే
ధీమంతుం డగు నాంజనేయుని నసద్దేహేంద్రియాతీతచి
ద్భామానందుఁడ వీవ నే నని కృపన్ బోధించు శ్రీజానకీ
రామబ్రహ్మము నంతరంగమున నారాధింతు నశ్రాంతమున్. 1

తా. శోభాయుక్తములైనట్టిన్ని అప్రాకృతములైనట్టిన్ని దనపాదపద్మములను అనన్యభక్తిచేత భజించునట్టి ఆంజనేయుని దేహేంద్రియాతీతమును, అనృతజడదుఃఖరహితమును అగు సచ్చిదానందరూపుడవగు నీవే పరమాత్ముడనగు నేననియు నిత్యనిరతిశయ జ్ఞానానందరూపుండనగు నేనే నీవనియు, సకలోపనిషత్సారసూత్రమైన "తత్త్వమసి" యను శ్రుత్యర్థమును అనిర్వ్యాజమైన కరుణచే నుపదేశించుచున్న శ్రీసీతారాము డనుపర బ్రహ్మమును నామనస్సుననిల్పి ధ్యానించుచున్నాను. 1

(1) భక్తి మూడువిధములు బాహ్యము, అనన్యము, ఏకాంతము.

బాహ్యము:—పరోక్షమునజ్ఞానమునకును అనన్యము అపరోక్షజ్ఞానమునకును, ఏకాంతము నిశ్చయజ్ఞానమునగల్గు నిత్యానందమునకును కారణమగును. భక్తియొక్క అంగములు 9. 1 శ్రవణ, 2 కీర్తన, 3 స్మరణ, 4 పాదసేవ, 5 అర్చన, 6 వందన, 7 దాస్య 8 సఖ్య 9 ఆత్మనివేదన.

సీ. తనరజోగుణముచేఁ దనరంగ నేదేవి
గల్పించు నఖిలలోకములనెల్ల
దనసత్త్వగుణముచే నొనరంగ నేకొమ్మ
పోషించు నీసర్వభూతములను
దనతమోగుణముచేఁ దగ నేవధూమణి
జగములనెల్ల సంక్షయముఁ జేయుఁ
దాశుద్ధసత్త్వప్రధానమై యేరామ
రామాంకమున నజస్రము వసించు
తే. నట్టి భువనైకమాత దయాసమేత
సద్గుణవ్రాత నిర్మలస్వాంతపూత
భక్తజనమానసోద్యానపారిజాత
సీత కరుణించి నన్ను రక్షించుఁగాత. 2

తా. ఏసీతాదేని తనయొక్క రజోగుణముచేత త్రిభువనములను నిర్మించునో, ఏ సీతాదేవి తనయొక్క సత్వగుణముచేతను స్థావరజంగమములను సర్వభూతములను తగినట్లు పోషించునో, ఏలతాంగి తన యొక్క తమోగుణముచేత లోకములను నశింపజేయునో, ఏ లతాంగి శుద్ధసత్త్వప్రధానురాలై శ్రీరామచంద్రుని యెడమతొడయందు దనిశము గూర్చుండునో అట్టి జగన్మాత దయాసమేత, శాంతిశమదమాది దివ్యగుణసమంచితరాలై భక్తుల పాలిటికల్పవృక్షమై నిర్మలమైన మనస్సుకలది యగు సీతాదేవి అల్పజ్ఞుడనగు నన్ను కరుణించి రక్షించుగాక.

---

(2) పంచమలములు,

1 ఆణవమలము:—పరబ్రహ్మమునుగూర్చి యపుడపుడుగల్గు జ్ఞానమును మరుగుపరచునది. 2:—కార్మికమలము గురువులుబోధించిన పరమార్థమునందు బుద్ధిచేరనీయనిది. 3 మాయికమలము:—పరతత్త్వజ్ఞానవాసన నెప్పుడును గలుగనీయనిది. 4 మాయేయమలము పాపకార్యములబుద్ధిని జొనుపునది 5 తిరోధానమలము:—పరబ్రహ్మమ నిత్యమను బుద్ధినికల్గించి జననమరణాదిదుఃఖములను కలుగజేయునది.

సీ. తతశుద్ధసత్త్వప్రధానవిగ్రహుల ని
మ్నల రజస్సత్త్వతమోగుణముల
స్వసుధర్మశృంగారవైరాగ్యవేషుల
విశ్వోద్భవస్థితివిలయకరులఁ
దప్తకాంచననీరధరచంద్రవర్ణుల
శుభకమండలుచక్రశూలధరుల
ఘనసత్యవైకుంఠకైలాసవాసుల
వరహంసఖగవృషవాహనులను

తే. షడ్గుణైశ్వర్యయుతులభాషావధూప్ర
సన్నమంగళదేవతాసర్వమంగ
ళాధిపతుల సాక్షాత్పరమాత్మమయుల
బ్రహ్మవిష్ణుమహేశులఁ బ్రస్తుతింతు. 3

తా. శుద్ధసత్త్వమే ప్రధానముగాగల దేహములనుధరించి మలినసత్త్వప్రధానమైన యవిద్యాగుణములైన రజోగుణసత్త్వగుణతమోగుణములు గలవారును, ఘోరవృత్తిశాంతవృత్తిమూఢవృత్తియు గలవారును పుష్పచందనవస్త్రభూషితులును, చతుర్దశభువనములను పుట్టించుట పెంచుట నశింపజేయుట జేయువారును ఎఱ్ఱని నల్లని తెల్లని శరీరచ్ఛాయలు గలవారును, కమండలము, చక్రము, త్రిశూలము చేతులయందు ధరించువారును సత్యలోకము వైకుంఠము కైలాసము అనులోకముల నివసించువారును హంసగరుడవృషభవాహనములనెక్కి సంచరించువారును షడ్గుణములతోగూడిన యైశ్వర్యముగలవారును సరస్వతి, లక్ష్మి, పార్వతియను తరుణీమణులు భార్యలుగా గలవారును పరబ్రహ్మస్వరూపులును అగు త్రిమూర్తులగు బ్రహ్మవిష్ణుమహేశులధ్యానింతును. (ఈపద్యమున క్రమాలంకారమును గమనించవలయును.)*

---

*షడ్విధైశ్వర్యములు:—ఐశ్వర్యము, ధైర్యము, కీర్తి, తేజస్సు, జ్ఞానము, వైరాగ్యము ఈసంపదలు కలిగియున్న షడ్విధైశ్వర్యములగును.

ఉత్పత్తి, లయము, ప్రాణులరాకడ, ప్రాణులపోకడ, విద్య అవిద్యనెఱుగుట అనునవి యాఱును షడ్విధైశ్వర్యగుణములనియు నెఱుంగవలయును.

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప సమయింపం జాలు సామర్థ్యముల్
బ్రహ్మోపేంద్రనగేంద్రచాపులకు సంపాదించుచు న్వారికిన్
బ్రహ్మాత్మైక్యవివేక మిచ్చుచును సంభావించుచుం బ్రోచు నా
బ్రాహ్మీ మంగళదేవతాగిరిజలం బ్రార్థింతు నశ్రాంతమున్. 4

తా. చతుర్దశభువనములతోడను గూడుకొనియున్నట్టి బ్రహ్మాండమును పుట్టించుటకును బెంచుటకును లయించుటకును దగిన సామర్థ్యమును బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కొసంగి వారికి పరమాత్మప్రత్యగాత్మలయొక్క యైక్యముచేయదగువివేక మిచ్చి గౌరవించుచు వారలను రక్షించుచుండు సరస్వతి లక్ష్మిపార్వతుల నేను యెల్లప్పుడును ప్రార్థించుచుందును.

క. వరవిశ్వోద్గతిహేతువు
పరముఁడు పురుషుండు ప్రకృతి బ్రహ్మము పరమే
శ్వరుఁ డంచుఁ దజ్ఞు లెవ్వని
బరికింపుదు రగ్గణాధిపతి నర్చింతున్. 5

తా. వేదాంతులేమహానుభావుని వేదములకు మూలమైన "ఓం" అను ప్రణవమనకును లోకములయొక్క పుట్టుకకును కారణభూతుఁడైన చతుర్ముఖబ్రహ్మయనియు పాంచరాత్రులువైఖానసులు మున్నగువారు విష్ణుమూర్తియనియు, సాంఖ్యయోగులు జీవుడనియు, ప్రకృతివాదులు మూలప్రకృతియనియు, యద్వైతులు పరబ్రహ్మమనియు, శైవులు రుద్రుడనియు భావించి యే మహానుభావుని కొనియాడుదురో యాగణాధిపతిని నేను పూజించుచున్నాను.

మ. తనరం గాయముచేత రామచరణద్వంద్వైకదాస్యంబు హె
చ్చినభక్తిం దగువాక్కుచే ననిశమున్ శ్రీరామనామప్రకీ
ర్తనముం జిత్తముచేత రామపరతత్త్వధ్యానముం జేయు శ్రీ
హనుమంతుర్గ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపఁగన్. 6

తా. అనన్యభక్తిచేత శరీరముతోడ శ్రీరామపాదపంకేరుహసేవయును వాక్కుచేత శ్రీరామచంద్రనామసంస్మరణంబును మనస్సుచేత శ్రీరామచంద్రునిధ్యానమును చేయుచుండునట్టి ఆంజనేయుని (మనోవాక్కర్మముల శ్రీరామచంద్రుని సేవించునట్టి ఆంజనేయుని) నాకోరిక నెరవేరుటకై ప్రార్థించుచున్నాను.

క. ఆరయ మద్బాల్యంబున
గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకుం
దారకయోగముఁ దెలిపిన
నారాయణగురువులను మనంబునఁ గొలుతున్. 7

తా. నాయొక్క బాల్యమున నిత్యానిత్యవస్తువివేకముగలుగుటకును, చిత్తసంశుద్ధి గల్గుటకును తారకమంత్రోపదేశమొసర్చిన నారాయణగురువులకు మనఃపూర్వకవందన మాచరించి సేవించుచున్నాను.

సీ. ఘనపాపములనుమాపఁగ దనుతాపమునుబాపఁ,
దనరూపమునుజూపఁగ దనరువాని
దనుకాయమునుద్రోయఁగ బెనుమాయనోగిమాయ
ముగఁజేయగుణిడాయఁగ దగినవాని
మనుకారణశరీరమును జీఱ నవికార
వరకారణముఁ జేరఁగ బరగువానిఁ
దనయందుజగమంచుఁగ దాఁబొందుగానొందు
చెలువొందువిందుగాఁగ దెలియువాని

తే. నిగమనిగదితసుగుణము లగణితముగ
మిగుల నిగుడఁగ సగుణుఁడై యగుణుఁ డగుచుఁ
బగలు రేయన కొకరీతి నెగడువాని
శ్రీమహాదేవగురుని భజింతు నెపుడు. 8

తా. పంచమహాపాతకములను నశింపజేయువాఁడును, దేహసంబంధములైన తాపత్రయముల పోగొట్టువాఁడును, పరబ్రహ్మస్వరూపమును తెలిసికొనదగిన జ్ఞానమొసంగువాఁడును, శరీరధర్మములైన ఆకలి దప్పికమున్నగునవి లేనివాఁడును, సూక్ష్మశరీరమునుత్యజించుటకు చతుర్దశభువనమోహనమగు మహాప్రకృతిని క్రమముగా నాశనమగునట్లు చేయుటకును, బ్రహ్మాంతర్లక్ష్యమును పొందుటకును దగినవానిని కారణదేహమును నశింపజేయుటకు వికారరహితమైన సర్వోత్కృష్టమైన బ్రహ్మతత్త్వమును పొందుటకు దగినవానిని తనలోనవిద్యయు, అందు తాను పొలుపొందునట్టి దాని నెఱుంగు వానిని, వేదములందు జెప్పబడిన సుగుణములు లెక్కింప నశక్యమగునట్లు మిగుల వృద్ధిపొందిన ప్రాకృతదివ్య

మంగళవిగ్రహుండై మనోవాక్కుల కగోచరుండై కాలపరిచ్ఛేదశూన్యుండై ఒకే విధముగా ప్రకాశించువానిని మహాదేవగురుని యెల్లప్పుడును భజింతును.

## సంస్కృతకవిస్తోత్రము.

శా. లోకాలోకపరీతభూచరమహాలోకోపకారంబుగా
శ్రీకల్యాణకరోరుకావ్యచయముల్ ప్రసిద్ధంబుఁ గావించి సు
శ్లోకుల్ పుణ్యమతుల్ జగద్గురువులై శోభిల్లు చున్నట్టి వా
ల్మీకి వ్యాస మయూర బాణకవి కాళీదాసులం గొల్చెదన్. 9

తా. ఇహలోకములందును పరలోకములందును వ్యాపించియున్న యజ్ఞానభూములయందును జ్ఞానభూములయందును సంచారముగలిగి లోకోపకారములై పండితపామరులకు గొప్ప మేలుకలుగునట్లుగా త్రివర్గసంపదలను మోక్షమును యొసంగునట్టి యుద్గ్రంధములను రచించి సత్కీర్తి గడించినవారును నిర్మలచిత్తులును గ్రంధరూపమున జ్ఞానోపదేశమొనర్చిన కారణమున లోకగురువులును అయి ప్రకాశించునట్టి వాల్మీకివ్యాసమయూరబాణకాళిదాసాదికవులను స్తుతించెదను. * 9

## సు క వి వ ర్ణ న ము.

తే. మహిత గురులఘువర్ణ ధర్మములు నియమ
ములుఁ గలితకర్తృకర్మక్రియలును దెలిసి
నామరూపావ్యయవిలక్షణంబు లాత్మ
నెఱిఁగిన కవీశ్వరుండె కవీశ్వరుండు. 10

గురులఘువులను యక్షరనిర్ణయమును గణములు యతులు ప్రాసములు మున్నగు వాని లక్షములను బాగుగ నెఱిగినవాడే కవీశ్వరుఁడు. తక్కినవాఁడు కవియను నామమున కనర్హుఁడు.

బ్రహ్మవేత్తపరముగగూడ నీపద్యమునకు భావము దెలుపవచ్చును.

తా. బ్రాహ్మణులు మొదలుగ సగ్రవర్ణములయు శ్వపచులు మొదలగు నీచజాతులయు కులాచారాదికములను కర్మములను కర్మఫలసిద్ధియున్నగునవి యెఱింగి నామరూపాదికములుగల జగంబును నాశరహితమైన పరబ్రహ్మమును దనయందు దెలిసినయాతఁడే బ్రహ్మవేత్త. తక్కినవాడు గాడనియు భావము.

*అజ్ఞానభూమికలు. } ముందు పేజీలలో వివరింపబడెను.
జ్ఞానభూమికలు. }

ఆంధ్ర కవి నుతి.

ఉ. నన్నయభట్టు నాంధ్రకవినాథుని దిక్కనసోమయాజినిం
బన్నుగ సోమసత్కవిని భాస్కర బమ్మెరపోతరాజులన్
మున్ను ప్రసిద్ధి గాంచు కవిముఖ్యుల నందఱి నెమ్మనంబులో
నెన్ని నమస్కరించెద నభీష్టఫలాప్తి దనర్చునట్లుగాన్. 11

ఆంధ్రకవీశ్వరులలో నగ్రగణ్యుఁడైన నన్నయభట్టును, నాచనసోముని, భాస్కరుని. బమ్మెర పోతరాజును మఱియు ప్రసిద్ధికెక్కిన యితరులగు మహాకవుల నందఱను నేను నామనంబున గోరినకోరిక లభించుటకు వేర్వేఱుగా నభివర్ణించి నమస్కరించుచున్నాను,

కుకవి నిందనము.

క. శుద్ధపదయుక్తిఁ దొఱఁగి య
బద్ధమును నిబద్ధిగా నిబద్ధి నొగి మహా
బద్ధముగాఁ గను కుకవుల
నొద్ధత్వము మానుకొఱకు నభినందింతున్. 12

మంచివగు శబ్దముల ప్రయోగింపక నపశబ్దమునే సుశబ్దముగను సుశబ్దమును యప శబ్దముగను తలంచునట్టి కుకవులను తాముసమస్తము దెలిసినవారమనియు, తామురచించిన కావ్యమే గొప్పదనియు భావించి గర్వపడవలదని ప్రార్థించుచున్నాను.

ఈపద్యమున కవివేకిపరముగ గూడ భావముగలదు. మోక్షమును పొందదగిన సులభమైన మార్గమును వదలి అసత్యమైనట్టియు జడాత్మకమైనట్టియు జగమే సత్యమైన దనియును నదియే ఆనందస్వరూపకమై పరబ్రహ్మమని భావించి వేదాంతరహస్యముల న్నియు దామే యెఱింగినట్లు నటించుచు గర్వపడునట్టి యవివేకులను కుతర్కవాదము లుచేయవలదని ప్రార్థించుచున్నాను.

మ. గరిమన్ స్వర్ణ మనేకభూషణములై కన్పట్టుచందంబునం
బరమాత్ముం డఖిలప్రపంచమయుఁడై భాసిల్లు న ట్లాటచే
సురసిద్ధోరగయక్షకిన్నరనరస్తోమాది శశ్వచ్చరా
చరరూపోజ్జ్వల సర్వభూతములకున్ సద్భక్తితో మ్రొక్కెదన్. 13

తా. బంగారమంతయు నొక్కటియేయైనను యనేకవిధములగు నాభరణములుగా జేయబడుచున్నది. అట్లే పరబ్రహ్మముగూడ నొక్కడైనను, దేవతలు సిద్ధులు పన్న

గులు యక్షులు కిన్నరులు నరులు మున్నగు స్థావరజంగమరూపములు ధరించియున్నాడు. కావున పరమేశ్వర స్వరూపమగు సమస్తభూతవ్రాతమునకును నమస్కరించెదను.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సద్గురుకీర్తనంబును సంస్కృతాంధ్రసత్కవిస్తోత్రంబును గావించి యేను ముముక్షుజనహితంబును సంసారసాగరోత్తారకంబును దారక సాం ఖ్యామనస్కాత్మకంబును జీవబ్రహ్మైక్య సాక్షాత్కార సాధారణకారణంబునైన రాజయోగం బంతయు నొక్కప్రబంధంబుగా రచియింప నిశ్చయించి పరమైకాంతంబున శ్రీగురుమంత్రదేవతాతత్త్వానుసంధానంబు సేయుచున్న సమయంబున. 14

తా. ఇవ్విధంబున నిష్టదేవతలను పొగడి సంస్కృత ఆంధ్రకవుల నభివర్ణించి మోక్షాసక్తిగల జనంబులకు మేలైనదియును సంసారసాగరమును దాటింపదగినదియును తారక సాంఖ్యామనస్కము లనుయోగత్రితయమే స్వరూపముగాగలదియును జీవునకును పరబ్రహ్మమునకును గల యైక్యమును ప్రత్యక్షముగా జేయుటకు దగిన సులభమార్గమును చక్కగా (రాజయోగమును.) ఒక్కగ్రంథముగా రచింపదలచి యేకాంతమున గూరుచుండి శ్రీమహాదేవాచార్యనిరూపముధరించిన శ్రీరామచంద్రునిస్వరూపమగు పరమాత్మకును తానైన ప్రత్యగాత్మకును యైక్యరూపమున ధ్యానసమాధియందున్న యవసరమున.

## ప్ర బం ధ హే తు వు.

సీ. కమనీయవరదివ్య * కాంచనచేలంబుఁ
గాషాయవస్త్రంబుగా ధరించి
చాపబాణంబులు * చంచత్కమండలు
దండములుగాగ హస్తములఁ బూని
రమణీయరత్నహారంబు రుద్రాక్షమా
లికగా గళంబున * లీలఁ దాల్చి
సీతావధూటిని * శ్రీరాజయోగాహ్వ
యాధ్యాత్మవిద్యగా * నవధరించి

తే. ప్రేమ మీఱంగ శ్రీరామ రామ రామ
యనుచుఁ దనపేరు నుడువుచు నద్భుతముగ
శ్రీమహాదేవగురుఁ డైన రామవిభుఁడు
గరుణతోడుత నెదుర సాక్షాత్కరించె.

శ్రీరామచంద్రుడు మహాగురుదేవుని రూపమును ధరించి నేత్రానందకరమైన పీతాంబరమును కావివలువగా ధరించి విల్లును కమండలముగను, అమ్మును దండముగను ధరించి కమనీయములగు హారములను రుద్రాక్షమాలలవలె ధరించి సీతామహాదేవిని రాజయోగమనెడి బ్రహ్మవిద్యగ ధరించి శ్రీరామరామయని యాత్మనామమే జపించుచు కట్టెదుట సాక్షాత్కరించెను.

వ. ఇట్లు శిష్యవాత్సల్యంబున సాక్షాత్కరించి మదీయ దీర్ఘదండనమస్కారంబులు చతుర్విధపురుషార్థప్రద చతురక్షరసమన్విత నారాయణస్మరణపూర్వకంబుగా నంగీకరించి కలకలనవ్వుచు శరీరత్రయ విలక్షణావస్థాత్రయ సాక్షి పంచకోశవ్యతిరిక్త సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండ వైన నీవ సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండ నైననేను, సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండనైన నేన సచ్చిదానందస్వరూప ప్రత్యగాత్ముండ వైన నీవని సర్వోపనిషత్సారభూతార్థం బైన పరమతత్త్వరహస్యార్థం బుపదేశించి యీయభేదవిజ్ఞానదృష్టిచేత నిరంతరంబున న్నవలోకించుచు జీవన్ముక్తిసుఖం బనుభవింపుము; ప్రారబ్ధభోగావసాన సమయంబున ఘటాకాశంబు మహాకాశంబునం గలసినవిధంబున నాయందు విదేహకైవల్యంబు నొందెదు; సందేహంబు లేదు అని యాజ్ఞాపించి యిప్పు డీవు బ్రహ్మాండపురాణంబునం దధ్యాత్మరామాయణంబు మామహేశ్వరసంవాదరూపం బై యొప్పునందు శ్రీరామహృదయంబను నితిహాసంబు సీతారామాంజనేయసంవాదంబున బ్రవర్తిల్లు నది సంక్షేపరూపంబు గావున నయ్యర్థంబు విస్తరించి యొక్క ప్రబంధంబుగా రచియించి

నాపేర నంకితంబు సేయుము, సర్వపాపవినిర్ముక్తుండ వై కృతార్థుండ వయ్యెద వని యానతిచ్చి తిరోహితుం డయ్యె, నంతట మేల్కని పరమానందభరితాంతఃకరణుండ నై.

తా. ఈవిధంబుగ సాక్షాత్కరించి నాయొనర్చిన సాష్టాంగదండనమస్కారమును ధర్మార్థకామ మోక్షప్రదంబును చతురక్షరమాత్రంబును అగు నారాయణ స్మరణపూర్వకంబుగా నంగీకరించి నవ్వుచు, స్థూలసూక్ష్మకారణ శరీరముల వేరైన జాగ్రత్స్వప్న సుషుప్తు లను మూడవస్థలకును సాక్షియైన, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ రహితమై సచ్చిదానంద స్వరూపముగల కూటస్థుఁడవైన నీవే సత్యజ్ఞానానందస్వరూప పరమాత్ముఁడనగు నేను, సత్యజ్ఞానానందస్వరూపుడనగు నేన సచ్చిదానంద స్వరూపకుండవగు నీవు అని సకలోపనిషత్సారభూతమగు నర్థము నుపదేశించి యిట్టిభేదరహితమైన మనంబున నిరంతరము నన్నుపాసించుచు జీవన్ముక్తి నొందుము. కాలానుగుణ్యముగ ఘటాకాశము మహాకాశమున గలసిన తెరంగున నంత్యంబున దేహకైవల్యంబునొందినాయందైక్యమగుదువుసందేహము లేదు. అనిపల్కి వెండియు నిట్లనియెను. బ్రహ్మాండపురాణమున పార్వతీపరమేశ్వర సంవాదరూపకమైన యధ్యాత్మరామాయణంబుఁ శ్రీరామహృదయమను నితిహాసముగలదు. అయ్యది సీతారామాంజనేయమన ప్రవర్తిల్లును. అందునయ్యది సంక్షేపముగ జెప్పబడినదిగావున నీవద్దానిని విస్తరించి నాపేరనంకితంబుగా నొకయుద్గ్రంధమును రచింపుము. అందుచే సర్వపాపవర్జితుఁడవై కృతార్థుడవయ్యెదవని యానతిచ్చి యంతర్హితుండయ్యె. నేనంతట మేల్కాంచి పరమానందముతో గూడుకొనినవాడనై-

## కృతికర్తృభాగ్య ప్రశంస.

శా. శ్రీవిశ్వేశ్వరపార్వతీప్రియదమై శ్రీజానకీరామవా
క్యావిర్భూతము మారుతాత్మజసుబోధంబై తగన్ శ్రీమహా
దేవాచార్యవరాంకితంబుగను ధాత్రి రాజయోగంబు సం
భావింపన్ రచియింపఁ గల్గె నిఁక నా భాగ్యంబు సామాన్యమే.

తా. పార్వతీపరమేశ్వరులకానంద మొసంగునదియును, శ్రీ సీతారామచంద్రుల యుపదేశవాక్యములచే జనించినదియును, ఆంజనేయునకు చక్కగా బోధింపబడినదియును

నగు నీరాజయోగమును యెల్లరకును చక్కగాదెలియునట్లుగను శ్రీరామచంద్రమూర్తి కంకితంబుగా నీసీతారామాంజనేయమును రచించునట్టి మహద్భాగ్యము నాకు చేకూరి నిధి సామాన్యమగునా ?

ఏతద్గ్రంథప్రశంస.

క. దివ్యము భవ్యం బగు మ
త్కావ్యము సంతతము మోక్షకాములచే శ్రో
తవ్యము వక్తవ్యము మం
తవ్యము భావ్యమును గీర్తితవ్యము గాదే. 18

తా. శ్రేష్ఠమైనదియును శుభకరమైనదియును మోక్షాపేక్షగలవారలచే నెల్లప్పుడును పఠింపదగినదియు, వినదగినదియు వల్లింపదగినదియు సర్వోత్కృష్టమైనదియును వర్ణింపదగినదియునై యున్నది.

వ. అని విచారించి సంతోషభరితచిత్తుండనై మదీయాచార్య పరంపరావతారంబు నభివర్ణించెద. 19

తా. ఇట్లాలోచించి సంతుష్టాంతరంగుడనై నాగురుపరంపర నభివర్ణించెదను-

గురుపరంపరాభివర్ణనము.

శా. సత్తామాత్రుఁడు నిర్విశేషుఁడు తనూసర్వేంద్రియప్రాణహృ
చ్చిత్తాహంకృతిధీప్రకాశకుఁడు సచ్చిత్తోషకాయుండు వి
ద్వత్తాపాంధతమఃప్రదీపమయుఁ డాత్మస్వామి భాసిల్లె శ్రీ
దత్తాత్రేయగురుం డనంగ జగదంతర్యామి యై మున్నిలన్. 20

తా. దేశకాలవస్తు పరిచ్ఛేదవ్యతిరిక్తమైన సత్తయే స్వరూపముగా గలవాడును, తనకంటె నధికము లేనివాడును, శరీరత్రితయమును జ్ఞానేంద్రియంబులను, కర్మేంద్రియంబులను, అంతరింద్రియంబులను, పంచవాయువులను, పంచోపవాయువులను వానివాని పనులఁ బ్రవర్తింపజేయువాడును, సత్యము, విజ్ఞానము, ఆనందము స్వరూపముగాగలవాడును యంధకారమునడంచెడి దీపముచందమున పండితులైనవారల తాపత్రయముల నెడి యంధకారమును దస్వజ్ఞానదీపముచే నడంచువాడును, అయిన పరమాత్ముఁడే భూమి

యందు దత్తాత్రేయరూపమున నత్రిమహామునికి బుత్రుఁడై జనించి జగత్త్రితయమునందున్న నధికంబుగ ప్రకాశించెను.

క. ఆ దత్తాత్రేయగురు
శ్రీదివ్యపదారవిందసేవాదిశ్రీ
మోదుఁడు ప్రత్యక్షప్ర
హ్లాదుం డన శ్రీజనార్దనాహ్వయుఁ డొప్పున్. 21

తా. ఆదత్తాత్రేయమహర్షికి శిష్యుఁడై యాతనిపాదారవిందము లనారతము ననన్యభక్తితో నారాధించుచు ప్రత్యక్షముగా భూమిపై నవతరించిన ప్రహ్లాదుడోయన్న నెల్లరపొగడ్తలకెక్కి ప్రకాశించెను.

మ. తనసౌశీల్యము శాస్త్రచింతనము నాత్మజ్ఞానముం జూచి హె
చ్చినకూర్మి న్నిజదివ్యరూపములతో శ్రీభారతీమోక్షకా
మిను లేతెంచి యహర్నిశంబు దను నెమ్మిం గొల్వఁగా శ్రీజనా
ర్దనయోగీశ్వరుఁ డొప్పె నెల్లెడ నవిద్యాధ్వాంతమార్తాండుఁ డై.

తా. జనార్దనయోగీంద్రునియొక్క సత్ప్రవర్తనముచేత నాతఁడు విష్ణుదేవుడని తలంచి లక్ష్మీదేవియును, శాస్త్ర చింతనాదికముల దిలకించి యాతఁడు బ్రహ్మయని దలంచి సరస్వతీదేవియును, యాతని విజ్ఞానమును పరతత్త్వజ్ఞానమును దిలకించి యాతఁడు శివుఁడని పార్వతియును యాతని సమీపించి యనిశము సేవింపగా నాతఁడు బ్రహ్మవిద్యాగురుండై అజ్ఞానమును బారద్రోలి ముల్లోకములను బ్రకాశించెను.

తే. ఆ జనార్దనగురున కత్యద్భుతముగ
శ్రీమదేకోగురుస్వామి శిష్యుఁ డయ్యె
మును వసిష్ఠమహామునీంద్రునకు నరి
దాశరథి భక్తుఁ డైనచందంబు దనర. 23

తా. పూర్వము వశిష్ఠునకు శ్రీరాముడు శిష్యుఁడైనట్టు లాజనార్దనయోగికి యేకోగురుస్వామి శిష్యుడయ్యెను.

సీ. తనదువైరాగ్యంబు గనుఁగొని సిగ్గుచే
సనకాదిమును లజునివెనుక నొదుఁగ

తనదుసద్భక్తిచేఁ దగఁ గట్టువడి యుంట
శ్రీకృష్ణుఁ డాత్మీయసేవఁ జేయ
దనదువిజ్ఞానతీర్థమునందుఁ గ్రుంకుచు
గంగాదినదు లెల్ల గంతు లిడఁగ
దనయపూర్ణాత్మసంతతసమాధినిఁ జూచి
ప్రహ్లాదుఁ డాశ్చర్యపరత నొంద

తే. స్వకృతగీతాదిశాస్త్రభాష్యంబు లెల్ల
వేదతుల్యంబులై ధాత్రి వెలయుచుండ
వామదేవ శుకార్జున వ్యాస భీష్మ
సదృశుఁ డేకోజనార్దనస్వామి వెలసె. 24

తా. వామదేవుఁడు, శుకుఁడు, అర్జునుఁడు, వ్యాసుఁడు, భీష్ముఁడు మున్నగువారితో సాటియనదగు నాయేకోజనార్దనస్వామియొక్క యిహపరలోకభోగవిరక్తిని జూచి సిగ్గుపడి సనకసనందనాదులు బ్రహ్మవెనుక దాఁగొనగను, శ్రీకృష్ణుడు భక్తిపాశములచే గట్టుబడి తనకు శుశ్రూషలు సలుపగ, గంగాదిమహానదులు తమవిజ్ఞానమను పుణ్యతీర్థస్నానమున పరిశుద్ధిజెంది మహానందముతో నృత్యముచేయగను, ప్రహ్లాదుడు తననిర్వికల్పసమాధి దిలకించి ఆశ్చర్యమును పొందగను, తనవిరచితములగు స్మృతులు శ్రుతులు సూత్రములు శాస్త్రములు భాష్యములు వేదములతో సమానప్రతిభగల్గి వెలుంగగను ప్రకాశించెను.

క. ధరలో నారాయణునకు
నరుగతి నేకోజనార్దనస్వామికి శ్రీ
నరహరిమహేశగురుఁ డ
చ్చెరువుగ సద్భక్తి మెఱయ శిష్యుం డయ్యెన్. 25

తా. శ్రీకృష్ణునకు అర్జునుఁడు శిష్యుడైనట్లు యేకోజనార్దనగురునకు బ్రహ్మజ్ఞానసంపద్యుక్తుడైన నరహరిమహేశగురువు శిష్యుడయ్యెను.

చ. అతఁడు సమస్తభూతబహిరంతరనావృతబోధమూర్తియై
వితతసముద్రమధ్యమునుండు నెడ వేల్పులు స్వాచ్ఛి యితం డయారె యా

శతేశ్వతియో రమావరుఁడో శంకరుఁడో శుకుఁడో యటంచు న
ద్భుతమును బొందు చుండఁ బరిపూర్ణత నొప్పె ధరాతలంబునన్.

తా. నరహరి మహేశగురుస్వామి పంచభూతములయొక్కయు పంచభూతముల చేరికచే జనించిన ప్రాణిసమూహముయొక్కయు బాహ్యాంతరముల వ్యాపింపని విలక్షణ మగు నపరోక్షజ్ఞానయుతుండై నిర్వికల్పసమాధినుండగా విలకించి దేవతలెల్ల రీతఁడు బ్రహ్మయా, రమానాథుఁడా ! లేక శంకరుఁడా లేక శుకుడాయని విభ్రాంతినొంద సచ్చిదానంద నిత్యనిర్మల పరబ్రహ్మమై భూమివి ప్రసిద్ధిగాంచెను.

క. ఆ నరహరిసద్గురునకు
శ్రీనాగోరామగురుఁడు శిష్యుండై వి
జ్ఞానంబునఁ బ్రత్యక్షు
శ్రీనారాయణుఁ డనం బ్రసిద్ధి వహించెన్. 27

తా. ఆతనికి నాగోజీరామగురువు శిష్యుడై బ్రహ్మజ్ఞానమున శ్రీమన్నారాయణుఁడేయను ప్రఖ్యాతి బడసెను.

శా. రాజన్మూర్తులతోడఁ బెంపెసఁగు వైరాగ్యోపరత్యాళు లు
త్తేజం బొప్ప సహాయలై మెఱయ సద్దివ్యప్రబోధస్ఫుర
ద్రాజాస్య న్వరియించి మోక్షసుఖసామ్రాజ్యంబుతో నొప్పె నా
గోజీరామగురుండు పండితులకోర్కుల్ దీర సేవింపఁగన్. 28

తా. నాగోజీరామగురువును, తరుగని వైరాగ్యము, నెమ్మదియను సుగుణము స్త్రీరూపమును ధరించివచ్చి పనికత్తెలై తోడ్పడ బ్రహ్మైవాహమస్మియనెడి నిర్వికల్పక జ్ఞాన మను తరుణీమణినివరించి బ్రహ్మనందసామ్రాజ్యమును పరిపాలించుచు తమతమకోరి కలు నెఱవేఱునట్లు విద్వాంసులు దన్ననుసరింపవెలింగెను-

క. ఆ నాగోరామునకుఁ
శ్రీనారాయణున కజునికిఁ జెలువుప భక్తుం
డై నెగడె నెల్లదిక్కులఁ
గోనేరుగురుండు తత్త్వకోవిదుఁ డగుచున్. 29

తా. శ్రీమన్నారాయణునకు బ్రహ్మ శిష్యుఁడైనట్లు ఆనాగోజీగురువునకు కోనేరుగురువు శిష్యుఁడై ముల్లోకముల ప్రసిద్ధికెక్కెను-

శా. ఆకాశీతలసేతుమధ్యకలితక్ష్మాధీశ్వరోద్యచ్ఛిర
శ్శ్రీకోటీరమణిప్రభార్చితనిజాంఘ్రిద్వంద్వపంకేరుహుం
డాకాశాదిసమస్తతత్త్వసముదాయాతీతవిశ్వేశుఁడై
శ్రీకోనేరుగురుండు మోక్షవరలక్ష్మీకాంతుఁడై రంజిలెన్. 30

తా. కోనేరుగురువు సేతుసీతాచలమధ్యనుండు రాజుల కిరీటములందలి మణులనుపువ్వులచే పూజింపబడిన పాదయుగళుండై ఆకాశాదితత్త్వముల కతీతుఁడైన పరబ్రహ్మస్వరూపుడును ముక్తికాంతాధినాథుండునునై ప్రకాశించెను.

శా. ఆ కోనేరుగురూత్తముం గొలిచి దివ్యాధ్యాత్మయోగంబు దా
శ్రీకల్యాణగుణప్రసిద్ధుఁ డగుచున్ శ్రీమన్మహాదేవలో
కైకాచార్యుఁడు సంగ్రహించె నతిసౌఖ్యం బొప్ప సాందీపునిన్
శ్రీకృష్ణుండు భజించి విద్య లొనరం జేకొన్న చందంబునన్. 31

తా. శ్రీకృష్ణుఁడు సాందీపునకు శిష్యుఁడై యితిహాసములను వేదములను ఆగమములను మున్నగు విద్యలను గ్రహించినట్లు అణిమాద్యష్టైశ్వర్యములు గల మహాదేవాచార్యుడు సకలసద్గుణనిధియైన కోనేరుగురువునకు శిష్యుఁడై జీవబ్రహ్మైక్యసమాధినిగ్రహించెను

సీ. అఖలభూతంబుల నాడించుమాయను
సొంపుగా నెవ్వఁ డాడింపు చుండు
గురుజనంబుల కెల్ల గురువులై తగుహరి
హరుల కెవ్వఁడు గురు వగుచు నుండు
వివిధలోకంబుల వెలిఁగించి వెలుఁగుల
మీఁచి యెవ్వఁడు వెలిఁగించు చుండుఁ
బ్రభువుల కెల్ల సత్ప్రభువైన బ్రహ్మకుఁ
బ్రభుఁ డౌచు నెవ్వఁడు పరఁగు చుండు

తే. సగుణనిర్గుణరూపుఁడై నెగడు చుండు
నమ్మహాదేవగురువరు నభినుతింప

సకలనిగమాగమాంతశాస్త్రంబు లోప
వనఁగ మముఁబోంట్లకు నుతింప నలవి యగునె. 32

తా. బ్రహ్మ రుద్రుడు విష్ణుఁడు సదాశివుఁడు మహేశుడు విరాట్పురుషుఁడు మున్నగు సమస్తజీవకోట్లను దేహేంద్రియాదులే యనుభ్రమిజిక్కి భరింపజేయు మూల ప్రకృతి మాయలదగులక సద్దానిని సొగసుగా నాడించుచుండువాడును, లోకగురువులగు బ్రహ్మాదులకు జనకుఁడైనవాడును, పదునాల్గులోకముల నుత్తేజిత మొనరించువాడును, సూర్యచంద్రాగ్నులను ప్రకాశింపజేయువాడును, దిక్పాలుల కధిపతిరైన బ్రహ్మకు ప్రభువైనవాడును, అనంతకల్యాణగుణములు గలవియు, సగుణోపాసకులకు యుక్తమైనవియు, వేదాంతములవలన దెలియదగినదియు నైన పరబ్రహ్మస్వరూపముగలవాడై ప్రకాశించు మహాదేవాచార్యుని వేదములును, వేదాంగములును, ఉపనిషత్తులును, ఆగమములు 28 యును, ఆగమాంతములగు చర్యాక్రియాయోగ సాదముల జెప్పబడిన షడధ్వములతోగూడిన కర్మసాదాఖ్య, కర్తృసాదాఖ్య అమూర్తిసాదాఖ్య మూర్తిసాదాఖ్య శివసాదాఖ్య మహాసాదాఖ్యలును, అద్వైతబ్రహ్మసిద్ధగాఢ బ్రహ్మనందీయము, గీతాభాష్యము, వేదభాష్యము, మున్నగు శాస్త్రములును అమ్మహాదేవగురుని నుతింప సామర్థ్యముగలవి కావనుచుండ మాబోంట్లకు వశమా !

కవివంశానుక్రమణిక.

తే. అమ్మహాదేవగురుచర ణారవింద
పరపరాగాంశభజనతత్పరుఁడఁ బరశు
రామపంతులకులజాతరామ మంత్రి
మౌళి తిమ్మాంబికాప్రియాత్మజుఁడ నేను. 33

తా. ఆగురుదేవుని పాదధూళియందలి పరమాణువును సేవించు నాసక్తిగలవాడను, పరశురామపంతుల కులమునబుట్టిన రామమంత్రికిని ఆతని భార్యయగు తిమ్మాంబకును ప్రియతనూజుడను లింగమూర్తి గురుమూర్తి యను పేరుగలవాడనైన నేను-

షష్ఠ్యంతములు.

క. శ్రీరామనామమంత్రా
కారునకు ననంగనిర్వికారునకు మహా

కారునకు నిర్జితాహం
కారున కజ్ఞానభూమికాదూరునకున్.* 34

తా. శ్రీరామమంత్రస్వరూపుడును, ఆకసమువలె దేనిని యంటనివాడును, షడ్విధవికారములులేనివాడును విరాట్పురుషుండును, అజ్ఞానభూమిక లేడింటికిని దూరమైన వాడును, అగువానికి *

క. ధీరునకు భక్తజనమం
దారునకు నిరంతరాత్యుదారునకు నిరా
ధారునకు నిఖిలజగదా
ధారునకు ననాద్యఖండితశరీరునకున్. 35

తా. నిత్యానిత్యవస్తుతత్త్వము నెఱింగినవాడును, కల్పవృక్షమువలె భక్తులవాంఛితములనిచ్చువాడును, మహాత్యాగముగలవాడును, తనకుతానే ఆధారమైనవాడును 14 లోకముల కాశ్రయుడైనవాడును జననమరణములు లేనివాడును, అయినవానికి-

---

* అజ్ఞానభూమికా వివరణము.

బీజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నజాగ్రము, స్వప్నము; సుషుప్తి అని అజ్ఞానభూమికలు 7.

(1) బీజాగ్రము:—సచ్చిదానంద పరిపూర్ణమందు జగత్సృష్టికి కారణముగల తెలివియే బీజాగ్రము-
(2) ఆ తెలివికి ముందులేనిభేదము సూక్ష్మముగల్గి విశ్వాభిముఖమగుట జాగ్రము-
(3) లోకవాసన యెక్కువయగుట మహాజాగ్రము-
(4) మనోరాజ్యమేలుట జాగ్రత్స్వప్నము-
(5) మఱచినదాని దలచుటస్వప్నజాగ్రము-
(6) జాగ్రమందు కల్పితస్వరూపము జూచుట స్వప్నము-
(7) ఆత్మప్రతిబింబమైన జగద్విషయ సౌఖ్యముల మునుంగుట సుషుప్తి.

జ్ఞానభూమికావివరణము.

శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, సంసక్తినామిక, పదార్థభావన తురీయము-

(1) శుభేచ్ఛ:—వేదాంతపరిజ్ఞానమును యిహాముత్రార్థఫలభోగ విరక్తియుంగల్గి మోక్షమపేక్షించుట.

క. వ్యాపకునకుఁ ద్రిశరీరా
లేపకునకు నిర్జితావలేపకునకు ధీ
దీపకునకు సచ్చిత్సుఖ
రూపకున కనంతవిశ్వరూపాత్మునకున్. 36

తా. విశ్వమునకు లోపల వెలుపలనిండి యుండువాడును, శరీరత్రయము నంటని వాడును, యింద్రియములను తమతమ పనులయందు వర్తించునట్లు జేయువాడును, సత్తు చిత్తు ఆనందమురూపముగాగలవాడును బ్రహ్మవిష్ణుమహేశ్వర సదాశివరుద్రస్వరూపుడును, అగువానికి-

క. శ్రీమద్దత్తాత్రేయమ
హామునిసదృశునకు శ్రీమహాదేవగురు
స్వామికిఁ దతసర్వాంత
ర్యామికి విజ్ఞానభూమికాకారామునకున్. 37

తా. దత్తాత్రేయమహామునితో సాటియైనవాడును, ఓంకారస్వరూపుడును, జ్ఞాన భూమికల సంచరించువాడు అగు మహాదేవగురునకు-

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీసీతారామాంజనేయ సంవాదం బను వేదాంతగ్రంథమునకుఁ గథాప్రారంభం బెట్టి దనిన.

---

(2) విచారణ:—అద్వైతశాస్త్రపరిజ్ఞానము సజ్జనస్నేహము వైరాగ్యముగల్గి బ్రహ్మ విచారముచేయుట.

(3) తనుమానసి:—పైరెండుభూమికల సాధనగల్గి విషయేంద్రియముల దగులకుండ మనస్సును క్షీణింపజేయుట.

(4) సత్త్వాపత్తి:—పైమూడిటి నభ్యసించి యింద్రియార్థములయాశమాని యితర సంకల్పములులేక బ్రహ్మనిష్ఠ నుండుట.

(5) సంసక్తినామిక:—నాల్గుభూమికల యభ్యాసముచే సర్వమును విడచి బ్రహ్మనిష్ఠ పట్టు వదలకుండుట.

(6) పదార్థభావన:—అంతర్బహిర్మధ్య దృశ్యములులేక ఆత్మారాముఁడై నేనే బ్రహ్మము ననుట.

(7) తురీయము:—పైయారుభూమికల నెఱింగి యెందును భేదములేమినిదెలిసి పర బ్రహ్మమే బ్రహ్మముగా నుండుట.

కైలాసపర్వతవర్ణనము.

క. శ్రీసుఖద శుద్ధసత్త్వా
వాసము శివపార్వతీనివాసము సుమహా
భాస మనాభాసము కై
లాసము దనరారుఁ జిద్విలాసం బగుచున్. 39

తా:—చతుర్విధపురుషార్థము నిచ్చునట్టి గుణలయావస్థారూపమైన శుద్ధసత్త్వము నకు జన్మభూమియైనదియు పరబ్రహ్మస్వరూపుఁడైన మూలపురుషునకును మూలప్రకృతికిని నివాసమైనదియును సూర్యచంద్రాదుల మీరి వెలుంగునదియును వికారరహితమైనది యును నిర్వికల్పజ్ఞానస్వరూపమైనదియునునైసచ్చిదానందపరబ్రహ్మము యొప్పుచుండును.

కైలాసపరముగాను.

తా. చతుర్విధపురుషార్థములనిచ్చెడు నిర్మలసత్త్వగుణయుతులైన బ్రహ్మజ్ఞాను లకు నివాసమైనదియు పార్వతీశంకరులనివాసమైనదియు మహాతేజముగలదియు, మమకా రాహంకారములు లేనిదియు మిక్కిలి వింతలుగల్గినదియు నయినకైలాసము యొప్పు చుండెను.

క థా ప్రా రం భ ము.

వ. అది మఱియు నాదిమధ్యాంతవిహీనంబును, స్వజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యంబును, నిత్యాపరోక్ష స్వప్రకాశాపహాసి తానంతకోటిసూర్యచంద్రానలాలోకంబును, వేదశాస్త్రపురాణేతిహాసాగ మాగమ్యంబును, బహువిధవర్ణధర్మకర్మగుణనామరూపవికారశక్తి విర హితంబును, బ్రహ్మేంద్రాద్యమరాసురోరగ గరుడ గంధర్వ కిన్నర కింపు రుష సిద్ధ సాధ్య విద్యాధర చార ణాప్సరో యక్షగుహ్యకభూతఖేచర దేవర్షి బ్రహ్మర్షీశ్వర యోగీశ్వర మునీశ్వర యతీశ్వర కవీశ్వరాద్యు పాస్యంబును, నిత్యనిర్గుణనిర్వికల్పనిర్వికారనిరంజననిర్విషయాతీంద్రియా వాఙ్మానసగోచరాప్రమేయశుద్ధముక్తకేవలాఖండసచ్చిదానందమయంబు నైన తురీయాతీతపరతత్త్వకైలాసంబున నవ్యక్తమహదాదిసప్తావరణపరి వేష్టితంబును, జతుర్దశలోకకందరమందరంబును, సార్వభౌమాది హిర

ణ్యగర్భాంతానందగండశైలభాసురంబును, భాను సోమ నక్షత్ర తారా గ్రహ పావక సౌదామన్యాది వివిధతేజోరత్నశర్కరిలంబును, ప్రవిమల వైరాగ్యోపరత్యేకాంతాత్యంత ముముక్షుతాధిత్య కాధ్యాత్మానంద జీవ నాభిషిక్త నిర్మల నిశ్చల కలికాకలిత ఫలిత నిష్కామ కర్మోపాసనా యాగ యోగ జపతపస్సత్యశౌచదయా శీలవ్రతదానాది నానావిధా నోకహోద్యాన విరాజితంబును, శాస్త్రపుష్పోపేత నిగమాగమాంత కల్పలతావిలసితంబును, షడ్విధసమాధిసౌధవిభ్రాజితంబును, బరమా ధ్యాత్మవిద్యానంద జలాభిషిక్త నిర్మలచిత్తవృత్త్యంగణ శమదమోప రతి తితీక్షాశ్రద్ధా సమాధానా మానిత్వా దంభిత్వాది కల్యాణగుణమణి గణరంగవల్లీప్రకాశితంబును, నిరతిశయ కైవల్యభాండాగార శోభితంబును ఫలకామనాభావ స్వభావనియత కర్మాచరణ చిత్తశుద్ధి సర్వకర్మపరి త్యాగ గురుభక్తి వేదాంతశ్రవణ మనన నిదిధ్యాసన జ్ఞానాది సోపాన సమన్విత విజ్ఞానరాజమార్గలలితంబును, బంచాక్షరీమహామంత్రమాణిక్య తోరణాలంకృతంబును, బ్రణవనాదమంగళవాద్యరవపూరితంబును నగు తురీయ మహాస్థానమంటపాంతరంబున సర్వోపనిషత్సారభూత బ్రహ్మై కత్వదర్శనయోగ ప్రోంకార సింహాసనాసీనుండై శుద్ధసత్త్వప్రధాన మాయామయ దివ్యశోభనవిగ్రహుండును సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వరక్షకత్వ సర్వసంహారకత్వాద్య గణితసమగ్రసుగుణపరిగ్రహుండును, సత్యజ్ఞానానందస్వరూపుండును, సర్వవ్యాపకుండును, దేవదేవుండు నగు శ్రీమహాదేవుండు మూర్తి మంతంబులైన చతుర్వింశతితత్త్వంబులును, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులును, హృషీకేశ్వర వాణీశ్వర సురేశ్వర నందికేశ్వర భృంగీశ్వర విఘ్నేశ్వర కుమారాది ప్రమథగణాధీశ్వరులును, బ్రాహ్మీమాహేశ్వర్యాది సప్త మాతృకలును స్వసాన్నిధ్యంబున నిజకరుణాకటాక్షవీక్షణంబు నపేక్షించి కొలువ స్వస్వరూపావలోకనంబు సేయుచు నాత్మారాముండై యున్న

సమయంబునఁ దదీయవామార్థశరీరిణియుఁ బరాపరప్రకృతిస్వరూపిణియు నిఖిలజగదుపాదానకారణభూతయు నఖిలలోకైకమాతయుఁ ద్రిభువన గేహినియు విశ్వమోహినియు ధీముఖియు జ్ఞానవిజ్ఞానలోచనయు విషయ విరక్త్యధరయు విచారమందస్మితయు నిర్మమతానిరహంతాహస్తయు యోగబోధస్తనియు సందేహమధ్యయు సంసారచక్రనాభియు రాగద్వేష జఘనయుఁ గామలోభోరుయుగళయు సంకల్పవికల్పచరణయుఁ గాలాను గతకర్మయానయు వేదాంతవిద్యావ్యసనవసనోపరతికంచుక ధారిణియు రజస్సత్త్వతమోగుణగ్రంధినీవీబంధ కంచుకబంధసురుచిరయు ఫలత్యాగ పూర్వవర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వరప్రణిధానాచార్యోపాసనేంద్రి యాత్మవినిగ్రహస్థిత ప్రజ్ఞత్వాదిసాత్త్వికగుణభూషణాలంకారిణియు శుద్ధ వాసనావాసితయు నిత్యానపాయినియు దేవదేవియు నగు శ్రీమహాదేవి యతిప్రీతిపూర్వకంబుగాఁ జతుర్విధశుశ్రూషలు గావించుచు సేవించుచుఁ బూజించుచు భావించుచు నమస్కరించుచు నారాధించినం బ్రసన్నుండై మెచ్చి నీకు నెయ్యది యిష్టం బిచ్చెద నడుగు మనిన సంతోషభరిత చిత్తయై యమ్మత్తకాశిని చిఱునవ్వునగుచు నిట్లనియె. 40

తా. ఆపరబ్రహ్మము తుదమొదలులేనిదియును, స్వజాతిలేనిదియును, విజాతిలేనిది యును స్వగతభేదరహితమైనదియును, సూర్యచంద్రాగ్నుల తిరస్కరించు తేజముగలదియు నాల్గువేదములచేతను,ఆరుశాస్త్రములచేతను,పదునెనిమిదిపురాణములచేతను యితిహాసముల చేతను 28 ఆగమములచేతను దెలియనలవిగానిదియును; వర్ణములును, ఆవర్ణములకుదగిన ధర్మానుష్ఠానకర్మములును, త్రిగుణములును, రామకృష్ణాదినామములును, మత్స్యకూర్మాది రూపములును, షడ్విధవికారములును, షడ్విధశక్తులును లేనిదియును, బ్రహ్మాదులగు దేవ తలు అనంతాదిసాములు గరుడగంధర్వులు మొదలగువారును, నవగ్రహములును, నార దాదిమహాఋషులును, సనకసనందనాదిమహర్షిసత్తములును కపిలాదులగు యోగీశ్వరులు ను, అగస్త్యాదిమునీశ్వరులును, గోవిందభగవత్పాదశంకరాదియతులును,మహాకవులుమున్నగు వారిచే సేవింపదగినదియు, త్రికాలముల నశింపకుండునదియు, ప్రకృతిగుణములును సంకల్ప వికల్పములు జననాదివికారములును దేవమనుష్యాదిరూపములును లేనిదియును, సాధనాంత రములులేక వెలుంగునదియును, వినుటకు చూచుటకు వర్ణించుటకు ధ్యానించుటకు నశక్య

మైనదియు ప్రమాణింపరానిదియు నిర్మలమైనదియు విజ్ఞానరూపమైనదియు దేనిని యంటనిదియు ఏకస్వరూపమైనదియు విభాగింపరానిదియు సత్యము జ్ఞానము ఆనందము రూపముగాగలదియు 5 వ అవస్థమీరినదియు అగు పరబ్రహ్మమనెడి కైలాసపర్వతమునందు అవ్యక్తము మహత్తత్త్వము పంచతన్మాత్రములు అనుసప్తప్రాకారములును, 14 లోకములను గుహలును చక్రవర్తి మనుజగంధర్వపితృదేవతలు ఆజానజానులు కర్మదేవతలు ఇంద్రుడు గురుడు నవబ్రహ్మలు చతుర్ముఖబ్రహ్మలు అను జారుడురాళ్లును, సూర్యుడు చంద్రుడు నక్షత్రములు గ్రహములు అగ్ని సౌదామిని మొదలగు అనేక తేజోన్నతరత్నముల యిసుకగలదియు, ఇహపరలోకభోగవిరక్తి చిత్తశాంతి నిశ్చలచిత్తము తీవ్రమోక్షేచ్ఛ అను పర్వతసానువులును మొలచిన బ్రహ్మానందరసముచే నభివృద్ధి నొంది నిర్మలము నిశ్చలము అను మొగ్గలతో ఫలాపేక్షలేని యిష్టకర్మములు పూర్తకర్మములు నిత్యనైమిత్తికములు మంత్రోపాసనలు యాగములు యోగములు మంత్రజపములు వ్రతములు దానములు మొదలైనవను అనేక వృక్షములుగల యుపవనముగలదియు షట్శాస్త్రములనెడి పుష్పములుగల వేదముల ఆగమముల యుపనిషత్తులును చర్యక్రియ యోగజ్ఞానపాదము మొదలగువాని యందలి కర్మకర్తృపూర్తి శివమహాసాదాఖ్యార్థములను దెలియజేయువాక్యము లను కల్పవృక్షములు కలదియు, ఆరువిధములైన సమాధులనెడి నగళ్లుగలదియు ఆనందమను నీటిచే దడుపబడిన పరిశుద్ధహృదయమునందలి వృత్తిజ్ఞానమను ముంగిటియందు ఇంద్రియనిగ్రహము జీవబ్రహ్మైక్యసమాధిచే. కర్మపరిత్యాగము సల్పుటమున్నగు సద్గుణములను రత్నములముగ్గులు గలదియు మోక్షమను బొక్కసము గలదియు త్రికరణముల దుష్టవ్యాపారములవిడచుట ఆచార్యభక్తి ఉపనిషదర్థమును వినుట వినినదాని నేకముజేసి చింతనజేయుట అట్లొనర్చి విజాతీయములగు దుర్గుణములనువీడి సజాతీయములగు చింతనము స్వరూపజ్ఞానము అను మెట్లుగల రాజవీథులుగలదియు పంచాక్షరియనుమాణిక్య తోరణముచే నలంకృతమైన ముంగిలి వాకిండ్లుగలదియు 10 విధములైన ఓంకారము లనుమంగళనాద్యముల మ్రోతలచే నిండినదియు నయిన తురీయావస్థయను గొప్పకొలువుకూటమునందు పరబ్రహ్మమునకును ప్రత్యగాత్మకును నైక్యమునూపు స్వరూపముగలదియైన ఓంకారమనుసింహాసనముమీద కూర్చుండినవాడై శుద్ధసత్త్వప్రకృతియైన మాయావికారమును అప్రాకృతమును నిత్యమంగళకరమైన విగ్రహము గలవాడును సమస్తము నెఱుగుట సమస్తమునకు ప్రభువగుట సర్వత్రనిండియుండుట సమస్తమునుపాలించుట మొదలగు సుగుణవిరాజితుడును, దేశకాలపరిచ్ఛేదములేకుండుట సాదృశ్యములేకయుంకుట నిరతిశయానందము ఇదియే స్వరూపముగా గలవాడును ప్రాణుల యందంతర్యామియై యుండువాడును దేవతలకు ప్రభువైనవాడును అగు సాంబమూర్తి

రూపములను ధరించి 24 తత్త్వములును 5 శక్తులును ప్రమథగణాధిపతులును సప్తమాతృకలును తన కటాక్షమపేక్షించి కొలువగా దన్ను తాను సందర్శించుచు హాయిగానున్న సమయమున అర్ధశరీరముగలదియు త్రివిధప్రకృతులే రూపముగా గలదియు ముల్లోకములకు నివాసమైనదియు ముల్లోకముల మోహింపజేయునదియు వస్తుతత్త్వమెఱుంగుబుద్ధియే ముఖముగాగలదియు శాస్త్రప్రజ్ఞానబ్రహ్మజ్ఞానములు నేత్రములుగాగలదియు 14 యింద్రియ విషయానుభవవిరక్తియే పెదవిగాగలదియు బ్రహ్మవిద్యావిచారణయే చిరునవ్వుగాగలదియు భేదములేనివృత్తులే హస్తములుగాగలది నేనుజీవుఁడనా? బ్రహ్మనా యనుసంశయమే నడుముగాగలదియు సంసారచక్రమేబొడ్డుగాగలదియు రాగద్వేషాదులే పిఱుదులుగాగలదియు, కామలోభములు తొడలుగాగలదియు సంకల్పవికల్పములు పాదములుగాగలదియు పుణ్యపాప మిశ్రకర్మఫలములే నడకగాగలదియు బ్రహ్మవిద్యాపర్యాలోచనయే చీరగాగలదియుచిత్తవిశ్రాంతియే రవికగాగలదియు రజోగుణయుతమగు జాగ్రతయే పోకముడిగాగలదియుస్వప్నావస్థయే రవికముడిగాగలదియు సుషుప్తియే జడకుడిగాగలదియు 4 వర్ణముల వారికినివివిధాశ్రమములవారికిని దగు ఫలాపేక్షలేకచేయబడు ధర్మానుష్ఠానముల కధీశ్వరియుసాత్వికగుణములే యాభరణములుగాగలదియుశుద్ధసత్వమే పరిమళచందన చర్చగాగలదియు పరమశివునెడబాయనిదియు పరమశివునకుపట్టపురాణియైనదియైన శ్రీపార్వతీదేవి అతిప్రీతితో భర్తకు చతుర్విధ శుశ్రూషలగావించుచు సేవించుచు పూజించుచు ధ్యానించుచు నమస్కరింపుచుండ నతఁడు మెచ్చి పార్వతీ! నీకువలయు వరమొక్కటి యడుగుమనెను. అంతపార్వతి సంతోషించి నవ్వుచు భర్త కిట్లనియెను.

ఆ. ప్రాణనాథ తనదు పతినిఁ గొల్చుటకంటె,
వేరుపనులు గలవె చారుమతికి
గాన నీకుసేవఁ గావించుటయ కాని
యొండుకోర్కె లేద ఖండమూర్తి. 41

తా. నాథా! తరుణీమణికి తన ప్రాణవల్లభుని నిరంతము సేవించుటకంటె నవశ్యాచరణీయములగు కార్యములు లేవుగదా? కాన నాకు మీ సేవ సేయుచుండుటకంటె వాంఛనీయము వేరొండులేదు.

ఆ. అయిన నీ కభీష్ట మడుగు మిచ్చెద నని
యానతిచ్చితిరి మహాత్మ యిపుడు

గాన నాకు నెల్ల ౯ మానవులకు మేలు
గలుగ నొకటి యడుగ ౯ వలసె ననఘ. 42

తా. అయిన తాము కటాక్షమున నీయభీష్టమిచ్చెదనని సెలవిచ్చిరిగనుక నాకును లోకుల కెల్లరకునుగూడ నుపయోగకరమైన పదార్థవిషయమునుగూర్చి యడుగవలయునను నభిలాష జనించుచున్నది.

క. నిఖిలకలుషసంక్షయకర
మఖిలాభీష్టప్రదం బహనంతావ్యయచి
త్సుఖదము జగదధిపత్యభి
ముఖకర మగు మంత్రరాజకముం గృపఁ జెపుమా. 43

తా. సమస్తములైన పాపములను బారద్రోలునదియును అఖిలములగు కోరికలను గూర్చునదియును చిదానంద మొసంగునదియును లోకములను సృష్టించుటకును పోషించుటకును లయింపజేయుటకు కారణభూతుఁడైన పరమాత్మను దెలియజేయునట్టిదియును నగు మంత్రరాజము నుపదేశింపుము. *

తే. అనిన విని నవ్వి గిరిజ కి ౯ ట్లనియె శంభుఁ
డడుగరానిరహస్యార్థ ౯ మడిగి తీవు
దగ నది మదీయనిక్షేప ౯ మగుపదార్థ
మైన నెఱిఁగింతు నీకు నెహయ్యంబువలన. 44

తా. అని పార్వతి యడుగగా పరమేశ్వరుఁడు నవ్వి తన్వీమణీ! యడుగరానియట్టి గోప్యమగు నట్టి విషయమునుగూర్చి యడిగియుంటివి. అయ్యది నాహృదయమున నిక్షిప్తమైన ధనమువంటిది. అయినను నీవు వినదలచితివి గాన నీకు నే నెఱింగించెదను వినుము.

తే. శ్రీమనోరామ శ్రీరామ ౯ రామ రామ
యనుచు రమియింతు రామునియందు రామ
నామము వరానన సహస్రనామతుల్య
మట్లు గావున దీనిని ౯ నవధరింపు. 45

---

* కల్లుద్రావుట, గురుపత్నీగమనము, బ్రాహ్మణహత్య, బ్రాహ్మణధనాపహరణము బంగారు దొంగిలించుట యీ యైదును మహాపాపములని యెఱుంగవలయును.

తా: పార్వతీ! నేను ప్రతినిమిషమునందును శ్రీరామరామ యని జపించుచు ఆతనియందే మనస్సు నిలిపియుందు. ఒక్కసారి శ్రీరామనామమును స్మరించునంతమాత్రముననే విష్ణుకృత్యాది సహస్రనామములన్నియు జపించిన యంతటిఫలముగలుగు. కావున నీవు తప్పక యాశ్రీరామమంత్రమును నీమనంబున నిలుపుము.

శ్రీరామనామార్థము శివుఁడు పార్వతికిఁ దెలుపుట.

క. ఆదిపరబ్రహ్మప్రతి
పాదక మత్యంతపరమపావనముసుమీ
యీదివ్యమంత్రరాజము
మోదిత ధర్మార్థకామమోక్షప్రదమున్. 46

తా. గిరిజా! ఈశ్రీరామమంత్రము తక్కిన మంత్రములన్నిటికంటె శ్రేష్ఠమైనదై బ్రహ్మరుద్రాదులగు పంచకర్తలవ్యాపారమునకును ముఖ్యకారణమైనదియును పరతత్త్వమును దెలియజేయునదియును, పవిత్రమైనవస్తువులలో మిక్కిలి పవిత్రమైనదియును తన్నుపాసించినవారికి చతుర్విధపురుషార్థములు నొసంగునదియునై యున్నది.*

క. సత్యజ్ఞానానంద
ప్రత్యగభిన్నాత్మునందు బ్రహ్మవిబుధుల్
నిత్యము రమియించు చుండఁగ
గాత్యాయని! రామపదము గలిగెఁ బరునకున్. 47

తా. సచ్చిదానందస్వరూపమై కూటస్థునికంటె నితరము గాని పరమాత్మయందు సకలబ్రహ్మవేత్తలమనంబు లెల్లప్పుడును లీనమయి యుండుటచేత ప్రకృత్యతీతమైన యాపరబ్రహ్మమునకు రామనామము లభించెను.

తే. రామపదవాచ్యుఁ డాదినారాయణుండె
యతనికిని నాకు భేదమింతైనఁ గలుగ
దద్వయబ్రహ్మమయుల మట్లగుటవలన
నింతి! నాయంద నేను రమింతు నెపుడు. 48

* బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు, మహేశ్వరుఁడు, సదాశివుఁడు. వీరైదుగురును పంచకర్తలు, వీరివ్యాపారము క్రమముగా సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములు—పురుషార్థములు నాలుగు. ధర్మము, అర్థము, కామము, మోక్షము.

పార్వతీ! శ్రీరాము డనుపేరబరగు పురుషుడు అహం, అనుశబ్దమునకు లక్ష్యమైన పరబ్రహ్మమైన నారాయణుఁడుసుమా! ఆనారాయణునకును నాకును భేదము లేదు. మే మిరువురమును రెండవదిలేనియట్టి పరబ్రహ్మస్వరూపులము. అట్లగుటచే నేను నాయందే క్రీడించుచుందును.

## శ్రీరామనామప్రభావము.

తే. రామతారకపావన రామనామ
మెంతపాపంబు నడఁగించు నంతయఘము
శ్వపచుఁ డైనను జేయఁగా జాలఁ డనఁగఁ
దత్ప్రభావంబు నెన్నంగ దరమె నాకు. 49

తా. ఎంతెంతటిమహాపాతకములనైనను రామనామసంస్మరణము హరింపజేయును. రామనామము హరింపజేయజాలనంతటి ఘోరపాపమును చండాలుఁడైనను చేయజాల డనుటయే నిక్కము- కావున శ్రీరామనామమాహాత్మ్య మిట్టిదని వర్ణింప నలవియగునా?

క. ఈ రేడుజగములందును
నారీమణి! విమలరామనామముచేతం
జీరఁబడని ఘనదుర్భర
ఘోరమహాఘంబు లేదు కోరి వెదకినన్. 50

తా. పార్వతీ! యీపదునాల్గులోకములందునను శ్రీరామమంత్రముచేత నశింపజేయబడజాలనియట్టి మహాపాతకము వెతకిచూచినను లేదనియే జెప్పవలయును.

తే. బ్రహ్మహత్యాయుతము మద్యపానదశశ
తమును గుర్వంగనాకోటిగమన దురిత
మపరిమితహేమచౌర్యంబు లనవరతము
రామనామాభిహతము లోకరాజవదన! 51

తా. పార్వతీ! పలుమారులు బ్రహ్మహత్య చేయుటవలననైనను, వేయిపర్యాయములు కల్లుద్రావినపాపమును, నూరులక్షలమారులు గురుభార్యతో గలసినపాపమును, అనేక సారులు బంగారమును హరించినందువలన గలిగినపాపమును శ్రీరామనామము నశింప జేయును.

సీ. బ్రహ్మహత్యాఖ్యపాపతమోర్కబింబంబు
మధుపానదోషాభ్రమారుతంబు
తపనీయచౌర్యపాతకశైలభిదురంబు
గురువధూగమనాఘకుంజరహరి
జననీపితృభ్రాతృవనితార్భకాచార్య
గోవధారణ్యోరుదావవహ్ని
పరసతీసంగమపరధనహరణాది
ఘోరపంకోరగక్రూరబర్హి
తే. అనృతభాషణవల్లీమహాలవిత్ర
మార్యదూషణపంకేరుహద్విపేంద్ర
మఖిలకలుషాంబునిధిబడబానలంబు
రామనామంబు హిమశైలరాజతనయ ! 52

పార్వతీ ! బ్రహ్మహత్యవలన గల్గినపాపమను, అంధకారమును పటాపంచలు జేయునట్టిసూర్యుడు శ్రీరామనామము. కల్లుద్రావుటవలన గల్గినపాపమను మేఘములను చెదరగొట్టునట్టి వాయువు శ్రీరామనామము. స్వర్ణస్తేయమువలన గల్గినపాపమనుకొండలను పిండిగొట్టగల వజ్రాయుధము శ్రీరామనామము. గురుభార్యాసంగమమువలన గల్గినపాప మనుమత్తేభములను గూల్చునట్టిసింగము శ్రీరామనామము, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, శిశువులు మున్నగువారిని వధించుటవలన గల్గినపాపాటవులను గాల్చుదవానలము శ్రీరామనామము. కల్లలాడుటవలన గల్గినపాపము లనుదీవలను త్రెంచుకొడవలి శ్రీరామనామము. పెద్దలను దూషించుటవలన గల్గినపాపమనుతామరపువ్వులను, నాశనముచేయునట్టి మత్తేభము శ్రీరామనామము. శ్రీరామనామము బడబానలము సముద్రముయొక్క అడుగున నుండునట్లుగా సముద్రమెట్లడచిపెట్టినదో యట్లే సమస్తపాతకములను అణచిపెట్టెను.

తే. రమణి ! యవశముచేనైన రామనామ
మమర గీర్తింపఁబడుచుండ నఖిలపాత
కములచే విడ్వఁబడుసుమ్ము సుమతి యపుడె
సింహ మతిభీతమృగములచేతఁబోలె. 53

తా. పార్వతీ! ఇంకను శ్రీరామనామమహిమ నాలింపుము. సింగము దన కాహారము లభింపనపుడు ముట్టె నేలబెట్టి గర్జించును. ఆగర్జనమాలించి మృగములు భీతిల్లి నలుమూలలకు బరుగిడుచుండును. అట్లే శ్రీరామనామము ఆకస్మికముగా నోటనుచ్చరించినంతమాత్రమున సకలపాపములును సింహగర్జనమువిన్న మృగములవలె పరుగిడును. శ్రీరామనామము స్మరించినంతమాత్రమున నఖిలపాపములనుండియు విముక్తుడగును.

తే. అనవరత రామనామకీర్తనపరుండు
వెనుకటి యఘంబులఁ దలంచి వెఱవ వలను
ఘనత నేనుఁగు నెక్కి కుక్కలను గాంచి
భయపడఁగ నేల మనుజుఁ డోపంకజాక్షి! 54

పార్వతీ! మత్తేభము పైకూర్చుండిన మనుజుఁడు భూమిపైనరచుచుండు కుక్కలకు భయపడనియట్లుగనే శ్రీరామనామసంస్మరణ మొనరించునట్టివాఁడు తా నీవఱకుఁ జేసిన పాపములనుగూర్చి సుంతైనను భయపడవలసినపనిలేదు.

క. ఇలలోన రామనామము
సులభంబై వెలుఁగుచుండఁ జులకఁగ బలుకం
గలనాలుక గలుగఁగ న
ల్పులు మిన్నక నరకములను బొందెద రకటా. 55

పార్వతీ! శ్రీరామనామము పలుకుట కతిసులభమైనది. గురుశుశ్రూషమున్నగు కష్టములులేకనే సులభముగా లభించునదియైయున్నది. అయినను మూఢులగుజనులు శ్రీరామనామమును స్మరింపక వ్యర్థముగా ఘోరములగు నరకములలోఁ బడుచున్నారు.

ఉ. ప్రాపుగ రామనామము నిరంతరముఁ భజియించువారికిం
బాపము లేదటంచుఁ బెనుపామును బట్టఁగ వచ్చు నగ్నిసం
దీపితలోహఖండము నతిత్వరితంబుగ మ్రింగ వచ్చు బ
ల్కోపముఁ బెంచు పెద్దపులికోరలు దియ్యఁగ వచ్చు నిద్ధరన్. 56

తా. గౌరీ! శ్రీరామనామమునే యనవరతమునునమ్మి భజించుచు రాముఁ తనకు జిక్కఁని నమ్మినవారు తమకట్టిపాపమును లేదని కృష్ణసర్పమును చేతితోఁ బట్టుకొనవచ్చును. అగ్నియందెఱ్ఱగాగాలిన యినుపగుండును చేతితో బంతివలె బట్టవచ్చు మిక్కిలి కోపముతోనున్న పెద్దపులికోరలనుగూడ పెఱుకవచ్చును.

క. ఏపాపము నైనఁ దగం
బాపఁ గలదు రామనామభజనపరునకున్
బాపము గల దని పలుకు మ
హాపాతకియఘము నడఁప నే నది యోప దిలన్. 57

తా. పార్వతీ ! శ్రీరామనామ మెట్టిపాపమునైనను పోగొట్టగలదుగాని రామనామమునే భజించునట్టివానికి బాపముగలదని వచించెడు పాపాత్మునకు గల్గెడిపాపమును మాత్రము శ్రీరామనామము పరిహరింపజాలదు.

శ్రీరామనామమంత్రాధికారులవివరణము.

సీ. ద్విజవరేణ్యులకును విప్రోత్తములకు యో
గీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్య సంపద్విశిష్టులకు నే
కాంతవాసులకు వేదాంతులకును
జండాల పుల్కస శ్వపచ కంకి కిరాత
శబర హూణాంగనాసంగతులకు
బ్రహ్మహత్యా సురాపాన హేమస్తేయ
గురునధూసంగమకరవరులకు

తే. సుందరీక్షత్రియోరవ్యశూద్రులకును
మఱియు నానావిధానేకమానవులకుఁ
బరమపావన మై శుభప్రదము నైన
రామనామంబు శరణంబు రాజవదన ! 58

పార్వతీ ! సమస్తవిధములయిన సత్కర్మముల నాచరించుచు బ్రాహ్మణులలో శ్రేష్ఠులైనవారలకును, కర్మఫలాపేక్షలేక సంసారసాగరమునుండి తాము తరించుమార్గము ను దెలిసికొని యితరులకు బోధించుచుండునట్టి నియమముగల యోగిపుంగవులగు బ్రాహ్మణులకును, పరతత్వమెఱింగిన యోగీంద్రులకును, జీవబ్రహ్మైకతత్వమెఱింగిన వారలకును గురుజనులచే నుపదేశింపబడినవారలకును, యిహపరభోగములయెడ విరక్తిగలవారలకును, నిర్జనములైన వనంబుల నివసించువారలకును, బ్రహ్మజ్ఞానముగలవారలకును, మాలలు

మాదిగలు మొదలైన తక్కువజాతివారలకును, స్త్రీలకును, క్షత్రియాదులకును శ్రీరామ నామ మవశ్యపఠనీయము. అట్టివారలకు సకలశుభములు చేకూర్పగల మహామంత్రము శ్రీరామనామము.

చ. కన దురురామనామమున కంటె ఘనం బగు పాపనాశసా
ధనము నిరంతరేష్టఫల దాయకమైన విశేషకారణం
బును మఱి లేదు లోకమున మూఢులెఱుంగరు దాని నాశ్రయిం
చిన సకలార్థసంపదలు చేకురుసిద్ధము శైలనందనా! 59

తా. శైలనందనా! మహత్తరమైన శ్రీరామనామముకంటె పాపములను బో గొట్టగలిగిన మహామంత్రసాధన మింకొకటిలేదు. కాని అజ్ఞానులగువారు దాని నెఱుంగక మోసగింపబడుచున్నారు. శ్రీరామనామమును జపించుచు శ్రీరాముని ధ్యానించుచు యాతనిపవిత్రచారిత్రము నాలించుచుండువారలు సమస్తసంపదలనుపొంది సుఖించు చుందురు. *

తే. అబల! శ్రీరామరామనామాఖ్యమంత్ర
మీప్సితంబుల నర్థుల కిచ్చు చుండఁ
గాంచి నెఱి సిగ్గు పడు చుండుఁ గల్పతరువు
కామధేనువు నంఘు చింతామణియును. 60

గౌరీ! శ్రీరామనామము భక్తులకోరికలనన్నింటిని యొసంగుచుండుట దిలకించి కామధేనువు, కల్పవృక్షము, చింతామణి చిన్నతనమునకు లోనై సిగ్గుపడుచుండును.

## శ్రీరామనామమంత్రోపాసనాఫలము.

సీ. ధర్మార్థులకు సర్వధర్మంబు లొనఁగూర్చు
సర్థార్థులకుఁ జేయు నర్థములను
గామార్థులకు నెల్లకామంబుల నొసంగు
నాత్మజార్థుల కిచ్చు నాత్మజులను

* భోగసంపద లెనిమిదివిధములు— దాస్యముచేయువారు, సేవకులు, కుమారులు, బంధువులు వస్తువాహనములు ధనసంపద, ధాన్యసమృద్ధి యివి 8 అష్టవిధభోగము లనబడును.

శ్రీధృతిస్మృతియశశ్శ్రేయస్సుఖక్షమా
విద్యార్థులకు వాని వెలయ నిచ్చు
ఛత్రచామరగజాశ్వప్రభుత్వార్థుల
కవియు సంపాదించు ననవరతము

తే. జంద్రసూర్యాలయాంబుల స్వర్గలోక
సత్య వైకుంఠ కైలాససదనములను
గోరువారల కవియుఁ జేకూఱఁజేయు
రామనామంబు విలసిల్లి రాజవదన ! 61

తా. శ్రీరామనామము ధర్మ మపేక్షించువారలకు సద్ధర్మమొసంగును. ద్రవ్యసంపద కోరువారలకు ద్రవ్యమొసంగును. కేవలము కామియై కామితములనే గోరువారలకు వారల యీప్సితములనొడగూర్చును. పుత్రులుకావలెనని వాంఛించువారలకు పుత్రులనిచ్చును. సంపదలను, శాస్త్రజ్ఞానమును, బ్రహ్మజ్ఞానమును యొసంగును. ఛత్రచామరాదికములతోగూడిన దొరతనమాకాక్షించువారలకు తప్పక దొరతనమొసంగును. సూర్యలోకము, చంద్రలోకము, స్వర్గలోకము, బ్రహ్మలోకము, (సత్యలోకము) విష్ణులోకము, (వైకుంఠము) శివలోకము, (కైలాసము.) వీనియం దెవ్వరేదికోరినను వారికాలోకముల నొసంగగలదు.

వ. అదియునుం గాక. 62

సీ. నిఖలరోగంబుల నిర్మూలముగఁ జేయు
భవభయంబులనెల్ల బాఱఁదోలు
బంధనంబులఁ బటాపంచలు గావించు
నొలయు నాపదలను నులిమివైచు
శాత్రవవిజయంబు సతతంబు సమకూర్చుఁ
దూలించు బహువిధదుఃఖములను
దలఁ జూప కుండ దుర్దశలను దొలఁగించు
సకలశుభంబుల సంగ్రహించు

తే. బరమపావనమంగళ ప్రదము గాన
గలితధర్మార్థకామమోక్షములలోన
నెసఁగుభక్తుల కొసఁగని దెద్ది లేమ
ఏమి చెప్పుదు శ్రీరామనామమహిమ. 63

తా. శ్రీరామనామమహిమ నేమని యభివర్ణింతును. ఆ శ్రీరామనామము సకల విధములైన రోగములను నశింపజేయును. సంసారమునకు సంబంధించిన భయములన్నిటిని పారద్రోలును, ఆశాపాశమువంటి బంధనముల పారద్రోలును. ఆపదలను పోనడంచును. శత్రువిజయమొసంగును. దుఃఖములను దూరమునకుగురగొట్టును. దుర్దశలు తలలెత్తకుండ తొలగించును. అనేకవిధములైన భాగ్యములొనగూర్చును. శ్రీరామనామ మతిపావనమైనదియును మంగళకరమైనదియును నగును. గాన ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములలో శ్రీరామనామ మొసంగజాలని దెద్దియునులేదు.*

క. అచ్చటనె సరస్వతియును
నచ్చట భాగీరథియును యమునానదియున్
నచ్చట సమస్తతీర్థము
లెచ్చట శ్రీరామనామ మెప్పుడు గలుగున్. 64

* పంచవిధక్లేశములు, (1) అవిద్యాక్లేశము, (2) అభినవక్లేశము, (3) అస్తిగతక్లేశము, (4) రాగక్లేశము, (5) ద్వేషక్లేశము.

(1) నేను జీవుడనని నిర్ణయించుట అవిద్యాక్లేశము.

(2) సంసారమును, తదనురక్తిజెందిన మనస్సు విడువకుండుట అభినవక్లేశము.

(3) విషయాభిలాషగల్గి విడివడ నేరకుండుట అస్తిగతక్లేశము.

(4) ధనముపై నమితాశగల్గియుండుట రాగక్లేశము.

(5) పొట్టకై పరులనాశ్రయించి వారల దూషించుట ద్వేషక్లేశము.

అష్టవిధములగు బంధములు.

(1) దయ, (2) జుగుప్స, (3) మోహము, (4) భయము, (5) సంశయము. (6) కులము, (7) బలము, (8) శీలత.

అష్టకష్టములు.

(1) ఋణము, (2) యాచన, (3) వృద్ధత్వము, (4) జారత్వము, (5) చోరత్వము, (6) దరిద్రము, (7) రోగము, (8) ఎంగిలితినుట. ఇవి 8 అష్టకష్టము లనబడును.

తా. ఎచ్చట ప్రతినిముషమునందును శ్రీరామనామమంత్ర జపము జరుగుచుండు నో యచటనే గంగా యమునా సరస్వతి మున్నగు సమస్త పుణ్యనదీనదంబులును కలిగి యుండును. కావున నాస్థలము మహాపవిత్రమైనదగును.

తే. తెలివి శ్రీరామనామసుధారసంబు
నమృతులై గ్రోలు భక్తుల కమృతమేల
నమరనమృతాంధసులచేతనదియె మిగులఁ
గోరఁబడుచుండు గావున వారిజాక్షి. 65

తా. గౌరీ! దేవతలు క్షీరసముద్రమునందుద్భవించిన యమృతమును ద్రావియుండి యు, మోక్షాసక్తులై సదా యు శ్రీరామనామామృతమునే యెల్లపుడు గ్రోలుచుందురు. శ్రీరామ ధ్యానామృత మనవరతము గ్రోలెడి ముముక్షువులకు క్షీరసముద్రోద్భవమైన యమృతముతో నెంతమాత్రమును నిమిత్తము లేదు.

తే. కోరి మును గానవిమనుష్యుఁ బేరువాడి
చేరిన నతం డతని చెంతఁ జేరినట్లు
తన్నెఱుంగక దనపేరుఁ దలఁచినంతఁ
గరుణ చేరాముఁ డపుడె సాక్షాత్కరించు 66

తా. గిరిజా! ఒకగుంపులోనున్న వానిలో నొకనిని మన మెఱుఁగకున్నను వాని పేరు పెట్టి పిలిచినతోడనే యా పేరుగలవాడు పలుకుచుండును. అట్లే శ్రీరాముడును తన్నె ఱుఁగక పోయినను భక్తిచే తన్ను పిలచెడిభక్తులకు పలుకుచుండును.

సుగంధివృత్తము.

రామ రామ రామ రామ రామ రామ యంచు శ్రీ
రామ రామ రామ రామ రామ రామ యంచు శ్రీ
రామ రామ రామ రామ రామ రామ యంచుఁ ద
న్నామకీర్తనంబుఁ జేసినం గలుఁగు మోక్షముర్వి. 67

తా. సులభము.

క. నిరతంబు రామనామ
స్మరణంబునకంటె మోక్షసాధన మితరం

బరయంగ లేదు ధరలో
బరమసులభ మైన లసమసేపాయం బబలా! 68

తా. పావనంబగు శ్రీరామమంత్రజపంబుకంటె మోక్షమునొందుటకు సులభతర మైన మార్గమొక్కటియును లేదు. శ్రీరామనామసంకీర్తనమే మోక్షము నొందుటకు సులభ మైనట్టియు నిరపాయమైనట్టియు మార్గమైయున్నది.

వ. అని యిట్లు శ్రీరామమంత్రంబును దత్పరిభావంబు నుపదేశించిన నాకర్ణించి పరమానందభరితస్వాంత యై యక్కాంతామణి యత్యంతభక్తిపూర్వకంబుగా ననేకప్రమాణామంబు లాచరించి వినుతించి స్వామీ తన్మంత్రాధిష్ఠానదేవతా శ్రీరామ తత్త్వస్వరూపం బెట్టిది యెఱింగింపు మనిన నొక్కింత విచారించి శ్రీరామహృదయం బను పరమేతిహాసంబు గల దందు శ్రీరామతత్త్వం బతి విస్పష్టంబుగా విలసిల్లు నది యతిరహస్యంబు గావున నెవ్వరికిగోచరంబు గాకుండు, దాని నే దెలియం జెప్పెద విను మని శ్రీమహాదేవుం డప్పార్వతీదేవి కిట్లనియె. 69

తా. పరమేశ్వరుఁడు పార్వతికిట్లు శ్రీరామమంత్రంబును, మంత్రభావమును దెలుపగా విని మహోత్కృష్టమైన యానందమును పొంది నాథా! శ్రీరామమంత్రమునకు ముఖ్యదేవతయైన శ్రీరాముఁడెవ్వఁడు. ఆతనియొక్క యథార్థస్వరూపమెట్టిది దెలుపవలసిన దని నమస్కారపూర్వకముగా ప్రశ్నింప నాతఁడు కొంతతడవు యోచించి పార్వతి కిట్లనియెను. పార్వతీ! వినుము. నీకు సర్వమును దెలుపగల నితిహాసమొక్కటిగలదు. అయ్యది శ్రీరామహృదయం బనగ బరగుచుండును. అద్దానివలన శ్రీరామచంద్రుని స్వరూపలక్షణము చక్కగా నవగాహనమగును. ఇయ్యది మిగుల గోప్యమైనది. కావున మూఢుల కగమ్యగోచరమై యుండును. నీయందలి కటాక్షముచే నీకుదెలుపుచున్నాను వినుమని పరమేశ్వరుండు పార్వతికి శ్రీమద్రామాయణ కథాసంగ్రహము నిట్లు వినిపించెను.

## శ్రీరామాయణకథాసంగ్రహము.

సీ. ఆదినారాయణుం డై డాత్తరక్షణపరా
యణుఁడు లోకోపకారార్థముగను

శ్రీరామచంద్రుఁ డై క్షితిపై నవతరించి
ప్రేమతో సీతను బెండ్లియాడి
సాకేతపురమున సంభ్రమించుచు నుండి
జగముల రక్షింప జననివరము
జనకునివాక్యంబు సమకూర్చి చెల్లింపఁ
దమ్ముఁడు భార్యయుఁ దానుఁగూడి
తే. తాపసులవేషములు దాల్చి తాల్మిమీఱ
దండకారణ్యభూములఁ దగఁ జరించి
సకలరాక్షసగణముల సంహరించి
యరిగి సీతానిమిత్తమై యంతమీఁద. 70

తా. శ్రీమన్నారాయణుఁ డార్తులగు దేవతలను రక్షించుటకును లోకముల కుపకారమాచరించుట కొఱకును శ్రీరామచంద్రుఁడై భూమిపై జన్మించి సీతాదేవిని పెండ్లియాడి అయోధ్యాపురంబున గొన్నిదినంబులు వసించి యావల తనతండ్రియొక్క ఆజ్ఞను తల్లియైన కైకయొక్క కోర్కెను గూడ దీర్చదలంచి ప్రియురాలితోడను అనుజుఁడగు లక్ష్మణునితోడను దండకారణ్యమునకు మునివేషమున నరిగి యందు సంచరించుచు ; పెక్కురగు రక్కసుల నుక్కడించుచు కడకు సీతాపహరణంబున కెంతయో చింతించుచు సీతాన్వేషణార్థమరిగి- (ముందు పద్యముతో నన్వయము.)

మ. రణభూమిం దగ రావణాసురునిఁ బుత్త్రిభ్రాతృబంధూరువా
రణగంధర్వశతాంగయుక్తముగ నస్త్రశ్రేణిచేఁ ద్రుంచి ల
క్ష్మణ సుగ్రీవ హనూమదాదియుతుఁ డై కాంక్షించి సీతావధూ
మణితో వచ్చె నయోధ్య కార్యులు నుతింపం బుష్పకారూఢుఁ డై

తా. శ్రీరాముఁడు రావణుని కుమారులను, తమ్ములను, చుట్టములను, యేనుగులను, గుఱ్ఱములను సంహరించి రావణుని సంగ్రామరంగమున వధించి అనుజుఁడగు లక్ష్మణుఁడుహితులగు సుగ్రీవుఁడు విభీషణుఁడుమున్నగువారలను గూడుకొని సీతాదేవిని గైకొని పుష్పకవిమానారూఢుఁడై అయోధ్యానగరమున కరుదెంచెను.

తే. ఇట్లరుగుదెంచి రాముఁడు హితపురోహి
తార్యబాంధవసచివభృత్యప్రభృతులు
ననుజులును గొల్వ సక్తుఁడై జనకజాభి
యుక్తుఁడై యంత బట్టాభిషిక్తుఁడయ్యె.

తా. శ్రీరాముఁడు అయోధ్య కిట్లుదెంచి హితులు, పురోహితులు, పండితులు, బంధువులు మంత్రులును సోదరులును పరిజనులును సేవింపగా సీతాదేవితోగూడి పట్టాభిషిక్తుడయ్యెను.

## శ్రీరామపట్టాభిషేకము.

సీ. శృంగార మేపార సీతాంగనామణి
మును నిజవామాంకమున వసింప
దనపాదుకలు శిరంబున మోచి ముందర
హనుమంతుఁ డతిభక్తి ననుసరింప
ధవళాతపత్ర మాతతధనుర్బాణముల్
దాల్చి లక్ష్మణుఁడు కైదండ నలర
సరి నిరుగడల వింజామరంబులు పూని
భరతశత్రుఘ్నులు పరిఢవింప

తే. ననుపమోజ్జ్వలరత్నసింహాసనమున
నమరఁ గూర్చుండి కోటిసూర్యప్రకాశుఁ
డై వసిష్ఠాది మునిసమూహములచేతఁ
జెలఁగి రాముండు పట్టాభిషిక్తుఁడయ్యె.

తా. శ్రీరాముఁడు తనయొక్క ఎడమతొడమీద నలంకరింపబడిన సీతాసతీమణిని గూర్చుండబెట్టుకొని యున్న సమయమునను హనుమంతుడనన్యమగు భక్తితో దనపాదుకలను శిరమున ధరించియుండగను, లక్ష్మణుఁడు తెల్లనిదైన ఛత్రమును ధనువును బాణములను ధరించి వెనుకనిలచి కైదండలొసగగను భరతశత్రుఘ్నులిరువురును యిరుపార్శ్వములను నిలచి వింజామరలు వీచుచుండగను, ఉపమానములేనట్టి నవరత్నఖచితమైన రత్నసింహాసనమున గూర్చుండి వశిష్ఠాదిమహామునులచేత పట్టాభిషిక్తుడయ్యెను.

వ. ఇట్లు పట్టాభిషిక్తుండై శ్రీరామచంద్రుండు హితపురోహితామాత్య సుహృద్విద్వద్బ్రాహ్మణ దాస దాసీజనంబులకును, నానాదేశాధీశ్వరులకును, విభీషణ సుగ్రీవజాంబవ త్సుషేణ నల నీల గజగవయ గవాక్ష గంధమాదనాదులకును, వందిమాగధపాఠకలోకంబునకును దక్కినవారల కందఱకును, మనోరథంబులు దీరందగిన రథతురగ వారణగోభూహిరణ్యాగ్రహార రత్న దివ్యవస్త్రాభరణ గంధ మాల్యాదు లొసంగి సత్కరించి యంతటఁ దనపురోభాగవర్తియుఁ బుణ్యకీర్తియును నిటలతటఘటితాంజలియును గృతకార్యుండును నిరాకాంక్షుండును నిత్యానిత్యవస్తువివేకయుక్తుండును సకలవిధైహికాముష్మిక భోగవిరక్తుండును శమాదిషట్కసంపత్తియుతుండును ముముక్షుతా సమన్వితుఁడును మహాబుద్ధిమంతుఁడు నైన హనుమంతుం గనుంగొని కరుణారసంబు పొంగార జనకజాంగనామణినెమ్మొగంబుఁ జూచి మనకు నిత్యభక్తుండును మదీయజ్ఞానాసక్తుండును బరమభాగవతశిఖామణియు నైన యితనికి మద్ద్వైత తత్త్వస్వరూపం బుపదేశింపుమనిన బంగారంబునకుఁ బరిమళంబు గలిగినతెఱంగున నుప్పొంగి మందస్మితముఖారవిందయై విశ్వమోహిని యైన సీతామహాదేవి యాంజనేయుని కభిముఖి యై యిట్లనియె.

తా. శ్రీరామచంద్రుఁడు పట్టాభిషేకమైనపిమ్మట హితులకు, పురోహితులకు, మంత్రులకు, పండితులగు బ్రాహ్మణులకు, దాసులకు, దాసీజనులకు, అనేకదేశములనుండి యరుదెంచిన భూపాలకులకును, రాక్షసరాజైన విభీషణునకును, కపిరాజగు సుగ్రీవునకును జాంబవంతునకును, సుషేణుఁడు, నలుఁడు, మున్నగాగల కపినాథులకు తక్కంగల నెల్లవారలకును వారివారి యభీష్టముల గుర్తించి యథోచితములగు గజతురగస్యందనాదికములను, గోభూహిరణ్యాగ్రహారరత్న దివ్యవస్త్రాభరణాదికములను కానుకగా నొసంగి సత్కరించి తనముందట నున్నట్టివాడును, యధికపుణ్యుండును అంజలిఘటించి శిరంబున జేర్చుకొనియున్నవాడును, కార్యమును సాధించినవాడును, నిరపేక్షగలవాఁడును నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రార్థఫలభోగవిరాగముగలవాడును, శమదమాదిషట్కసంపత్తి

గలవాడును మోక్షాపేక్షగలవాడును అధికమగు బుద్ధిబలముగలవాడును అగునట్టి ఆంజనేయుని దిలకించి కరుణాంతరంగుఁడై జానకీదేవి నెమ్మొగంబు దిలకించుచు మనకు నిత్యభక్తుండును, నాయొక్క తత్త్వమెఱుంగవలయునను కుతూహలముగలవాఁడును, ప్రహ్లాద నారదాది పరమభక్తాగ్రేసరుల కెనయగువాడును అగు యీ ఆంజనేయునకు శ్రీరామావతారతత్త్వమును నీ వుపదేశింపుమని యానతిచ్చెను. అంతట జానకీదేవి మిగులనానందించి యాంజనేయున కభిముఖియై యిట్లు వక్కాణించెను. *

---

(1) సాధనచతుష్టయము.

* (1) నిత్యానిత్యవస్తువివేకము. (2) ఇహాముత్రార్థఫలభోగవిరాగము. (3) శమాదిషట్కసంపద. (4) మోక్షాసక్తి.

(1) నిత్యానిత్యవస్తువివేకము:— నామరూపములు లేక, సత్తుచిత్తు ఆనందము అఖండము, నిర్మలము అనునవియే స్వరూపముగా గలిగిన పరబ్రహ్మమే నిత్యమైనది. తక్కిన సర్వమును (ప్రకృతి సంబంధములగునట్టివియు బాహ్యదృష్టికి గాన్పించునవియును అగు దారసుతాదులు (భార్యలు, మాతాపితరుల ధనధాన్యములు మున్నగునవి.) అసత్యములని యు దెలిసికొనుటయే నిత్యానిత్యవస్తువివేకము.

(2) ఇహాముత్రార్థఫలభోగవిరాగము:— భూలోకమున నర్థసంపదచే ననుభవింపదగిన భోగములయందును. (ఇండ్లు తోటలు స్త్రీలు పువ్వులు కాయలు పండ్లు ధనధాన్యాదికము మున్నగునవి.) పరలోకములగు స్వర్గలోక సత్యలోక వైకుంఠ కైలాసాదిలోకములయందు గల్గునట్టి సాలోక్యసామీప్యసారూప్య సాయుజ్యము లనుపదవులయందు లభించునట్టి భోగములయందును విరక్తిగల్గియుండుటయే ఇహాముత్రార్థఫలభోగవిరాగమనబడును.

(2) శమాదిషట్కము.

(1) శమము, (2) దమము, (3) ఉపరతి, (4) తితీక్ష, (5) శ్రద్ధ (6) సమాధానము.

(1) శమము:— అంతరింద్రియనిగ్రహము.

(2) దమము, బాహ్యేంద్రియనిగ్రహము.

(3) ఉపరతి:— విహితకర్మలను జ్ఞాననిధిచే క్రమముగా విడచిపెట్టుట.

(4) తితీక్ష:— శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగునట్టి ద్వంద్వములయెడ సమబుద్ధిగలిగి సహించుట.

(5) శ్రద్ధ:— గురువులయెడలను, గురుబోధనమందును వేదాంతశాస్త్రమునందును పరమాత్మయందును, విశ్వాసముగల్గియుండుటయే శ్రద్ధ.

## సీత హనుమంతునకు తారకయోగంబుబోధించుట.

మ. సుమతీ! రాముఁడు నిర్వికారము సదా శుద్ధంబు బుద్ధం బచిం
త్య మవాచ్యం బతులం బతీంద్రియము సత్తామాత్రముఁ స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్ప మజముఁ సత్సంవిదానందరూ
ప మమూర్తం బజరంబు కేవలపరబ్రహ్మంబు చింతింపఁగన్. 75

తా. జననమరణాది షడ్విధవికారములును లేనిదై శుద్ధసత్త్వమును జ్ఞానముచే నెఱుంగఁదగినదై మనసుచే నిట్టిదని ఊహించుటకు కలవిగానిదై వాక్యములచే నిట్టిదని వర్ణింపరానిదై బుద్ధిచే నిశ్చయించుటకనువుగానిదై నేత్రములచే చూడబడనిదై భూతభవిష్యద్వర్తమానములందు నాయాప్రదేశములనక అఖిలప్రదేశములను తనంతటతానే వెలుగుచున్నదై ద్వంద్వాతీతమైనదై సంకల్ప వికల్పములులేనిదై శరీరత్రయమునుగూడ లేనిదై సత్తుచిత్తు ఆనందము స్వరూపముగాఁగల పరబ్రహ్మమే శ్రీరామచంద్రుడని గ్రహింపుము.†

క. అవికారుఁ డయ్యుఁ గనకము
వివిధాభరణంబు లైనవిధమున నితఁడే
దివియై భువియై రవియై
కవియై సర్వాత్మఁ డై ప్రకాశించుఁ దగన్. 76

తా. షడ్విధవికారములును లేనివాడైనను ఈపరబ్రహ్మమే బంగారు ఒక్కటైనను పెక్కువిధములగు నాకారముల ధరించి తొడవులైనట్లుగా నీరాముఁడే భూమ్యా

---

(6) సమాధానము, సద్గురువులచే నుపదేశింపబడిన మహావాక్యములను శాస్త్రములయందు దిలకించి మనస్సంతుష్టినొందుట. 4 మోక్షేచ్ఛ మోక్షమునందు మనస్సునిలిపియుంచుట.

(8) సప్తవిధములగు బుద్ధి.

పండ, మేధ, చార్వి, చత్వ, గృహీతి, శ్రౌతి, ప్రతిభ అని బుద్ధియేడువిధములు. తత్త్వము తెలిసికొనదగిన బుద్ధిపండ, వినినవానిని మరువకుండునది మేధ, ఊహాపోహాలున్న బుద్ధి చార్వి. విషయములగూర్చి పలుమారు వినుటకు విసుగులేకుండునది చత్వ, చెప్పిన దానిని తప్పక గ్రహించునది గృహీతి, గురుశుశ్రూషలయందు సహనముంచుబుద్ధి శ్రౌతి, ప్రజ్ఞానుభవములో విషయబోధనము చక్కగా తెలుపుడు చేయునది ప్రతిభ.

1. † షడ్విధవికారములు. 2. జననము. పెరుగుట, 3. ముదియుట 4. చిక్కుట 5. చచ్చుట 6. గర్భనరకములోనుండుట యీ ఆరును షడ్విధ వికారములు అనబడును.

కాశాదిపంచభూతములును సూర్యచంద్రులును పురుషుఁడు అను అష్టమూర్తుల స్వరూ
ములుగలవాఁడయ్యెను.

క. త్రిగుణాత్మిక వై యనిశము
జగములఁ బుట్టింపఁ బెంప నే సమయింపంగా
దగు మూలప్రకృతియ నే
నగుమఁజుమీ సత్యముగ మహాగుణశాలీ.

తా. పావనీ ! నేను త్రిగుణాత్మకమైన ప్రకృతిని. నేనే యీజగములను బుట్టిం
ప పెంపసమయింప కారణమైయుందు. నేనే త్రిగుణానుగుణ్యములగు వృత్తులతో బ్రహ్మ
విష్ణు శంకరుల చెంతనుండి జగత్సృష్టికికారణభూతురాలనై యున్నాను.

క. అమలుఁ డగు నితనిసాన్ని
ధ్యమువలన సృజింతు జగమహేతంద్రితనై యి
ట్లమర జడులచేఁ దత్సృ
ష్టము కల్పింపఁబడు నీయనేసంగునియంచున్.

తా. పావనీ! సచ్చిదానందరూపుఁడగు రామచంద్రుని సాన్నిధ్యమునందుండు
చేత కలిగినబలముచేత నేనే మహాజాగ్రతతో జగత్సృష్టిగావించుచుందు. అజ్ఞులైనవారీ
సంగతి నెఱుంగక అమలుఁడగు నీతఁడే జగత్సృష్టిగావించుచుండునని తలఁతురు.

వ. అది యెట్లనిన నాకర్ణింపుము. అయోధ్యానగరంబున సత్త్వనిర్మల
బయిన రఘువంశంబునం దీతనిజన్మంబును, విశ్వామిత్రసహాయత్వం
బును, దన్మఖరక్షణంబును, అహల్యాశాపశమనంబును, హరధను
ర్భంగంబును, మత్పాణిగ్రహణంబును, పరశురామపరాక్రభంజనం
బును, పురప్రవేశంబును, దండకారణ్యాగమనంబును, విరాధవధం
బును, శూర్పణఖా కర్ణ నాసికా చ్ఛేదనంబును, ఖర దూషణ త్రి
శిరః ప్రముఖ రాక్షస ఖండనంబును, మాయామారీచహరణంబును,
మాయాసీతాపహరణంబును, జటాయు కబంధ మోక్షలాభంబును,
శబరిపూజనంబును, సుగ్రీవసమాగమంబును, వాలీవధంబును, సీతా
న్వేషణంబును, సముద్రసేతుబంధనంబును, లంకానిరోధంబును,
భీమసంగ్రామంబున భ్రాతృపుత్త్రపౌత్త్రబాంధవసహిత జనాదిసహి

తంబుగా రావణసంహరణంబును, విభీషణరాజ్యప్రదానంబును, పుష్ప కారోహణంబును, మత్సమేతంబుగా సాకేతపురగమనంబును, రాజ్యాభిషేకంబును మొదలుగాఁ గలకార్యంబులన్నియు నాచేత నాచరితంబు లయ్యెఁ; అట్లగుచుండ నిర్వికారుఁ డఖిలాత్మకుం డైన యీ రామునియం దజ్ఞానులచే నారోపింపఁబడుఁ గావున. 79

తా. అతిపవిత్రమైన రఘుకులమునం దయోధ్యలో నీతఁడు జనించుటయు, ఈతఁడు విశ్వామిత్రయాగసంరక్షణమున కరుగుటయును, తన్మఖసంరక్షణంబును, అనంతర మీరాముని వలన నహల్య శాపవిమోచన మొందుటయు, శివుని విల్లువిరచుటయు, జనకజ నైననన్ను పరిగ్రహించుటయు, పరశురామగర్వభంగంబును పురప్రవేశమును దండకారణ్యమున కరుగుటయు, విరాధవధంబును అనంతరము శూర్పణఖకు ముక్కు సెవులుగోసి పంపుటయు ఖరదూషణాదిరాక్షసుల జక్కాడుటయు, మారీచవధంబును మాయాసీతాపహరణంబును జటాయువునకును కబంధునకును మోక్షలాభంబును శబరిపూజనంబును సుగ్రీవ సమాగమంబును వాలివధంబును సీత నన్వేషించుటయును, సముద్రబంధనమును లంకా నిరోధమును భయంకరమైన యుద్ధమును, అందు మిత్రామాత్యసోదరపుత్రసహితంబుగ రావణుని వధించుటయును, విభీషణరాజ్యప్రదానంబును, పిమ్మట పుష్పకవిమానమువై సాకేతపురమున కరుగుటయు రాజ్యాభిషేకంబు మున్నగుకార్యములన్నియు నాచేత నే చేయబడెను. అయినను అజ్ఞానులచే నిర్వికారుండైన ఈరామునియం దాకార్యముల నారోపింతురు.

ఉ. రాముఁడు నిర్వికారుఁడు నిరామయుఁ డవ్యయుఁ డక్షరుండు ని
ష్కాముఁ డతీంద్రియుం డజుఁ డకర్త యభోక్త యసంగుఁ డంతరా
రాముఁడు నిర్వికల్పుఁడు నిరంజనుఁ డద్వయుఁ డైన యాపరం
ధాముఁడు గాని చారుగుణధాముఁడు గాఁడు సమీరనందనా. 80

తా. పావనీ ! రాగద్వేషాదులగు దుర్గుణములు లేనిదియు శరీరములేకపోవుటచే రుగ్మత లేనిదియును నామరూపలింగవిభక్తులు లేనిదియును నశింపనిదియును కోరికలులేనిదియును, వాక్కు మనస్సుమున్నగు నట్టి యింద్రియములకు అందరానిదియును పుట్టకలేనిదియును ఎట్టికర్మమును చేయనిదియును పుణ్యపాపాదికర్మఫలములులేనిదియును, ఎవ్వనికిని చిక్కనిదియును, సమస్తప్రాణులయంతరంగములయందును వసించి క్రీడించుచుండు నదియును సృష్టిస్థితిలయధానానుగ్రహములైన చేయనిదియును ఇతరమగుసాధనమును వాంఛింపనిది

యును, తనకంటె భిన్నమగు నత్యుత్తమవస్తువులేనిదియును అగు పరబ్రహ్మమే శ్రీరామ
చంద్రుడని యెఱుంగుము. *

క. మాయాగుణానుగతుఁడై,
పాయక నానావిధప్రపంచం బితఁడే
సేయు నని తోఁచు నేమియుఁ
జేయఁ డసంగుం డకర్తృ సిద్ధము వత్సా!

తా. ఆంజనేయా! ఈరాముడు మాయాగుణానుగతుడై నానావిధప్రపంచమును
నేయుచుండునని తోచును కాని యాతఁ డేమియును చేయడు.

వ. అనిన విని హనుమంతుండు సీతాదేవి కిట్లనియె.

తా. సులభము.

తే. రామచంద్రుఁడు తారకబ్రహ్మమగుట
సత్యమగుఁ గాని యిమ్మహాసర్వమయుని
సులభముగఁ గాంచు పరమసుసూత్రమెద్ది
నా కెఱింగింపవమ్మ లోకైకజనని! 83

---

* రాగద్వేషాదుల క్రమవివరణము.

రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము, దర్పము, అహంకారము ఇవి 13 న్నూ రాగద్వేషాదులనబడును.

రాగము, పరకాంతాసక్తి, ద్వేషము, అపకారమునకు ప్రత్యపకారముచేయవలయు నను తలంపు, కామము, ఇహలోకసౌఖ్యములనుభవింప ద్రవ్యాదికములను మిక్కుటముగా సంపాదింపవలయుననువాంఛ. క్రోధము, తనపనులకు విఘ్నముచేసిన వారిని వధింపవలయు నని యత్నించుట, లోభమనగా దనచెంతనున్న పదార్థము నితరుల కివ్వకుండుట, మోహ మనగా పుత్రమిత్రకళత్రాగులయందు ప్రేమ నధికముగ గలిగియుండి మంచిచెడ్డ లెఱుంగకుండుట, మద మనగా సకలైశ్వర్యములును గల్గి తానేమిచేసినను చెల్లునని తలంచుట. మత్సరము అనగా, ఇతరుల యైశ్వర్యమునుజూచి ఓర్వలేకుండుట. ఈర్ష్యఅనగా తనకువచ్చిన యాపదలిత రులకు, రావలయుననుట, అసూయయనగా తన సౌఖ్యము లితరులకు గలుగరాదను చిత్త వృత్తి, దంభమనగా తన పనులనుజూచి యితరులు తనను మెచ్చుకొనవలయునను చిత్త వృత్తి దర్పమనగా నాకు సరియైనవాడు లేడని తలంచుట. అహంకారమనగా ఆడంబ రముగా నితరులను శిక్షింతునని యాదలించుట—

తా. ఓమాతా! శ్రీరామచంద్రుడు పరమాత్మయగుటను నేను సంపూర్ణముగా నెఱుఁగుదు. నాకందువిషయమై సందేహమెంతమాత్రమును లేదు. శ్రీరామచంద్రునకును ప్రత్యగాత్మయైన నాకును భేదములేదని దెలిసికొనదగినయుక్తిని నాకెఱింగింపుమని ఆసక్తితో హనుమంతుఁ డడిగెను.

వ. అనిన విని నవ్వుచు సీతాదేవి హనుమంతున కిట్లనియె. 84

తా. సులభము.

తే. ప్రత్యగాత్మస్వరూపుఁ డై పరఁగు తనకు
రమణపరమాత్ముఁ డైన శ్రీరామునకును
సమరసైక్యానుసంధానసరణి యెద్ది
యదియ యోగంబు సదుపాయ మాంజనేయ! 85

తా. పావనీ! శరీరత్రయమునకు విలక్షణమైనదై అవస్థాత్రయసాక్షియై పంచకోశవ్యతిరిక్తమై సచ్చిదానంద నిర్మలస్వరూపమై వెలుంగునది ప్రత్యగాత్మ. అట్టి ప్రత్యగాత్మయే పరబ్రహ్మముగను పరబ్రహ్మమే ప్రత్యగాత్మగాను యెల్లపుడును చిత్తమునదలంచుచుండుటయే రాజయోగము—

## అభ్యాసాదియోగనిర్ణయము.

వ. ఆయోగం బభ్యాసయోగంబు జ్ఞానయోగం బన ద్వివిధంబై యొప్పు, నం దభ్యాసయోగంబు ప్రాణాయామం బన విలసిల్లు, నది యుఁ బ్రాకృతంబు వైకృతంబు కేవలకుంభకంబు ననం ద్రివిధం బయ్యె, నందుఁ బ్రాకృతంబు మంత్రయోగంబు వైకృతంబు లయ యోగంబు కేవలకుంభకంబు హఠయోగం, బీత్రివిధప్రాణాయామ యోగులకు యమనియమాసనప్రాణాయామంబులు పూర్వాంగం బులు, ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధు లుత్తరాంగంబు లగు, నం దహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహంబులు యమంబు లు, శౌచ తప స్సంతోష స్వాధ్యాయేశ్వర ప్రణిధానంబులు నియ మంబులు, వీరాసన స్వస్తికాసన పద్మాసన యోగాసన కూర్మాసన

భద్రాసన సిద్ధాసన సింహాసనాదికంబు లగు చతురుత్తరాశీత్యాసనంబుల నీ మూఁడింటి నభ్యసించి యంతటఁ బ్రాణనిరోధంబు సేయందగు, నందు స్వభావనియత రేచక పూరక కుంభకక్రమంబులచేత నేకవింశతిసహస్రషట్ఛతాధికసంఖ్యాజపామంత్రానుష్ఠానంబు మంత్రయోగంబు, ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిలసంయమనపూర్వకంబుగాఁ బ్రాణవృత్తియం దపానంబు నపానవృత్తియందుఁ బ్రాణంబును లయంబు గావించుట లయయోగంబు, మూలబంధోడ్యాణబంధ జాలంధరబంధపూర్వకంబుగా రేచకపూరకంబుల నుడిగించి ప్రాణాపానంబులరెంటిని శేయుంబగ లొక్కచందంబునఁ గుంభించుట హఠయోగం, బివి త్రివిధప్రాణాయామంబులు; విషయంబులవలన నింద్రియంబుల మరలించుట ప్రత్యాహారంబు, సగుణనిర్గుణాత్మక వస్తుచింతనంబు ధ్యానంబు, మూలాధారాదిదేశంబులఁ జిత్తంబు నరికట్టుట ధారణాయోగంబు, నిర్మల నిశ్చల చిత్తవృత్తి నిర్గుణబ్రహ్మత్వంబు సంపాదించుట సవికల్పనిర్వికల్పాత్మకసమాధియోగం; బిట్లష్టాంగంబు గలిగి యభ్యాసయోగంబు ప్రకాశించునదియ పరిపక్వచిత్తులకు యోగ్యం బతిదుర్లభం, బిది యణిమాద్యైశ్వర్యంబుల నొసంగుచు నాత్మజ్ఞానంబు ప్రకటంబుగాఁ జేయు, మఱియుఁ బ్రవిమలచిత్తులకు జీవబ్రహ్మైక్యజ్ఞానమాత్రంబు నిచ్చు, నతి సులభం బైన విజ్ఞానయోగంబు రాజయోగం బనంబడు, నీరెంటికి శ్రీరామచరణకమలభక్తికారణంబు, దానికి వైరాగ్యంబు మూలంబువినుము.

తా. రాజయోగము రెండువిధములు, అభ్యాసయోగము జ్ఞానయోగము. అభ్యాసయోగమునకే ప్రాణాయామమనియు పేరు. ఈఅభ్యాసయోగమే ప్రాకృతము, వైకృతము, కేవలకుంభకము అని మూడువిధములు. అందు ప్రాకృతము మంత్రయోగమగును. వైకృతము లయయోగంబు, కేవలకుంభకంబు హఠయోగంబు యీమూడువిధములగు ప్రాణా

యామములు చేయువారలకును యమనియమాసనప్రాణాయామంబులు పూర్వాంగము లనబడును. అహింస సత్యము,చౌర్యముచేయకుండుట, బ్రహ్మచర్యము సలుపుట, అపరిగ్రహము ఇవి యమంబులు, శౌచము తపస్సు సంతోషము, స్వాధ్యాయము యీశ్వరప్రణిధానము ఇవి నియమంబులు, వీరాసనము, స్వస్తికాసనము పద్మాసనము, యోగాసనము, కూర్మాసనము, భద్రాసనము, సిద్ధాసనము సింహాసనాసనము మున్నగు ఆసనముల నీమూడింటిని యభ్యసించి యనంతరము ప్రాణనిరోధము సేయదగును. ఇందు మంత్రయోగ మెట్టిదనిన- రేచకపూరకకుంభకములను మూడువిధములచేతను 21600 సారులు హంస మంత్రాత్మకమైన యజపాగాయత్రిచేయుట మంత్రయోగము. అభ్యసించిన రేచకాది ప్రాణాయామమాచరించిన పిమ్మట ప్రాణవృత్తియం దపానవృత్తియు అపానవృత్తియందు ప్రాణవృత్తియు లీనపరచుట లయయోగంబు. దీనికే వైకృతప్రాణాయామమని పేరు. ఇంక హఠయోగ మెట్టిదనిన-మూలబంధము ఉడ్యానబంధము జాలందరబంధము మున్నగు బంధములు మున్నగలుగునట్లుగా ప్రాణాపానముల రెండింటిని రాత్రింబవళ్లొక్కరీతిగా నిలుపుట హఠయోగమనంబడును. ఇదియె కుంభకప్రాణాయామ మనబడును. ఈయవి త్రివిధ ప్రాణాయామములు. విషయములనుండి యింద్రియములను మరలించుట ప్రత్యాహారమనబడును. సగుణనిర్గుణస్వరూపమగు వస్తువును (పరమాత్మను) చింతించుచుండుట ధ్యానయోగమనబడును. మూలాధారము మొదలుగాగల స్థానములయందు మనస్సునుయరికట్టుట ధారణయోగమనబడును. నిర్మలమైనట్టియు నిశ్చలమైనట్టియు మనోవ్యాపారముచేత త్రిగుణరహితుడైన పరమాత్మను దెలిసికొని ప్రసన్నునిగావించుకొనుట సవికల్పనిర్వికల్పాత్మక సమాధియోగంబు. ఇట్లు 8 అంగములుగల్గి అభ్యాసయోగము ప్రకాశించుచుండును.ఇయ్యది పరిపక్వతనొందినవారికి తగినదియు నతిదుర్లభమైనదియు నగును. ఈ అభ్యాసయోగము అష్టైశ్వర్యముల నొసంగును. బ్రహ్మజ్ఞానమును వృద్ధిజేయును. చిత్తపరిపక్వముగలవారలకు గొలదిగొప్పలులేని వస్తుతత్వముతో నైక్యమునొసంగును. (జీవబ్రహ్మైక్యము) అతిసులభమైనట్టియు అనుభవముచే గల్గినట్టి జ్ఞానోపాయమును యైయున్న అభ్యాసయోగమే రాజయోగమనబడును. అభ్యాసజ్ఞానయోగముల రెండింటికిని, శ్రీరాముని పదపద్మములు సేవించుటయే హేతువు. దానికి ఇహపరలోకభోగవిరక్తి మూలము. ఇంకను వినుము.*

---

*అహింసాలక్షణము.

ఉత్సాహము. ఈరు పేను నల్లి చీమ యీగ మొదలు జంతులన్
ప్రగూరసర్ప వృశ్చికాది గురువిషప్రదావళిన్

ఘోరమృగముల న్వధింపఁ గోర కునికి నాగమో
క్తోర్తు హింస సేయ రెండు నొప్పు నాయహింసకున్.

ఎట్టిజంతువుల నైనను వధింపకుండుటయును ; యజ్ఞములయందు మాత్రమే వేదోక్తముగా పశువులవధించుటయు నహింస యనబడును.

సత్యలక్షణము.

క. ఉన్నది కన్నది విన్నది
యున్నట్లుగఁ బలుకుటయును నొరునకు సత్యా
పన్నత గలుగఁగఁ గల్యా
ణోన్నతి గల కల్లమాటయును సత్య మగున్.

వినిన దానిని వినినట్లుగను, కన్న దానిని కనినట్లుగను తప్పక చెప్పుటయును, ఒకనికి గల్గిన ఆపదను తప్పించి శుభ మొనగూర్చుటకు బల్కిన యసత్యమును సత్యమేయగును.

అస్తేయలక్షణము.

క. ప్రస్తుతిగ నెట్టిదశ పర
వస్తువులం ద్రికరణముల వర్జించుట తా
నస్తేయ మనుచుఁ జెప్పుదు
ర స్తమితాజ్ఞానతంత్రు లయినమునీంద్రుల్.

ఎట్టికష్టకాలమునందైనను ఇతరులసొత్తు హరింపకుండుటయు, దొంగిలించుమని వచింపకుండుటయు, ఇతరుల ద్రవ్యమపహరించు నుద్దేశముతో నితరులద్రవ్యమును ముట్టకుండుటయు యస్తేయమునకు లక్షణము.

బ్రహ్మచర్యలక్షణము.

క. కాంతలనందఱ నామర
ణాంతకముగఁ బరిహరించు టది మే లొండే
నెంతయు నిజభార్యావ్రత
సంతుష్టినిఁ జెంద బ్రహ్మచర్యంబ యగున్.

ఆమరణాంతము స్త్రీ సంపర్కములేక వర్తించువాడును, అట్లుగాకున్నను ఋతుకాలమున దన కులాంగనతో వర్తించుటయును బ్రహ్మచర్య మనబడును.

అపరిగ్రహలక్షణము.

ఆ. దానపూర్వకంబుగా నెవ్వరేమైన
నొసఁగ సంగ్రహింపకునికి సత్కృ
తముగ శిష్యు లొసఁగు ద్రవ్యంబుఁ గొనుట యా
ననఘ తదపరిగ్రహంబు వత్స.

ధనధాన్యాదు లెవ్వరైనను ధారాపూర్వకముగా నిచ్చినయెడల గైకొనకుండుటయును, శిష్యులిచ్చినది గైకొనుటయును అపరిగ్రహ మనబడును.

శౌచలక్షణము.

తే. శౌచములు రెండు తెఱఁగులై చను బ్రసిద్ధి
మృత్తికాజలములచేత మెఱయు బాహ్య
మమలినాభ్యంతరపుశౌచ మనఁగ భావ
శుద్ధియని కద వచియింతు రిద్ధమతులు.

పరిశుద్ధి 2 విధములు, బాహ్యపరిశుద్ధి, అంతరపరిశుద్ధి. మృత్తికజలాదులచే జేయబడునది బాహ్యపరిశుద్ధి. కామక్రోధాదిదుర్గణములతోడను ఆణవకార్మికాదిపంచమలములతోడను కూడక మనస్సు నిర్మలమైయుండుట అంతరపరిశుద్ధి.

త్రివిధతపోలక్షణము.

శ్లో. దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే
అనుద్వేగకరం వాక్యం సత్య ప్రియ హితంచ యత్
స్వాధ్యాయాభ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే
మనః ప్రసాదసౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపోమానస ఉచ్యతే.

తే. మనమున వాక్కున గాయం
బున దలఁపులఁ బలుకులను బ్రబుదత నుపవా
సనిరూఢి యిద్ధపూర్వో
క్తనియతి బ్రచరించు టిదియ తప మగుఁ బేర్మిన్.

(1) శరీరతపంబు:—దేవతలను విప్రులను గురువులను పండితులను పూజించుట, బాహ్యపరిశుద్ధి గల్గియుండుట, బ్రహ్మచర్యవ్రతమూనుట, అహింసానియమమూనుట ఇవి శరీరసంబంధమగు తపంబు.

(2) వాక్సంబంధమైనతపంబు:—ఇతరులకు నొప్పిగలుగకుండ మాటలాడుట, సత్యము దప్పకుండుట, వేదమంత్రముల సదాపఠించుట వాక్సంబంధమగు తపంబు.

(3) మనస్సంబంధమగు తపంబు:—మనంబునకు వ్యతిరిక్తము సత్ప్రవర్తనముగా వాఙ్నియమము, మనోనిగ్రహము మనశ్శుద్ధి గల్గియుండుట మనస్సంబంధమగు తపంబు.

## సంతోషలక్షణము.

క. ఆపదలను శోభనముల
నాపక చనఁ జూచుచును స్వయంస్వాగతవి
త్తాపత్తిని ముద మందుట
దీపితసంతోష మని కథింతురు ప్రాజ్ఞుల్.

శుభాశుభములను నిలుపక సకాలమున నొనరించుదు పేరాశవిడచి తనకు లభించినదానితో తృప్తివహించిసంతోషించుట సంతోషమునకు లక్షణము—

## స్వాధ్యాయలక్షణము.

తే. మఱియు స్వాధ్యాయ మన మూలమంత్రపఠన
మది విచారింప వాచిక మని యుపాంశు
వనియు మానసికం బని యనఘ మూఁడు
దెఱఁగులై యుండుఁ దెలిపెదఁ దెలియ వినుము.

క. ఒరులు వినఁ గొనుట వాచిక
మొరులు వినక యుండఁ గొనుటయు నుపాంశువు న
క్షరవిరళముఁ గొని మది సం
స్మరియించుట మానసికము స్వాధ్యాయ మగున్.

తే. అందు వాచికజపమున కధికతర ము
పాంశుజప మ య్యుపాంశుజపమున కధిక

తరము మానసజప మగు దాని కధిక
తరము లే దని తెలియు మో ధర్మనిరత.

స్వాధ్యాయ మన వేదములయొక్క మూలమంత్రములను పఠించుచుండుట.

ఈశ్వరప్రణిధానలక్షణము.

సీ. కరణంబు లఖిలోపకరణంబులును గాఁగఁ
ప్రాణంబు లుపచార భటులు గాఁగ
గంగాప్రముఖనాడికలుజలంబులు గాఁగ
షట్కమలములు పుష్పములు గాఁగ
జఠరాగ్ని పాత్ర ముజ్జ్వలధూపము గాఁగఁ
బటుజీవకళలు దీపంబు గాఁగ
నందితానందంబు నైవేద్యముం గాఁగ
రవిశశిజ్యోతు లారతులు గాఁగ
తే. నంగదేవాలయమున సహస్రకమల
పీఠమున శాంతి జనకజోపేతుఁ డగుచుఁ
జెలఁగు పరమాత్మురాము నర్చించు చుండఁ
ద త్త్వవిదు లీశ్వరప్రణిధానమంద్రు.

తా. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతరింద్రియములు, పూజాపాత్రములుగను, 10 విధములగు ప్రాణములును పనివాండ్రుగను, గంగ, యమున, సరస్వతి యనబడు ఇడాపింగళ సుషుమ్నలు అభిషేకాదిజలములుగను, ఆధారాదికమలములు పుష్పములుగను, జఠరాగ్ని ధూపముగను, చిత్కళలు దీపములుగను, బ్రహ్మానందము నివేదముగను, సూర్యచంద్రమండలములు నివాళులుగను, శరీరమను దేవాలయమున సహస్రారమను సింహాసనమున శాంతియను సీతాయుతుడగు శ్రీరామపరబ్రహ్మమును యెల్లప్పుడు పూజించుటయే యీశ్వరప్రణిధానమని పెద్దలువచింతురు.

యోగాసనముల లక్షణములు.

వీరాసనము.

క. ఒకతొడపై నొకపాదము
నొకపాదముమీఁదఁ దొడయు నునిచి శరీరం

బకుటిలగతి నిల్పినఁ ద
క్కక యది వీరాసనంబు కైవడి యయ్యెన్.

తా. ఒకతొడమీద నొకపాదము మరియొకపాదముమీద తక్కినతొడయును జేర్చి శరీరము వంకరలేకుండునటు నిల్పినయెడల నది వీరాసనమగును.

స్వస్తికాసనము.

క. పిక్కల తొడల నడుములం
దొక్కటఁ బదతలము నిడి సమున్నతి నొడల్గా
నిక్కించిన నీయాసన
మక్కజముగ స్వస్తికాహ్వయంబగు జగతిన్.

జంఘలకును ఊరువులకును నడుమ పాదములుజేర్చి శరీరమును చక్కగనిగిడ్చిన నయ్యది స్వస్తికాసనమగును.

పద్మాసనము.

శా. వామాంకంబున దక్షిణాంఘ్రియును దద్వామేతరాంకంబునన్
వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశావ్యాప్తంబు లౌ చేతులన్
నేమం బారఁగఁ గాళ్ళయంగుళములం జేకొన్న పద్మాసనం
బౌ ముక్కుం గొనఁ జూపునం జుబుకహృద్వ్యాసంగముం గల్గినన్

తా. ఎడమతొడమీద కుడిపాదము, అట్లే కుడితొడపై నెడమపాదమునుంచి వెనుకనుండి కుడిచేతితో కుడికాలి బొటనవ్రేలిని, ఎడమచేతితో నెడమకాలి బొటనవ్రేలిని పట్టుకొని భ్రూమధ్యమున దృష్టినిల్పినయెడల నది పద్మాసనమగును.

సీ. అది పద్మబంధంబె యగు నైన నుత్తాన
చరణంబు లూరు సంస్థములు గాఁగ
నూరుమధ్యంబున నుత్తానకరతల
ద్వయమును రాజదంతముల మొదల
హత్తియుండెడి రసనాగ్రంబుఁ దొంటిభా
తిని యున్న చుబుకంబు దృష్టి గలిగి

మారుతం బల్లనఁ బూరించు చుండిన
నది పద్మ మగు మతాంతరమునందు
తే. మఱియు నిది మత్స్యమతము పద్మమునఁ బూర్వ
మట్ల యుండుచు సంస్ఫుటహస్తయుగ్మ
మున గుదాకుంచనముఁ జలదనిలపూరి
తము విసర్జనవిధియు ధ్యానమును వలయు.

తా. కుడితొడపై నెడమపాదము నెడమతొడపై కుడిపాదమునుంచి వెలుపల నుండి చేతులు రెండుతొడలపయి వెలికిలనుంచి ముక్కుకొనయందు దృష్టినిల్పి దంత మూలముల నాలుకనునిల్పి వక్షస్థలమున గడ్డమునునిల్పి మెల్లగ వాయువును పూరించు చున్నయెడల నది మతాంతరపద్మాసనమగును. మరియు తొలుతటివలె పద్మాసనమున నుండి గడ్డమును వక్షస్థలమునునిల్పి మనస్సునందు ధ్యానముచేయుచు అపానమున నూర్ధ్వ ముగా రేచించి కుండలీశక్తియుక్తముగనిల్పి ప్రాణవాయువును విడువవలయును. అపుడు జ్ఞానాధిక్యము కలుగును. ఈకారణమున నాడీద్వారమున గాలి నిల్చును. మృతులు ముక్తులగుదురు, దీనినిసిద్ధపద్మాసనమనియు ముక్తిపద్మాసనమనియు నందురు.

యోగాసనము.

క. యోగవటజానుయుగసం
యోగంబునఁ బదతలంబు లుర్విఁ నిలిపి లో
నీగిన కరముల నుండిన
యోగాసన మండ్రు దీని యోగవిధిజ్ఞుల్.

తా. హంసదండమును మోకాళ్లక్రింద నుంచుకొని పాదములను నేలపయినిల్పి తొడలనడుమ చేతులను పోనిచ్చి పిక్కలనుబట్టి యాత్మాలోకనము చేయుచుండెనేని యది వేదాంతులు యోగాసనమనిరి.

కూర్మాసనము.

క. పీడఁబడిన గుల్ఫంబులు
గూడఁగ సంధించి పట్టి గుద మలవడఁగా
బీడించినఁ గూర్మాసన
మీడితమతి నెఱుఁగుదురు యమీంద్రులు దీనిన్.

తా. ఆధారమున కుభయపార్శ్వముల, రెండుపదములునుంచి నిక్కించి కూర్చుండెనేని యది కూర్మాసనమగును.

ఉత్థానకూర్మాసనము.

తే. కుక్కుటాసనబంధంబుఁ గూర్చినట్టి
కరయుగంబుల మెల్లనఁ గంధరంబు
బంధనముఁ జేసి వెలికిలఁ బడిన కూర్మ
మట్ల వడఁగ నుత్థానకూర్మాసనంబు.

తా. కుక్కుటాసనముపైనుండి రెండుచేతులతో కంఠమును బట్టుకొని కూర్మమువలె వెలికిలబడెనేని యది యుత్థాన కూర్మాసనమనబడును.

భద్రాసనము.

తే. అండముల క్రింది నెలవులయందు నుభయ
పార్శ్వములు రాయ రెండుగుల్ఫములఁ బెట్టి
పార్ష్ణిపదములఁ గరములఁ బట్టి నిశ్చ
లాత్ముఁడై యుండెనేని భద్రాసనంబు.

క. భాసుర పద్మాసన సి
ద్ధాసనము గృహస్థవర్తనాతీతులకున్.

తా. అండములకు దిగువభాగమునందు చీలమండలనుంచి పదములను రెండుచేతులను బట్టి కదలకుండిన నయ్యది భద్రాసనమగును. ఈభద్రాసన మభ్యసించువాడు సమస్తవ్యాధులను జయించును.

తా. గృహస్థులు పద్మాసనమును సిద్ధాసనమును అభ్యసింపవచ్చును. అయినను గృహస్థులకు పద్మాసనమును తక్కిన యాశ్రమస్థులకు సిద్ధాసనమును తగును.

సిద్ధాసనము,

శార్దూలము. యోనిస్థానముఁ బార్ష్ణిభాగఘటనాయుక్తిన్ని బంధించుచర్మ
దాన మ్మేఢ్రముమీఁద నోజ నొకపాదం బూన సిద్ధాసనం
బౌ నం దింద్రియనిగ్రహంబునుసు దేవస్థాణుభావంబు యో
గానందైకమనంబు భ్రూయుగళమధ్యాలోకముం గలిసన్.

తా. ఎడమకాలి మడిమ మూలాధారమందును కుడికాలిమడమ లింగస్థానమునను యుంచి శిరస్సు, కంఠము, భుజములను నిక్కించి భ్రూమధ్యమును చూచుచున్న సిద్ధాసనమగును. ఇద్దానిచే నింద్రియనిగ్రహము, శరీరపాటవముమలినరహితమైనమనస్సుకలుగును.

మతాంతరసిద్ధాసనము.

క. వెండియును సవ్యగుల్ఫము
దండముపైఁ బెట్టి మీఁద దక్షిణగుల్ఫం
బుండఁగ నవక్రమముగఁ గూ
ర్చుండిన సిద్ధాంసనంబ యగుఁ బక్షమునన్.

తా. లింగముపై నెడమమడమనుంచి దానిపై కుడిమడమనుంచి వెనుకజెప్పినట్లుగా నాసాగ్రమును జూచుచున్న నియ్యది మతాంతర సిద్ధాసనమగును. వజ్రాసనమనియు ముక్తాసనమనియు గుల్ఫాసనమనియు, పెక్కుతెరంగుల నుడువుదురు. ఆసనములన్నిటిలో నుత్తమమైనది.

సింహాసనము.

శార్దూలము. అండాధఃస్థలి నూరుపార్శ్వముల సవ్యాసవ్యగుల్ఫద్వయం
బొండొంటిం గ్రమహీనభంగి నిడి దోర్యుగ్మాంగుళుల్జానులం
దుండ న్వే ప్రసరించి నిక్కి వివృతాస్యుండైన సింహాసనం
బొం డేమిం గనఁ బోక నాసికముఁ దా నోలిం బరీక్షింపఁగన్.

తా. అండముక్రింది నెలవుల తొడలవెనుక భాగములు పోవునట్లు కుడియెడమల మార్చియుంచి చేతులవేళ్లను మోకాళ్ళపై సవ్యముగా వెడల్పుగానుంచి కూర్చుండి నోరుదెరచి భ్రూమధ్యమునందలి చిద్బిందువును జూచుట సింహాసనమగును.

కుక్కుటాసనము.

క. జలజాసనంబునం గర
ములు జానూరువుల మధ్యమునఁ జొనిపి ధరన్
నిలిపి గగనమున నంగం
బలవడ నిలుపంగఁ గుక్కుటాసన మయ్యెన్.

తా. పద్మాసనమున నుండి మోకాళ్ళ తొడలసందులను చేతులపోనిచ్చి హస్తములను నేలనాని పైనెగసినట్లుండిననది కుక్కుటాసన మగును

## గోముఖాసనము.

క. వామదిశ పృష్ఠపార్శ్వము
ధామముగా దక్షగుల్ఫతలమును న ట్ల
వ్వామపుగుల్ఫము వలనిడ
గోముఖ మీయాసనంబు గోముఖభాతిన్.

తా. ఎడమకాలి మడిమ వీపుకుడి ప్రక్కను కుడికాలి మడిమ వీపుయెడమప్రక్కను మోకాలుమీద మోకాలు గదియించి శరీరమును నిక్కించి భ్రూమధ్యమును జూచుచున్నది గోముఖాసనమగును.

## ధనురాసనము.

క. మును పాదాంగుష్ఠంబులు
దనచేతులు చెవులుదాఁక ధనువుదివియు న
య్యనువున నెడమఁ గుడి దినియు
ధనురాసన మండ్రు యోగతత్త్వవిధిజ్ఞుల్.

తా. పాదాంగుష్ఠముల రెండింటిని రెండుచేతులను విల్లువలె వీపునకు వెనుకచెవులకు సరిగా బట్టినయెడల ధనురాసనమగును.

## మయూరాసనము.

మహాస్రగ్ధర. ధరణిన్ హస్తస్థలంబుల్దగులనిలుపుచుందండముంబోలెదత్కూర్పరయుగ్మన్యస్తనాభీభవనతలయుగోద్భాసియై యున్నతాస్యస్థితుఁడై యాకాశదేశస్థితి నిలిచినఁ దా శ్రీమయూరాసనం బాహరియించు న్రోగదోషాఘాతశనవిషసమూహంబుల న్సంహాయుక్తిన్.

తా. చేతుసిసేల నూని నోచేతుల బొడ్డునకు రెండుప్రక్కల నుంచి ముఖమును పైకెత్తి కాళ్లు చాచి నెమలితోకవలె పైకెత్తిన మయూరాసనమగును. దీనివలన నుదరగుల్మాదిరోగములును సర్వపాపములును మానును అగ్నిమాంద్యము నశించును. విషమునైనను జీర్ణింపజేయును.

కపాలాసనము.

సీ. ఊర్ధ్వసంస్థితనాభియును నధస్తాలువు
నూర్ధ్వభానుఁడు నధోయుక్తి శశియు
నూర్ధ్వపాదంబులు నొగి నధశ్శిరమును
గలయది విపరీతకరణసంజ్ఞ
గల కపాలాసనక్రమ మయ్యె గురువాక్య
మున నది సిద్ధించు జనుల కెలమి
నిత్యంబు నభ్యాసనిరతున కీకపా
లాసనం బఖిలరోగాళిఁ జెరచు
తే. జఠరవహ్ని వర్ధిలఁ జేయు జగతి నట్టి
సాధకునకు నాహారంబు సంగ్రహింప
జను బహుళముగ నల్పభోజనముచేత
ననిలవేగంబు విడిపించు నతనితనువు.

తా. తలక్రిందుగా నిలచి భ్రూమధ్యముననుండు చిద్బిందువును జూచుచుండిన నది కపాలాసనమనబడును. ఈయాసనమును నిత్యమును 2 జాములు అభ్యాసపరచినవాడు మృత్యుంజయుడగును.

ముక్తాసనము.

క. పదగుల్ఫంబున గుదముం
గదియంగా నిల్పి యంకగతమై యుండం
బద మొకటి సంఘటించిన
నది ముక్తాసన మవక్రమగు మేసమరస్.

తా. ఎడమకాలిమడమచే మూలాధారమును గప్పి కుడియడుగు నెడమతొడపై నుంచిన ముక్తాసనమనబడును.

టిట్టిభాసనము.

క. వెలకిల జరణతలంబులు
దలమీఁదం జేర్చి ధరణితలమున నిలుపం

గలిగెడు నట్లుగఁ గరములు
నలపశ్చిమ మెత్త టిట్టిభాసన మయ్యెన్.

తా. పాదములు రెండును వెలికిలనుండ తలపైజేర్చి చేతులతో నిలిచి వెనుకటి భాగమును మీదికెత్తుట టిట్టిభాసన మనబడును.

పశ్చిమతానువాసనము.

చ. పదముల భూమి దండ మురభాతిగఁ జాచి కరాంగుళంబులన్
బదయుగళాగ్రము ల్బిగియఁబట్టి లలాటము జానుయుగ్మముం
బదిలముగా ఘటింప నిది పశ్చిమతానము దీన రోగము
ల్గదియవు పశ్చిమంబునను గాలి యగున్ జఠరాగ్ని కార్శ్యముల్.

తా. భూమిపై రెండుకాళ్లను జాచి కాలిబొటనవేళ్లను చేతులతో బట్టుకొని మోకాళ్ళపై నుదురుంచిన నది పశ్చిమతానువాసనము- ఇందు గాలి పడమటిదెసగా నడచుటచే జఠరాగ్ని ప్రజ్వరిల్లును, జాడ్యములుమాను.

పూర్వతానువాసనము.

తే. వరుస మోఁగాళ్లు నేలమోపంగమడిచి
మడిమలును బిఱుదులునుగూర్చి మస్తకంబు
నడుమఁగరకూర్పరంబుల నదిమిమోపి
నడుమెగయనున్నఁ బూర్వతానంబటండ్రు.

తా. కాలివేళ్లు మడచి భూమిపైనిల్పి మడమలును పిరుదులును కలిపి తలను చేతులతోడను నడుమును మోచేతులతోడను అదిమిపట్టుకొని నడుమును నిట్టనిలువుగా నుంచిన నది పూర్వతానువాసనము.

అర్ధకాసనము.

మ. పదతలము ల్ధరాతలముపైఁ గడుదగ్గఱ నిల్పి లోఁదొడల్
గదిసినజంఘలు న్మఱిలలాటము మోపిన జానుయుగ్మమున్
బ్రిదులక యుండు హస్తపరిపీడితజానువు గల్గి యుండునే
నిది యగు నర్ధకాసన మహీనసుఖాస్పద మండ్రు సంయముల్.

తా. పిరుదులను క్రిందమోపి గొంతుకగా కూర్చుండి మోకాళ్లను చేతులతో జుట్టిపట్టుకొనుట అర్ధకాసనము. ఇది మిక్కిలి సుఖప్రదమైనది.

కామదహనాసనము.

చ. అవనితలంబుఁ బొందఁగ బదాంగుళమూలము లోన నిల్పి జా
నువులు నభఃస్థలంబునన నూల్కొన బార్ష్ణియుగంబు యోనియుఙ్
దవులఁగ యోగదండఘటనాస్థితి హ స్తతలంబు లుండెనే
నవిరళ మైన కామదహనాసనమం డ్రది యోగతత్పరుల్.

తా. మునివ్రేళ్లను భూమిపైనిల్పి మోకాళ్లను క్రిందబెట్టక పిరుదులు మడమలు రాసికొనునట్లుండి యోగదండముపై చేతుల నానుకొని నిక్కి భ్రూమధ్యమును జూచు చున్న నయ్యది శాస్త్రవిదులచే కామదహనాసన మనబడెను.

ప్రాణాయామలక్షణము.

తే. ప్రణవపంచాక్షరాష్టాక్షరాదికముల
మాత్రగాఁ జేసి పూరకమాత్రలకును
రెట్టి కుంభకమున నిల్పి రేచకంబు
నాడిశోధన మట్ల చేయఁగవలయు.

తే. సోముదెస గాలి గొనుచు సుషుమ్నఁ బట్టి
సూర్యుదెస వీడి క్రమ్మఱ సూర్యువలని
పింగళంబున గొని పట్టి పిదప నిగుడ
విడువవలయు యథాశక్తి నుడుగ కెపుడు.

తా. మంత్రము నొక్కమాత్రగాజేసి పూరకమాత్రలకు రెట్టించి కుంభకమందు నిల్పి రేచకమున పూరక మాత్రలలో సగమును నిర్ణయించి సుషుమ్నానాడిని శోధనచే యవలయును. మరియు యెడమముక్కు రంధ్రమున వాయువును గొని సుషుమ్నయందు నిల్పి కుడిముక్కున విడచి మరల కుడిముక్కున పూరించి సుషుమ్నయందు నిల్పి యెడ మముక్కున విడుచుచు నిట్లు సదా శక్తికొలది ప్రాణాయామము చేయవలయును. ఇది మూడువిధములు. (1) ప్రాకృతము, (2) వైకృతము, (3) కుంభకము. ఉదయము మొద లు మరునాటి యుదయములోపున మూలాధారమున గణపతికి 600 స్వాధిష్ఠానమున బ్ర హ్మకు 6000 మణిపూరకమున విష్ణునకు 6000 అనాహతమున రుద్రునకు 6000 విశుద్ధమున యీశ్వరునకు 1000 ఆజ్ఞేయమున సదాశివునకు 1000 సహస్రారమున గురువునకు 1000 అజపాగాయత్రి మంత్రము జపించి సమర్పణచేయుట ప్రాకృత ప్రాణాయామము.

రేచకపూరకకుంభకక్రమముల నధస్సంచారముగల ప్రాణవాయువునందు అపానమును పిదప అపానమునందు ప్రాణమును జేర్చుట వైకృతప్రాణాయామము, మూలబంధవుడ్యాణబంధ జాలంధర బంధములను గావించి రేచకపూరకములను నిల్పి ప్రాణాపానములను రేపవల్లొక్క రీతిగ నిలుపుట కుంభక ప్రాణాయామము.

బంధత్రయవివరణము.

తే. గుహ్యమున వామపాదంబుఁ గూర్చి యితర,
పాదమూలంబు నాభినిఁ బరగఁ జుబుక
మురమునను జేర్ప నివి బంధవరములంద్రు,
ఆర్యనుత ! వీనిఁదెలియుమీవాత్మయందు.

క. మడమను యోనిస్థానము,
విడువక బంధించి యూర్ధ్వవీథి కపానున్
వడి నాకుంచనమునఁ గొని
పడ నాకర్షింప మూలబంధం బయ్యెన్.

తే. కృత్రిమము లేక నాభికి గ్రిందు మీఁదు
బతిమిమై బంధనము సేయవలయు దీనిఁ
బరమయోగీంద్రు లుడ్యాణబంధ మంద్రు
బంధములలోన నుత్తమం బాద్రుదీని.

తే. కంఠ మాకుంచనము సేసి కడుదృఢముగ
హృదయమునఁ జుబుకము నిల్ప నిదియ కాదె
భవ్యజాలంధరాభిఖ్య బంధ మూర్ధ్వ
భాగమున నున్న యమృతనిబాధకంబు.

వ. అంఘ్రిమూలంబున పాదముల నుంచి ప్రాణమును బిగించి అని భాగవతాది గ్రంథముల జెప్పబడినరీతిని గుదగుహ్యముల నపానుని సంచారమగుటచే నెడమమడమచే గుదస్థానమును బంధించుట మూలబంధము, కుడిపడమచే నాభిని బంధించుట ఉడ్యాణబంధంబు, గడ్డమును రొమ్మునపైనుంచుట జాలంధర బంధము. ఇట్టి బంధత్రయముల సుస్థిరులై హఠయోగసిద్ధిగల యోగీంద్రులు జరామరణాదులు లేక మోక్షమందుదురు.

సమాధిలక్షణము.

ఆ. ఎదుట గానుపించు నెల్లచిదాభాస
కళలు తనకు వేఱుగా నటంచుఁ
దెలియు తెలివి నెపుడుఁ దెలియుట బాహ్యదృ
శ్యానువిద్ధ మనఁగ నలరు వత్స.

క. అంతర మగు ద్విదళంబున
వింతగఁ జూపట్టుకళల వీక్షించుచుఁ దా
సంతస మందుచు నుండుట
యంతర్దృశ్యానువిద్ధ మనఁబడు సుమతీ.

తే. బాహ్యమునఁ బెక్కుగా వినఁబడెడి శబ్ద
తతులఁ దెలిసెడు తెలివియె తా నటంచుఁ
దెలిసి యానందరసమునఁ దేలు చుంట
బాహ్యశబ్దానువిద్ధ మై పరఁగు వత్స!

క. అంతర్హృదయనభంబున
సంతత మొగి మ్రోయు ప్రణవశబ్దంబుల నా
ద్యంతము విను తనుఁ దెలియుట
యంతర్దృశ్యానువిద్ధ మనఁబడుఁ బుత్త్రీ!

ఆ. బాహ్యదృశ్యశబ్దపటలంబుగను నాత్మఁ
గనుట బాహ్యనిర్వికల్పమాంత
రస్థదృశ్యశబ్దరాశిఁ గన్గొను నాత్మఁ
గనుట లోనినిర్వికల్ప మనఘ.

సమాధి రెండువిధములు. సవికల్పకము, నిర్వికల్పకము. అందుసవికల్పకము మరల నిరుదెరంగులు- దృశ్యానువిద్ధసవికల్పకము, శబ్దానువిద్ధసవికల్పకము. ఈరెండును నిర్వికల్పక సమాధియుఁగలసి మూడువిధములయ్యెను. ఇవి అంతర్బాహ్యభేదములచే నానవిధములయ్యెను.

బాహ్యదృశ్యాను విద్ధసవికల్పకము, బాహ్యనిర్వికల్పకసమాధి బాహ్యశబ్దాను విద్ధ సంకల్పకము, అంతర్దృశ్యానువిద్ధ సంకల్పకము, అంతర శబ్దానువిద్ధ సంకల్పకము. అంతర నిర్వికల్పక సమాధి.

(మరియొక విధమగు ప్రాణాయామము.)

కుడిముక్కు ఇడ. ఇది సూర్యనాడి. యెడమముక్కు పింగళ యిది చంద్రనాడి. ఈ రెండింటియందును చరించు ప్రాణవాయువును బ్రహ్మబీజమగు ప్రణవమందలి అకార ఉకారమకారముల మూడుమాత్రలగా జేసి వానిలో అకారముచే సూర్యనాడిని 12 మాత్రల కాలమును మకారముచే చంద్రనాడిని 16 మాత్రలకాలమును పూరించి ఉకారముచేత రెండునాడులును 10 మాత్రలకాలమును సుషుమ్నను కుంభించినపిమ్మట నడినాళమున క్రమముగ పూరించుట యొకవిధమగు ప్రాణాయామము. ఈవిధముగా ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము, అర్థరాత్రములందునను దినమునకు 20 సార్లు ప్రాణాయామమును చేయుచున్న వాయువు స్థిరపడినపిమ్మట కేవలకుంభకమునకు మార్గము గల్గును. ప్రాణాయామలక్షణము లనేకవిధములుగా నుండును కావున సద్గురునిచే ప్రాణాయామలక్షణమును దెలియవలయును.

ప్రత్యాహారలక్షణము.

పలువిధములగు శబ్దములువినుట, శీతోష్ణాదికములగు స్పర్శములను దెలిసికొనుట, పొడుగు, పొట్టి, లావు, సన్నము, తెలుపు, నలుపు, ఎరుపు పచ్చన, మిశ్రమము లను 10 విధములగు రూపముల జూచుట 6 విధములగు రుచులనెఱుగుంట, సువాసన, దుర్వాసన మిశ్రమవాసన వాసనజూచుట, సుశబ్దాపశబ్దాదులను పలుకుట, యిచ్చిపుచ్చుకొనుట, నడచుట, పరుగెత్తుట, మున్నగునవి గావించుట, మలవిసర్జన మాచరించుట, రతియందానందించుట,సంశయించుట మొదలగు గుణములనుండి *పదునాలుగింద్రియములను ద్రిప్పుట, ప్రత్యాహారలక్షణ మనబడును.

ధ్యానలక్షణము.

క. మానసకమలమునందున
శ్రీనారాయణునిమూర్తిఁ జింతించుచు లో
ధ్యానము సేయుట సగుణ
ధ్యానం బని యండ్రు సుజను లమలవివేకా!

---

* పదునాలుగింద్రియములు. శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము వాక్కు, హస్తము, పాదము, వాయువు, గుహ్యము.

సీ. కమలాసనస్థుఁడై కాయంబు నిక్కించి
కరము లూరులఁ జేర్చి కనులు మూసి
దేహేంద్రియప్రాణధీమనాదిక మెల్ల
దృశ్య మేఁ గాను తద్దృక్కు నేను
దృశ్య మేఁ గాను తద్దృక్కు నే ననువృత్తి
దృశ్యంబ కాఁ దద్దృక్కు నేన
యని విజాతిప్రత్యయనివృత్తిగా సజా
తిప్రత్యయప్రవృత్తిక్రమమున
తే. నాత్మదా నైనయందాఁక నయ్యశేష
దృశ్యదృగ్వృత్తులను నిషేధించుకొనుచు
ననిశ మాత్మావలోకన మందు చుంట
నిర్గుణధ్యాన మనఁ జెల్లు నిర్మలాత్మ!

తా. ధ్యానము 2 విధములు. సగుణము, నిర్గుణము. హృదయమునందు శ్రీరామచంద్రుని నిల్పి మనస్సుచే సహస్తవస్తువులను గల్పించి షోడశోపచారములను గావించుటచేసగుధ్యానము సగుణము. పద్మాసనమున నుండి శరీరమును చక్కగా సాచి చేతులను తొడపైనుంచి కన్నులనుమూసి, శరీరత్రయమును, 14 యింద్రియములను, 10 విధ ప్రాణములను దృశ్యములు నేనుగాను. వీనిని వీక్షించునట్టి సాక్షిని. అట్టిసాక్షియు దృశ్యమేగాన నావృత్తినిఁజూచు సాక్షిని అని మాయచే కల్పితములగు విజాతీయములైన బహిర్దృశ్యములను అంతర్దృశ్యములను, అట్టివాటికి సాక్షినను వృత్తిని నిషేధించుచు ఆనంద స్వరూపుఁడై పరబ్రహ్మము తానని దృఢముగలుగువరకు సదా నిర్వికల్పక బ్రహ్మనిష్ఠనుండుట నిర్గుణము:—

ధారణాలక్షణము.

షట్కమలములందును వాని కధిపతులైన గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, యీశ్వర, సదాశివ, గురుచరణముల నక్కడక్కడ ధ్యానించునపుడు మనస్సును నిల్పుటే ధారణయోగము; జీవుడనగు నేనే పరమాత్మను, పరమాత్మయే ప్రత్యగాత్మ అనునిష్ఠనుండుటయే సమాస అభ్యాసయోగ మిట్లు 8 అంగములు గల్గియుండును.

అభ్యాసయోగులకు 8 విధములగు నైశ్వర్యములును గల్గును. బ్రహ్మజ్ఞానము గల్గును. చిత్తశుద్ధిగలవారికి జీవేశ్వరైక్యజ్ఞాన మొసంగును.

## అష్టైశ్వర్యముల వివరణము.

సీ. అణుజంతువులయందు నణువై చరించుట
 లణిమాహ్వయైశ్వర్య మలఘుచరిత
యబ్జజాండాదిమహన్మహుం డై యుంట
 మహిమాఖ్యభూతి నిర్మలవిచార
బ్రహ్మాండమునకంటె భారమై యుండుట
 గరిమాఖ్యసంపత్తి కలుషదూర
యమరాద్రిసదృశుఁడై యతిసూక్ష్మగతినుంట
 లఘిమావిభూతిసల్లలితహృదయ

తే. వాంఛితార్థావలంబనావాప్తి ప్రాప్తి
గగనగమనాదిసిద్ధి ప్రాకామ్య మర్క
శశిముఖనియామకత్వ మీశత్వ మఖిల
జీవవశ్యప్రవృత్తి వశిత్వ మనఘ.

తా. అణిమ:—అణువుగూపమునఁనుండు ప్రాణులయందైన సూక్ష్మపరమాణురూపమున నుండుట. (2) మహిమ:-బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వర సదాశివ విరాట్పురుషాండములకంటె నధికుఁడైయుండుట, (3) గరిమ:-బ్రహ్మాద్యండములకంటె బరువుగానుండుట, (4] లఘిమ:-ఎక్కువబరువుగలవాఁడైనను దూదికణమువలె తేలికయైయుండుట (5) ప్రాప్తి:-వలయు వస్తువులు గలుగునట్లు జేసికొనుట, (6) ప్రాకామ్యము:-ఆకాశసంచారము గలుగుట సమస్తదేవతల నాయాలోకముల పనులయందు నియమించుట, (7) ఈశత్వము, (8) వశిత్వము, సమస్తజంతువులను వశముచేసికొనుట.

---

శా. ప్రత్యక్షాపగమంబుఁ బావనము నత్యభ్యాసంబు గావింపఁగా
నత్యంతోరుసుఖంబు ధర్మమతిగుహ్యాం బుత్తమం బాద్యముల్
సత్యం బాగమసిద్ధ మాదిమునిరాట్సంస్తుత్యము న్వేద్యముల్
నిత్యానందము రాజయోగము మహానిర్వాణమార్గం బగున్. 87

పావనీ ! దృశ్యమగు జగత్తును పరబ్రహ్మమని తోపసేయునదియును మిక్కిలి పవిత్రమైనదియును, శ్రవణమననిధిధ్యాసములు గావించువారికి సౌఖ్యములు గలుగజేయునదియును, పుణ్యస్వరూపమైనదియును, మిక్కిలిరహస్యమైనదియును, మిక్కిలి శ్రే

ష్ఠమైనదియును, సత్యమైనదియును, సృష్టికిఁ బూర్వమునుండియు నున్నదియును, యిరువదియెనిమిది ఆగమములచేతను ప్రతిపాదింపబడినదియును, తొలుతటి మునులైనవారలకు హయగ్రీవదక్షిణామూర్తులచేతను పొందదగినదియును మోక్షాపేక్షగలవారలకు తెలియదగినదియు, నిత్యమును బ్రహ్మానందము నొసంగునదియును అగు రాజయోగము మోక్షమొసంగు మార్గములలో ముఖ్యమైనది.

ఆ. రాజగుహ్య మైన ✱ రాజయోగంబును
శ్రద్ధధాను లగుచు ✱ జనము లెల్ల
సంశ్రయింప లేక ✱ సంసారవనధిలో
మునుఁగు చుండుదురు వి✱మూఢు లగుచు. 88

తా. ఆంజనేయా! తెలివిమాలినవారై జను లతిగోప్యమైన రాజయోగము నభ్యసింపక జననమరణాది షడ్వికారములునుగల సంసారమను సముద్రమున మునిగి తేలుచు కష్టములొందుచుందురు.

క. ఈరాజయోగమార్గం
బీరేడుజగంబులందు ✱ నెవ్వ రెఱుఁగ రా
త్మారామలసదపాంగా
పారకృపాయుక్తులైన ✱ భక్తులు దక్కన్. 89

తా. ఈరాజయోగమును పదునాల్గుభువనములలోననుగల బ్రహ్మనిష్ఠాత్ములగు విజ్ఞానులుమాత్రమేయెఱుగుదురు గాని యితరు లెఱుంగరు.

తే. రాజయోగంబు ముక్తికి ✱ రాజపథము
రాజగుహ్యంబు పరమంబు ✱ రాజవిద్య
యదియు మూఁడువిధంబుల ✱ నలరుచుండు
సాంఖ్యతారకసదమన✱స్కములనంగ. 90

తా. రాజయోగము ముక్తినపేక్షించువారికి రాజవీధివంటిది. మిక్కిలి గోప్యమైనది యోగములన్నిటికంటెను, విద్యలన్నిటికంటెను, శ్రేష్ఠమైనదియునై యున్నది. ఇయ్యది 3 విధములు. సాంఖ్యము, తారకము, అమనస్కము, అని మూఁడువిధములుగా నున్నది.

తే. తారకంబు మనశ్శుద్ధి✱కారకంబు
సాంఖ్య మాత్మస్వరూపవి✱చారకంబు

అనుభవజ్ఞాన మమనస్క - మట్లుగాన
నాద్య మెఱిఁగింతు మొదల నీ కవధరింపు. 91

తా. తారకయోగము మనశ్శుద్ధిగలుగఁజేయునదియును, సాంఖ్యయోగము బ్రహ్మస్వరూపము యిట్టిదని తెలియఁజేయునదియు, అమనస్కము సాక్షాత్కార జ్ఞానమొసంగునదియును అయియున్నది. పావనీ! నీకు మున్ముందుగా తారకయోగమును దెలిపెద నాలింపుము.

ఉ. తారక ముద్భవాంబునిధితారక - మంబుజసంభవాదిబృం
దారకసన్నుతం బఘవిదారక మంచితరాగరోషసం
హారకము ప్రధానపరిహారక మాత్మసుఖానుభూతి వి
స్తారక మాగమాంతసువిచారక మై తనరారు మారుతీ. 92

తా. తారకమంత్రరాజము షడ్విధ వికారములుగల సంసారసాగరమును దాటించును. బ్రహ్మమొదలగు దేవతలచేత నుతింపబడినదియును, పాపములను పటాపంచలుచేయునదియును దుర్గుణములను హరింపజేయునదియును నేను జీవుడ నను నజ్ఞానమును తొలగించునదియును పరమాత్మకును నాకును భేదములేదనునట్టి జ్ఞానమొసంగి యాజ్ఞానమువలన గల్గిన యానందసముద్రమున నోలలాడించునదియును వేదములయొక్క కడపటిభాగమైన జ్ఞానకాండచే నెఱుఁగదగినదియునై యున్నది.

క. తారకయోగము దెలియఁగ
నేరక వేదాంతవాక్యనికురుంబముచే
నూరక వాదించుచుఁ జెడు
వానికి మోక్షంబు గలదె - వాయుకుమారా. 93

తా. తారకయోగనిష్ఠనుమాని వేదాంతవాక్యార్థములను ప్రతిపాదించుచు వాదములు సలుపుచుండువానికి సంసారదుఃఖరహితరూపమగు మోక్షములేదు.

తే. రాజయోగంబుఁ బూని నిరంతరంబు
పట్టుగా నభ్యసింపంగ - బ్రాలుమాలి
కొన్ని వేదాంతయుక్తులు - గూడఁబెట్టి
పలుకనేర్చిన బ్రహ్మానుభవము గలదె. 94

తా. పావనీ! రాజయోగమును శ్రవణమననిదిధ్యాసములచే వాడుకచేయక బద్ధకించి వేదాంతశాస్త్రమందలి కొన్నియుక్తులనుమాత్రము నేర్చికొని సభలలో నుపన్యసించుమాత్రమున జీవబ్రహ్మైక్యముగల్గి మోక్షము లభింపదు.

సీ. దారుణగాఢాంధకారం బడంగునే
వసుధపైఁ గృతదీపవార్తవలన
నాఁకొన్నమనుజునియాఁకలి దీఱునే
ఘనసరసాన్న వర్ణనమువలన
నెటి పేదవానిపేదఱికంబు వోవునే
ద్రవ్యప్రభావకీర్తనమువలన
రోగపీడితుని బలురోగంబు దీఱునే
కలితౌషధప్రసంగంబువలన
తే. జండిపడి బుద్ధిలో వెలి నిండి మిగుల
దట్టమైనట్టి యజ్ఞానతమము దెగునె
తర్కితవిచిత్రశబ్దబోధంబువలన
ఫలితయోగానుభవదృష్టివలనఁ గాక. 95.

తా. పావనీ! ఇంటియందు దీపమును పెట్టక దీపముసంగతిని మాటలాడినంతమాత్రమున నింటియందలి చీకటిపోవునా! ఆకలిగొన్నవానికన్నమును బెట్టక యన్నమును పొగడినంతమాత్రమున వాని యాకలిదీరునా! పేదవానికి ద్రవ్యమీయక ద్రవ్యముయొక్క ప్రభావమును వర్ణించిన వానిపేదఱికము పోవునా! ఔషధమీయక నౌషధప్రభావము గ్గడించిన రోగము శాంతించునా! అటులనే వేదాంతప్రసంగములవలన బ్రహ్మైవాహమస్మియను జ్ఞాననిష్ఠకలుగక అహంకారరూపకమగు అజ్ఞానమడంగదు.

### యోగాభ్యాసఫలనిరూపణము.

క. యోగాభ్యాసమువలన స
దాగతి చిత్తేంద్రియములదర్పము లడఁగున్
రాగద్వేషాదులు చను
బాగుగ నాత్మకు సుఖానుభవముం గలుగున్. 96

తా. రాజయోగము వాడుకచేయుటచే పంచవాయువులయొక్కయు, పదునాలు గింద్రియములయొక్కయు, స్వేచ్ఛాప్రవర్తనములు నిలచును, రాగద్వేషాదులు నశించును, బ్రహ్మానందము లభించును.

వ. అట్లు గావున యోగాభ్యాసంబు ముముక్షువున కవశ్యకర్తవ్యం బట్లగుటం దత్ప్రకారం బెఱింగించెద సావధానచిత్తుండవై వినుము. 97

మోక్షమందాసక్తిగలవారలకు రాజయోగమవశ్యాచరణీయముగాన రాజయోగాభ్యాసాదిక్రమము తెలియజేసెదను శ్రద్ధతో వినుము.

## యోగాభ్యాసులకు ముఖ్యములగు నాహారాదినియమము.

చ. వనరుచు నేమియుం దినని వానికి మిక్కిలి వెక్కసంబుగాఁ
దిని యెగఁబోయువానికిని దీఱనినిద్దుర యెల్లప్రొద్దుఁ బై
కొనఁబడి యుండువానికిని గొంకక రేపగ లొక్కరీతి మే
ల్కొని వసియించువానికి నగోచరము ల్వరయోగలక్ష్యముల్. 98

తా. వ్రతోపవాసముల సల్పుచు నేమియుదిననివానికిని, మిక్కిలి ఎక్కువగాదిని ఆయాసపడువానికిని సూర్యోదయ సూర్యాస్తమయముల నెఱుగక నిద్రించువానికిని దివారాత్రములందు నిద్రలేనివానికిని రాజయోగాభ్యాసము లభింపదు.

క. యుక్తాహారవిహారుఁడు
యుక్తస్వప్నావబోధుఁ డురుకర్మములన్
యుక్తవిచేష్టుం డగు ఘను
యుక్తున కగుఁ బరమరాజయోగము సుఖమై. 99

తా. మితభోజనము చేయువాఁడును మితమైన విహారముగలవాఁడును సకల లౌకికకర్మములను మితప్రవర్తనము కలవాఁడును అగునట్టి మహానుభావునకు రాజయోగాభ్యాసము లభించును.

## యోగమతలక్షణము.

సీ. వితతమై విజనమై విమలమై సుఖమై ప్ర
సంగు వివిక్తదేశమ్మునందు
సమభూమియందు నిశ్చలముగా మిణ్ణుప
ల్లములు గాకుండఁ జేలవము గాఁగ

వరుసఁ గుశాజినవస్త్రంబు లనువుగాఁ
బఱచి యొప్పుగ వానిపైఁ దిరముగ
బూని పద్మాసనాసీనుఁ డై యామీఁదఁ
గాయమధ్యమమును గళము శిరము
తే. జక్కగా నిక్కి దృక్కులు ముక్కచెక్కిఁ
జిక్కఁ దక్కించి తక్కినదిక్కుఁ గనక
మిక్కిలి దశేంద్రియంబుల స్రుక్కఁ జేసి
ఫలితముగ యోగ మభ్యసింపంగవలయు. 100

తా. విశాలమైనదియు, జనసంచారములేనిదియు, దుర్గంధములేనిదియు నల్లులు, చీమలు, దోమలు మున్నగునవి లేనిదియు దగు స్థలమున యోగశాస్త్రమున జెప్పబడిన పర్ణశాలయందు సమానమైన నేలపై కృష్ణాజినము, దర్భాసనము, చక్కగాపరచి వానిపై కూర్చుండి స్థిరచిత్తముగల్గి పద్మాసనముననుండి నడుము, తల, మెడ, వీనిని నిక్కించి య న్యతలంపులనుమాని కనుబొమలనడుమ దిలకించుచు బ్రహ్మనిష్ఠ నలుపవలెను.

మ. యతధీచిత్తమరుద్ధశేంద్రియతనువ్యాపారుఁ డై మౌని యై
హతకామాదివికారుఁడై గతభయుండై బ్రహ్మచారివ్రత
స్థితుఁ డై శాంతమనస్కుఁడై స్వగురుమూర్తిప్రోక్తలక్ష్యార్థసం
గతి యామద్వయ మభ్యసింపఁ దగు యోగం బంచితోద్యోగుఁడై.

తా. పావనీ ! జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల జయించి పంచవాయువుల స్వాధీనపరచుకొని, శరీరవికారముల నణచి మౌనమూని కామక్రోధాదుల నశింపజేసి పోగొట్టబడిన భయముగలవాఁడై బ్రహ్మచర్యము సల్పుచు, శాంతియుతుఁడై నిజగురునిచే నుపదేశమందు లక్ష్యముయొక్క వస్తువునందు సత్త్వవృత్తియుతమైన తనమనంబు నేర్చి రెండు జాములు యోగమభ్యసింపవలయును.

క. మారుతి యీనియమంబులు
తారకసాంఖ్యామనస్కతత్పరులకు సా
ధారణము లగుచు వెలయుం
దారకయోగుల కతిప్రధానము లందున్. 102

తా. పావనీ! ఈపూర్వోక్తనియమములు తారకసాంఖ్యామనస్కయోగులకు సామాన్యములు. అందు తారకయోగుల కవశ్యాచరణీయములు.

పంచముద్రాలక్షణము.

క. వరుసఁ ఖేచరి యన భూ
చరి యన మధ్యమ యనంగ ఽ షణ్ముఖి యనఁగా
వరశాంభవి యనఁ గల వీ
ధరలోపల ముద్ర లైదు ఽ తారకమునకున్. 103

తా. పావనీ! తారకయోగమునకు ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి, అను ౫ ముద్రలుగలవు.

ఆ. సద్గురూపదేశఽసరణిచే నీమైదు
ముద్రలను విశేషఽముగ నెఱింగి
యభ్యసింపవలయు ఽ సటమీఁద దారకం
బొందుఁ బ్రణవనాదఽబిందుకళల. 104

తా. సద్గురువుచే నీపంచముద్రలను చక్కగా నెఱింగి అభ్యాసపరచినవెనుక ఓంకారమునందలి చిణి చిణి చిణి మున్నగు దశవిధనాదములనువిని జ్ఞాతృచనోబుద్ధి చిత్తాహంకారముల సమిష్టిక్షేత్రజ్ఞవ్యష్టిజీవచైతన్యములయొక్క శోధనముచే ఓంకారలక్ష్యార్థమైన పరబ్రహ్మము తానను నిర్వికల్పస్థితి లభించును.

వ. అది యెట్లంటేని. 105

ఆ. కనులు మూసియైనఁ ఽ గడు విచ్చియైన భ్రూ
మధ్యమమునఁ జూపు ఽ మలఁచినిలిపి
యూర్ధ్వముఖము గాఁగ ఽ నొనరఁ జూచిన నది
ఖేచరి యను ముద్ర ఽ కీశవర్య. 106

తా. పావనీ! కనులను మూసిగాని మూయకగాని చూపులను త్రిప్పి కనుబొమల నడుమ నిల్పి యూర్ధ్వముననున్న చిదాకాశమును చూచుచున్నయెడల నది ఖేచరీముద్ర యనబడును.

క. లోచనములు గదలింపక
యాచార్యోక్తస్వనాసికాగ్రం బెపుడున్

గోచరముగఁ జూచిన నది
భూచరి యను ముద్రయగును బోధశరణ్యా. 107

తా. పావనీ ! కనులను కదలింపక ముక్కుతుదను జూచుచుండెనేని యది భూచరీముద్ర యనబడును.

ఆ. కనులు సగము మూసి ఘననాసికామధ్య
సీమయందుఁ జూపుఁ జెదరనీక
నిలిపి మీఁద నున్న నిటలంబుఁ గాంచిన
మధ్యలక్ష్య మగుఁ గుమారతిలక. 108

తా. ఆంజనేయా ! కన్నులను సగముమూసి ముక్కునడుమనుచూపు నిల్పి పైనున్న నుదుటిభాగమును చూచుచుండునది మధ్యలక్ష్యముద్రయని తాత్పర్యము.

తే. కర్ణలోచననాసాయుగంబు మూసి
మలఁచి భ్రూమధ్యమమునఁ జూపులను మనము
నిలిపి వరనాదబిందుచిత్కళలఁ గనుట
షణ్ముఖీముద్ర యండ్రు సజ్జనులు వత్స. 109

తా. వాయుపుత్రా! చెవులను, కన్నులను, ముక్కులను మూసి దృష్టిని మనస్సును అంతర్ముఖము గావించి కనుబొమలనడుమ నిల్పి నాదబిందుకళల జూచుచుండు నది షణ్ముఖీముద్ర యనబడును.

క. అంతర్లక్ష్యము బహిర
త్యంతనిశ్చలసుదృష్టియపగతపవన
స్వాంతవికారము గలయది
వింత యగుచు నొప్పు శాంభవీ ముద్ర యనన్. 110

తా. ఆంజనేయా ! దశవిధ ప్రాణవాయువులను, పదునాలుగింద్రియములను జయించి కన్నులను తెరచి చూపులను చిదాకాశమున నిల్పి యచటివింతలను గాంచుచు తన్మయత్వము నొందుటయే శాంభవీముద్ర యనబడును.

సూర్యచంద్రమండల కళానిర్ణయము.

మ. అమరేంద్రార్చితపూర్వవర్ణితనితాంతాంతర్బహిర్మధ్యల
క్ష్యములుద్యద్వరమండలత్రయకళాసందర్శనాభ్యాసమో

గము లీరెండును నాదబిందురుచిసాక్షాత్కారసద్ధేతుభూ
తములై యొప్పు నిరంతరం బలఘుతర్క ధ్యానంబు గావించినన్.

తా. పావనీ! సూర్యచంద్రాగ్ని మండలములయందలి ముప్పదియెనిమిది కళలను జూచుటకు సాధనములైన అంతర్లక్ష్యముగల ఖేచరీషణ్ముఖీశాంభవీముద్రలను బహిర్లక్ష్యముగల భూచరీముద్రను మధ్యలక్షణముగల మధ్యముద్రను యమనియామాది 18 యోగములను అభ్యసించి వాడుకకు దెచ్చుకొనినయెడల ఓంకారమునందలి దశవిధనాదము లగు చిద్బిందువును, అందలి చిత్కళను జూడవచ్చును వినవచ్చును.

ఆ. నాదబిందుకళల నయమొప్పఁ జూచుచు
నింద్రియముల మనము నివృత్తిఁజేసి
సత్కళీశ్వరుండు స్వప్రకాశాత్మచి
త్సుఖముఁ గాంచు బరమసులభముగను. 112

తా. ఇంద్రియములను జయించి మనస్సును స్వాధీనమునసుంచుకొని యితరచింతలనువిడచి నేర్పున నాదబిందుకళలను దర్శించుచున్న నేనే బ్రహ్మనను విజ్ఞానమునఁగలిగి యానందమును మిగుల సులభముగా పొందును.

చ. లలితనినాదబిందుకళలన్ గుఱిఁ జేసిన మానసేంద్రియం
బులు వెలి లోపలం దిరుగఁ బోవక వానిని చూచుచుండ ని
శ్చల మగు దేహ మయ్యెడ విచారముచేఁ బరమాత్మతత్త్వమున్
సులభముగా నెఱుంగఁబడునీసు విమ్మది చక్కనిత్రోవ యారయన్.

తా. ఆంజనేయా! బ్రహ్మనిష్ఠగోరుపూరుషుఁడు ప్రణవనాదమును చిద్బిందువును చిత్కళను తప్పక దిలకించుచుండిన పదియింద్రియములతోడను గలసి మనస్సు విషయాకారమున అంతర్బాహ్యముల దిరుగకుండును. అట్టియెడ నాకలిదప్పిక లడంగును. అట్లు చిద్బిందువును జూచుచున్నయెడల మనస్సు లయించి పరబ్రహ్మమునందే యుండును. ఇది యోగమార్గములో నుత్తమమైనది.

ఆ. నాదబిందుకళల నాదరింపనియోగి
యింద్రియములు మనము నిట్టు నట్టు
బరువు లిడఁగ వానిఁ బట్టఁ జాలక కుందు
నిట్టివాఁడు పరము నెట్టు గాంచు. 114

తా. పావనీ ! నాదబిందుకళాదర్శనమొనర్పనివాఁడు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతో గూడుకొనిన మనస్సు శబ్దస్పర్శరూపరసగంధాది విషయములగూడి యథేచ్ఛగా నంతర్బాహ్యముల చరించుచుండగా దానిని నిలుపజాలక డీలుపడి విషయసుఖములదగిలి విచారపడుచుండునే గాని యపరోక్ష సాక్షాత్కారము లేకయుండును.

సీ. గాలంబు లేనిచో ꠰ జాలకాగ్రణిచేత
బాఠీనజాలముల్ ꠰ పట్టు వడునె
సరియురి లేనిచో ꠰ శకునాంతకునిచేతఁ
జొక్కంపుపక్షులు ꠰ చిక్కువడునె
యోదంబు లేనిచో ꠰ నాగిమావటీనిచే
గజరాజములు సరి꠰కట్టు వడునె
తగుకోల లేనిచో ꠰ మృగయావినోదిచే
ఘోరమృగంబులు ꠰ కొట్టు వడునె
తే. రాజితానందతారక꠰రాజయోగ
పావనసమాధి లేనిచో ꠰ బరమశుష్క
తర్కవేదాంతవాదత꠰త్పరులచేత
నింద్రియమనంబులు విని꠰గ్రహింపఁబడునె. 115

తా. పావనీ ! జాలరివానికి గాలములేనియెడల చేపలు దొరుకనట్లు, బోయవానికి సురిత్రాళ్ళు లేకుండ పక్షులు చిక్కకుండునట్లు, అంకుశములేని మావటివానికి యేనుగ లొంగనట్లు, బాణములులేని వేటగానికి జంతువులు చిక్కకుండునట్లు, వ్యర్థములగు నూహలచే నుపనిషదర్థముల వాదించువానికి బ్రహ్మప్రణవముల యుత్తమయోగమనియెడి తారకయోగముయొక్క అనుసంధానములేనియెడల యింద్రియములు మనస్సునకు లోబడకుండును.

క. జన మంజనంబుఁ గైకొని
ఘన మగు ధనమును నెఱుంగు ꠰ కైవడిని నిరం
జనతారకయోగముఁ జే
కొని పరతత్త్వమును దెలియ ꠰ గుఱిపడు నంతన్. 116

తా. ఆంజనేయా! లోకు లంజనముచే నిధులెఱింగినట్లు సాధనాంతరములు లేకున్నను, తారకయోగమును అభ్యసించినేని మనస్సున కింద్రియములు వశమగును.

తే. పలలమును జూపి డేగను బట్టురీతి
నమృతసమనాదబిందుకళానుభూతి
సుఖము నొందించి మఱిగించి చొక్క జేసి
యింద్రియమనంబుల వినిగ్రహింపవచ్చు. 117

తా. మాంసమును జూపించి డేగలనుబట్టుకొని స్వాధీనముజేసికొనువిధమున నాదబిందుకళానుభవజన్యమగు సౌఖ్యంబునొందించి మచ్చికపరచి మనస్సున కింద్రియములు స్వాధీనమగునట్లు చేయవచ్చును.

ఆ. వేద మట్లు గాన నాదబిందుకళాను
భవముఁ దెలిపె మొదలఁ బండితులకుఁ
దత్ప్రకార మెల్లఁ దగ నెఱిఁగించెద
విస్తరించి తెలియ వినుము వత్స. 118

తా. పావనీ! వేదము పూర్వము పండితులకు నాదబిందుకళానుభవంబును దెలిపెను. ఆప్రకారమంతయును నీకు సవిస్తరముగా దెలిపెదను. సావధానమనస్కుడవై వినుము.

దశవిధనాదముల వివరణము.

తే. సద్గురుప్రోక్తముద్రచే శ్రవణయుగము
మూసి యాలింపఁ బ్రణవంబు మ్రోయు మొదలఁ
జిణి యనుచు నంతటను జిణి చిణి య టంచు
మించి రెండవమాఱు ఘోషించు ననఘ. 119

తా. గురునిచే నుపదేశింపబడిన ముద్రచే రెండుచెవులనుమూసి వినినయెడల ఓంకారము జిణియనుచు మ్రోగుట వినసగును. అంతట నాయోంకారము హెచ్చి చిణిచిణి యనుచు ఘోషించును.

శా. కంటి న్నెమ్మదిఁ గంటి సద్గురుని నింకేల మేనిలో పువ్వులా
జెంటల్ బూజలొనర్తునంచుఁ గరమర్థిన్ దేహా దా మున్నుగా

ఘంటానాదముఁ జేసెనో యనఁగ నోంకారంబు హృద్వీథి యం
మింటన్ మ్రోయుఁ దదారవంబుగతి యాకిమీఁదన్ విజృంభించుచున్.

తా. పావనీ! కూటస్థుఁడు పరమశివుని గాంచితిని. ఇంక శరీరమునందున్న మూలాధారాదిపుష్పములు 6 టిచే నను పరమశివుని పూజింతును, అను మహదానందమున తాను ఘంటానాదము జేసెనో యనునట్లు హృదయమార్గం బను నాకాశమున నోంకారము ఘోషించుచుండును. అయ్యది క్రమక్రమమున విజృంభించుచు శంఖావీణాదులగతి ననుకరించును.

స్రగ్ధర. కామక్రోధాద్యసద్రాక్షసగణవిజయాకాంక్షిమై ప్రత్యగాత్మ
శ్రీమన్నారాయణుం డుకేచితవిమలమహాకేచిత్తశంఖంబు నిండన్
క్షేమం బారంగఁ బూరించినగతి మొరయుఁ గజిత్కళాదర్శకంబై
భూమానందప్రదం బైకస్ఫుటనిగమశిరోభూషణోంకార మంతన్.

తా. పావనీ! అంత నుపనిషత్తులకు కారణభూతమైన యోంకారము, కూటస్థబ్రహ్మను శ్రీమన్నారాయణుఁడు కామక్రోధాదిరాక్షసులను జయింపగోరి తన్కుంగల యెల్లవారికి క్షేమముగలుగునట్లు నిర్మలమును సుందరమును గొప్పదియునైన చిత్తమను పాంచజన్యమను శంఖమును స్వస్వరూపజ్ఞానభరితమగునట్లు పూరింపగా నాధ్వనివలె పెంపొందుచు జ్ఞానకళంగనబరచుచు నతిశయించిన యానందంబు నొసంగుచు మ్రోసను.

మ. నలువొప్పం దగు బ్రహ్మదండి నొకవీణాదండముం జేసి ష
డ్జలజాతంబుల మెట్లుగా నిలిపి పంచప్రాణముల్ తంత్రులై
యలరంగాఁ గొని ముక్తికామిని సహస్రారంబునం దుండి ని
చ్చలు వాయించె ననంగ నొప్పుఁ బ్రణవస్వానంబు దానంతటన్.

తా. పావనీ! అంత ప్రణవనాదము ముక్తికాంత తెఱంగున బ్రహ్మదండిని వీణగావించుకొని మూలాధారమున్న గు నాఱుపుష్పములను యావీణకు సరికట్లుగానుంచి ప్రాణాపానాదుల నైదు తంత్రులు గావించుకొని యావీణపై మహదాకాశపునిమ్మెడి కమలమునవసించి మీటుచున్నదో యనునట్లు మ్రోగును.

తోటకవృత్తము. అమృతాంగనబోధమయాత్మునిసు
ద్ధమనఃపవనంబులు కె తాళముగా

సమరం గొని పాడుచు నాడినయ
ట్లమలప్రణవారవ మంతఁ దగున్. 123

తా. అంత నిర్మలప్రణవనాదము ముక్తికాంత జ్ఞానస్వరూపుడగు క్షేత్రజ్ఞుని గూర్చి నిర్మలమగు మనస్సును వాయువుల దాళములుగాగొని పాడుచు నృత్యము చేయునట్లొప్పును.

సీ. సలలితేంద్రియగోపికలుపరప్రీతిచేఁ
జనుదెంచి తను బొంది సంతసింప
బ్రహ్మదండిలతావిభాస్వదాధారాది
కపికావళి మహావికాస మొంద
బ్రస్ఫుటీకృతపటుస్ఫటకుండలీంద్రుఁడ
త్యానందకరముగా నాడు చుండఁ
బొందుగా భ్రూమధ్యబృందావనమ్మునఁ
బ్రత్యక్షబోధ గోపాలమూర్తి

తే. విమలమానసపవనహస్తములచేతఁ
దనసుషుమ్నామురళి లీలఁ దాల్చి మధుర
గాన మొనరించె ననఁగ నోంకార మలఘు
వేణునాదస్వరూప మై వెలయు నంత. 124

తా. పిమ్మట యోంకారమపరోక్షసాక్షాత్కారమైనవిజ్ఞానమనెడి కృష్ణుడు కనుబొమలనడుమప్రదేశమగు బృందావనమున మనోహరులగు చతుర్దశేంద్రియము లను గొల్లభామలుగలసి యానందింప, బ్రహ్మదండియను తీగెలనున్న మూలాధారాది చక్రమట్కాము లను కోనెలల సమూహమానందింప కుండలి యనుశక్తి కధిష్ఠానుఁడైన జీవసంజ్ఞగల సర్పరాజానందింప నిర్మలములగు మనోవాయువు లనుకరముల బ్రహ్మనాడియను పిల్లనగ్రోవిధరించి విలాసముమీర వీనుల కపరిమితానందముగా గానమొనరించినట్లుగా మహత్తరమైన వేణునాదమువలె వెలయుచుండును.

సుగంధివృత్తము. క్రూర రాగదోషవైరి కోటి నెల్లఁ ద్రుంపఁగా
గోరి యాత్మరాముఁ డుండ ఘోరసంగరార్థ మై

భూరిభేరికారవంబు బోరుకొల్పినట్లు లోం
కారనాద మొప్పు వింతగాఁ గుమార యంతటన్. 125

తా. అటుపిమ్మట ప్రణవము ప్రత్యగాత్మయను శ్రీరాముఁడు దుష్టములైన కామక్రోధాదు లను శత్రువులను సంహరింప నెంచి ఘోరయుద్ధంబు సేయుకొరకు యత్నించి మ్రోగించెడు భేరివాయిద్యము తెఱంగున చోద్యముగా మ్రోగును.

మ. అమరేంద్రాదులఁ గెల్చు సొంపలరు మాయాకాంతనాడింపఁగా
నమలాత్మం డగు నల్లమాప్రభువరుం డాత్మీయవిద్యామృదం
గము వాయించె ననంగ నొప్పు లలితోంకారస్వనం బంత హృ
ద్య మచింత్యం బతులం బవాచ్య మయి నిత్యానందమై మారుతీ.

తా. దేవేంద్రాదుల గెలువవలయునని యుల్లాసముతోనుండు మాయాకాంత యను నర్తకిచే నాట్యమాడించుటకు అల్లమాప్రభురాయఁడు మృదంగమును వాయించెనో యనునట్లు మనోహరముగను మనస్సున కందనిదియును, పలుకులకందనిదియును సాటిలేనిది యును, రమణీయమునునై యోంకారము నిత్యానందరూపమున వెలయును.

సీ. నిఖిలేంద్రియములను నీలకంఠంబు ల
త్యంతసంతోషనృత్యములు సలుప
ధర్మామృతార్ద్రీకృతమనోవనీస్థలి
శమముఖసుగుణసస్యము లిగుర్ప
సమరసానందనిర్ఝరముచేఁ దాపదా
వానలం బెల్లఁ జల్లార్పఁబడఁగ
భ్రూమధ్యదేశనభోవీథిఁ జిత్కళా
విద్యుల్లతాతతుల్ వెలయుచుండఁ

తే. దతచిదాకాశమధ్యసంగతసమగ్ర
రాజయోగసమాధిధారాధరంబు
మోదవర్షంబు గురియుచు మ్రోసెననఁగఁ
బ్రణవదశమనినాద మొప్పారునంత. 127

తా. అనంతర మోంకారనాదము చిదాకాశమునందుగూడిన జ్ఞానయోగ నిర్వికల్పసమాధియనెడి మేఘసముదాయమునుగాంచి యింద్రియము లను నెమళ్లుచేరి నిర్భరానందమున తాండవముసల్ప-వర్ణాశ్రమధర్మము లను జలంబుచే దడుపబడిన మనంబను ధరణీతలమునందు శమము మొదలగు సుగుణములనెడి సస్యములపైరులంకురింపగా, ప్రత్యగ్బ్రహ్మైక్యరూపాఖండానందమనెడు ప్రవాహముచేత నాధ్యాత్మికాది తాపత్రయము లను దావాగ్ని చల్లారగ భ్రూమధ్య మను ఆకాశమార్గమున జ్ఞానకళ లను మెఱపుతీగెలు వెలయుచుండ నానందవర్షము గురియుచు ఘోషించెనో యనునట్లు మేఘధ్వనితో వెలయును.

వ. ఇట్లు చిణీనాదంబు చిణిచిణీనాదంబు ఘంటానాదంబు శంఖనాదంబు వీణానాదంబు తాళనాదంబు వేణునాదంబు భేరినాదంబు మృదంగనాదంబు మేఘనాదం బనంబరఁగు దశవిధప్రణవనాదంబుల శ్రీగురూపదేశపూర్వకంబుగా శ్రుతియు క్త్యనుభవంబులచేత నెఱుంగవలయు. మఱియును,

తా. ఇట్లు చిణి చిణి నాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళనాదము, వేణునాదము, భేరినాదము, మృదంగనాదము, మేఘనాదము అను 10 విధములగు ప్రణవనాదంబులను గురూపదేశపూర్వముగా శ్రుతిచేతను, యుక్తిచేతను, అనుభవముచేతను దెలియవలయును. మరియును,

తే. భూరినాదం బకారంబు ◊ పుణ్యపురుష
విమలబిందువు లసదుకారము గపీంద్ర
కళ మకార మీమూఁడును ◊ గలియఁ గూర్ప
ఘనత రోంకార మగు ◊ సదాగతి కుమార. 129

తా. ఆంజనేయా! ఘననాదస్వరూపమగు అకారము, బిందురూపమగు నుకారము, కళారూప మగుమకారము. యీమూడును గలియజేర్పగా బ్రహ్మప్రణవాత్మకమగునోంకారమగును. అకారము బ్రహ్మప్రణవమందలి యవిద్యాపాదాత్మికము, ఉకారము విద్యాపాదాత్మికము, మకార మానందపాదాత్మికము.

వనమయూరవృత్తము. గౌరవయకారము నుకారము మకారం
బారయఁగఁ గూడి యొకయక్షర మనాద్యోం

కార మనఁగా నిఖిలలోకకారణము నై ఘుం
టారవమురీతి హృదయాంబుజమున మ్రోయుఁగా. 130

తా. పావనీ! ప్రణవ మకారఉకారమకారముల చేరికచేనైనది. ఈప్రణవమే జగదుత్పత్తిస్థితిలయకారణమై, అనాహతచక్రమున ఘోషించుచుండును. ఓంకారము బ్రహ్మస్వరూపము, రత్నకాంచనధాతు నిష్పన్నమైన ఓంకారము సంసారార్ణవమునుండి తరింపజేయును.

క. హృదయసదనమునఁ బొదలెడి
సదమలనాదామృతంబు సేవింగొనకున్నఁగా
మది గదలుచుఁ గుదురదు గలు
గదు మొదలిటిపదము ముదముగదుర దుదయమై. 131

తా. హృదయ మను ననాహతచక్రమునబుట్టిన శ్రేష్ఠమైనట్టియు నిర్మలమైనట్టిదియు నగు ఓంకారనాదమనియెడి యమృతముయొక్క రుచిచూడకున్న మనస్సు పదిలపడదు, మోక్షములభింపదు, బ్రహ్మానందముగలుగదు.

క. నాదం బుచితపరమా
హ్లాదము చిత్తప్రసాద మపగతగురుసం
వాదము గతఖేదం బని
వేదంబులు పలుకు వేదవేదాంతజ్ఞా. 132

తా. పావనీ! బ్రహ్మప్రణవనాదము పూజ్యమై అధికమగు నాహ్లాదము నొసంగునదియై అంతఃకరణమును నిర్మలముచేయునదియై వితండవాదముల నుడిగించునదియై ద్వైతభ్రమ తొలగించునదియునై యున్నదని వేదములు ఘోషించుచున్నవి.

తే. ప్రణవనాదరసామృతపానరతుని
విమలనయనము లనిమిషత్వము వహింప
మనసు దేవాలయంబున మనికి మఱిగి
సలలితకళాభూతిచే వెలయుచుండు. 133

తా. బ్రహ్మప్రణవనాదముచేగలుగు యానంద మను నమృతమును ద్రాగుటయందాసక్తియున్నదానికి నిర్మలములగు నేత్రములు ఱెప్పపాటులేకయుండ మనస్సు దేవతాపురమగు శరీరమున నివసింపమరిగి మనోహరమైన చిత్కళసంపదచేప్రకాశించును.

సీ. అనిమిషుం డజరుండు నమృతుండు పటుశక్తి
ధరుఁడు సిద్ధుండు విద్యాధరుండు
యోగీశ్వరుండు సాధ్యుండింద్రుఁడును శుచి
సమవర్తియును బుణ్యజనుఁడుభువన
పతియునువరసదాగతియును సుకృతార్థుఁ
డభవుఁ డనంతుండు నఖిలమిత్త్రుఁ
డతికళాశాలి మహాబుధుండు కవీశ్వ
రుండును సుమనోగురుండు ఘనుఁడు

ఆ. హంసవాహనుండునచ్యుతుండు శివుండు
పరమపురుషుఁడగుచుఁ బరఁగుచుండుఁ
బవనతనయ వినుము ప్రణవనాదామృత
పానతృప్తుఁ డైన పావనుండ. 134

తా. ఆంజనేయా! వినుము, ఓంకార మను సుధాపానముచేసిన పావనుఁడు తెప్పపాటులేనివాఁడును, మరణములేనివాడును, కుమారస్వామి, సిద్ధుడును, విద్యాధరుఁడును, యోగీంద్రుడును, సాధ్యుండును, ఇంద్రుడును, అగ్నియు, యముడును, నైఋతియును, వరుణుఁడును, వాయువును, కుబేరుఁడును, రుద్రుడును, ఆదిశేషుఁడును, సూర్యుడును, చంద్రుడును, బుధుడును, శుక్రుడును, గురుడును, మేఘుడును, బ్రహ్మయు, విష్ణువును, శివుడును, విరాట్పురుషుండును తానేయై ప్రకాశించును. (బ్రహ్మజ్ఞానిపక్షమున.) శాంభవీముద్రధారణమున రెప్పపాటులేనివాఁడును అఖండాకారమై యుండుటచే ముసలితనములేనివాఁడును, మరణములేనివాఁడును, సర్వజ్ఞత్వాదిశక్తులు గలవాడును, ఆత్మసిద్ధిగలవాడును, బ్రహ్మవిద్యాధరుండును, జీవబ్రహ్మైక్యజ్ఞానముగలవాఁడును, బ్రహ్మజ్ఞానసాధనమాచరించినవాడును, పరమైశ్వర్యముగలవాడును, నిర్మలుడును, ద్వంద్వరహితప్రవర్తనగలవాడును, ధర్మానుష్ఠానపరుడును, లోకనియామకుడును, సజ్జనులకాధారపురుషుడును, పుణ్యకర్మములే చేయువాఁడును, దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యుండును, సకలజనబాంధవుండును, అవికల్పవికల్పనామక కళాతీతుండును, సర్వము నెఱిఁగినవాడును, కవియు జ్ఞానగురుండును, సర్వోత్కృష్టుఁడును, హృదయకమల సంచారియు శివశక్తిబీజములగు హకారసకారములకుమధ్యనుండు బిందుకోశముతోఁగూడి జీవేశ్వరజగద్భ్రాంతు

లను నిస్సారజలమును విడచి సారవంతమగు బ్రహ్మజ్ఞాన మను క్షీరమును వేఱుసేయదగు హంసనధిష్ఠించిన బ్రహ్మస్వరూపుడు సంసారవారాసిగూలనివాఁడును, చంద్రసూర్యాగ్నుల కాంతనతిశయించిన కాంతిగలవాఁడును, క్షరాక్షరాతీతుడును అయినవాఁడై ప్రకాశించును.

## చిత్కళాసాక్షాత్కారము.

ఆ. ఆంజనేయ యింక ◆ నంతర్బహిర్మధ్య
దృగ్విలోకితప్రదీప్తచిత్క
ళావిభూతి యెల్ల ◆ భావించి చెప్పెద
నాదరించి చూడు ◆ మాత్మయందు. 135

తా. ఆంజనేయా ! లోనికిని వెలుపలకును నడుమనుండు జ్ఞానదృష్టిచే చూడబడినదై ప్రకాశించుచున్న చిన్మయకళాసంపత్తియంతయు నీకు చక్కగా నెఱింగించెదను. అద్దాని నాత్మలో నెంచిచూడుము.

ఆ. కనులు రెండు గురునియోగానుమతి గొని మూసి
బొమలనడిమి ద్విదళకమలమునను
విమలదృష్టి నిలిపి ◆ శమలలితాత్ముఁడై
చూడవలయు లక్ష్యశోభనముల. 136

తా. గురునియాజ్ఞవలన గనులుమూసికొని భ్రూమధ్యమందుండు రెండుదళములు గల్గిన యాజ్ఞా చక్రమున చూపునిలిపి అంత రింద్రియనిగ్రహముజేసి నిర్మలమైన మనస్సుగలవాఁడై చిత్కళయొక్క ప్రకాశముల దిలకింపవలయును.

క. మునుపుగ హృదయాకాశము
గనుపట్టుం జూపు లగుచు ◆ గన్నుల వెంటం
జనునది మన మగుఁ గావునఁ
గనఁ దగు నాకాశపంచకం బందుఁ దగన్. 137

తా. అట్లు జూచునపుడు మున్ముందు చిత్తాకాశము గోచరించును. అటుపిమ్మట చూపులై కనుల వెంటబోవునది మనస్సేయగుటచే నామనస్సునం దాకాశపంచకమును దిలకింపనగును.

వ. ఇట్లు తనలోచనంబులకుఁ గనుచూపుమేర గోచరం బైన హృదయాకాశంబునందుఁ గేవలనిరాకారం బైన గుణరహితాకాశంబు నిబిడనిష్ఠురనీరంధ్ర గాఢాంధకారం బైన పరాకాశంబు ప్రళయకాలప్రజ్వాలజ్జ్వాలాభీలదావానలాకారం బైన మహాకాశంబు వివిధవిచిత్రవితతాపరిమితద్యుతిభరితం బైన తత్త్వాకాశంబు ప్రచండమార్తాండమండలశతకోటిప్రభాభాసురం బైన సూర్యాకాశంబును పంచాకాశంబుల నవలోకింపవలయు. మఱియును. 138

తా. ఇట్లు తనకంటికగుపడినంతదూరమున కన్నులకు గనబడు చిత్తాకాశమందు కేవలగుణరహితాకాశమును, దిట్టమైనదియు కఠినమైనదియు, యెడములేనిదియు, గాఢాంధకారమే యాకృతిగాగలిగినదియును అగుపరాకాశంబును, కల్పాంతకాలమునజ్వలించెడి మంటలచే భయంకరమగు కార్చిచ్చువలె మహదాకాశమును, నానావిధములైన వింతలగల్గించుచు నపరిమితకాంతులచే నిండియుండు తత్త్వాకాశంబును మిక్కిలి యున్నముగల శతకోటి సూర్యకాంతుల తేజరిల్లు సూర్యాకాశమును అను 5 ఆకాశములను దిలకింపవచ్చును.

ఆ. ఆంజనేయ విను తదాకాశపంచక
మధ్యమమున వెలుఁగు ౯ మహితకళల
చందమెల్ల నీకు ౯ ముందుగా వినుపింతు
సందియములు మాని ౯ పొందువాని. 139

తా. పావనీ! ఈ ఆకాశపంచకమునడుమను తేజరిల్లుచుండునట్టి చిత్కళలవిధమంతయు నీకు ముందుగా నెఱింగింతును సందేహములనుమాని యాచిత్కళల సాధింపుము.

సీ. మందాకినీసుధా౯సందోహదుగ్ధాబ్ధి
సౌందర్యలహరుల౯చందమునను
మందారమల్లికా౯కుందారవిందోరు
చందనపుష్పరు౯క్ఛయముపగిది
నిందిరాసుందరీ౯మందిరాంతర్మక
రందనిర్ఝరరుచి౯ప్రతతిరీతి

నిందుభృన్నందిసంక్రందనకరిమృగేం
ద్రఫణీంద్రదీప్తిబృందములభాతి
తే. హారనీహారడిండీరశారదాభ్ర
హీరకర్పూరతారకాకారకాంతి
కరణి నాకాశపంచకాంతరమునందు
మండితము లగుఁ జిత్కళామండలములు. 140

తా. ఆకాశగంగ, అమృతరాశిపాలసముద్రముల సుందర తరప్రవాహములనువలె, మందారవృక్షము, మల్లెతీగె, మొల్లతీగె, తెల్లతామర, శ్రీచందనము వీని పుష్పముల కాంతులవలెను, లక్ష్మీదేవికినిలయమైన కమలములోపలనున్న మకరందరసవాహినియొక్క కాంతి సమూహమువలెను చంద్రుడు, పరమేశ్వరుడునంది యైరావతము సింగము ఆదిశేషుఁడు నీవస్తువుల కాంతివలెను, ముత్యపుసరులు నుంచు మరుగు శరత్కాలమేఘము, వజ్రము, కప్పురము నక్షత్రము వీనిరూపముల కాంతివలెను నాయాకాశపంచకముల మధ్యమందు చిత్కళాసమూహములు ప్రకాశించుచుండును.

సీ. సద్యస్తమోనాశఖద్యోతమానస
ద్విద్యుల్లతాప్రభావీథిపగిది
హృద్యతుషావేద్యఖద్యోతసందోహ
విద్యమానద్యుతివితతికరణి
ఘోరాంధకారకృద్దుర్భరినీలసవారి
వారివాహచ్ఛవివ్రజమురీతి
నీలనైడూర్యప్రవాళాబ్దరాగము
క్తాఫలగోమేధికములభాతి
తే. శుద్ధమాణిక్యమరకతశోణరత్న
తప్తతపనీయరుచులచందమునహృదయ
మండితాకాశపంచకమధ్యమమునఁ
గానఁబడు చుండుఁ జిన్మయకళలు వత్స. 141

తా. ఆంజనేయా! చిత్కళయను నది మనంబున దేదీప్యమానమైనట్టి యాకాశపంచకము యొక్క మధ్య తక్షణంబే కటికి చీకటిని నశింపజేయుటలో సూర్యునివలె ప్రకాశించెడి మెఱుపులసమూహమువలెను, మనోహరమైన రాత్రుల గంటికగపడు మిణుగురుల సమూహమునందుండు తేజముగలిగి, భయావహములైన కటికి చీకటులం గలుగజేయుచు నపరిమితంబగు నీలకాంతులుగల్గి జలభరితములైన మేఘకాంతులవలె ఇంద్రనీలములను మణులు, వైడూర్యములు ప్రవాళములు పద్మరాగములు ముత్యములు గోమేధికములు అనువాటిపోలిక గరుడపచ్చలు, వజ్రమణులు, కెంపులు బంగారము అనువాని కాంతులవలె గానబడును.

శా. చండాంశుప్రభ లుట్టిపడ్డగతి భాస్వచ్చిత్కళాకోటు లు
ద్దండస్ఫూర్తుల ఖండఖండములు నై తండోపతండంబు లై
నిండారం గనుపట్టు వెండియును హృన్నీరేజమధ్యాంచితా
ఖండాకాశపరంపరాంతరమునన్ గమ్యంబు లై యంతటన్. 142

తా. హృదయకమలమధ్య ప్రదేశమునం దొప్పుచున్న యఖండాకారమగు నాకాశపంచకముల యంతరంబున పొందదగినదై సూర్యకిరణములు హఠాత్తుగా గనబడినట్లధికముగా మెరయుచు తునుకలై తళతళలాడు చిత్కళాకోటులు గోచరించును.

జ్ఞానసూర్యోదయవర్ణనము.

సీ. తరుణబోధారుణోదయదీప్తి నజ్ఞాన
గురుతమమణ్ణ హృద్గుహల నడఁగ
ఫుల్లషడ్జలజాతములమీఁద నిక్కి హం
సము త్రివేణీసంగమమున మెలఁగ
విమలేంద్రియేందీవరము లెల్ల ముకుళింప
మన మను శశి సుఖవనధిఁ జాఱ
సలలితజ్ఞానవిజ్ఞానకోశంబు ల
న్యోన్యసంగతము లై యనఁగి పెనఁగ
తే. నాతతాజాండపిండాండజాతములను
బూని వెలిఁగించుఁ బటుతరస్ఫూర్తితోడ

ఘనతరాంతర్హృదాకాశమున వెలుంగు
మండితాఖండచిద్భానుమండలంబు. 143

తా. ఆంజనేయా! ఘనతరమగు దహరాకాశమున వెలుంగు శాంతిశమాదిగుణాలంకృతమై విభాగింపబడని జ్ఞానసూర్యుఁడు విజ్ఞానమను నరుణోదయకాంతిచే సవివేకమను గాఢాంధకారము మూఢులహృదయము లను గుహలందుడాఁగ, వికసించిన మూలాధారాది ఆరుకమలములమీదను నిక్కి ప్రణవాంగమగు హంసనామక పక్షి యిడాపింగళసుషున్నములనెడి గంగాయమునా సరస్వతులను త్రివేణీసంగమమగు ప్రయాగనలంకరింప ద్వైతవాదభ్రమచే శత్రువులగు 14 యింద్రియములనెడి నల్లకలువలు ముకుళింపగా మానసంబనియెడి చంద్రుడు బ్రహ్మానందమను సముద్రమున మునుగగా, మనోజ్ఞములగు వృత్తిజ్ఞానస్వరూపజ్ఞానము లను చక్రవాకమిధునమొండొంటితో గలిసికొనగ బ్రహ్మాండపిండాండముల సముదాయంబుల వెలిగించుచుండును.

ఆ. సకలకర్మలకును సాక్షియై స్వప్రకా
శతఁ దమోఘ్నుఁ డగుచుఁ జక్షురాది
కప్రవర్తకత్వగరిమభాసిలు సత్స్వ
భావుఁ డగుచుఁ జిద్విభావనుండు. 144

తా. జ్ఞానమను సూర్యుఁడు త్రికాలాబాధ్యమగు స్వపరప్రకాశస్వభావము గలవాఁడై నిత్యనైమిత్తికాదికములకు యింద్రియములకు అంతఃకరణసాక్షియై వృత్తులకు తన తేజముచే తమముహరించు (అజ్ఞానమును) చునేత్రాదీంద్రియములయొక్క అహంశ్రోతా మంతా అనునవి మొదలగు వ్యాపారములందు ప్రవర్తించునట్లు ప్రేరేచువాడను గౌరవముచే భాసిల్లుచుండును.

క. భ్రూమధ్యోదయశైలము
పై మొదలం దోఁచి యంతఁ బ్రవిమలహృదయ
వ్యోమారూఢుం డింద్రియ
తామరసానందకరుఁడు దానై వెలుఁగున్. 145

తా. పావనీ! జ్ఞానసూర్యుఁడు భ్రూమధ్యమను యుదయపర్వతముపై మొదట దోచి అంతట ప్రవిమలమగు హృదయాకాశము నధిరోహించి 14 యింద్రియములను పద్మముల సంతసింపజేయుచు దానెయై వెలుంగును

## మానసికస్నానవిధి.

సీ. అంతకు మున్నె నీ కపరోక్షవిజ్ఞాన
చక్షువుల్ దెఱచి యజ్ఞానమోహ
నాంగితాదాత్మ్యమూపాలింగనము మాని
చయ్యనఁ దను వన శయ్య డిగ్గి
చాపవైరాగ్యవిజ్ఞానోపరతులచే
మానసస్నానకర్మములఁ దీర్చి
యనిశంబు బుద్ధీంద్రియప్రేరకుం డెవ్వఁ
డాదేవ సవితృమహాప్రకాశ
తే. మెలమి నే నంచు లోచనాంబుజములచేత
ఘనతరానందబాష్పకార్ఘ్యంబు లిచ్చి
మొదల సందేహమందేహముఖవరప్ర
ణాశ మొనరించి యంతనానంద మలర. 146

తా. పావనీ! విజ్ఞానసూర్యోదయమునకు ముందుగానే అపరోక్షజ్ఞానమను జాగ్రదవస్థనుపొంది స్వస్వరూపానుసంధానమునకు నిరోధమైనదియు, మోహమును గలిగించునదియునగు అజ్ఞానమను స్త్రీని ఆలింగనముచేయుటమాని పంచకోశాత్మకమును, అష్టాంతరావేష్టితమును పిండబ్రహ్మాండ సంజ్ఞకమగు శరీరమే ఆత్మయను భ్రాంతినివదలి మానసిక జ్ఞానసరోవరములను యిడాపింగళాదులయందు స్నానమాచరించి మలత్రయమును బోగొట్టుకొని 14 యింద్రియములను తమతమవ్యాపారములందు వర్తించునట్లు చేయువాడును బ్రహ్మైక్యోపాధియగు యవిద్యనువీడిన కూటస్థుడునుఅగువాఁ డెవ్వడో ఆట్టి పరమాత్మయందు ప్రకాశించెడు అఖండమగు ఆనందమే ప్రధానరసముగా గలిగినట్టియు కార్యకారణాత్మకమగు ప్రపంచముయొక్క జననమరణనాశన, తిరోధాన అనుగ్రహముల గల్గించునట్టిదియును శ్రేష్ఠమైనదియు, అజ్ఞానములు నశింపజేయునదియును, అగు తేజము నేననితలంచి నేత్రములను దోయిళ్ళచే ఆనందజనితమగు బాష్పములచే నర్ఘ్యమిచ్చి సందేహాదులగు మందేహాదులగు రక్కసుల సంహరించి ఆనందబ్రహ్మము నొందుచుండగా, (ముందుపద్యముతో నన్వయము.)

క. మౌనజపము నిర్వృత్తి
ధ్యానముఁ గావించి యక్రియాత్మార్చనముం
బూని యొనరించి చిదఖం
డానందం బనుభవింపు మయ్య మహాత్మా. 147

తా. వాచికమానసికవ్యాపారరహితమగు స్వరూపచింతనమును కర్మేంద్రియవ్యాపారరహితమగు నాత్మార్చనను బాగుగనొనర్చి బ్రహ్మజ్ఞానముచే జనించిన సంపూర్ణమగు సుఖమనుభవింపుము.

తే. అఖండసుఖామృతావాప్తిఁ జెంది
చిత్తవిశ్రాంతితాంబూలసిద్ధిఁ గాంచి
మురిసియసమానమూర్తివై ముక్తికాంత
తోవినోదింపుమయ్య వాతూలతనయ. 148

తా. పావనీ! కాయికవాచికమానసికవ్యాపారరహితముగా పరిపూర్ణబ్రహ్మానందామృతమును పానముచేసి బ్రహ్మస్వరూపముగ బరిణమించుటనెడి తాంబూలచర్వణ మాచరించి (సున్నము వక్క ఆకులనెడి ద్రష్టృదర్శనద్రవ్యములనునవమలి) అత్యధికమగు సంతోషమొంది తనకు సాటిలేనట్టి యాకారము గలవాడవై ముక్తికాంతతో క్రీడింపుము.

జ్ఞానచంద్రోదయవర్ణనము.

సీ. కామాదిఖగముల గజిబిజు లడఁగ దే
హాభిమానాదిత్యుఁ డస్తమింప
సలయవిక్షేపకషాయరసాస్వాద
ధీంద్రియాబ్జములు నిద్రించుచుండ
విలసదాత్మాకారవృత్తి కైరవజాత
మింపొంది వికసింప నెఱుక మఱపు
లను చక్రయుగమున కతివియోగము గల్గ
ఖండవిజ్ఞాననక్షత్రతతుల

తే. తెలివి వెల్వలఁ బోవ నిర్మలమనశ్చ
కోరతృష్ణానలంబు చల్లాఱ నంత

సనితరముగ హృదాకాశమున వెలుంగు
మండితాఖండచిచ్చంద్రమండలంబు. 149

తా. కామక్రోధాదులనెడి పక్షులయొక్క కలకలధ్వనులు శాంతింపగను శరీరత్రయాద్యభిమానియగు జీవుఁడను భాస్కరుఁడు గ్రుంకగను శాంతాది వృత్తులగు ప్రాపంచిక వృత్తులు మూడింటితో గూడియుండుట, అంతఃకరణము స్వస్వరూపాలోకనమందును ప్రాపంచిక వ్యవహారములందు నిలువకయుండుట శబ్దాది తన్మాత్రరూపముగ పరిణమించి యుల్లసిలుట మున్నగు నీ యావరణాదులకు గల వృత్తులతోగూడిన 10 యింద్రియము లను పద్మములు ముకుళింపగను ఆత్మాకారమగు సాక్ష్యాది అఖండాకార వృత్త్యాత్మక కలువలు పుష్పింపగను, జ్ఞానాజ్ఞానము లను చక్రవాకమిధునము వియోగము గలుగునట్లుగను అద్వైతేతర చార్వాకాది మతసంబంధమగు భిన్నజ్ఞానాత్మక నక్షత్ర సమూహములు తెలతెల బారునట్లును స్వచ్ఛమగు అంతఃకరణ మను చకోర మాశయను వేడిమి శాంతింపగను సంపూర్ణమగు విజ్ఞాన మను చంద్రమండలము హృదయాకాశమున ప్రకాశించుచుండును.

## సలయవిక్షేపకషాయరసాస్వాదముల నిగ్ణయించుట.

## ముక్తికాంతాసమాగమము

వ. అయ్యవసరంబున సుషుమ్నాంతఃపురంబున నప్రమేయతురీయశయ్యాతలంబున హంసయానయు దుర్నిరీక్ష్యకళాభాసమానయు మూలాధారమంజీరయు స్వాధిష్ఠానకింకిణీసమన్విత మేఖలయు మణిపూరక కాంచీకలాపయు హృదయకీలితానాహతరత్నభూషితయుఁ గంఠవిభ్రాజితవిశుద్ధమంగళసూత్రాలంకృతయు భ్రూమధ్యప్రకాశమానసదమలద్విదళలాలాటికాశోభితయు సూర్యచంద్రమండలతాటంకయు గళవిరాజితయు ధగద్ధగాయమానసౌదామనీలతాశరీరిణియు శుద్ధసత్త్వదుకూలావృతయు సచ్చిదానందస్వరూపిణియు నైన ముక్తికాంత సుయోగజ్ఞానకరంబుల గాఢాలింగనంబు చేసి నానావిధప్రణవనాదంబు నను కంకణమేఖలామంజీరశింజితగళరవమణితాద్యారవంబులు చెలంగ విచారజనిత జ్ఞానానందరసమధురాధరామృతం బనుభవించుచుఁ బరమశమం బను చిఱుచెమట వొడమ నిర్నిద్రాతుద్రముద్రా

లక్ష్యదృగ్వచనమనోభావనాజ్ఞానంబుల నేకరూపంబు గావించి విత-తాపరిమితానుపమితపరమోపరతిసుఖరసికుండవు సమాత్మరతుండవు సంస్పృష్టాత్యంతమర్మస్థానుండవుసందర్శితానంతకలామండలుండవు ప్రగళితబిందుండవు నై యానందింపుము. 150

తా. అజ్ఞాన చంద్రోదయకాలమున అంతరహృదాకాశమునందు ప్రత్యక్షాది ప్రమాణముల కందరానిదై తురీయమైన తురీయమగు ఉన్మన్యవస్థ యనెడి పాన్పునై నుచ్ఛ్వాస నిశ్వాసములే గమనముగాగలదియు దిలకింప నలవికాని స్వప్రకాశ కళలచే దేజరిల్లునదియును మూలాధారమను అందెలుగలదియు స్వాధిష్ఠానమను చిరుగంటల యొడ్డాణముగలదియు, మణిపూరకమను ఒడ్డాణముగలదియు వక్షమున అనాహత చక్రమను మణిపతకముగలదియు కంఠమునవిశుద్ధ చక్రమను తాళిబొట్టుగలదియు, కనుబొమల మధ్య ఆజ్ఞాచక్రమను చేర్చుక్కగలదియు, ఇనశశిమండలముల నెడి కమ్మలజతగలదియు, తళతళలాడు మెరపుతీగవంటి శరీరముగలదియు, శుద్ధసాత్వికమను తెల్లని పట్టువస్త్రము ధరించినదియు, సచ్చిదానంద స్వరూపియునగు ముక్తికాంతను నిష్కామకర్మయోగము, రాజయోగములను చేతులతోడ నాలింగనముగావించి నానావిధ ప్రణవనాదములను హస్తకంకణములయొక్కయు ఒడ్డాణముయొక్కయు అందెలయొక్కయు ధ్వనులు సుసురతవేళ కంఠమునబుట్టు మణితమను ధ్వనియునతిశయింప నిత్యానిత్య వస్తువిమర్శనముచే జనించినదియు, బ్రహ్మజ్ఞానమందే గల్గినదియు ఆనందరసమనియెడి యధరామృతమును గ్రోలుచు మనోలయంబను చిరునెమ్మోము లుద్భవింప నెల్లపుడు వెలుంగునదియు న్యూనముగానిదియు, సచ్చిదానంద నిత్యనిర్మలత్వములను గురుతులచే నెఱుంగ దగినదియు నగు పరబ్రహ్మమునందు దృగ్వచనమనస్సులను యింద్రియములను యింద్రియముల వ్యాపారములనువానికి కారణమైన ప్రజ్ఞయును యేకముగావించి వ్యాప్తమైనదియు, అధికమైనదియు, అద్వితీయమైనదియు, నుత్తమమైనదియు, నగుచిత్తలయములవల్ల జనించిన సౌఖ్యమును నైకొన్నవాడవును, నీచోత్తమ మధ్యమమను భేదములులేనివాడవును, తాకబడిన గోప్యస్థానమగు పరమాకాశముగలవాడవును జారినబింద్వాత్మకమగు బుద్ధిగలవాడవునునై సంతసింపుము.

మహాభోగిలక్షణము.

ఆ. ఆత్మరతిని మరగి కే యంతంత కుపరతి
సుఖములను జెలంగి కేసురుచిరాత్మ

సమరతులను బొంది ౯ సంపూర్ణ కామత
రాజభోగి వగుము ౯ రాజయోగి. 151

తా. ఆంజనేయా! నీవు పరబ్రహ్మమునందు దనకభేదైక్యానుసంధానముచే గలుగు సుఖమనుభవించువాడవై క్రమమున నీవైన ప్రత్యగాత్మయందు పరమాత్మ అభేదముగ గూడియున్నదను పూర్ణబోధనమునఁగల్గు యానందమునుబొంది ప్రత్యగాత్మ పరమాత్మలకు భేదములేదను జ్ఞానమువలన యానందరస మగ్నుడవై నిరపేక్షాయుతుండవై మహాభోగము గలవాడవగుము.

ఆ. ఫాలమునను దృష్టి ౯ పైఁ గుండలీంద్రుండు
మస్తకమునఁ జంద్ర౯మండలంబు
నమర నమృతమయత౯హతధర్మ కామార్థ
పరుఁడవగుము త్రిపుర౯హరుఁడవగుచు. 152

తా. సూర్యచంద్రాగ్ని మండలములందు శుద్ధసత్త్వమందలి తేజస్సు సంబంధమైన దివ్యచక్షువును, ఆచక్షువుయొక్క అగ్రభాగమున శుద్ధసత్త్వమందలి తామసాంశమైన కాలసంజ్ఞగల ప్రణవకుండలి యను సర్పరాజును, సహస్రారచక్రమందు శశిమండలమును కలిగి త్రయావస్థలను త్రిపురములను దహించినవాడవై మోక్షస్వరూపుడ వగుటవలన ధర్మార్థ కామములందు ఆసక్తి లేనివాడవుకమ్ము.

చ. తొలుతనవాదికాలకృత ౯ దుఃష్కృతపుణ్యవిమిశ్రకర్మకో
టులను సముచ్చయంబులఁగ౯డున్నసితంబుగఁజేయుచుఁ సము
జ్జ్వలసదఖండచిద్వర సు౯వర్ణమయామలదివ్యవహ్నిమం
డలము వెలుంగు నంతటవి౯డంబితహృద్గగనాంతరంబునన్. 153

తా. పిమ్మట హృదయాకాశ మధ్యమందు ముందుగా నధికముగా ప్రకాశించునట్టిదియు ప్రసిద్ధమైనదియు విభాగింప బడనిదియు, జ్ఞానస్వరూపమైనదియు, నుత్తమమైనదియు, స్వర్ణమయమైనదియు, నిర్మలమైనదియు, అప్రాకృతమైనదియు నైన అగ్నిమండలము విశ్వనిర్మాణ సంకల్పకాలమునకు బూర్వము చేయబడిన పాపముల నిచ్చునట్టిదియును పుణ్యముల నిచ్చునట్టిదియు పుణ్యపాపముల నొసంగునట్టిదియు నగు కర్మసమూహములనునట్టి కట్టెలను భస్మము సేయుచు ప్రకాశించును.

మ. ఉరురాగాదిగుణాజసంఘము ననాద్యోంకారమంత్రంబుచే
త రయం బార వధించి ఆత్మవిషయేధ్మశ్రేణితోఁ గూడఁ జె
చ్చెర నానావిధవాసనాజ్యములతోఁ జిద్వహ్నిమధ్యంబునన్
వరుస వ్రేల్చి సౌఖ్యసోమరసపానం బంతఁ గావింపవే. 154

తా. అనంతరము కామాదిగుణసముదాయ మను మేకలగుంపును అనాదియగు ప్రణవమంత్రంబుచే శీఘ్రముగా వధించి మనంబుతో సంబంధించిన శబ్దాదివిషయము లనెడు కట్టెలతోడను లోకవాసన లను నట్టి ఆజ్యముతోడను విజ్ఞాగ్నిమధ్యమున విధియుక్తముగ హోమముజేసి హవిర్భాగమైనట్టి బ్రహ్మానంద మను సోమరసమును పానము సేయుము.

వాసనాత్రయము.

తే. అమ్మహోజ్జ్వలసూర్యసోమాగ్నిమధ్య
సీమయం దంతఁ గనుపట్టు శీతధామ
చండధామానలాత్మకాఖండధామ
మండలాదిహిరణ్మయమండలంబు. 155

తా. 10 కళలతో దేజరిల్లు యగ్నిమండలమే యాధారముగాగల యమృతకలశము సూర్యమండలము తన్మధ్యనుండు యమృతము చంద్రమండలము, ఆమండలత్రితయాత్మకమగు సంపూర్ణ తేజస్సుగల హిరణ్మయమండలము మండలములకు యుత్పత్తిస్థానమై మండలమధ్యమందు గాననగును.

వ. అది మఱియు. 156

సీ. మహనీయమై శాఖమధ్యాహ్న కాండసం
కలితమార్తాండమండలముపగిదిఁ
జారునిర్మలశరత్సమయరాకాసము
జ్జ్వలపూర్ణచంద్రమండలముపగిదిఁ
దప్తహేమాభిదీప్తజ్వాలికాజాల
విలయకాలాగ్నిమండలమురీతి
నీలతోయదమధ్యనిరతకమనీయ
వితతసౌదామనీలతికభాతి

తే. బరఁగి నీవారశూకంబుకరణి సూక్ష్మ
మై విమల మై యవర్ణ మై యప్రమేయ
మై యచింత్యప్రకాశమై యలరు చుండుఁ
జండరుచులహిరణ్మయమండలంబు. 157

తా. వైశాఖమాసపు మధ్యాహ్నకాలమందలి సూర్యమండలమువలెను శరదృతువునందలి పూర్ణిమాచంద్రమండలముతోను బంగారమువలె వెలుగుచున్న మంటలయొక్క సమూహముగల ప్రళయాగ్ని మండలమువలెను నల్లని మేఘములనుండి బయలు వెడలిన మెరుపుదీగెలవలెను వరిముంటికై వడిచిన్నదిగను నిర్మలముగను, అవర్ణమైనదిగను, ప్రత్యక్షాదులగు *ప్రమాణముల కగోచరమైనదిగను మనస్సుచే నూహింపరాని తేజస్సంపద గలదిగాను యుండెడు హిరణ్మయమండలము చూచుట కలవిగాని కాంతులచే ప్రకాశించును.

క. అది యాపోజ్యోతి యనం
గదలక ద్విదళమునఁ దనరుసకళ యామీఁదన్
మొదలిటివెలుంగు వెలుఁగు న
ల్లదెయాత్మారామతత్త్వ మగు ననిలసుతా. 158

తా. పావనీ! పరబ్రహ్మమనగా సమస్తజీవులయందును అంతర్యామిగా క్రీడించుచు నారాయణ నామముచే చలింపక ఆజ్ఞాచక్రమున ప్రకాశించు జ్ఞానకళాగ్రభాగమున సర్వకారణ నిష్కారణయుతమై వెలుంగు దివ్యతేజముగునది హిరణ్మయ మండలమని తెలియుము.

మత్తకోకిల. కోటిసూర్యులు కోటిచంద్రులు కోటికోటితటిల్లత
ల్పాటిగాఁ బరిపాటిగా నొకచోట నిల్చిన రీతి న
మ్మేటివెల్గుఁదగం ద్రికూటముమీఁదఁజూడుమదృశ్యముల్
దాటిమాయనుమాటిమాటికిఁ దాల్మిచేనటుమీటుచున్. 149

తా. నామరూపాదులుగల దృశ్యప్రపంచమును గడచి యపుడపుడు కారణోపాధియగు మాయను దూరముచేయుచు త్రివేణీ సంగమమును బొందినదై యొకప్రదేశమందే అనేక సూర్యచంద్ర మెరుపులయొక్క తేజములో తేజరిల్లు దివ్యతేజమును దిలకింపుము.

*ప్రమాణములు 8 విధములు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అనుపలబ్ధి, అర్థాపత్తి ఐతిహ్యము, సంభవము.

వ. ఇట్లు భ్రూమధ్యవీథియందలి హృదయాకాశంబునం గనుపించు వియన్మండల తమోమండల మేఘమండల విద్యున్మండల తారామండల జ్యోతిర్మండల సూర్యమండల చంద్రమండల వహ్నిమండల హిరణ్మయమండలంబు లను దశవిధమండలంబులును బూర్వోక్తదశవిధనాదంబులును వక్ష్యమాణ బిందుకోశాత్మత హంసతత్త్వంబును మహాకాశమధ్యంబునం గనుపించు జీమూతంబులచందంబున నెవ్వని యందుఁ దోఁచు ననిలాదిభూతచతుష్టయంబునఁ దత్కార్యంబున నంటనిమింటిపగిది నిన్నింటి నెవ్వం డంటకుండు నాదిత్యుం డఖిల రూపంబులఁ బ్రకాశింపంజేయుకైవడి నెవ్వండు చిన్మాత్రుండై యిన్నింటి వేర్వేఱ విభజించి యెఱుంగునతండ యీ బిందు నాద కళాతీత స్వప్రకాశ నిత్య శుద్ధ బుద్ధముక్త పరిపూర్ణ సచ్చిదానందస్వరూప ప్రత్యగభిన్న పరమాత్మారాముం డగు విశుద్ధసత్త్వప్రధానయుఁ బరమవైరాగ్యబోధోపరతిస్వరూపిణియు బిందు నాద కళాత్మకయుఁ గేవల బ్రహ్మాత్మైక్యవిద్యామయయు నైన న న్నాశ్రయించి యద్వితీయాపరోక్ష బ్రహ్మచైతన్యస్వరూపకుం డైన యీ యాత్మారామునియం దాత్మాకారాకారిత వృత్తిగతచిదాభాసకుండవైన నీవు ప్రచండాతపమధ్యనిక్షిప్తదీపకలికవిధంబున జ్ఞానకర్మేంద్రియపవనమనోవృత్తివిలయపూర్వకంబుగా నేకీభూతుండవై నివాతదీపంబుభంగి నిస్తరంగసముద్రంబుపోలిక విగతాశేషపర్ణపాదపంబుచాడ్పున నీలపీతాదివర్ణశూన్యగగనంబుకరణి స్వప్నజ్ఞానపునరుత్థానవిరహితసుషుప్తిరీతి నిశ్చలుండవు నిశ్శేషుండవు నిశ్శబ్దుండవు నిర్వికల్ప నిరాకార సుఖస్వరూపుండవు నై బాహ్యాభ్యంతరములు మఱచి నిరుపమరాజయోగతురీయసమాధిం బొందు మని యుపదేశించి వెండియు ని ట్లనియె. 160

తా. ఇట్లు కనుబొమలనడిమత్రోవను హృదయాకాశ మొకటియుండెనం దాకాశాది 10 మండలములును ప్రకాశించుచుండుట కాననగును. మరియు దశవిధ ప్రణవధ్వనులు శివశక్తి యుక్తమగు మనస్సనెడు జీవతత్త్వమును గోచరించునదై మహదాకాశమధ్యగాన్పించు మేఘములవలె యేపరమాత్మయందు గాన్పించునోయట్టి నాలుగుభూతములుగల పృథ్వీజలాదులును వాటికార్యములును ఘటపటాదులను తాకక యాకాశమువలె హిరణ్మయాదులైన యన్నిటి నేపరమాత్మ యంటకుండునో భాస్కరాదులు ప్రకాశించునట్లు విజ్ఞానస్వరూపకుఁడై పైన జెప్పినవానిని ప్రత్యేకముగా వివరించి తెలియునో యా పురుషుఁడే నాదబిందు కళలకంటె భిన్నమగు విశేషలక్షణములు గలవాడును స్వయం జ్యోతియు నిత్యుండు మలరహితుండును సర్వజ్ఞుడును ప్రకృతి నతిక్రమించినవాడును అవిచ్ఛిన్నస్వరూపుడును జ్ఞానానందస్వరూపియునైన ప్రత్యగాత్మకంటె నభేద్యుఁడుగాని యాత్మారాముడె పరమాత్మ. సత్త్వరజస్తమో గుణాతీతమగు అర్ధమాత్రాది శబ్దంబులచే బరగువిజ్ఞాన ప్రకృతిస్వరూపమే ప్రధానముగాగలదియు, నుత్తమమగు యిహపరలోక భోగవిరక్తియు, విజ్ఞాన తన్మయత్వములే స్వరూపముగాగలదియు, అకారఉకార మకారాత్మకమగు బిందుకళలే స్వరూపముగా గలదియు (అనగా ప్రణవస్వరూపియు,) ప్రత్యగాత్మ పరమాత్మల కైక్యానుసంధానము గలుగజేసెడు జ్ఞానస్వరూపియును నైన తన్నాశ్రయించి తనకంటె వేరువస్తువు లేనట్టి పరబ్రహ్మమునందు శుద్ధజీవుడవైన నీవు తీక్ష్ణాతపమం దుంచబడిన దీపపుమొగ్గవలె కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకు, 5 వాయువులకు, వృత్తులకు లయము కలుగునట్లుగా నేకస్వరూపుడవై ౯ మారుతములేనిదీపమువలె చలనములేనివాడవు, అలలులేని సముద్రమువలె నుండువాడవు ఆకులులేనిచెట్టువలె నిశ్శేషుడవు వర్ణములేని గగనమువలె యాకారరహితుడవై బ్రహ్మానందస్వరూపుడవై బహిరింద్రియ దృశ్యములగు తనకంటె నితరములగు వస్తువులయొక్క నామరూపములను అంతరింద్రియములకు గోచరించు క్రోధాదిరూపములను మరచి సాటిలేని రాజయోగ, నిర్వికల్పసమాధిని పొందుము. అనిబల్కి మరియు నిట్లు జెప్పెను.

ఆ. అట్టి పూర్ణసమాధి మనోనిలముల
చలన ముడుగక కాని గోచరము గాదు
అవియ బిందువు చాంచల్యా మడఁగ కున్న
నిశ్చలంబులు గావు వినిశ్చితాత్మ. 161

తా. ఆంజనేయా! నిర్వికల్పసమాధి పొందవలెనన్న మనస్సును ప్రాణాపానాదివాయువులను చలించకుండునట్లు బంధింపవలయును. అట్లు బంధించుటవలన మనస్సు ప్రాణములు బుద్ధిచాంచల్యము నుడుగకున్న గా నేరదు.

హంసతత్త్వోపదేశము.

తే. అట్టి బిందువు చాంచల్య ◌ మడఁగ దెందు
హంసతత్త్వంబు నెఱుఁగక ◌యట్లు గాన
దానివివరింతు విను మది◌ గానఁబడిన
గాలి బిందువు మనమును ◌ గదల కుండు. 162

తా. ఏయోగముచే నైన ప్రకృతి పురుషాత్మకమగు హంసయొక్క నిజస్వరూపము దెలియనిదే బుద్ధిచలనము నశించదు. హంసతత్త్వము దెలిసినమనస్సు ప్రాణవాయువులు కదలకుండునుగాన హంసతత్త్వము దెలిపెద నాలింపుము.

తే. కంజపుంజానుగతసౌఖ్య◌గతుల మెఱసి
యాతతబ్రహ్మసంస్థాన ◌ మగుచు లలిత
మానసానందకర మై స◌మత్వ మమర
సత్యరతి నొప్పు నీహంస◌చక్ర మనఘ. 163

తా. పావనీ! ఆత్మ హకారసంజ్ఞగలవాఁడు, పరమాత్మ శక్తికి సకారచంద్రుడు. ఇట్టిహకారసకార విశిష్టమగుదానికే హంసస్వరూపుడని పేరు. ఈ హంసచక్రమున సద్బుద్ధి ఆకలి నిద్రాదులకు ఆధారములగు 8 దళములు 8 దిక్కుల నున్నవి. అట్టి యీ హంసచక్రము షట్కమలములను పొందుటచే గలుగు సౌఖ్యములచే ప్రకాశించి సర్వత్ర వ్యాపించియుండు బ్రహ్మమునందు నివసించి మనంబునకు సంతసము గలుగజేయునదై బ్రహ్మముతో నైక్యముజెంది ప్రకాశించును.

ఆ. వినుము పాలు నీళ్లు ◌ విభజింప నేర్చిన
పరమహంసపగిదిఁ ◌ బ్రవిదితాద్య
పరమహంసుఁ డైన ◌ పరమహంసుఁ డసార
సారములను బంపఁ◌జాలు ననఘ. 164

తా. పావనీ! క్షీరముతోఁగలసిన నీటినుండి క్షీరమును విడదీయ నేర్చిన హంసమువలె ప్రపంచోత్పత్తి స్థితిలయాదులకు, కారణభూతుడగు పరబ్రహ్మస్వరూపము గలవాఁడు నిస్సారమైన ప్రపంచమునుండి ప్రపంచవిలక్షణుఁడగు పరమాత్మను విభజింపనేర్చును.

తే. చటులసంసారదుఃఖనా◌శనకరంబు
హంసతత్త్వార్థవిజ్ఞాన ◌ మతిరహస్య

మట్లు గావునఁ జెప్పెద నే నవధరింపు
పరమభాగవతోత్తమ భక్తవరద. 165

తా. పావనీ! పరమాత్మస్వరూపమగు హంసయొక్క నిజమైన శబ్దార్థము నెవ డెఱుంగుచున్నాఁడో అట్టివాఁడు సంసారమునుండి తొలగింపబడుచున్నాడు. అట్టి దుఃఖములుపోఁగొట్టినట్టి హంసతత్త్వార్థజ్ఞానమును నీకు దెలిపెదను వినుమనియెను.

శరీరగతములగునిడాపింగళాదులవివేచనము.

వ. మాతృపితృభుక్తాన్నసంభూతరక్తశుక్లబిందుజనితంబై త్వఙ్మాంసరుధిరమజ్జాస్థిస్నాయువు లను షట్కౌశికంబులు గలిగి యొప్పు నీస్థూలశరీరంబునందు డెబ్బదిరెండు వేలనాడులు గల వందు గుదంబునకంటె రెండంగుళంబులమీఁదట లింగంబునకంటె రెండంగుళంబులక్రిందట నధోముఖాగ్రంబై మూఁడుకోణంబులు దనర దేహమధ్యమస్థానంబున మూలాధారచక్రం బలరు నదిమొదలు సహస్రారంబుతుదగాఁ బృష్ఠభాగంబున వీణాదండంబుభంగి సమస్తనాడికామూలకందంబై మూలోర్ధ్వచ్ఛిన్నవంశాభంబై షడాధారసమన్వితంబై యుండు దీర్ఘాస్థి బ్రహ్మదండి యనంబరఁగు నాబ్రహ్మదండిమూలాధారాగ్రకోణస్థమై కుండలీనామపరాశక్తియుక్తమై ప్రాణాగ్నిబిందునాదనిలయమై సావిత్రీసరస్వతీనామికమై బ్రహ్మరంధ్రగతమై సుషుమ్నానాడిప్రవర్తిల్లు దద్వామదక్షిణపార్శ్వంబులయం దాధారంబు మొదలుకొని నాసికాగ్రపర్యంతంబువ్యాపించి నాడీచక్రసంస్యూతలై పితృయాన దేవయాన లనెడు సంజ్ఞికలై చంద్రసూర్యమండలంబులం బొంది యిడాపింగళ లను నాడు లొప్పుచుండు నది నాభిమండలంబు నాశ్రయించి కుక్కుటాండంబువిధంబున నాడీచక్రం బమరు నానాడిక లన్నాడీచక్రసముదిత లట్లు గావున గాంధారి హస్తిజిహ్వ యను నాడులు నేత్రాంతవ్యాపినులు పూషాలంపూషానాడులు కర్ణద్వయానుగతులు శుక్లాఖ్యనాడి భ్రూమధ్యంబు నొందు

ఘ్రాణరంధ్రయుగ్మంబు శ్రోత్రరంధ్రయుగ్మంబు భ్రూమధ్యంబు దిగువం గలసి యుండు నచ్చోటు శృంగాటకంబు చతుష్పథం బని విలసిల్లు గంగా యమునా సరస్వతులను పేళ్లు గల యిడా పింగళా సుషుమ్నలు గూడిన భ్రూమధ్యస్థానంబు త్రికూటం బనఁ ద్రివేణీసంగమం బనం దగు వాక్ప్రసారిణి యైన సరస్వతీనాడి జిహ్వాంతగామిని యగు విశ్వోదరీనాడి చతుర్విధాన్నంబుల భక్షించుఁ గంఠస్థ యైన పయస్వినీనాడి క్షుత్తృష్ణల నొదవించుచు జలపానం బాచరించి మఱియు నాడీచక్రసముద్భూత లైన మూఁడునాడు లధోముఖులై యుండు నందు రక్తాహ్వయనాడి శుక్లంబును సినీవాలీనాడి మూత్రంబును గుహూనాడి మలంబును బహిర్గతంబుగఁ జేయు శంఖినీ దామినీనాడులు భక్షితాన్నరసంబుల గ్రహించి కపాలకుహరంబు నొంది శిరంబున నమృతంబు గావించు నదియునుం గాక హృదయంబున నేకోత్తరశతనాడులు దనర్చు నం దొక్కనాడి యూర్ధ్వగామిని యగు నన్నాడి మార్గంబు మోక్షమార్గం బని వేదాంతంబులు పలుకు నిట్లు వివరించి చెప్పిన వెల్ల ముఖ్యనాడులు వీనిలో నిడా పింగళా సుషుమ్నలు శ్రేష్ఠనాడు లందు బ్రహ్మనాడి సకలనాడికాశిరోమణి యగు నిత్తెఱంగునం దిర్యగూర్ధ్వాధఃప్రసృత లై పరమ సుషిరప్రధాన లైన ద్విసప్తతీసహస్రనాడులయందుఁ జలన ధావన కంప నాకుంచన శోషణ ధర్మకంబులైన దశవిధప్రాణంబులు మెలంగు నందు హృదయస్థానంబున వసియించి ప్రాణుం డిడాపింగళాఖ్యనాడికారంధ్రద్వయంబువలన నుచ్ఛ్వాసరూపంబుచేత బాహ్యంబునకు నిర్గమించి ద్వాదశాంగుళ పర్యంతం బరుదెంచి యచ్చట నడంగు గుదస్థానంబునందుండి యపానుండు నిశ్శ్వాసరూపంబుచేతఁ బ్రాణునకధోముఖంబుగా నెదురునడుచుచు నధోముఖనాడీత్రితయంబువలన మలమూత్రశుక్లంబుల వెడలించుచుండుఁ గంఠదేశంబున వసించి

యుదానుండు మనంబునందలి సంకల్పవికల్పంబుల జిహ్వాద్యష్టస్థానంబులవలన శబ్దరూపంబుగాఁ బలికించుచు సుషుప్త్యవసరంబున సకలేంద్రియంబుల సంగ్రహించి యుపశమింపఁజేయుచుఁ బ్రబోధసమయంబున వానినెల్ల నెప్పటిచోట్ల నుంచుచు మఱియు లోకాంతరగమనాగమనంబుల సమర్థుండై యొప్పుచు నగ్నిష్టోమమయుండై సుషుమ్నారంధ్రంబు నాశ్రయించి బ్రహ్మరంధ్రంబున కుద్గమించుచుండు సర్వశరీరంబున వ్యాపించి వ్యానుండు బాహ్యశీతోష్ణంబుల నభ్యంతరంబునకు నాంతరశీతోష్ణంబుల బాహ్యంబున కిచ్చుచు భక్షితాన్నరసంబు నంతటఁ బ్రసరింపఁజేయు చుండు నాభిస్థానస్థితుం డగు సమానుండు జఠరానలంబుఁ బ్రజ్వలింపంజేసి ప్రాణ్యుపభుక్తచతుర్విధాన్నంబులం బచనంబు చేసి యెల్లనాడులకుం బంచిపెట్టు నాగుఁడుద్గారంబుఁ గూర్ముఁ డున్మీలనంబుఁ గృకరుండు క్షుతంబు దేవదత్తుఁడు విజృంభణంబు సర్వవ్యాపి యైన ధనంజయుండు మృతం బైన విడువక దేహస్థాల్యంబుఁ బుట్టించుచుండు నిటుల దశవాయువులతోఁ గూడి యాదశేంద్రియాన్వితం బై కామ రాగద్వేషాది వికారసహితం బై విషయసుఖగ్రహణంబు కొఱకు నధోముఖం బై శ్రవణేంద్రియంబువలన ద్వివిధశబ్దంబులఁ ద్వగింద్రియంబువలనఁ బంచవిధస్పర్శంబుల నేత్రేంద్రియంబువలన షడ్వర్ణంబుల జిహ్వేంద్రియంబువలన షడ్విధరసంబులు ఘ్రాణేంద్రియంబువలనఁ ద్రివిధగంధంబుల ననుభవించుచు వెండియు వాక్పాణి పాదపాయూపస్థలతోడం గూడి వచ నాదాన గమన విసర్గానందకర్మంబుల నొనర్చుచు మనంబు ప్రవర్తించుచుండు నమ్మనంబుఁ గరణంబుగాఁ గైకొని తత్పవన మనోగ్రస్థితయుఁ గర్తృత్వభోక్తృత్వాదిధర్మసమేతయు నైనబుద్ధి విలసిల్లు నదియె బిందువనంబరఁగు నది సర్వకార్య కారణాశ్రయయు నిఖిలవాసనావాసితయు నగుం గావున నమ్మానసమారుతేంద్రియశరీరంబులతోఁ గూడి విషయాభి

ముఖమైతచ్చాంచల్యంబువలనఁ దానుం జలించుచు బహిరంతర్విష యానుభవంబు చేయుచు సుషుప్తియం దజ్ఞానాకారం బగుచు జాగ్రత్స్వప్నంబులయందు బుద్ధ్యాద్యాకారంబై తోఁచుచు ననాదికాలంబు ననుండి ముక్తిపర్యంతం బనంతకర్మంబు లాచరించుచు సవిచారరూపిణియై నిరంతరపర్యటనశీలయై యుండు మఱియును.

తా. ఆంజనేయా! తల్లిదండ్రులచే భుజింపబడిన అన్నముమున్నగు వానిచే జనించిన శోణితశుక్లముల చేరికవలన నుత్పత్తియైన స్థూలశరీరమునందు- (మాంసాస్థి చర్మాది షట్కోశములుగలది) డెబ్బదిరెండువేల నాడులుగలవు. అందు గుదస్థానమునకు రెండంగుళములకుపైన లింగమునకు రెండంగుళములు క్రిందిభాగము శరీర మధ్యభాగము. అందు గుదమునకు క్రిందువైపుగనుండు నట్టిదియు, మూడుకోణములుగలదియునగు మూలాధారచక్రంబుగలదు. మూలాధారము మొదలు సహస్రారమువఱకు వీపుతట్టున వీణాదండము తంతులకెట్లు మూలమైయున్నదో యట్లే సమస్తనాడులకును మూలమై పైనను క్రిందను నరుకబడిన వెదురువలె షడాధారచక్రములతో గూడుకొని బ్రహ్మదండియను నొకపెద్ద యెముకగలదు. ఆయెముకగలదు. ఆయెముక మొదటనున్న మూలాధారచక్రముయొక్క మధ్యమకోణమునందు కుండలియను పేరుగల పరాశక్తియుతమైనదియును ప్రాణవాయువు ప్రణవము జఠరాగ్ని బుద్ధి యీనాల్గింటికి స్థానమైనదియు బ్రహ్మరంధ్రమును పొందునదియునై సావిత్రి సరస్వతియను పేరులనొప్పు బ్రహ్మనాడి పరగుచుండును. బ్రహ్మనాడి యెడమ కుడిప్రక్కలను మూలాధార మాది నాసికాగ్రమువఱకునాడీచక్రముతో గలసినవియు పితృయాన దేవయానలను పేళ్ళుగలదియును సూర్యచంద్రమండలములను పొందినదియునై యిడాపింగళనాడులు సంచరించుచుండును. నాడీచక్రము పొక్కిలి నాశ్రయించి కోడిగ్రుడ్డువలె నుండును. ఇడాపింగళలలీనాడీచక్రమున పుట్టినవి. కన్నుల చివురవఱకు గాంధారి, హస్తి, జిహ్వాయనునాడులు వ్యాపించియుండును. పూషఅలంపూషయను నాడులు చెవులవఱకు వ్యాపించియుండును. కనుబొమలమధ్య శుక్లయను నాడియుండును. నాసికారంధ్రములును, చెవిరంధ్రములును కనుబొమలమధ్య కలియును ఆస్థలమునకు శృంగాటకము లేకచతుష్పథమనిపేరు. గంగ, యమున, సరస్వతీయను పేర్లు గల యిడాపింగళ సుషుమ్నా నాడులుకలియు కనుబొమలమధ్య స్థానమునకు త్రికూటము లేక త్రివేణీసంగమమందురు. సరస్వతియనునాడి నాలుకతుదివరకు వ్యాపించియుండును విశ్వోదరియనునాడి 4 విధముల భక్ష్యభోజ్యముల భుజింపజేయును. పయస్వినీనాడి ఆకలిదప్పుల కలిగించును. నాడీచక్రమునబుట్టిన రక్తసినీవాలీకుహూయనునాడులు క్రిందకు

వ్యాపించి రేతస్సు, మూత్రము, మలముల నుక్రమముగ వెలిక్రిఁద్రోయును. శంఖిని దామిని యను నాడులు భుజింపబడినయన్న సారమును బ్రహ్మరంధ్రమును జేర్చి యమృతమును కలిగించును. ఇవిగాక యనాహతచక్రమున 101 నాడులు ప్రకాశించుచుండును. అంద మృతనాడి చిదాకాశమును బొందును. దానికే మోక్షమార్గమనియు, కైవల్యమార్గమనియు నందురు. ఈచెప్పిననాడులు ముఖ్యములు. వీనిలో యిడాపింగళ సుషుమ్నలు శ్రేష్టములు, ఇందుసుషుమ్ననాడికాశిరోమణి యనబడును. ఇవ్విధమున నూర్ధ్వముగను క్రిందుగ నువ్యాపించిన 72000 నాడులయందు చలించుట, పరుగెత్తుట, మున్నగునవియే స్వభావములుగా గలిగిన ప్రాణాపానాదికములగు దశవిధప్రాణములు సంచరించుచుండును. అందు ప్రకర్షముగా శ్వాసాదులను బయలువెడలించునది ప్రాణవాయువు. ఈవాయువు వక్షస్థలమునుండి ఇడాపింగళనాడుల రంధ్రములనుండి ఉచ్ఛ్వాసరూపముచే వెలికరుదెంచి 12 అంగుళములవరకు వచ్చి యచటులయించును. అపానమువలన నిశ్శ్వాసను చేయబడు చున్నది. ఇది గుదస్థానమునుండి అధిష్ఠానదేవతచే ప్రేరేపింపబడి అధోముఖముగా సంచరించుచు ఆయానాడులచే మలమూత్రశుక్లముల విసర్జింపజేయును. ఉదానమూర్ధ్వమునకు శబ్దముల దెచ్చునది, కంఠము వాసస్థానము, అధిష్ఠానదేవతయగు నజునిచే మనస్సునగల్గు సంకల్పవికల్పాదికములను నాలుకాది యష్టస్థానములయందు ధ్వని రూపముగా బలికించుచు సుషుప్తియందు సమస్తేంద్రియములను నుపసంహరించి తనకు కారణమైన అజ్ఞానమున లయించును జాగ్రతయం దింద్రియములను ఆయాస్థానముల నిల్పుచు నంత్యమున సర్వేంద్రియముల గ్రహించి లోకాంతరమునకుబోవ దగుసామర్థ్యముగల్గి తేజస్సుగల్గి సుషుమ్నాద్వారమున బ్రహ్మరంధ్రమునకుబోవును. శరీరసంతతమునుండునది వ్యానము ఇది విశ్వయోనియను యధిష్ఠానునిచే ప్రేరేపింపబడి లోపలివేడిమిని చల్లదనమును బయటికి దెచ్చును వెలుపలి శీతోష్ణములను లోనికి గొనిపోవుచు భుజింపబడిన యాహారము యొక్క సారమును శరీరమంతటను వ్యాపింపజేయుచుండును. సమానవాయువు నాభీప్రదేశమున వసించి యధిష్ఠానదేవతయగు జయునిచే ప్రేరేపింపబడి జఠరాగ్నిని ప్రజ్వలితమొనర్చి ఆహారమును పక్వముచేసి 72000 నాడులకు పంచిపెట్టును. నాగవాయువు మననమును కలిగించును. కూర్మవాయువు కంటిరెప్పల దెరపించుట మూయించుట జేయును కృకరవాయువు తుమ్ములకలుగజేయును. దేవదత్త మావలింతలగల్గించును. సర్వవ్యాపియగు ధనంజయవాయువు చచ్చినను విడువక దేహమంతటనువ్యాపించి శరీరమును వృద్ధిపరచు చుండును. మనస్సు 10 వాయువులతోగూడినదియు 10 యింద్రియములతో జేరినదియు కామాది వికారములుగలదియు శబ్దాదులవలనగల్గు ఆనందమును అనుభవించుటకుగాని ప్రపంచవ్యాపారముగలదియునై శ్రోత్రేంద్రియమువలన ధ్వన్యాత్మక వర్ణాత్మక శబ్దములు

స్ను- చర్మముచే మృదుకఠినాది అయిదువిధస్పర్శలును, కనులవలన షడ్వర్ణములనున్ను రసనేంద్రియమున షడ్రసములున్ను ముక్కువలన మూడువిధములగు గంధములనున్ను యనుభవించునదియై వాక్పాణిపాదపాయూపస్థలతోఁగూడి సుశబ్దాపశబ్దములు దానాదానాదులు నడచుట మొదలగు గమనములు మూత్రవిసర్జనములు మున్నగు కర్మలజేయుచు ప్రకాశించును. మనస్సు సాధనముగాజేసికొని ప్రాణవాయువుయొక్కయు మనస్సుయొక్కయు అగ్రమందున్నదియు, కర్తృత్వభోక్తృత్వాది స్వభావములతో విలసిల్లు బుద్ధియే బిందువనబడును. ఆబిందువు అన్నివిషయేంద్రియముల కాధారమై, అన్నికోరికలందు వసించునదియు, మనంబుతోడను పంచవాయువులతోడను మూడుశరీరములతోడగు, .గూడినదై, యావిషయలోలతవలన బిందురూపకమగు బుద్ధియు చలించుచుండును. బాహ్యేంద్రియ కర్మేంద్రియములయొక్కయు అంతఃకరణముల యొక్కయు శబ్దస్పర్శాది కర్తృత్వములయొక్క అనుభవ మనుభవించుచు నిద్రయందు జడస్వభావముగలదియు, జాగ్రత్స్వప్నముల అహంకార చతుష్టయరూపముగ గనబడుచు ప్రపంచనిర్మాణమునందు కోరికజనింపని కాలమునందుండి కైవల్యప్రాప్తి గలుగునంతవఱకు పుణ్యపాపకర్మముల జేయుచున్నదియును ఆకర్మానుగుణ్యములగు నైహికాముష్మికముల ననుభవించునదియును బ్రహ్మజ్ఞానకారణమైన జీవేశ్వర జగద్విచారములేనిదియును యెల్లపుడును సంచరించు స్వభావముగలదియునై నివసించుచుండును.

నాదబిందుకళావివరణము.

క. ప్రతనుప్రాణమనోగ్ర
స్థితబుద్ధియె బిందు వండ్రు గె జెలఁగెడి యాత్మ
ప్రతిబింబమె కళ పవనో
న్నతఘోషమె సుమ్ము ప్రణవనాదము వత్సా. 167

తా. ఆంజనేయా! బిందువనగా స్థూలశరీరమందుండు ప్రాణవాయువు మనస్సువీటియగ్రభాగముననున్నట్టి నిశ్చయాత్మకమగు విజ్ఞానమే. ఆబిందుస్వరూప విజ్ఞానమయకోశమునందు ప్రకాశించు పరమాత్మయొక్క ప్రతిబింబమే కళయనంబడును. ప్రాణాది వాయువుల విశేషమే ఓంకారమనబడును.

క. ఆ నాదబిందుకళలం
గానంబడు చుండువానిఁ గను పురుషుఁడె ప్ర

జ్ఞానఘనుఁ డైన రాముఁడు
నానావిధతత్త్వములకు నాథుఁడు పుత్త్రా. 168

తా. నాదబిందువుయొక్క కళయందుగాన్పించు జీవుని దిలకించువాడే అనుభవముచే గల్గినజ్ఞానమందధికుఁడైన శ్రీరామపరబ్రహ్మము. ఈపరబ్రహ్మమే 36 తత్త్వములకును ప్రభువు.

సీ. అట్టి శ్రీరామతత్త్వాభాసకళతోడ
నెనసిన యాబిందు వెల్లబొద్దు
మార్తాండచంద్రాగ్నిమండలాన్వితసూక్ష్మ
చతురగ్రమునకు సరి నధోము
ఖంబుగా నున్న హృత్కమలంబుతో బహి
ర్ముఖ మై స్వవిషయానుభూతిఁ దగిలి
మానక పవమానమానసేంద్రియదేహ
సంగతి నూరక సంచరించు

తే. నట్లు గావున దశనాడికాంతరస్థ
దశవిధేంద్రియపవనచిత్తముల నెల్ల
హంసతత్త్వానుభవమున నడఁచినిలిపి
యచలముగఁ జేయుమంతట నాంజనేయా. 169

తా. ఆంజనేయా! బ్రహ్మవిద్యానాయకుండగు పరమాత్మయొక్క జీవకళతోడ గలసిన అంతఃకరణ మెల్లపుడును ఇనశశివహ్ని మండలము లతో గలసినదియును, జ్ఞాననేత్రమునకు సరిగా క్రిందిముఖముగలదియు, మనస్సనుపద్మముతో ప్రపంచమువైపునకు తిరిగినదియును, ఆత్మసంబంధమైన స్పర్శాదికములనుభవించునదియునునై ప్రాణాది దశవాయువులతోడను జ్ఞానేంద్రియములతోడను కర్మేంద్రియములతోడను, స్థూలసూక్ష్మకారణశరీరములతోడను గూడి సంచరించుచుండును. కనుక పదినాడులయొక్క మధ్యనుండు పదివిధములగు యింద్రియములను దశవిధవాయువులను మనస్సుమున్నగువానిని లోబరచుకొని యావిధముగా సంచరించెడు యంతఃకరణమును కదలకుండ జేయవలయును.

ఆ. ఇంద్రియముల నిగ్రహించి ప్రాణములతో
మానసమును కూర్చి వానితోడ
హంస యనఁగ నొప్ప నక్షరద్వయము యో
జించి సంతతము భజింపవలయు. 170

తా. పావనీ! ఇంద్రియములనుజయించి మనస్సును ప్రాణములతోఁగలిపి, అట్టి చిత్తముతోఁగూడిన ప్రాణముతో పురుష ప్రకృతిమయములగు హకారసకారములను బిందువుతోఁజేర్చి యెల్లపుడు భజించుచుండుము.

వ. అది యెట్లంటేని. 171

సీ. అనిశంబు పద్మాసనాసీనుఁ డై చూపు
లమరంగ నాసికాగ్రమున నిలిపి
యింద్రియంబుల నెల్ల నిట్టట్టు వోనీక
మదిచేతఁ దిరముగాఁ గుదియఁబట్టి
ప్రాణాదిదశవిధపవనంబులను వికా
రము లంటకుండఁ జొక్కముగ నునిచి
కామరాగాదిసంకల్పవర్ణనముగా
స్వాంతంబు నరసి నిశ్చలము చేసి

తే. యనిలమానసములతోడ హంసమంత్ర
మమరఁగూర్చి జపించుచునంతమీద
హృదయనభమున బిందువు గదలకుండఁ
బెంపుగా నాదకళల వీక్షింపవలయు. 172

తా. ఎల్లపుడును పద్మాసనమున గూర్చుండి చూడ్కులను ముక్కుకొననిల్పి దశవిధములగు నింద్రియములను యిటునటు చెదరనీయక మనస్సుచే చిక్కబట్టి ప్రాణాదులగు 10 విధవాయువులను చలనాదివికారములు పొందకుండ గావించి కామరాగాదుల యెడతలంపు లేకుండజేసి మనస్సునుశోధించి ప్రాణవాయువు మనస్సులతో హంసమంత్ర జపము సేయుచు హృదయాకాశమునందు బుద్ధినిల్పి చెదరనీయక ఓంకారనాదకళలను దిలకింపవలయును.

హంసశబ్దార్థవిచారము.

ఆ. నాదబిందుకళల కాదిమై ద్రష్టయై
సర్వదృశ్యములకు సాక్షి యగుచుఁ
జిత్స్వరూప మైన శ్రీరామతత్త్వ మా
నమల మగు హకార మాంజనేయ. 173

తా. జ్ఞానస్వరూపమైనదియు, బ్రహ్మవిద్యాయుక్తమైనదియునగు పరబ్రహ్మము నాదము, బిందువు కళవీటికి చూచునదిగను వీనిచే బుట్టిన జీవేశ్వర జగత్తులకు సాక్షిగను యుండెడిది హకారమగును.

తే. మహిత దేహేంద్రియప్రాణమానసాది
దృశ్యరూపిణియును జడాత్మికయుఁ ద్రిగుణ
కలితయు ననాదియు మహావికారి యైన
ప్రకృతి యగును సకారంబు పరమపురుష. 174

తా. శరీరేంద్రియములను ఆకారముగాగలదియు, అజ్ఞానమే స్వరూపముగా గలదియును, త్రిగుణయుతమైనదియును, అనాదియైనదియును షడ్భావవికారరహితమైనదియును యైనదిసకారమగును.

క. విను మా పురుషప్రకృతుల
ఘనతాదాత్మ్యంబు మధ్యగతబిందువు గా
వున హంస యనఁగ జీవుం
డనిలమనోయుక్తుఁ డగుచు నతఁడు వెలుంగున్. 175

తా. పైనజెప్పిన హకారసకారస్వరూపములగు పురుషప్రకృతులయొక్క చేరికయే మధ్యనుండుండెడి బిందువు- అందువలననే హంసయన జీవుఁడనుట. అట్లుచెప్పబడు జీవుఁడు మనోమారుతములతోగూడువాఁడై ప్రకాశించుచుండును.

అష్టదళపద్మమున హంస తిరుగునపుడు గలిగెడు గుణవిశేషముల వివరణము.

వ. ఇట్లు నిర్వికారుం డైన పురుషునకుఁ గేవలజడాత్మిక యైన ప్రకృతిం బ్రత్యేకంబుగాఁ గర్తృత్వభోక్తృత్వాదిరూప సర్వసంసారంబు ఘటిం

ప దట్లు గావున హకార స్వరూపకుం డైన యాత్ముం డా శక్తి యైన సకారంబుతో నన్యోన్యతాదాత్మ్య ధ్యానరూపంబున గూడి హంస స్వరూపకుం డైన జీవుం డై నవద్వారపురంబునం బ్రవేశించి వివిధేం ద్రియప్రాణమనోయుక్తుం డై పంజరాంతరంబున మెలంగు పులుంగు తెఱంగునం జిక్కి వెడల నుపాయంబు గానక నానావిధభోగంబు లనుభవించుచుం గ్రీడించు నట్టి హంసకు నగ్నీసోములు పక్షంబు లోంకారంబు శిరంబు బిందునేత్రంబు ముఖంబు రుద్రరుద్రాణులు చర ణంబు లై యొప్పార భానుకోటిప్రతీకాశం బై కాష్ఠంబులయందు వహ్నియుం దిలలయందుం దైలంబు క్షీరంబులయందాజ్యంబు వ్యా పించి యున్నచందంబున బ్రహ్మాది స్తంభపర్యంత సర్వభూతంబుల యందు హృదయకమలం బధిష్ఠించి యుండు నందుం బూర్వదళం బునం బుణ్యమతియు నాగ్నేయదళంబున నిద్రాలస్యాదులు యామ్య దళంబునం గ్రౌర్యసేముషియు నైరృతిదళంబునం గ్రీడయు వాయవ్య దళంబునం గమనాదిమనీషయు సౌమ్యదళంబున రతిప్రీతియు నీశాన్య దళంబున ద్రవ్యాదానంబు మధ్యంబున వైరాగ్యంబుం గేసరంబుల జాగ్రదవస్థయుం గర్ణికయందు స్వప్నంబు లింగంబున సుషుప్తియుం బొందు చుండు. మఱియు నెప్పుడు పద్మత్యాగి యగు నప్పుడు నాదంబున విలీనం బగు నది తురీయం బన్నాదం బాధారాదిబ్రహ్మ రంధ్రపర్యంతంబు శుద్ధస్ఫటికసంకాశం బై నిండి యుండు నదియె పరమార్థతత్త్వరహస్యం బని యోగీశ్వరులచేతం జెప్పంబడు న ట్లగు టం జేసి. 176.

తా. నిర్వికారుఁడగు పురుషునకును అజ్ఞానస్వరూపమగు ప్రకృతికిని వేరువేరుగా కర్తృత్వ భోక్తృత్వములు మొదలైన స్వభావయుక్తమగు సంసారములేదుగాన హకార సంజ్ఞగలయాత్ముఁడు స్వశక్తియైన సకారరూపమగు ప్రకృతితో గలసియుండుటవలన కలి గినఆత్మయే తానను అభేదస్ఫురణ చేరినవాఁడై హంసస్వరూపమగు శబళబ్రహ్మమగును. ఆశబళబ్రహ్మము తొమ్మిదివాకిళ్లుగల శరీరమనెడి పట్టణమును ప్రవేశించి దశవిధేంద్రి

యములతోడను మనస్సుతోడను గూడినవాఁడై పంజరాంతరమున చరించుపక్కిచందము నవెలికేగుట కుపాయంబులేక పెక్కువిధముల సౌఖ్యములనుభవించుచుండును. అట్టి జీవుఁడగ్ని మండలము చంద్రమండలములను రెండురెక్కలుగను ఓంకారము శిరముగను జ్ఞాననేత్రము ముఖముగను, రుద్రబీజమగు హకారమును, శక్తిబీజమగు నేత్రముఖమును, రుద్రబీజమగు హకారమును, శక్తిబీజమగు సకారమును పాదద్వయముగను, ప్రకాశించుచు దారువులందగ్నియు తిలలయందు తైలమును క్షీరమునందు నేయియుంగలచందమున సమస్తప్రాణుల హృదయములందును నివసించియుండును. ఈసహస్రారము 125 చిన్న రేకులుంగల పెద్దదళము లెనిమిదియును నెనిమిదిదిక్కులగలది, తూర్పున సద్బుద్ధియు ఆగ్నేయమున నిద్రాలస్యాదులును దక్కినమున క్రూరబుద్ధియు, నైఋతిని పాపబుద్ధియు పడమటను విలాసమును, వాయవ్యమున నడచుటమొదలగు వానియందు బుద్ధియు, ఉత్తరమున సురతాసక్తియు, యీశాన్యమున ద్రవ్యమీయవలయునను తలంపును మధ్యను ఇహపరలోక భోగవిరక్తియును కింజల్కములందు మెలకువయునుకర్ణికయందు స్వప్నమును దుంపయందు నిద్రయును పొందుచుండును. ఏసమయమున సహస్రారకమలము విడచునో యపుడు అఖండసచ్చిదానంద పరబ్రహ్మమునందు నైక్యమగును. అట్టి యైక్యమే తురీయావస్థయందురు. ఆనాదము ప్రణవవాచ్యమైన పరబ్రహ్మము ఈనాదమే ఆధారచక్రము మొదలు సహస్రార చక్రమువఱకు నిర్మలస్ఫటికములతో సమానమైనిండియుండును. అదియే మహత్తరమైనట్టి యథార్థముయొక్క గోప్యమని బ్రహ్మజ్ఞానులచే పలుకబడెను- అట్లు చెప్పబడుటచేత-

## హంసాదిలయస్థానసూచనము.

క, దేశికనాథుని మహదుప
దేశమువలనన్ వివేకసద్దృష్టివలనఁ ద
న్నాశస్థలము సుషుమ్నా
దేశం బని దానికీలుఁ దెలియఁగవలయున్. 177

తా. పరమగురువుయొక్క యుపదేశమువలనను జ్ఞానదృష్టివలనను, నాదలయస్థానము సుషుమ్నాదేశంబని యెఱుంగవలయును.

ఆ. సర్వభూతహృదయసజలజాతములయందు
సమతఁ బవనమానసములతోడ

హంస యనుచుఁ బలుకు నతఁడె నేననువీలుఁ
దెలిసి తలఁప నదియు బోలియు నంత. 178

తా. అటువిమ్మట సమస్తప్రాణులయొక్క హృదయపద్మములయందు సమముగా ప్రాణవాయువుతోడను మనస్సుతోడను హంసయని పిలువబడు పురుషుఁడే నేనను టెఱింగి మననము సేయగా నాయనుసంధానము నశించును.

ఆ. ఈ రహస్య మెఱిఁగి యేకాగ్రచిత్తుఁ డై
సంతతము భజింపఁ జాలు నేని
యనిలమానసములు హంసంబుతోఁ గూడ
విలయ మొందు మొదలి వెలుఁగునందు. 179

తా. ఈ పరమరహస్యము నెఱింగి నిశ్చలచిత్తముతో నెల్లప్పుడారాధించువాఁడైన యెడల ప్రాణవాయువులు, మనస్సు శబళబ్రహ్మతో బిందుత్రయాతీతమగు చిత్కళ యందైక్య మొందును.

రేచకపూరకకుంభకములవివరణము.

సీ. హృదయగతప్రాణుఁ డే తెంచు నాసికా
వివరంబువలనను వెలికి ద్వాద
శాంగుళపర్యంత మది రేచకం బగు
నరుదెంచు నంతలో నర్ధసమయ
మచ్చోట లయ మగు నది బహిఃకుంభకం
బారీతి లోపలి కరుగునదియె
పూరకం బన నొప్పుఁ బూరించు నంతలో
నర్ధకాలంబు దా నడఁగు నచట
తే. నదియె యాంతరకుంభకం బనఁగఁ దనరుఁ
బొసఁగ నిబ్భంగి రేచక పూరకాది
గతులచే విహరించు నీ గాలివానిఁ
గలిసి మదితోడహంసంబు మెలఁగు నపుడు. 180

తా. హృదయమునందలి ప్రాణవాయువు నాసికారంధ్రములనుండి 12 అంగుళములవఱకు వెలుపలకు వచ్చును. అట్లువచ్చుట ఉచ్ఛ్వాసమనబడును. అట్లు వెలుపలికివచ్చి లోపల నర్ధనిమేషము వెలుపలనే లయమగును. అట్లు లయమగుట బాహ్యకుంభక మనబడును. వచ్చినతీరుననే లోపలికేగునది పూరకంబనబడును. లోపలికేగునంతలో నర్ధనిమేషము లయమగును. అట్లు లయమగుటకే లోకుంభకమందురు. ఈవిధముగా రేచకకుంభకాది నడకలచే సంచరించెడి ప్రాణవాయువును, రేచకాదులగలసి మానసముతోడ ప్రణవాంగమైన జీవహంస తిరుగునప్పుడు నిశ్వాసమునందు హకారముచే జెప్పబడియెడుసచ్చిదానంద పరబ్రహ్మమునుజేర్చి ప్రాణవాయువు నిలుపుటయందాత్మప్రతిబింబమునుగూర్చి అనంతరము (ఉచ్ఛ్వాసలయ సంజ్ఞయందు) సకారమునుపొందిన ప్రకృతిని దిలకించి ఆపురుషప్రకృతి బింబమును తెలియు తెలివియే నేనని యెఱుంగుము.

తే. పూరకమున హకారంబు ♦ బొందుపఱచి
కుంభకంబున బిందువు ♦ గూర్చి యంత
రేచకమున సకారంబు ♦ జూచి వాని
దెలియు తెలివియె నే నని ♦ తెలియవలయు. 182

తా. నిశ్వాసమునందు హకారమును మిళితముజేసి లోకుంభకమందు బిందువును జేర్చి యావెనుక రేచకమునందు సకారస్వరూపిణియైన సకారమునుజేర్చి ఆపురుషప్రకృతిప్రతిబింబములను దెలియు తెలివియే నేననియెఱుంగుము.

తే. ఇట్లనిలమానసములతో ♦ నెలసి హంస
యాఱుకమలంబులందు న ♦ హర్నిశంబు
లీలచే నిరివదియొక్క ♦ వేలయాఱు
నూఱుమాఱులు విహరించు ♦ మేరతోడ. 182

తా. ఈవిధముగా ప్రణవాంగమైన జీవహంస ప్రాణవాయువులతోడను, మానసముతోడనుజేరి మూలాధారముమొదల షట్చక్రములు 21600 సార్లు నిర్ణయప్రకారము సంచరించుచుండును.

## షట్కమలముల నిర్ణయము.

వ. అట్లు గావున గుదస్థానంబున వశషసవర్ణగంబై చతుర్దళయుక్తంబై తప్తకాంచన పుష్పసన్నిభంబై మహీనిలయంబై ఘ్రాణకారణంబై

మూలాధారచక్రంబు విలసిల్లునందు వినాయకున కాఱునూఱులును, లింగస్థానంబున బభమయరలవర్ణగంబై షడ్దళసమన్వితంబై జలాలయంబై రసనాకారణంబై స్వాధిష్ఠానచక్రంబు రంజిల్లు నందు౽జతుర్ముఖున కాఱువేలును, నాభిస్థానంబున డఢణతథదధనపఫవర్ణగంబై దశదళోపేతంబై తేజోనివాసంబై పీతవర్ణంబై నేత్రకారణంబై మణిపూరచక్రంబు ప్రకాశించు నందు శ్రీమహావిష్ణున కాఱువేలును, హృదయస్థానంబున కఖగఘఙచఛజఝఞటఠ వర్ణగంబై ద్వాదశదళోపేతంబై శ్వేతవర్ణంబై మరున్మందిరంబై త్వగింద్రియకారణంబై యనాహతచక్రంబు దనరు నందు రుద్రునకాఱువేలును, గంఠస్థానంబునం దకారాది షోడశస్వరగంబై షోడశదళయుతంబై నీలవర్ణంబై గగనసదనంబై శ్రోత్రకారణంబై విశుద్ధచక్రం బలరు నందు జీవాత్మునకు సహస్రంబును, భ్రూమధ్యస్థానంబున హంక్షమ్మను వర్ణంబులు గలిగి ద్విదళలలితంబై మాణిక్యవర్ణంబై యంతఃకరణభవనంబై యాజ్ఞాచక్రంబొప్పు నందు౽ బరమాత్మునకు సహస్రంబును, బ్రహ్మరంధ్రస్థానంబున నోంకారవర్ణగంబై సహస్రదళశోభితంబై కోటిసూర్య ప్రకాశమానంబై ధీనిలయస్థలంబై సహస్రారచక్రంబలరారు నందు శ్రీగురుస్వామికి సహస్రంబును శ్రీమద్దేశికోక్తాసన ముద్రాలక్ష్యమంత్రధ్యాన క్రమపూర్వకంబుగా సమర్పించు సద్గురుభక్తుండు జీవన్ముక్తుండగు నట్లొప్పించునప్పుడు. 183

తా. ఆప్రకారము సంచరించునుగావున గుదస్థానంబున వశషసలఅక్షరముల గలదియు 4 దళములుగలదియు, బంగారు రేకుయొక్క పుష్పములో సమానమైనదియు, భూమికినివాసమైనదియు, నాసికమునకు హేతువైనదియునునై మూలాధారమను చక్రము ప్రకాశించును. అందు విఘ్నేశ్వరునకు 600 మార్లు అజపాసుంత్రమును, మేహనస్థానమున బభమయరలను 6 అక్షరములుగలదియు, ఆరు రేకులుగలదియు ఎఱ్ఱరంగుగలదియు ఉదకమునకు స్థానమైనదియు, నాలుకకు హేతువైనదియునై స్వాధిష్ఠానముండును. అందు బ్రహ్మకు 6000 మార్లను పొక్కిలియందు డఢణ తథదధన పఫ అనువర్ణములుగలదియు

10 రేకులుగలదియు పసుపుపచ్చని రంగుగలదియు, అగ్నికి స్థానమైనదియు, కనులకు హేతువైనదియునగు మణిపూరకముండును. అందువిష్ణువునకు 6000 సార్లును, వక్షస్థలమున కఖగఘఙచఛజఝఞటఠ అను 12 అక్షరములుగలదియు, 12 రేకులుగలదియు, తెల్లనిదియు, వాయువునకు స్థానమైనదియు, చర్మేంద్రియకారణమైనదిఅగు అనాహత చక్రము ప్రకాశించునందు రుద్రునకు 6000 మార్లును, కంఠమున అకారము మొదలు 16 అచ్చులుగలదియు 16 రేకులుగలదియు, నల్లనిదియు ఆకాశమునకు స్థానమైనదియు, కర్ణములకు హేతువైనదియు, విశుద్ధచక్రము ప్రకాశించునందు జీవాత్ముఁడగు క్షేత్రజ్ఞునకు 1000 మార్లును, కనుబొమలమధ్యను హం, క్షం అను 2 అక్షరములు గలిగినదియును రెండురేకులు గలదియును మాణిక్యపుచ్ఛాయగలదియును అంతఃకరణమునకు నివాసమైనదియును ఆజ్ఞాచక్రము ప్రకాశించునందు పరబ్రహ్మమునకు 1000 మారులును దహరమునందు ప్రణవాక్షరము గలదియు, 1000 రేకులుగలదియు, నైసహస్రారచక్రము ప్రకాశించును. అందు గురుదేవునకు 1000 మారులును అజపామంత్రము జపింపవలయును. అట్లు వినాయక మహావిష్ణు, రుద్రాదులకు అజపామంత్రమును గురునిచేబోధింపబడిన పద్మాసనాద్యాసనములచేత ఖేచరాది ముద్రలచేతను అనుష్టానసరణితో నర్పణముగావించి ఉత్తమశిష్యుఁడు జీవన్ముక్తుడగును. అట్లు జేయునప్పుడు,

క. కుడియెడమ నాడులందున్
నడుచు న్వాయువులు వానినడువడి వెలిలోఁ
బొడగనుచు నెపుడు మెలఁగుః
నడిమినడవనంటి నెమ్మనంబు కుమారా. 184

తా. పావనీ! ఉచ్ఛ్వాసనిశ్వాసవాయువులు కుడియెడమ పార్శ్వములయందుండెడు యిడాపింగళినాడులయందు చరించుచుండును. మనస్సు ఆయుచ్ఛ్వాసనిశ్వాసములయొక్క సంచారము లోపల వెలుపల చూచునపుడును సుషుమ్నానాళమునుబొంది సంచరించుచుండును.

### హంసస్థాన సూచనము.

క. ఆ రెంటికిని విలక్షణ
మై రాజిల్లెడు సుషుమ్నయందమలాజ్ఞాం
భోరుహమున హంసుండా
త్మారాముఁడు సర్వసాక్షియై వెల్గుసుతా. 185

తా. ఆంజనేయా! ఇడాపింగళనాడులకు విలక్షణమై ప్రకాశించు సుషుమ్నా నాళమందలి స్వచ్ఛమగు ప్రణవకుండలియందు కూటస్థుఁడును, జీవులయం దంతర్యామి స్వరూపమున గ్రీడించుచున్న పరబ్రహ్మము అంతర్మధ్యబాహ్యత్రిపుటలను దిలకించుచుండువాఁడై ప్రకాశించును.

ఆ. అచలహంసరూప ఽ మెచట సంభవమగు
నెచట సంచరించు ఽ నెచట నడఁగు
నదియసూ సుషుమ్న ఽ యదియపో ద్విదళాబ్జ
మది సుసూక్ష్మదృష్టి ఽ నరయుమనఘ. 186

తా. పావనీ! చలింపనట్టిదియు, నామరూపక్రియలు లేనిదియునగు పరమాత్మకు నేస్థలమందు నామరూపక్రియలు గలుగునో, ఏస్థలమున పరమాత్మసంచరించునో, ఏప్రదేశమున పరమాత్మ నామరూపక్రియలు లీనమగునో ఆస్థలమునకే సుషుమ్నయనిపేరు. దీనినే బ్రహ్మనాడియందురు. ఈబ్రహ్మనాడినే మనోబుద్ధులనెడు రెండు రేకులుండు ఆజ్ఞాచక్రమందురు. ఆయాజ్ఞాచక్రమును అత్యంత నిర్మలజ్ఞానదృష్టిచే నరయుము.

చ. అది యతిసూక్ష్మదృష్టియు దృఽగాద్యవసానపదంబు ధీమన
స్సదనము స్వప్రకాశము నఽసంగము నిర్విషయంబు గాన న
ప్పదమున హంసనాదముల ఽ భంగులగూర్పఁ దదంతరంబునం
దుదయమునొంది చిత్కళ మఽహోన్నతి వానినడంచు నెంతయున్.

తా. సర్వప్రపంచోదయ కారణమగు ప్రథమస్ఫురణ నతిసూక్ష్మముగను, ద్రష్టృదర్శనదృశ్యములయొక్క లయస్థానముగను, బుద్ధికిని మనస్సునకును స్థానముగను, తనంత తానే ప్రకాశించునదిగను, దేనిసంటునిదియును, 14 యింద్రియవిషయజ్ఞానము లేనిదిగను ఉండుటవలన ఆసుషుమ్నయందే జీవేశ్వరులయొక్క కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వములు మున్నగుధర్మములజేర్చగా నాతెలివియందే యపరోక్షజ్ఞానముపుట్టి అతిశయించి జీవేశ్వరోపాధులను నశింపజేయును.

ఆ. భూరిహంసనాదఽ పూర్వోత్తరారణి
జనితచిత్కళాగ్ని ఽ ఘనతమెఱసి
స్వాదివస్తువులను ఽ స్వస్వరూపంబుగాఁ
జేయకున్నె పైని ఽ జేరునపుడు. 188

తా. కార్యోపాధిగల జీవుడును, కారణోపాధిగల యీశ్వరుడును అను అరణులను ధ్యానమను మథనమువలన జనించిన యపరోక్షజ్ఞాననునగ్ని తనపుట్టుకకు కారణమైన జీవేశ్వరు లను అరణులను తాను పరబ్రహ్మమును జేరునప్పుడు తనరూపముగా మార్చుకుండునా. మార్చును.

## బిందునాద కళాప్రకారాంతర సూచనము.

క. అంగము నిర్మలబిందువు
లింగము నాదంబు పరమలింగాంగమహా
సంగమె మంగళకళయని
లింగాంగులు దెలియుదురు చలింపనియుక్తిన్. 189

తా. శివబ్రహ్మైక్య జ్ఞానసంపన్నులు ప్రణవాంగమైనజీవుఁడు స్వచ్ఛమగుబ్రహ్మానందరసబిందువనియు, శుద్ధస్ఫటికసమానమగు ఆనందబిందువున శబ్దించుచు వెలుంగు యీశ్వర స్వరూపజ్యోతి ప్రణవనాదమనియు, లింగస్వరూపమైన యీశ్వరునియొక్కయు అంగస్వరూపుడగు జీవునియొక్కయు నభేదైక్యమే పరమశివకళయనియు- శ్రవణాదికములచే దెలసికొనుచున్నారు.

ఆ. అట్లు గావునఁ గళహంసనాదంబుల
రూప మడఁచి తనరూపుఁ జేసి
తాను తానయైన తత్త్వంబునం దైక్య
మొందు బయలు బయల నొందినట్లు. 190

తా. అట్లు తెలియుదురుగనుక జీవేశ్వరులకించిద్జ్ఞత్వసర్వజ్ఞత్వాద్యుపాధుల నశింపజేసి ఆత్మజ్ఞానాకారముగ గావించి ఘటాకాశము మహాకాశమం దైక్యమయినట్లు తానుతానై వెలింగెడు పరబ్రహ్మమందు కలియుదురు.

మ. కలహంసాన్విత నాదబిందుకళ లైక్యం బెప్పుడౌ నప్పుడు
జ్వలకర్పూరశిఖ ప్రణాశముగతిన్ సర్వేంద్రియోపేతకా
నిలచిత్తంబులు శూన్యమై చనఁగ దా నిర్వాతదీపోపమా
చలసచ్చిత్సుఖవిగ్రహాత్ముఁ డలరున్ సంపూర్ణుఁడై యంతటన్.

తా. మధురధ్వనులతోఁగూడినబ్రహ్మ ప్రణవములోఁగలసిన అకారఉకార మకారాత్మకమయిన నాదబిందుకళలు బ్రహ్మమునం దెప్పుడుజేరునో అపుడు కర్పూరదీపము

శలె ప్రాణపంచకమును చిత్తమును లయింపగా తానైన బ్రహ్మజ్ఞాని చలింపనిదీపమువలె కాలత్రయములచే బాధితముగానిదియు, అపరోక్షజ్ఞానమైనదియునైన సుఖదుఃఖ నివృత్తి రూపకమగు ఆనందమును స్వరూపముగాగల్గి సర్వత్ర నిండినవాఁడై ప్రకాశించును.

అమనస్కాని రూపణము.

వ. ఇట్లు హంసనాదబిందుకళలతో సకలేంద్రియ సమన్విత మనఃప్రాణం
బు లెప్పుడు విలయంబగు నప్పు డయ్యవస్థ తురీయంబనియు నున్మని
యనియు సహజామనస్కంబనియు జెప్పనొప్పునట్టి పూర్ణ నిర్వికల్ప
సమాధియం దద్వితీయాపరోక్ష స్వయంప్రకాశమానాఖండసచ్చి
దానందస్వరూప పరమాత్మారామచైతన్యమాత్రుండవై యుండు
మని యుపదేశించి వెండియు నిట్లనియె. 192

తా. ఇంద్రియములతోఁగూడిన మనస్సుప్రాణులను నాదబిందుకళలతో నెపుడు లయించునో యపుడాయవస్థ తురీయమనియు ఉన్మనియనియు సహజా మనస్కంబనియు పలుకదగును. తానుతానైనట్టిదియు, స్వయంప్రకాశమయినదియు, విభాగింపరాని సత్యజ్ఞానానందరూపమగునట్టిదియు నత్యుత్తమమయిన తనయందుతాను క్రీడించుచున్న పరమాత్మస్వరూపుడవుకమ్ము.

రాజయోగ నిరూపణము.

సీ. పరమహంసంబు రేపగలు చింతింపంగ
బిందు విందందుఁ గంపింప కుండు
దశవిధప్రణవనాదము లాలకింపంగఁ
దుదను ఘంటానాద మొదవిమ్రోయు
బహులక్ష్యలక్ష్యముల్ పరికించి చూడంగ
సురుచిరంబై స్వయంజ్యోతి యొప్పు
యామద్వయంబు యోగారూఢుఁడై వాని
ధ్యానింపఁ దన్మయత్వంబు గలుగు
తే. నట్టి యున్మనియందు మనోనిలములు
వివిధవిషయేంద్రియములతో విలయమొందు

నిదిధ్యాసనా సర్వవేదాంతవిదితపరమ
రాజయోగంబు దేవతారాజి వినుత. 193

తా. ఆంజనేయా! రేచకపూరకాత్మకమగు హంసమంత్రమును రాత్రింబవళ్ళు ధ్యానింప బుద్ధి అంతర్బాహ్యములయందు కదలకుండు, చిణి మొదలగు ఓంకారనాదము లాలించుచుండగా చివర ఘంటాధ్వని చక్కగా విననగును. అనేకవిధములగు లక్ష్యములను శోధింపగారమ్యమగు స్వయంప్రకాశము కననగును. రెండుజాములు జీవబ్రహ్మైక్యనిష్టయందు నిశ్చలుండైయుండి నాదబిందుకళలను మననముచేయగా నుపశాంతిగల్గును. అట్టిఅవస్థయందు అంతఃకరణము, ప్రాణవాయువులు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ విషయములు లయించును. ఇదియే యుపనిషత్తులుబోధించు రాజయోగము.

అధికారితారతమ్యమున యోగసిద్ధియగుటకుఁగాల
నిర్ణయముఁదెలుపుట.

వ. ఇవ్విధంబునఁ బ్రతిదివసంబు యామద్వయనియమంబు దప్పకయభ్యసించిన నిర్మలనిశ్చలచిత్తవృత్తిగలపురుషునకు షణ్మాసంబులకు, మందప్రజ్ఞునకు సంవత్సరంబునకుఁ, గేవల మూఢాత్మునకు ద్వాదశవర్షంబులకుఁ బరమసూక్ష్మతారకయోగసిద్ధి యగునని యోగశాస్త్రంబుల వినంబడు దివ్యజ్ఞానవిజ్ఞానసంపన్నుండైన యాచార్యుని సాన్నిధ్యంబున వసియించి స్థానాంగభావాత్మశుశ్రూషలు గావించుచు నిరంతరంబు సేవించు మహానుభావునకు నిరంతరాయంబుగా శీఘ్రకాలంబున నిర్గుణబ్రహ్మసాక్షాత్కారంబగు సందేహింపవలదు.

తా. ఈవిధముగా ప్రతిదినమునను రెండుజాములుకాల మభ్యసించుచున్న యెడల నిర్మలనిశ్చలతత్త్వముగల పురుషులకు ఆరుమాసములలోపలను, మందబుద్ధులకు సంవత్సరమునకును మూర్ఖులకు 12 సంవత్సరములకును తారకయోగసంసిద్ధి కలుగును. దివ్యజ్ఞానసంపన్నుడగు ఆచార్యునిచెంత నివసించుచు చతుర్విధ శుశ్రూషలగావించుచు సేవించుచుండుపురుషులకు శీఘ్రకాలంబున నిరంతరాయంబుగా యోగసంసిద్ధియగును.

మ. అని బోధించిన నాంజనేయుఁడు తురీయానందముం బొంది చయ్యన సీతాలలనాశిరోమణికి సాష్టాంగప్రణామంబు చే

సె నటంచుఁ బరమేశ్వరుండు గృపచే శ్రీపార్వతీదేవికిన్
వినుపింప న్విని రాముఁ డేమనియె నాకవృత్తాంతముం జెప్పవే.

తా. అనిబోధింపగా నాంజనేయుడు తుకీయంబగు ఆనందమునుబొంది సీతకు సాష్టాంగనమస్కారమాచరించెనని పరమేశ్వరుఁడు పార్వతికిజెప్పగా నామె విని అనంతరము రాముఁడేమిచెప్పెనో యదిదెలుపవలసినదని పార్వతి ప్రశ్నించెను.

వ. అని యడుగుటయును. 196

తా. అనిపార్వతి యడుగగా,

చ. పరమదయాసముద్ర గుణభద్ర కరాంచితబోధముద్ర భా
స్కరశతకోటిధామ జితకామ బుధాంబుధిసోమ విస్ఫుర
న్నిరతిశయప్రభావ ఘననిర్మలభావ మహార్ద్రభావ శం
కరహరిధాతృరూప చిదఖండకలాప జగత్ప్రదీపకా. 197

తా. నిరతిశయమైనదయకు సముద్రునివంటివాఁడా! శాంతిశమదమాది సద్గుణములుగలవాఁడా! హస్తమునందొప్పుచున్న చిన్ముద్రగలవాఁడా! శతకోటిసూర్యులతో సమానమగు తేజముగలవాఁడా! మన్మథుని జయించినవాఁడా! దేవతలను సముద్రమునకు చంద్రునివంటివాఁడా! మిగులవెలుంగుచున్నట్టిదియు, మహత్తరమైనట్టిదియునగు మహత్త్వముగలవాఁడా! గొప్పదైన నిర్మలమైన స్వరూపముగలవాఁడా! మిగుల సరసమైనమనస్సుగలవాఁడా! శివకేశవబ్రహ్మస్వరూపుఁడా! బ్రహ్మజ్ఞానమనెడి పరిపూర్ణాచరణముగలవాఁడా! చతుర్దశభువనములను ప్రకాశింపజేయువాఁడా!

క. జగదింద్రజాలకల్పక
సగుణాగుణరూప పరమసత్యాలాపా
నిగమాగమాంతవినుతా
త్రిగుణాతీతస్వభావ ధీనుతభావా. 198

తా. ముల్లోకములనెడి యింద్రజాలమును కల్పించువాఁడా! సగుణ నిర్గుణస్వరూపుఁడా! సర్వోత్కృష్టమైన బ్రహ్మమును ప్రసాదించువాఁడా! వేదములయొక్క, ఆగమములయొక్క అగ్రములైన ఉపనిషత్తులచేత పొగడబడువాఁడా! సత్త్వరజస్తమోగుణములకంటె విలక్షణమగు స్వభావముగలవాఁడా! విజ్ఞానులచే నుతింపబడిన ప్రవర్తనగలవాఁడా!

మాలిని. కలుషచయవిరామా ౸ ఖండితాశేషకామా
సులభసుఖవిచారా ౸ సూరిచేతోవిహారా
విలయజననదూరా ౸ విశ్వరూపావికారా
సలలితశుభకీర్తీ ౸ సచ్చిదానందమూర్తీ. 199

తా. పాపసమూహమును నశింపజేయువాఁడా! ఖండింపబడిన సమస్తవాంఛలు గలవాఁడా! అనాయాసముగా లభించిన బ్రహ్మవిచారముగలవాఁడా! బ్రహ్మజ్ఞానుల మనస్సునందు విహరించువాఁడా! జననమరణములకు దూరమైనవాఁడా! ప్రణవస్వరూపా! షడ్విధవికారములునులేనివాఁడా! రమ్యమైనట్టియు మంగళకరమైనట్టియు యశస్సుగలవాఁడా! సత్యజ్ఞానానందస్వరూపా!

గద్య. ఇది శ్రీమన్నారాయణ మహాదేవగురుకరుణాకటాక్షవీక్షణ విమలీకృతనిజహృదయకమలకర్ణికాంతసందర్శితాఖండసచ్చిదానందరసైకస్ఫూర్తి షట్చక్రసీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయ సంవాదం బను యోగశాస్త్రంబునందుఁ దారకయోగానుభవవిచారంబునునది ప్రథమాశ్వాసము.

మొదటి యాశ్వాసము

సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీసీతారామాంజనేయసంవాదము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీదత్తాత్రేయగుప
ప్రాదుర్భూతాపరోక్ష ♦ పరమజ్ఞాన
శ్రీదైత మహాదేవ మ
హాదేవాచార్య వినమితామరవర్యా. 1

తా. బ్రహ్మవిద్యాన్వితుండగు దత్తాత్రేయుడనుయాచార్యునివలన జన్మించినదగు సాక్షాత్కారమయిన బ్రహ్మజ్ఞానమునకు ప్రియుఁడా! సకలమునందును విశేషముగా ప్రకాశించువాడా! దేవతలచే నమస్కరింపబడువాఁడా! మహాదేవనామమును ధరించిన గురుమూర్తీ!

వ. అవధరింపుము శ్రీమహాదేవుండు అమ్మహాదేవి కిట్లనియె. 2

తా. వినుము. శివుఁడు పార్వతీదేవికిట్లని చెప్పెను.

క. శ్రీరాముఁ డపుడు శ్రీ సీ
తారామముఖంబుఁ జూచి ♦ తలయూఁచి మహా
కారుణ్యకటాక్షముచే
మారుతవరసుతునిఁ గాంచి ♦ మందస్మితుఁడై. 3

తా. అపుఁడు శ్రీరాముఁడు సీతాదేవియొక్క ముఖమునుజూచి ఆమె యాంజనేయుని తారకయోగపరిపూర్ణునిజేసెనని సంతసించి తలయూపి దయోపేతములగు దృక్కుల నాంజనేయుని దర్శించి చిరునవ్వునవ్వెను.

తే. తెలిసెనయ్య సీతాదేవి ♦ దెలియఁజెప్ప
గలితతారకయోగప్రకార మెల్ల

నింక నీపయిఁగరుణచే నెఱుకపఱతు
సాంఖ్యయోగంబు విను మాప్రసంగ మనఘ. 4

తా. ఆంజనేయా! సీతాదేవిజెప్పిన తారకయోగమంతయును దెలసెనుగదా ఇంకనీయందలి వాత్సల్యముచే జ్ఞానయోగమును దెలిపెదవినుము.

వ. సాంఖ్యామనస్కంబు లుపనిషదర్థప్రతిపాదకంబు లందు దొలుత సాంఖ్యంబు తేటపడ వివరించెద నిశ్చలచిత్తుండవై వినుమని యిట్లని యె. 5

తా. సాంఖ్యము అమనస్కములు రెండును వేదాంతతాత్పర్యమగు పరబ్రహ్మను నిరూపించును. అందు తొలుతటిదగు సాంఖ్యయోగమును ముందుగా దెలిపెదను. నిశ్చలమగు మనస్సుగలవాఁడై యాలింపుము- అని యిట్లు చెప్పనారంభించెను.

పరబ్రహ్మస్వరూప నిర్ణయము.

సీ. ఏకమై పరమై విశోకమై సత్య మ
లోకమై వ్యాపకాలోక మగుచు
జ్ఞానమై జగదధిష్ఠానమై ముక్తిని
దానమై మాయావిహీన మగుచు
నందమై కేవలానందమై సంతతా
స్పందమై శ్రుతిపద్మకంద మగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వి
కారమై విగతసంసార మగుచు
తే. జిలుఁగు మెలసులకలకలు గలుగుకొనుచు
మెలఁగు ప్రకృతిని దగులక మిగిలి వెలుఁగు
వెలుఁగు వెలుఁగంగఁ జేయుచు గలయవెలుఁగు
బరమపరిపూర్ణ నిర్గుణబ్రహ్మమనఘ. 6

తా. పావనీ! శ్రేష్ఠమైనదియు, నఖండమైనదియు, త్రిగుణరహితమైనదియు నగు పరబ్రహ్మము సజాతి విజాతీయ స్వగతభేదములేనిదై ప్రకృతికంటెభిన్నమై, దుఃఖరహితమయి సదాయుండునదై నిష్ప్రపంచమై యెల్లెడలను వ్యాపించినతేజముగలదై భువనముల

సృష్టిస్థితిలయములకు కారణమైనదై మోక్షమునకు కారణమై మాయారహితమైనదై రమ్యమయినదై, నిరతిశయానందస్వరూపమైనదై యెప్పుడును కదలనిదై వేదములకు మూలసారమయి జ్ఞానాజ్ఞానస్వ రూపమయినదై యెట్టివికారములును లేనిదై మమతలేనిదై దెలియనవకాశములేని వెనకువలుగలదై వ్యాపించియుండు అవ్యక్తమునంటక నతిశయించి ప్రకాశించు చిత్తుయొక్క శక్తిని ప్రకాశింపజేయుచు తానును ప్రకాశించుచుండును. అయ్యదియే పరమపరిపూర్ణబ్రహ్మము.

క. నిష్కారణము నిరీహము
నిష్కంపము నిష్క్రియంబు నిష్కల్మషమున్
నిష్కళము నిష్కళంకము
నైష్కర్మ్యప్రాప్య నిర్గుణ బ్రహ్మమగున్. 7

తా. నిష్కామకర్మమున పొందదగినదియును, త్రిగుణాతీతమైనదియునగు బ్రహ్మమునకు జననకారణములేదు. మనస్సులేదు. కోరికలులేవు. అచేతనమగుట కదలనేరదు. కర్మేంద్రియములులేనిదగుటను ఇంద్రియవ్యాపారములులేనిది. ఆణవకార్మికమాయామలములులేనిది, కళాతీతనుయినది- ప్రకృతిరహితమయినదియునై యున్నది.

క. హానాదానవిహీన
జ్ఞానాజ్ఞానాతిరిక్త సత్యానంద
జ్ఞానప్రధాన తజ్జని
దానాధిష్ఠాన మానిధాన మదీనా. 8

తా. ఆంజనేయా! పుణ్యపాపములను గ్రహించుటయు తత్తదుచితఫలంబుల నిచ్చుటయు అనునవిలేనిదియును, ఎఱుకమరపులకంటె వేరైనదియు, త్రికాలబాధితమగునదియు, సౌఖ్యసుజ్ఞానస్వరూపియు ప్రకృతికిని ప్రకృతిజనితములగు సప్తావరణములకును కారణమయిన జ్ఞానశక్తికి ఆశ్రయమయినదియునై పరతత్త్వమున్నది.

క. ప్రస్థానత్రయ వేద్యుఁడ
వస్థాత్రయసాక్షి సర్వవస్తు స్తోమాం
తస్సుం డస్థిరవిశ్వభ
వస్థిత్యంతాదిమూర్తి వాయుకుమారా. 9

తా. పావనీ ! ప్రస్థానత్రయముచే నెఱుంగఁదగినవాడును, అవస్థాత్రయమును జూచువాఁడును, సమస్తవస్తువులయొక్క లోపలనుండువాడును, ఆశ్వరములగు లోకముల సృష్టిస్థితిలయములకు కారణస్వరూపుఁడు పరమాత్మయే.

పంచచామరము. ఇలాజలానలానిలాంబ రేందు భానుమండలో

జ్జ్వలాఖిలావిలామలాత్మజాలకాంతర స్థచం

చలాచలావిలాసశూన్య సంతతాపరోక్షచి

త్కళాకలాపలాలిత ప్రకాశకుం డతండగుఁ. 10

తా. పరమాత్మ పృథివ్యప్తేజోవాయురాకాశములు సూర్యచంద్రులు అను సప్తమండలములందుండెడి పాపులగు పురుగులు మొదలగువానియందు బ్రహ్మాదులగు దేవతలయందును పుణ్యపాప సమన్వితులగు మనుష్యులయందును అంతర్యామియును, శివాష్టమూర్తులగు జాలకములయొక్క లోపలనున్నట్టి కదలునదియు కదలనిదియు నైన క్రియలేనిదియు, అపరోక్షజ్ఞానముయొక్క చిత్కళాసమూహమును ప్రకాశింపజేయు వాఁడును అయిన బ్రహ్మము జ్ఞానాతీతము.

క. ఆద్యుం డపరిచ్ఛేద్యుఁ డ

విద్యాధ్వాంతద్యుమణి సువిద్యాసద్యో

వేద్యుఁడు గర్కశతర్కా

భేద్యుం డనవద్యుఁ డగు నభేదాత్ముఁ డజా 11

ఆంజనేయా ! పరబ్రహ్మము సృష్టిస్థితి సంహారతిరోధానానుగ్రహములను పంచకృత్యములకు కారణుఁడును, దేశకాలభేదములచే విభాగింపబడనివాఁడును, చీకటికి సూర్యునివలె అజ్ఞానమునకు నాశనకరుఁడును, బ్రహ్మజ్ఞానముచేత తెలియదగినవాఁడును, తర్కమండలి ప్రత్యక్షప్రమాణములచే దెలియదగినవాడును, స్థూలసూక్ష్మకారణోపాధిరహితుఁడును విచ్ఛేదింపబడనిస్వరూపముగలవాఁడునునై యున్నాఁడు.

క. భూతానుభూతమిథ్యా,

భూతద్వైతమయపంచభూతోత్థజగ

జ్జాతానుస్యూతాజా

ద్వైతాత్ముఁ డతండు వాయుతనయ మహాత్మా. 12

తా. ఆంజనేయా! పరబ్రహ్మము స్థావరజంగమప్రాణులను పొందిన నామరూపముగా దోఁచుచున్న ప్రకృతివలనపుట్టిన పంచీకృత అపంచీకృతములను రెండువిధములయిన

భూజలాగ్నివాయుగగనములవలన పుట్టినలోకములయొక్క సమూహమునందు కూడినవాఁడై పుట్టుకలేనివాఁడై తనకంటె రెండవదియగు రూపములేనివాఁడై యున్నాఁడు.

క. భావాభావమయావి,
ర్భావవిహీనోభావరహితసద్భావుం డన్యా
భావస్వభావుఁ డతులవి
భావసుపావకసుధాంశుసద్భాప్రదుఁ డరయన్. 13

తా. ఆలోచింప పరబ్రహ్మము దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగు సత్పదార్థముయొక్కయు పరిచ్ఛేదమగు అసత్పదార్థముయొక్కయు స్వరూపములయొక్క పుట్టుక నాశములేని స్వభావముగలవాఁడును తనకంటె నితరములేనివాడయ్యు జగముగలవాఁడును స్వజాతీయవిజాతీయ స్వగతశూన్యుడును సూర్యాగ్నిచంద్రులకు గాంతినిచ్చువాడును అగును.

భావాభావపదార్థనిర్ణయము.

క. ఆప్తసుషుప్తవిలుప్తా
లిప్తవ్యాప్తప్రదీప్తసల్లింగరహితసం
ప్రాప్తప్రాప్తవిహీన
జ్ఞప్తియె సర్వప్రపంచసత్సాక్షి మహాత్మా. 14

తా. ఘటములోని జలము ఘటము వెలుపలి చెమ్మయగునట్లు జగన్నిర్మాణమునకు బీజరూపమగు అవ్యక్తనామప్రకృతి రూపసుషుప్తియందులయింపక ఆసుషుప్తినంటుక సర్వవ్యాపకమై వెలుఁగుచు, అహంభావము, ఎఱుగకపోవుటయనునవిలేని ప్రజ్ఞానమే పరమాత్మయని దెలియుము.

క. వ్యక్తం బవ్యక్తాది
వ్యక్తావ్యక్తాతిరిక్తసమగు బ్రహ్మము దా
బ్రాక్తనుకృత భాక్తనుయుత
భోక్తను సతతంబు సాక్షిసపోలికఁ జూచున్. 15

తా. వ్యష్టి సమష్టిరూపజీవేశ్వరులయందు కార్యకారణములచే ప్రకాశించు అవ్యక్తజనితమహదాది సప్తావరణలకు విలక్షణమయిన బ్రహ్మముజ్ఞానగమ్యము, అపరబ్రహ్మము తొల్లిటి శరీరమునచేయబడిన కర్మయొక్క ప్రతిఫలమునుపొందదగిన వర్తమానశరీరముగల జీవునిసాక్షిభూతుఁడుగానుండి దిలకించుచుండును.

తే. జాగ్రదాదివినిగ్రహానుగ్రహప్ర
తిగ్రహాసమగ్రజాగరూకాగ్రహోగ్ర
విగ్రహాత్యగ్రసాభాసవిశ్వహేతు
ధీప్రకాశకుఁ డతఁడె సందేహ మేల. 16

తా. జాగ్రతుమున్నగు మూడవస్థలయొక్క నశింపజేయుట కాపాడుట వహించుటయు గలిగినట్టి నిర్మలమయిన సత్త్వగుణమె స్వభావముగాగల్గిన సంపూర్ణజాగ్రత్తయు రజోగుణస్వభావమయిన కోపమును తామసగుణస్వభావమయిన భయంకరమును యాకృతిగాగల యుత్తమోత్తమమయిన ప్రకృతి చిచ్ఛాయయొక్క సృష్టిస్థితిలయములకు కారణమయిన ప్రజ్ఞానమును ప్రకాశించునాతఁడే పరబ్రహ్మమందురు. ఇందులకుసందేహ మెంతమాత్రమును లేదు.

ఆ. ఇదియు నదియు నట్టి దిట్టి దింతం తని
పలుకరాని దెద్ది బ్రహ్మ మదియె
యిదియు నదియు నట్టి దిట్టి దింతం తని
యరయుతెలివి యదియె యవియునదియె. 17

తా. పరబ్రహ్మము కనబడెడు ప్రపంచాకారముగలదియనిగాని, స్వరూపలక్షణములుగల పరమాత్మరూపమయినదిగాని, సర్వజ్ఞత్వాదిగుణములుగలదనిగానికించిద్జ్ఞత్వాదిగుణములుగలదనిగాని, వ్యష్టిసమష్టిరూపములుగలదనిగాని జెప్పుటకువీలులేదు. జ్ఞానము, జగద్రూపమయినది, పరమాత్మరూపమయినని సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వాది గుణములుగలది, వ్యష్టి సమష్టిరూపమయినదియని దెలియుటయైయున్నది.

తే. అట్టి పరిపూర్ణతత్త్వ మైనట్టి నేను
బూర్వకల్పాంతమున నీ యపూర్వవిశ్వ
జననమునకంటె మునునిరంజనుఁడనగుచు
నద్వయుఁడనై వెలుఁగుదు నాంజనేయ. 18

ఆంజనేయా! పరబ్రహ్మమునైన నేను విశ్వప్రళయమయినవెనుక యీప్రపంచముకంటె పూర్వము నిరంజనుఁడనై సమానరహితుఁడనై ప్రకాశింతును.

మాయాస్వరూపనిర్ణయము.

తే. అట్టినాయం దనాదిగా నాత్మశక్తి
యలరు నవ్యక్తనుయి జగ దాది యగుచుఁ

గలితమృత్తికయుం దున్న ♦ కలశశక్తి
యేర్పడక కుంభహేతువై ♦ యెసఁగినట్లు. 19

తా. నిరంజనుఁడనఁగు నాయందు మట్టియందు కుండగావించు శక్తియుండి తాను తెలియబడక కుండయొక్క నిర్మాణమునకు గారణమైనట్లు మొదటినుండియు వేరుపరుప రానిదై సృష్టికి కారణభూతమగు నాశక్తి అవ్యక్తనామకశక్తిగానుండును.

సీ. వటబీజమున మహా ♦ వటమహీరుహశక్తి
యుజ్జ్వలవహ్నియం ♦ దుష్ణశక్తి
యింద్రజాలకునియం ♦ దెపుడు మాయాశక్తి
కలితోపలములందుఁ ♦ గఠినశక్తి
సలిలజాతమునందు ♦ సలలితద్రవశక్తి
పవనంబునం దతిస్పందశక్తి
పారిశుక్లశోణితంబులయందుఁ దనుశక్తి
తగుశరీరములఁ జైతన్యశక్తి

తే. దనరి యవ్యక్తమగుచు దత్తత్సన్నిధాన
మై యధిష్ఠానమునకంటె ♦ ననితరంబు
నగుపగిదినొప్పు నాయందు ♦ నాత్మశక్తి
యేర్పడక యన్యమై విశ్వ ♦ హేతువగుచు. 20

తా. మఱ్ఱివిత్తున గొప్పచెట్టునుబుట్టించుశక్తియు, వెలిగెడియగ్నికి వేడిమిఁగల్గించు శక్తియు, గారడివానియొక్క టక్కరిశక్తియు, రాళ్ళయందు గట్టిగానుండుశక్తియు, ఉదకమునందు చెమ్మగలిగించు శక్తియు, వాయువునందు కదలించుశక్తియు, రేతస్సున రక్తమున శరీరమును నిర్మించుశక్తియు, శరీరమున కదలెడు శక్తియు, నేర్పఱుపరానిదయి వటవృక్షాదివస్తువులకంటె భిన్నముకాదో అవిధముననే నాయందలిశక్తి నాకంటెభిన్నము గా దోపక లోకముల సృష్టిస్థితులకు కారణమైప్రకాశించును.

సీ. సత్తుగా దాత్మవిజ్ఞానంబుచే నెంద
భావమై బాధింపఁ ♦ బడుటవలన

నెలమి నసత్తుకా ♦ దేనజ్ఞుఁడ నటంచు
నజ్ఞానభూతమై ♦ యలరుచునికి
సదసత్తు గాదు విచారింప లే దట్టి,
ద్రవ్యంబు గను విరుద్ధంబు గాన
నిరవయవము గాదు ♦ నిఖిలజగత్స్వరూ
పముచేత మిగుల నేర్పడుటవలన

తే. సావయవమునుగాదు దృశ్యము సుషుప్తి
యం దడంగినఁ దాను శూన్యంబుగామి
నొనర నుభయాత్మకముగా దయుక్తమగుట
నాంజనేయ మదీయమాయాతమంబు. 21

తా. నాసంబంధమయిన మాయయనుచీకటి సత్తుగాదు. బ్రహ్మజ్ఞానముచే త్రికాలములందును బాధింపబడుచున్నది కావున సత్తుగాదు. నే నజ్ఞానిని దుఃఖినిఅను అనుభవమున్నందున నసత్తుగాదు. అసద్రూపమగునది భూమిగలదనుట విరుద్ధముగావున సదసత్తుగాదు. లోకముయొక్క ఆకృతిచే గన్పడుటచే నిరవయవమనరాదు. ప్రపంచము నిద్రయందు నశించినను ధ్వంసశింపదుగావున అవయవములుగలదియుగాదు. ఒకవస్తువే అంగముగలదనియు లేదనియు జెప్పగాదుగనుక నుభయాత్మకముగాదు.

తే. అరయ నాయున్కికంటె వేఱైనయున్కి
లేదు గాన మద్భిన్నంబు ♦ గా దవిద్య
ప్రకృతి యజ్ఞాన మని పల్కఁ ♦ బడుటవలన
గాదు మదభిన్నమును నాయ ♦ నాదిమాయ. 22

తా. పావనీ! ప్రకృతినాయందే యున్కిగల్గియుండును. ఇతరమగు తావులనుండదుగావున ప్రకృతి నాకంటె భిన్నమయినదిగాదు. అనాదియైన మాయప్రకృతియనియు అజ్ఞానమనియు జెప్పబడుటవలన నాకంటె భిన్నమయినదిగాదు.

క. భిన్నాభిన్నము గా దని
యెన్నంగా నేల ప్రకృతి ♦ యి ట్లగుట నుసం

పన్ను లనిర్వాచ్యం బని
మున్ను గణించిరి సమస్తమును దెలిసి సుతా. 23

తా. మాయ నాకంటె భిన్నమయిన దనియు గాదనియు తర్కించుటెందులకు, మాయయం దట్టిభేదములేమిచే బ్రహ్మజ్ఞానులు మాయాస్వరూపము నెఱింగి ఇది యిట్టిదని జెప్ప నశక్యమయినదనిరి.

తే. అనుభవజ్ఞానదృష్టిచే నరయఁ దుచ్ఛ
మొగి ననిర్వచనీయమౌ యుక్తిదృష్టి
చేత లౌకికమయదృష్టిచే ననంత
మగు దలంప మదీయమాయాతమంబు. 24

తా. నాయొక్క మాయయను చీకటి విజ్ఞానదృష్టిచే జూచిన నీచమైనదిగాను అపవాదయుక్తిరూపకమైన దృష్టిచే వచింపరానట్టిదియును లౌకికదృష్టిచేత ననంతమైనదియును నగును.

సీ. త్రాడు భుజంగమై స్థాణువు పురుషుఁడై
రాజిల్లు శుక్తిక రజత మగుచు
మరుమరీచికలు నిర్మలసలిలంబులై
తొడరి మిన్ను సితమై తోఁచుపగిది
నద్వయామలసచ్చిదానందమయుఁడనై
తగు నేను మిగుల నెద్దానివలనఁ
దొలుత నసజ్జడ దుఃఖాత్మకము లైన
జగములై కనుపింతు జనుల కెల్ల
తే. దృఢతరాద్వైతవిజ్ఞానదృష్టిచేతఁ
బండితులు పూర్ణ నిర్గుణబ్రహ్మమయుఁడ
నైన నను గాంచినంత నెయ్యది యభావ
మగు నదియసూ మదీయమాయాతమంబు. 25

తా. త్రాడు సర్పముగను, ఆకులు కొమ్మలులేనిమొక్క మనుష్యునిగను, ముత్య పుచిప్పలను వెండిగను, ఎండమావుల నీరమును, ఆకాశము నీలముగను గాన్పించునట్లు లనకంటె నితరము లేనిదియును, అవస్థాత్రయముచే నశింపనిదియు, సాధనాంతరములులేక ప్రకాశించునదియును అయిన జ్ఞానమును అగు నేను యేమాయచే లోకులకు అసత్యము అజ్ఞానము శోకము మున్నగుదానితో గూడిన లోకమువలె గాన్పింతునో అట్టినన్ను పండితులు దృఢమైనట్టియు, అఖండమైనట్టియు నగు అనుభవజ్ఞానదృష్టిచేత పరమాత్మస్వరూపునిగా దెలిసికొన్నంతనే యేది నశించుచున్నదో యది నా సంబంధమైన మాయ యనబడును.

వ. అది మఱియు సర్వభూతసుషుప్తిసమష్టిరూపంబు సమస్తప్రపంచవాసనామయంబు సత్త్వరజస్తమోగుణాత్మకంబు స్వాంతస్థసప్తానంతకోటిజీవసంఘాతంబుఁ గేవలజడంబు మోహాత్మకంబు సకలజగదుపాదానకారణంబు నవిద్యావ్యక్తతమస్సుషుప్తిప్రకృతి ప్రళయప్రధానమాయాజ్ఞానాదిశబ్దవాచ్యంబు నై యొప్పుచుండు నని వెండియు. 26

తా. మరియు నాప్రకృతి సమస్తప్రాణులయొక్క నిద్రయంతయు స్వరూపము గాగలదియు వాసనయే యాకారముగా గలదియు సత్త్వరజస్తమోగుణములే స్వరూపముగా గలదియు, సమస్తప్రాణిలోకమును దనయందు గలదియు, మిక్కిలి మూఢమైనదియును భ్రమయే రూపమైనదియును లోకములకు నుపాదానకారణమైనదియునునై అవిద్య, అవ్యక్తము, తమంబు, సుషుప్తి, ప్రకృతిమున్నగు పేరులచే ప్రకాశించుచుండును.

తే. ఆదిమధ్యాంతశూన్యమై నట్టిప్రకృతి
యాదిమధ్యాంతములు గల్గినట్ల తోఁచి
యాదిమధ్యాంతరహితాద్వయాత్మునకును
నాదిమధ్యాంతములు గల్గ నావరించె. 27

తా. ప్రకృతి ఆదిమధ్యాంతములు లేనిదయ్యు నాదిమధ్యాంతములు గల్గినదానివలెనుండి సృష్టిస్థితిలయములులేని పరమాత్మకు సృష్టిస్థితిలయములు గలుగునట్లు ఆక్రమించును.

క. కవియ న్మాలప్రకృతియు
ద్వివిధయగును మాయ యన నవిద్య యనంగ నా

ద్యవిమలసత్త్వాత్మిక యగు
నవిమలసత్త్వప్రధాన యగు నన్య తగన్. 28

తా. ఈవిధముగా నావరించు మూలప్రకృతి మాయయనియు నవిద్యయనియు రెండువిధములు. అందు మాయ నిర్మలమగు సత్త్వగుణమే ప్రధానముగాగలది. అవిద్య మాలిన్యమైన సత్త్వగుణమే ముఖ్యమైనది.

తే. అమలసత్త్వప్రధాన మైనట్టి మాయ
యందు దాని కధిష్ఠాన మైన నేను
ప్రతిఫలించితి మేఘసంగతజలముల
మించి యాకాశ మమర బింబించినట్లు. 29

తా. సత్త్వగుణప్రధానముగాగల సమష్టిరూపమైన మాయయందు అట్టిమాయకు ఆధారభూతుడనైన నేను ఆకాశముతోగూడిన మేఘము నీళ్ళయందు ప్రతిఫలించినట్లు నేను బొడకట్టుచుందును.

క. మాయాప్రతిబింబంబును
మాయాధిష్ఠానపరము మాయయుఁ గూడన్
మాయావి యైన యీశుఁ డ
మాయకుఁడగు నతఁడు బ్రహ్మమయుఁడై యుంటన్. 30

తా. సత్త్వగుణప్రధానమైన మాయయందు ప్రతిఫలించినబ్రహ్మచైతన్యమును మాయాధిష్ఠానమైన పరబ్రహ్మమును మాయయును జేరి యీశ్వరుండగును. ఆయీశ్వరుఁడు పరమాత్మస్వరూపియైనందున మాయారహితుఁడై వెలుఁగుచున్న,

క. ఆ యీశ్వరుండ నే నా
మాయయె సీతావధూటి మదిఁ దలఁప మహా
మాయుఁడ నయ్యు వశీకృత
మాయుఁడనై యవతరింతు మహి నిట్లనఘా. 31

తా. పావనీ! సత్త్వగుణస్వరూపిణియైన మాయయే సీత. అట్టి మాయతోగూడిన యీశ్వరుఁడను నేను. నాకు మాయ స్వాధీనమైనదైనను నేను మాయకు స్వాధీనుఁడనై యీప్రకారము పుట్టుదును.

వ. ఇట్లు శుద్ధసత్త్వప్రధానమాయోపాధికుండును సర్వేశ్వరుండనైన నేను వశీకృతమాయుండ నగుటంజేసి జగంబులు సృజియించి తద్రక్షణంబుకొఱకుఁ దొల్లి మత్స్యకూర్మ వరాహనారసింహ వామన పరశురామావతారంబులు ధరించి దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబులం గావించి యిప్పుడు శ్రీరామరూపంబుచే నవతరించి రావణకుంభకర్ణాది రాక్షసుల సంహరించి భూభారంబు నివారించితి నింక నిట మీఁదట బలరామకృష్ణబుద్ధకల్కిరూపంబుల నే నవతరింపఁగలవాఁడ నాచరిత్రంబులు లోకత్రయపవిత్రంబులు భవలతాలవిత్రంబులై యొప్పునని చెప్పి వెండియును. 32

తా. ఇట్లు నిర్మలమగు సత్త్వగుణమే ప్రధానముగాగల మాయయను కారణోపాధి గలవాడను, జీవకోటికి నియంతనైన నేను మాయను వశమొనరించుకొని లోకములను సృజించి- నాచే సృజింపబడిన లోకముల సంరక్షించునిమిత్తమై మత్స్యకూర్మవరాహనారసింహ వామనపరశురామావతారముల ధరించి దుష్టనిగ్రహ శిష్టానుగ్రహంబుల గావించియిప్పుడు శ్రీరామరూపంబున వసించి రావణకుంభకర్ణాది రాక్షసుల సంహరించి భూభారమును నివారించితి నింకమీదట బలరామకృష్ణ బుద్ధ కల్కిరూపముల నే నవతరించెదను. నాచరిత్రము ముల్లోకంబులకు పవిత్రమైనదియును సంసారపాశము లను తీగలను నాశనముచేయు కొడవండ్లునునై యుండును.

చ. గురుఁడు హిరణ్యగర్భుఁడని కొందఱు గొంద ఱిల న్మహావిరాట్పురుషుఁడటంచుఁ గొందఱు బుభుప్రభుఁడంచుముకుందుఁడంచుఁ గొందఱు శివుఁ డంచుఁ గొందఱు విఘ్ననాయకుఁ డంచును గొందఱుంబరాపరవపు నన్నెఱుంగక యుపాస్తి యొనర్తురు రజ్జులై తగన్. 33

తా. అవివేకులుకొందఱు నన్ను తెలియజాలక పరాపరప్రకృతులకంటె విలక్షణుఁడననియు, బృహస్పతిననియు, బ్రహ్మననియు, సమష్టివిగ్రహస్వరూపిననియు దేవతలకు నధీశుఁడైన యింద్రుడననియు, విష్ణువనియు, శంకరుఁడనియు, వినాయకుఁడనియు, బుద్ధుఁడనియు గరుత్మంతుఁడనియు, భావించి యారాధించుచున్నారు.

విశ్వమునకు ఉపాదాననిమిత్తకారణములు.

ఆ. వినుము నేను విశ్వకమునకు నుపాదాన
కారణము నిమిత్తకారణంబు
నగుచు నూర్ణనాభిపగిది నొప్పుదునింకఁ
గార్యములును నేనకే కపివరేణ్య. 34

తా. పావనీ! నే నీవిశ్వమున కుత్పత్తి కారణమును కలిగినదానిని వేఱుగాఁజేయు టకుఁగారణమును అగుచు సాలిపురుగుచందమున ప్రకాశించుచుందును. మఱియు, నేనే జీవేశ్వరజగత్తులై యున్నాను.

వ. ఇట్లు సర్వేశ్వరుండనైన నాకు నవ్యాకృతంబు మహానందమయకోశంబు నగు, సమస్తభూతసమష్ట్యజ్ఞానంబు కారణశరీరంబు, మహాసుషుప్తియవస్థ బ్రహ్మాదిస్తంబపర్యంతంబులైన సకలభూతంబులవయవంబులు, జగదుత్పత్తిస్థితిలయంబులు వ్యాపారంబులు, వేదశాస్త్రంబులు నిశ్వాసంబులై యొప్పునని చెప్పి వెండియు నిట్లనియె.

తా. ఇట్లు జీవులకెల్ల ప్రభుఁడనైన నాకు అట్టిట్టిదనరానిదియు బ్రహ్మమొదలు పిపీలికాపర్యంతము నుండు సమస్తజీవుల సుషుప్త్యానందములుగూడి సమష్ట్యానందకోశమగు అజ్ఞానమంతయు కారణదేహమును సకలజీవులయొక్క నిద్రావస్థయు, బ్రహ్మమొదలుకొని తృణమువఱకునుండు సమస్తభూతములు అవయవములును లోకముయొక్క సృష్టిస్థితిలయము లొనరించు వ్యాపారములును వేదశాస్త్రములు నిట్టూర్పులునై యుండును. అనిదెల్పి మరల నిట్లు జెప్పుచున్నాఁడు.

జీవనిర్ణయము.

తే. మలినసత్త్వప్రధానయౌ నల యవిద్య
దానియందు నధిష్ఠానమైన నేను
బ్రతిఫలించితిఁ గలశసంగతజలముల
సాభ్రనక్షత్రఖచ్ఛాయచందమునను. 36

తా. జీవోపాధియగు నవిద్య రాజసగుణ ప్రధానమైనదగును. అట్టి త్రిగుణసహితమైన మూలప్రకృతికి ఆధారమగు నేను కుండలోనిజలమున ప్రతిఫలించెడు మేఘాదులవలె అవిద్యయందు ప్రకాశించెదను.

క. జీవుండగు నాతఁడవి
ద్యావశుఁడై స్థూలసూక్ష్మతను వాసనలన్
భావించుచు సేవించుచుఁ
గేవల మూఢప్రవృత్తిఁ గ్రీడించుమెయిన్. 37

తా. కుండలోఁ బ్రతిఫలించిన ఆకాశమువలె నవిద్యయందు దోచిన ప్రతిబింబితమైన స్వరూపముగలవాఁడు మలినసత్త్వప్రధానమగు నవిద్యకు స్వాధీనుఁడై స్థూలసూక్ష్మశరీరములు తాననియెంచుచు ఆశరీరముల పోషించుచు తెలివిహీనుఁడై జీవుఁడగువాఁడువర్తించుచుండును.

ఆ. అతఁడు ప్రాజ్ఞుఁడనఁగ నానందమయుఁ డనఁ
బారమార్థికుఁ డనఁ బరఁగు చుండు
వ్యష్టికారణాంగవశుఁడై సుషుప్తి సు
ఖానుభూతి మఱిగి యనిలతనయ. 38

తా. పావనీ! జీవుఁడు కారణశరీరమునకు లోఁబడినవాఁడై నిద్రయందలి యానందమున ననుభవించువాఁడగుటచే ప్రాజ్ఞుఁడనియు, ఆనందమయకోశముగలవాఁడగుటచే పారమార్థికుఁడనియు పేర్ల నొప్పుచుండును.

వ. ఇట్లవిద్యయు నవిద్యాప్రతిబింబంబుఁ దదధిష్ఠానచైతన్యంబుం గూడి జీవు డనంబరఁగు నాజీవున కానందమయకోశసంజ్ఞికం బైన వ్యష్ట్యజ్ఞానంబు కారణశరీరంబు సుషుప్త్యవస్థ యగు నారెంటియందు నభిమానంబు గల యతండు ప్రాజ్ఞుండన నొప్పు నతని కింతమాత్రంబుచేత జీవత్వంబు పర్యాప్తంబు గామిం జేసి తదీయాదృష్టసహాయపూర్వకసూక్ష్మశరీరసృష్టిప్రకారంబు చెప్పెద వినుమని యిట్లనియె. 39

ఈవిధమున నవిద్యయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయును గలసి జీవుడనబడును. జీవునకు ఆనందమయకోశమనువ్యష్టిరూపమైన యవివేకకారణము దేహము. నిద్రయవస్థయు నగును. ఆకారణశరీర నిద్రలయందు కర్తృత్వముగలవాఁడు ప్రాజ్ఞుడనబడును. ప్రాజ్ఞున కింతమాత్రమున జీవధర్మము పూర్తిగానందున నాజీవుని దృష్టికి గానరానిదియు భవిష్యత్కాలమందు బొందదగిన ఫలమునకు సహాయభూతమైన సూక్ష్మశరీరసృష్టిప్రకారమును వివరించెద వినుమని యిట్లుజెప్పెను.

## సూక్ష్మశరీరసృష్టిప్రకారము.

తే. అమలసత్త్వప్రధానమాయాసమన్వి
తేశ్వరుఁడ నగు నేను సృష్టీచ్ఛచేతఁ
బూని వీక్షించితి తమః ప్రధానమాయ
నఖిలచేతనకర్మ సహాయముగను. 40

తా. శుద్ధసత్త్వప్రధానమైన మాయతోఁగలసిన పరమేశ్వరుఁడనగు నేను నిర్మించు కోరికతో తమోగుణప్రధానమైన మాయను సమస్తజీవులయొక్క పుణ్యపాప మిశ్రకర్మలకు తోడ్పాటుగా సంపూర్ణదృష్టిని జూచితిని.

వ. ఇట్లు చూచిన నాతమఃప్రధానసమష్ట్యజ్ఞానావచ్ఛిన్నచైతన్యంబు వలన శబ్దగుణకాకాశంబు నయ్యాకాశావచ్ఛిన్నచైతన్యంబువలన స్పర్శగుణకానిలంబు నయ్యనిలావచ్ఛిన్నచైతన్యంబువలన రూపగుణకానలంబు నయ్యనలావచ్ఛిన్నచైతన్యంబువలన రసగుణకజలంబు నజ్జలావచ్ఛిన్నచైతన్యంబువలనగంధగుణకపృథివియుఁబుట్టె నివియ పంచీకృతసూక్ష్మభూతంబులనియుఁబంచతన్మాత్రలనియుం జెప్పంబడు.నీభూతపంచకప్రత్యేకసత్త్వగుణార్ధంబువలనఁ గ్రమంబున దిగ్వాతార్కప్రచేతోశ్వినీ దేవతాసమన్విత శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులు జనియించె మిగిలిన సత్త్వార్ధసమష్టివలనఁ జంద్రవాచస్పతిరుద్రక్షేత్రజ్ఞ దేవతాయుక్తమనోబుద్ధ్యహంకారచిత్తంబులును సంభవించె నవ్వియదాదిపంచకరజోగుణార్ధంబువలన వరుసం దోడన వహ్నీంద్రోపేంద్రమృత్యుప్రజాపతిదేవతాసమేత వాక్పాణిపాదపాయూపస్థలు జన్మించెఁ దక్కిన రజోగుణార్ధసమష్టివలన విశిష్టవిశ్వకర్తృవిశ్వయోన్యజజయదేవతాక ప్రాణాపానవ్యానోదానసమానంబు లుద్భవించె నివ్విధంబున నుత్పన్నంబులైన జ్ఞానేంద్రియ పంచకంబు నంతఃకరణచతుష్టయంబు గర్మేంద్రియపంచకంబుఁ బ్రాణాదిపంచకంబుం గూడి యేకోనవింశత్యవయవంబుల లింగశరీరంబుగలిగె నీసూక్ష్మదేహంబు

వృక్షవనంబులభంగి నొక్కటి వ్యష్టి యనియు సర్వంబు సమష్టియని యుం జెప్ప నొప్పు వీనికి వ్యష్టి సమష్టి స్వప్నంబు లవస్థలగు నీవ్య ష్టిసూక్ష్మాంగ స్వప్నంబులయం దాప్రాజ్ఞుం డభిమాని యై ప్రాతి భాసికుండు స్వప్నకల్పితుండుఁ దైజసుం డనం బ్రవర్తిల్లు నాసమష్టి సూక్ష్మకాయ స్వప్నవిశిష్టుండనై యీశ్వరుండ నయిన నేను హిర ణ్యగర్భుండు సూత్రాత్మకుండుఁ బ్రాణుం డన సర్వజీవోపాస్యుండ నై యుండుదు నిది సూక్ష్మసృష్టి తెలియంగు. ఇంక స్థూలప్రపంచప్రకా రంబు వినుపించెద విమ మని యిట్లనియె. 41

తా. ఈశ్వరుఁడు సత్త్వగుణ ప్రధానమైన మాయతోగూడి తమోగుణ ప్రధాన మైన మాయను దిలకింపగా పూర్వోదాహృతమైనదియు, తమోగుణప్రధానమైనదియు, సర్వమునకును నుపాదాన కారణమైనదియునగు మాయతోగూడుకొనిన బ్రహ్మశక్తివలన శబ్దమే గుణముగాగల యాకాశమును ఆయాకాశముతోఁజేరిన యాత్మశక్తివలన స్పర్శగుణ ముగల వాయువును, ఆవాయువుతోగూడిన పరబ్రహ్మశక్తివలన రూపమే గుణముగాగల యగ్నియు, నాయగ్నితోగూడిన పరబ్రహ్మశక్తివలన మాధుర్యమే గుణముగాగల యుద కమును, ఆయుదకముతో గలసిన బ్రహ్మశక్తివలన గంధమే గుణముగాగల భూమియు పుట్టెను.ఒకటివలన నొకటిగా జన్మించిన యీపంచభూతములును అయిదుగా భాగింప బడని సూక్ష్మభూతములనియు పంచతన్మాత్రలనియు, జెప్పబడును.

తమోగుణమువలన బుట్టిన యీసూక్ష్మభూతములు 5 ను సత్త్వరజోగుణముల చేత సత్త్వసూక్ష్మ పంచభూతములనియు, రజస్సూక్ష్మ పంచభూతములనియు రెండువిధ ములు. మరియు నివి వ్యష్టి సమష్టిభేదములచేత సత్త్వవ్యష్టి సూక్ష్మభూతములనియును సత్త్వసమష్టి భూతములనియును, రజోవ్యష్టి సూక్ష్మభూతములనియును రజోసమష్టి సూక్ష్మభూతములనియును నాల్గువిధంబులయ్యెను. (1) సత్త్వవ్యష్టి సూక్ష్మభూతముల వలన పదిదిక్కులు, గాలి, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వినీదేవతలు, అధిదేవతలుగా, గల, చెవి, చర్మము, నేత్రము, నాలుక, ముక్కు అను విజ్ఞానేంద్రియములు పుట్టెను. (2)మిగి లిన సత్త్వసమష్టి సూక్ష్మభూతములవలన చంద్రుఁడు, బృహస్పతి, ఈశ్వరుఁడు, జీవుడు. అధిదేవతలుగాగల సంశయాత్మకమగు అహంకారమును చంచలాత్మకమగు చిత్తమును పుట్టెను. (3) రజోగుణవ్యష్టి సూక్ష్మభూతములవలన అగ్ని, దేవేంద్రుఁడు, విష్ణువు, యమ

డు, బ్రహ్మ, వీరధి దేవతలుగాగల నోరు, హస్తము, పాదము, గుదము, ఉపస్థము అను కర్మేంద్రియపంచకము పుట్టెను. (4) రజోగుణ సమష్టిసూక్ష్మభూతములవలన విశిష్టుఁడు విశ్వకర్త విశ్వయోని అజుఁడు జయుఁడు అను వీరలధిదేవతలుగాగల ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము సమానము అను పంచప్రాణములును పుట్టెను. ఇట్లుపుట్టిన జ్ఞానేంద్రియములు 5, మనోబుద్ధి చిత్తాహంకారములను అంతఃకరణచతుష్టయములు. 4, కర్మేంద్రియములు 5, ప్రాణాదివాయువులు 5, చేరి 19 అంగములచేత లింగశరీరము కలిగెను. సూక్ష్మశరీరము వృక్షమువలెను వనమువలెను వ్యష్టి సమష్టియనబడును. లింగశరీరములకు వ్యష్టిసమిష్టి స్వప్నదశలగును. ఈ వ్యష్టిలింగశరీర స్వప్నములయందు పూర్వోదావృతముగ సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుఁడగువాఁడు కర్తృత్వముగల్గి ప్రపంచాకారవృత్తి దోచుకాలమునం దున్నాడు కావున, ప్రాతిభాసికుఁడనియు, అజ్ఞానకార్యమగు నిద్రాశక్తితో గల్పింపబడునుగాన స్వప్నకలితుఁడనియు అంతఃకరణవృత్తితో గూడినందున తైజసుఁడనియు పిలువబడుచుండును. సమష్టి సూక్ష్మశరీరములయందు గూడుకొనిన యీశ్వరుఁడగు నేను జ్ఞానశక్తియుతుండనగుటం జేసి హిరణ్యగర్భుఁడనియు, మణులయందు సూత్రమువలె నానావిధప్రపంచమందును చేరియుండుటవలన సూత్రాత్మకుఁడననియు, క్రియాశక్తితో గూడుకొనియుండుటచేత ప్రాణుఁడననియు సమస్తప్రాణులచేతనుపూజింపబడువాఁడనైయుందును. ఇపుఁడు నాజెప్పినది జీవేశ్వరులయొక్క సూక్ష్మసృష్టి క్రమము. ఇంకమీద స్థూలపంచీకరణ ప్రకారము చెప్పెద నాలకింపుము-అని యిట్లు చెప్పనారంభించెను.

సీ. తత తమోగుణక భూత తముల నైదింటిని
క్రమమున రెండుభాగములుఁ జేసి
తొలుతఁ బంచార్ధాంశములఁ బూని వేర్వేఱఁ
దనియలు నాల్గుగాననువుపఱచి
ముఖ్యార్ధముల శేషభూతఖండచతుష్ట
యముల నొండొంటినెయ్యమునఁ గూర్పఁ
బంచీకృతంబులై పటుతరస్థూలంబు
లభివ్యక్తంబులయ్యె నొంట
తే. వాయునందన వినుమింక వానివలన
నఖిలజగములు నానాచరాచరములు

బహువిధాన్నంబులును ఘటపటగృహాది
సకలదృశ్యపదార్థము లుద్భవించె. 42

తా. పావనీ! తమోగుణప్రధానములైన పంచభూతములను రెండుగా విభజింప నవి 10 భాగములగును. ఆపదిభాగములలో నైదింటిని నాల్గేసి తునియలుగాజేసి యాభాగములను, భాగింపనినై దర్ధభాగములను, ఒకటొకటితో కలుపగా పంచీకృతములై ప్రకాశించెను. వానివలన చతుర్దశభువనములు పుట్టెను. మొదట పృధివిని రెండుగాభాగించి యారెంటిలో నొకభాగమును దూరముగానుంచి మిగిలినదానిని నాల్గుభాగములుచేసి ఆ నాలుగుభాగములను కడగానుంచిన పృధివిభాగములో చేర్చక నాలుగు భాగింపబడిన జలాగ్ని వాయు ఆకాశభాగములతో జేర్పవలెను.

పైనజెప్పిన క్రమముగా జేర్చుటచేతపంచీకరణ కదంబము.

(1.) అంతఃకరణము, సమానవాయువు, శ్రోత్రేంద్రియము, శబ్దము, వాక్కు.
(2.) మనస్సు, వ్యానవాయువు త్వగింద్రియము, స్పర్శము పాణి.
(3.) బుద్ధి, ఉదానవాయువు చక్షువు, రూపము పాదము.
(4.) చిత్తము ప్రాణవాయువుజిహ్వా 1 రసనేంద్రియము రసముఉపస్థేంద్రియము.
(5.) అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము పాయ్వింద్రియము.

## స్థూలపంచీకరణము.

| ఆకాశము. | వాయువు. | తేజము. | జలము. | పృథివి. |
|---|---|---|---|---|
| అంతఃకరణము. | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| సమానవాయువు. | వ్యానవాయువు | ఉదానము | ప్రాణము | అపానము |
| శ్రోత్రేంద్రియము. | త్వగింద్రియము | చక్షురింద్రియము | రసనేంద్రియము | ఘ్రాణేంద్రియం |
| శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| వాగింద్రియము | పాణీంద్రియము | పాదేంద్రియము | ఉపస్థేంద్రియం | పాయ్వింద్రియము. |

(1) తమోగుణాకాశార్ధభాగ మంతఃకరణచతుష్టయమయ్యెను.

మిగిలిన యర్ధభాగము 4 భాగములు చేయబడియెను. అందు ప్రథమభాగము తామసవాయువులో గలసి మనోగోళకమయ్యెను. ద్వితీయభాగము తామసాగ్నితో గలసి బుద్ధిగోళకమయ్యెను. తృతీయభాగము తామసజలముల గలసి చిత్తమయ్యెను. చతుర్థ భాగముక్ష్మతామసపృథ్విలో గలసి అహంకారస్థానమాయెను.

(2) తమోగుణవాయువులో నర్ధభాగము వ్యానగోళకమయ్యెను.

తమోగుణవాయువునందు మిగిలిన యర్ధము నాల్గుభాగములయ్యెను. అందు ప్రథమభాగము తామసాకాశమున గలసి సమానవాయువయ్యెను. ద్వితీయభాగము తామసాగ్నిలో గలసి ఉదానమయ్యెను. తృతీయభాగము తామసజలములో గలసి ప్రాణవాయు గోళకమయ్యెను. చతుర్థభాగము తామసపృథివియందు గలసి అపానమయ్యెను.

(3) తామసాగ్నియందర్ధము చక్షుర్గోళకమయ్యెను. మిగిలిన యర్ధము 4 భాగములయ్యెను. అందు ప్రథమశకలము తామసాకాశమున గలసి శ్రోత్రమయ్యెను. ద్వితీయ శకలము తమోగుణవాయువున గలసి స్పర్శగోళకమయ్యెను. తృతీయము తామసజలమున గలసి జిహ్వాయయ్యెను. చతుర్థము తామసపృథ్విని గలసి గంధగోళకమయ్యెను.

(4) తమోజలమునందర్ధము రసగోళకమయ్యెను.

శేషార్ధము 4 భాగలయ్యెను. అందు ప్రథమము తామసాకాశమునగలసి శబ్దగోళకమయ్యెను. ద్వితీయభాగము తమోగుణవాయువున గలసి స్పర్శగోళకమయ్యెను. తృతీయము తమోగుణాగ్నిలో జేరి రూపగోళకమయ్యెను. చతుర్థభాగము తమోగుణపృథివి గలసి గంధగోళకమయ్యెను.

(5) తమోగుణధరార్ధభాగము వాయుగోళకమయ్యెను.

మిగిలినది 4 భాగములయ్యెను. అందు ప్రథమము తామసాకాశమున జేరి వాగ్గోళకమయ్యెను. ద్వితీయము తమోగుణవాయువున గలసి పాణిగోళకమయ్యెను. తృతీయము తమోగుణాగ్ని గలసి పాదమయ్యెను. చతుర్థముతమోగుణజలమునగలసిగుహ్య మయ్యెను.

---

## ఈశ్వరశరీరవివేచనము.

వ. ఇట్లు గగనార్ధంబున వాయు తేజో జల భూభాగంబుల, ననిలార్ధంబున నాకాశానలసలిలేలాంశంబులఁ, బావకార్ధంబున నభ స్సమీర తోయ ధరణీఖండంబుల, నీరార్ధంబున వియన్మరుత్కృశానుధాత్రీశకలంబుల, ధరార్ధంబున వ్యోమపవనాగ్న్యుదకంబుల తునియల జీవా

దృష్టసహాయంబునం గూర్చిన క్రమంబు చేత శబ్దగుణకంబయిన యా కాశంబు శబ్దస్పర్శగుణకం బైన ఘనమానంబు శబ్దస్పర్శరూపగుణకం బైన దహనంబు శబ్దస్పర్శరూపరసగుణకం బైన యంబువులు శబ్దస్పర్శరూపరసగంధసమేతం బైన ధరణియుం బంచీకృతంబులై మహాస్థూలంబులై యభివ్యక్తంబులయ్యె నిమ్మహాభూతలంబులవలన నతల వితల రసాతల తలాతల మహాతల పాతాళ భూలోక భువర్లోక స్వర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకంబు లను చతుర్దశ భువనంబులు దత్తల్లోకోచిత జరాయు జాండజ స్వేద జోద్భిజ రూప చతుర్విధభూతగ్రామంబులుం దత్తత్ప్రాణియోగ్యాన్నపానాదికంబులు ఘటపటాది సర్వపదార్థంబులు సంభవించె నంతవట్టునుం గూడి స్థూలప్రపంచం బగు దీనికి వ్యష్టిసమష్ట్యాత్మకం బైన జాగరం బవస్థ యగు నం దొక్కొక్కవ్యష్టి స్థూలశరీరజాగరంబులయం దాలింగ దేహోపాధికుండైన తైజసుం డభిమానంబు చేసి చిదాభాసుం డన వ్యావహారికుం డన విశ్వుం డన నొప్పు హిరణ్యగర్భుండనయి నేను సమష్టిస్థూలవిగ్రహజాగ్రద్విశిష్టుండ నయి వైరాజసుండన వైశ్వానరుం డన విరాట్పురుషుం డన సకలజగదారాధ్యుండ నయి ప్రకాశించు చుండుదు మఱియును. 43

తా. ఇట్లు 4 భాగింపబడిన ఆకాశముయొక్క సగమునందు గాలి జలాగ్ని భూమి తునుకలను, 4 గా భాగింపబడిన గాలియొక్క సగమునందు ఆకాశ అగ్నిజల భూభాగములును, 4 తునుకలుగా జేయబడిన అగ్ని సగభాగమున ఆకాశ గాలి జలము భూమి తునుకలును 4 గా భాగింపబడిన జలార్ధభాగమునందు ఆకాశ గాలి అగ్ని భూ తునకలును, 4 గా భాగింపబడిన పృథివ్యర్ధభాగములను ఆకాశవాయ్వగ్నిజలభాగములను సమస్తప్రాణుల ప్రారబ్ధానుభవములతోడ్పాటుచే నొకభాగము మరియొకభూతభాగము జేర్చినట్లుగా శబ్దమే గుణముగాగలయాకాశమునందు శబ్దస్పర్శములుగల వాయువునుశబ్దస్పర్శరూపములుగల యగ్నియు, శబ్దస్పర్శరూపరసములుగల జలమును శబ్దస్పర్శరూపరసగంధములుగల భూమి అయిదువిధములుగా విభజింపబడి ప్రబలమయ్యెను.

ఈపంచమహాభూతములవలన 14 లోకములును ఆయాలోకములకు దగిన వసుజులు గుఱ్ఱములు పశువులు మొదలైనవియు, అండజములు, స్వేదజములు వృక్షములును అను నాల్గువిధములైన ప్రాణిసమూహమును వానికి దగిన అన్నపానాదులు మున్నగు సమస్తవస్తువులును పుట్టెను. ఇవన్నియుజేరి స్థూలప్రపంచ సృష్టియయ్యెను. ఈస్థూలోపాధికి వ్యష్టిసమష్టిరూపమైన జీవేశ్వరుల జాగ్రదవస్థదశయగును. ఆవ్యష్టిసమష్టిరూపకదశయందు ఒక్కొక్కనికి స్థూలశరీరజాగ్రదవస్థలయందు వెనుకజెప్పబడిన దేహాభిమానియగు తైజసుఁ డభిమానమును పొంది చిత్తువలె దోచుటచే చిదాభాసుఁడనియు, లోకవ్యవహారములు చేయుచుండుటచే వ్యవహారికుండునై అభిమానియైయుండుటచే విశ్వుడనియు చెప్పబడుచుండును. సమష్టిసూక్ష్మశరీరాభిమానినై నేను హిరణ్యగర్భు డనుపేరున సమస్తజీవసమూహముయొక్క రూపనుగు మహాస్థూలశరీరజాగ్రదవస్థతోగూడినవాడనై యుండుటచే వైరాజసుడనియు యెల్లజీవులయందునను అభిమానముగలవాడ నగుటచే వైశ్వానరుడనియు, పెక్కువిధముల దోచుటచే విరాట్పురుషుఁడననియు, జగములచే పూజింపబడువాడనై ప్రకాశింతును.

చ. ధరణి పదంబులుర్వ్ దివి తలతం బగు మస్తక మంతరిక్షముక్
సురుచిరనాభి చండకరసోములు లోచనము ల్దిశల్ శ్రుతుల్
వరదహనుండు నెమ్మొగము వాయువు ప్రాణము లు స్మహావిరా
ట్పురుషుఁడ నైన నాకుఁ గపిపుంగవ విశ్వశరీ రనాటర్చెక్. 44

తా. పావనీ! ప్రపంచమే శరీరముగా గలవాడనగుటచే ప్రకాశించెడి నాకు భూమి పాదములు, స్వర్గము విశాలమగుతలయు, ఆకాశము పొక్కిలియు, సూర్యచంద్రులు నేత్రములును, దిక్కులు చెవులును, మంత్రములచే పవిత్రముచేయబడిన శ్రౌతస్మార్తాగ్ని నోరును, గాలి ప్రాణమునునై యున్నాడను.

సుగంధివృత్తము.

ధారణీసురు ల్ముఖంబు ధాత్రిపు ల్భుజంబు లో
సూరి వైశ్యు లూరువు లుశూద్రు లంఘ్రులు స్మహా
భూరుపశాషకీలతాళి భూరిరోమము ల్విరా
ట్పూరుషుండ నైన నాకు బోధశుద్ధమానసా. 45

తా. ఆంజనేయా! విరాట్పురుషుండ నగునాకు బ్రాహ్మణులు ముఖముగను, రాజులు చేతులుగను, వైశ్యులు తొడలుగను, శూద్రులు పాదములుగను క్రేష్టములగు

వృక్షములును, యవగోధూమాది మొక్కలును, మల్లెమొదలగు లతాసమూహము రోమ
మములుగను యున్నవి.

వనమయూరము.

శైలములు శల్యములు ౘ సన్నదులు నాడీ
జాలములు వార్ధులు పిచండము త్రిసంధ్యా
కాలములు చేలములు ౘ కాలజలదాళు
ల్వాలములు విశ్వతనువర్తి నగు నాకున్. 46

తా. నాకు పర్వతములు ఎముకలుగను, గంగాదినదులు నాడులుగను, సముద్ర
ముదరముగను, త్రికాలములును రసనములుగను, నీలమేఘపంక్తులు వెంట్రుకలుగాను
యున్నవి.

శా. ఆధారం బిలయై జలంబు మణిపూరాంభోజమై వహ్నియై
స్వాధిష్ఠాన మనాహతం బనిలమై ౘ చంచద్విశుద్ధంబు ఖం
బై ధీమానసరూపక ప్రకృతియాజ్ఞాబ్జాతమై యొప్ప స
ర్వాధారోన్నతవిశ్వమూర్తి నగు నాకాదిత్యసంపూజితా. 47

తా. ఆంజనేయా! సర్వప్రాణులకు స్థానమైనట్టియు అతిశయించిన ప్రణవస్వ
రూపప్రపంచస్వరూపుడనైననాకు ఆధారచక్రము భూమిగను, మణిపూరక ముదకము
గను, స్వాధిష్ఠాన మగ్నిగను, అనాహతము వాయువుగను ప్రకాశించుచుందును. విశుద్ధ
చక్ర మాకాశముగను, మనస్సు బుద్ధి వీనియొక్క అవ్యక్తమను పేరుగల ప్రకృతి ఆజ్ఞాచక్ర
ముగను ప్రకాశించుచుండును.

క. మేరు వగు బ్రహ్మదండియె
యారయగా దక్షిణోత్తరాయణములు సాం
పార నిడాపింగళ లో
సూరి పరమపదము వరసుషుమ్న కుమారా. 48

తా. ఆంజనేయా! నాకు మేరుపర్వతమ్ము వెన్నెముకగను, దక్షిణోత్తరాయణములు
ఇడాపింగళ నాడులుగను, ముక్తిస్థానము శ్రేష్ఠమగు సుషుమ్నానాళముగను యున్నవి.

సీ. అతలంబు పదములు వితలంబు గుల్ఫముల్
సుతలంబు జంఘిక ల్సుజననివహ
నుత రసాతలము జానువులు దారుణమహా
తల మూరువులు తలాతలము కటియు
నాగలోకము మహానాభ్యధోభాగంబు
భూర్భువస్స్వర్లోకములును నాభి
జఠరవక్షంబులు సరిమహర్లోకంబు
కంఠంబు సుజనలోకంబు ముఖము
తే. మఱితపోలోక మరయ భ్రూమధ్యమంబు
సత్యలోకంబు విపుల మస్తకముసుమ్ము
విశ్వరూపధరుండ నై వెలయు నాదు
జలనిధిగభీర వీరకేసరికుమారా. 49

తా. ఆంజనేయా! నాకు అతలము పాదములుగను, వితలము చీలమండలుగను, సుతలము పిక్కలుగను, రసాతలము మోకాళ్లుగను, మహాతలము తొడలుగను, తలాతలము పిరుదులుగను, పాతాళము పొత్తికడుపుగను, భూలోక భువర్లోకస్వర్గములు వరుసను బొడ్డుకడుపు రొమ్ముగను, మహర్లోకము కంఠముగను సుజనలోకము ముఖముగను, తపోలోకము భ్రూమధ్యముగను, బ్రహ్మలోకము శిరముగను యుండుటవలన నేను సమస్త లోకములును రూపముగా గలవాడనై ప్రకాశించుచున్నాను.

వ. ఇట్లు సర్వాధిష్ఠానంబు సర్వపరిపూర్ణంబు నామరూపగుణధర్మకర్మ వికారరహితాఖండసచ్చిదానందపరబ్రహ్మంబునైన నేను సమష్టికారణసూక్ష్మస్థూలశరీరోపాధివిశిష్టత్వంబువలన నవ్యాకృతుండన హిరణ్యగర్భుండన విరాట్పురుషుండన సకలజీవోపాస్యుండనై ప్రకాశింపుదు. మఱియు వ్యష్టికారణసూక్ష్మస్థూలదేహోపాధితాదాత్మ్యాభిమానంబువలన బ్రాజ్ఞుండనఁ దైజసుండన విశ్వుండన సుషుప్తి స్వప్న జాగ్రదవస్థల ననుభవించుచు నజ్ఞానవశుండనై జీవుండన నీశ్వరోపాస

కుండనైపరివర్తించినచందంబునందోఁపును నీజీవేశ్వరతత్త్వంబు లవిద్యా కల్పితంబు లయ్యవిద్య శశవిషాణవంధ్యాపుత్త్రగగనారవిందంబుల భంగి నాయందునన్నెఱింగిన నభావంబగునట్లు గావున నింక జీవేశ్వరైక్యం బుపదేశించెద సావధానచిత్తుండవై యాకర్ణింపుమని యాత్మారాముం డాంజనేయున కిట్లనియె.

తా. లోకముల కాశ్రయమైనట్టినియు, సర్వత్ర వ్యాపించినవియు, కేశవాదినామములు, మత్స్యకూర్మాదిరూపములును, లేనట్టిదియు, శమదమాదిగుణములు లేనట్టిదియు, వర్ణాశ్రమములకు దగుకర్మలు లేనట్టిదియు, షోడశకర్మల ననుష్ఠింపనిదియును, షడ్విధవికారములును లేనిదియును నగుబ్రహ్మమైన నేను సకలచేతనములయొక్క యవస్థాత్రయముగల మూడుశరీరములతో గూడియుండుటవలన అవ్యాకృతుఁడనియు, హిరణ్యగర్భుడనియు, విరాట్పురుషుఁడనియు, సమస్తజీవులచేత సేవింపబడినవాడనై ప్రకాశింతును. మరియు ఒక్కప్రాణియొక్క స్థూలసూక్ష్మకారణశరీరములును వానికి సంబంధించు మూడవస్థలును నే ననుతాదాత్మ్యభిమానమువలన ప్రాజ్ఞుఁడనియు, తైజసుఁడనియు, విశ్వుఁడనియు నవస్థాత్రయమును పొందుచు నజ్ఞానమున భూజీవుఁ డనుపేరుచే సమస్తప్రాణులతోను, వాటి అవస్థలతోను గూడియుండెడు పరమేశ్వరు నారాధించువాడనై ప్రవర్తించుచున్నట్లు గాన్పింతును. జీవేశ్వరస్వరూపములు అజ్ఞానజములు అట్టి యజ్ఞానము సమిష్టివ్యష్ట్యుపాధులులేని పరమాత్మనైననాయందు నన్నెఱింగనేని కుండేటికొమ్మువలెను వంధ్యాపుత్రునివలెను ఆకాశపుష్పమువలెను శూన్యమైనదగును. కనుక నికఁ కించిద్జ్ఞత్వాదిగుణములుగల జీవునియొక్కయు, సర్వజ్ఞత్వాదిగుణములుగల పరమాత్మయొక్కయు ఐక్యమును దెలిపెదను వినుమని యిట్లు చెప్పుచున్నాడు.

## జీవేశ్వరైక్య విచారఘట్టము.

క. కలశాంబుదములఁ దద్గత
జలములఁ గడఁద్రోయ నాకసము ప్రతిబింబం
బులు లేమి నొకటియై యి
మ్ములు నుండు నఖండమై యసేమూర్తం బగుటన్. 51

తా. కడవయందు నీటిని, మేఘమునునుండు జలమును తీసివేయగా నాకసము ప్రతిఫలింప నేరదు. కావున ఆకాశము విభాగింపనిదై, ఒక్కటైనదై అన్నిచోట్లను యుండు నదియై యుండును.

క. ఆవిధమునఁ దనువుల మా
యావిద్యలఁ దొలఁగఁ ద్రోయ నంతటిలోనన్
జీవేశ్వరులు వెలుఁగమిఁ
గేవలతత్త్వంబు వెలుఁగుఁ గీశాధీశా. 52

తా. ఆంజనేయా! పైనవివరించినట్లు వ్యష్టిసమష్ట్యాత్మకజీవేశ్వరుల స్థూలసూక్ష్మకారణశరీరములను కారణకార్యోపాధులగు మాయయను నవిద్యను వదలఁగనే జీవుఁడును యీశ్వరుఁడును ప్రకాశింపకపోవుటచే బ్రహ్మచైతన్యము ప్రధానమైనదియును విభాగింపరానిదియును తనకంటె నితరమెద్దియును లేనిదియునునై ప్రకాశించుచున్నది.

వ. అది యెట్లనిన. 53

తా. అది యెట్టిదనగా.

క. కలశజల ప్రతిబింబం
బులకు విలక్షణ మసంగమును సమూర్తంబై
యలరు ఘటాకాశము తద్
జ్ఞులకు మహాకాశ మదియెయగును వివరింపన్. 54

తా. కడవకును, కడవలోని జలమునకును, ఆజలమున ప్రకాశించు ఆకాశప్రతిబింబమునకును సంబంధములేనిదై ఇతరవస్తు సంబంధము లేనిదియునై ఆకారరహితమైనదై కడవయందలి యాకాశము ప్రకాశించును. పరికింపగా నాత్మానాత్మవివేకుల కీఘటాకాశమే యఖండాకాశమని తోచును.

తే. క్రమముతో స్థూలసూక్ష్మ కారణములకును
సుకరజాగరణస్వప్న సుప్తులకును
ప్రభువులగు విశ్వతైజసప్రాజ్ఞులకు వి
లక్షణుండగు నాత్ముండు సాక్షియగును. 55

తా. స్థూలసూక్ష్మకారణదేహములకును జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి అవస్థలకును అభిమానులైన విశ్వుఁడు తేజసుఁడు ప్రాజ్ఞుడు అనువారికంటె పరమాత్ముఁడు వేరై సాక్షియై ప్రకాశించుచున్నాఁడు.

తే. అతఁడు కూటస్థుఁడనఁ బ్రత్యగాత్ముఁడనఁగ
నక్షరుండనఁ బురుషుం డనంగసాక్షి

యనఁగవిలసిల్లుఁ దాఁ బరమాత్ముఁడగుచు
బ్రకృతి పురుషులనంటక కపరమపురుష. 56

తా. ఆంజనేయా! పరమాత్ముడు కూటస్థుండును, పంచవింశతితత్త్వస్వరూపుఁడును, నశింపనివాఁడును, ద్రష్టయును అనునామములచే పిలువబడువాఁడై మాయామయులగు జీవుల నంటక సచ్చిదానందచైతన్యమై ప్రకాశించుచుండును.

క. జలదజల ప్రతిబింబా
బులకు విలక్షణ మసంగమము నమూర్తంబై
యలరు మహాకాశము కే
వలమై వలమై కవిపవరభావజ్ఞా. 57

తా. ఆంజనేయా! మేఘమునకును అందలి నీటికిని బ్రహ్మప్రతిచ్ఛాయయైన యీశ్వరునకును వ్యతిరిక్తమైనదియును, దేని కంటనిదియును, నిర్వికారమైనదియును, ఏకస్వరూపమైనదియును సర్వవ్యాపకమైనదియునునై మహాకాశము వెలుంగుచుండును.

క. జీవసమష్టి తనుత్రిత
యావస్థాత్రితయములకు నఖిలాత్మకమా
యావిష్ణు విరాట్పురు
షావలికి న్సాక్షి యై పరాత్ముం డొప్పున్. 58

తా. ఈశ్వరుని స్థూలసూక్ష్మకారణశరీరములకును వ్యష్టిస్థూలదేహాభిమానులైన యనేక విశ్వులుగూడి విరాట్టువు వ్యష్టిసూక్ష్మదేహాభిమానులైన యనేక తేజసులుగూడి హిరణ్యగర్భుడు వ్యష్టికారణదేహాభిమానులగు ప్రాజ్ఞు లనేకులుగూడి అవ్యాకృతుఁడు గాన వీనికిని పరబ్రహ్మము సాక్షియై ప్రకాశించును.

తే. అతఁడు పరమాత్ముఁ డనఁగ బ్రహ్మం బనంగ
నలఘుపరిపూర్ణచైతన్య మనఁగనొప్పు
నిర్వికల్పుం డనంగుండు నిర్వికారుఁ
డద్వితీయుఁ డనంతుఁడై యాంజనేయ. 59

తా. ఆంజనేయా! సర్వసాక్షియగు పరమాత్ముఁడు సంకల్పవికల్పములు లేనివాఁడును, ఇతరవస్తువులతో సంబంధములేనివాడును దేశకాలవస్తువులచే భాగింపబడనివాఁ

డును, పరమాత్మయు, పరబ్రహ్మమును సర్వవ్యాపియగు చిత్స్వరూపుడునునై యున్నాడు.

వ. అట్లు గావున. 60

సీ. కలకమేఘములఁ దద్గతజలంబులఁ దదీ
య ప్రతిబింబద్వయంబు నొకటఁ
గడకుఁ ద్రోచిన ఖలోకాశ మహాకాశ
ములకు నేకత్వంబు గలిగినట్లు
వ్యష్టిసమష్టి దేహములను ధీమాయ
లను జీవపరమేశులను విచార
దృష్టిచేఁ గని నిషేధించినయెడఁ బ్రత్య
గాత్మున కప్పరమాత్మునకును

తే. సమరసైక్యంబు ఘటియించు సత్యమనుచు
నిఖలవేదాంతశాస్త్రముల్ నిశ్చయించు
గురువు లిట్లుపదేశింపుదురు బుధులకు
ననఘ యిదియె మదీయ దివ్యాశయంబు. 61

తా. కుండలోని జలమునందు ప్రకాశించిన ఆకాశమును మేఘమునందున్న నీటిలో ప్రతిఫలించిన యాకాశమును ఒక్కసారి త్యజించినయెడల ఘటమేఘములనుండు యాకాశమునకు ఐక్యత కలిగినట్లు జీవేశ్వరులను, జీవేశ్వరుల స్థూలసూక్ష్మకారణశరీరములను అవిద్యామాయలను తత్త్వమసి మున్నగు మహావాక్యములచేత విచారించి త్యజింపగా కూటస్థునకును పరబ్రహ్మమునకును సమానమైన నైక్యము గల్గును. ఇట్లుయిక్యము కలుగునని సమస్తవేదాంతశాస్త్రములును నిర్ణయించును. ఆశాస్త్రములు నిర్ణయించినవిధముననే నాయభిప్రాయమును బోధింతును.

వ. కావున. 62

సీ. పరఁగ శరావకుంభకనామరూపముల్
ద్రోచి మన్నొకటిగాఁ జూచుపగిది
ఘటతటాకముల నొక్కట నిషేధించి త
ద్గతజల మొకటిగాఁ గాంచుకరణి

దీపప్రదీపవర్తియుగ మ్మడించి త
త్తేజంబు నొకటిగాఁ దెలియుభాతిఁ
గలశగృహంబులఁ గడనుంచి వానిలోఁ
గల మింటి నొకటిగాఁ దలఁచుకీతిఁ
తే. బాధ్యజీవేశ్వరత్రయోపాధియుగముఁ
బ్రాకటవివేకదృష్టి నిరాకరించి
తనరు పరిపూర్ణశుద్ధచైతన్య మొకటి
గా విలోకింపవలయు మేధావి యనఘ॥ 63

తా. ఆంజనేయా! ఆత్మానాత్మవివేకముగలవాఁడు కుండ మూఁకుడుయను నామములను రూపములను వదలి యవి నిర్మింపబడుటకు కారణమైనమన్ను ఒక్కటిగాజూచునట్లు, ఘటమునందున్న జలమును తటాకమునందలి జలమును, అను భేదముల విడచి ఘటతటాకములందలి నీటి నొక్కటిగా జూచునట్లు, దీపము, దివిటీయందలి వత్తులను వదలియందు దేకమైయున్న తేజస్సును ఒకటిగా నెఱుంగునట్లు, ఘటమును మఠమును వదలి ఘటమఠములందలి యాకాశము నొక్కటిగా దిలకించునట్లు అవిద్యామాయోపాధులుగల జీవేశ్వరుల స్థూలసూక్ష్మకారణోపాధుల జంటను జ్ఞాననేత్రముచేత త్యజించి పరిపూర్ణశుద్ధచైతన్యమును అఖండనిత్యనిర్మలపరమాత్మస్వరూపమును ఒక్కటిగా చూచుచుండవలెను.

## తత్త్వమసి యను సామవేదమహావాక్యార్థనిర్ణయము.

వ. ఇట్లు వ్యష్టిశరీరావస్థాత్రితయంబు విశ్వతైజసప్రాజ్ఞనామకంబు నైన జీవచైతన్యంబుఁ గించిద్జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వాదిగుణంబులుంగూడి త్వంపదవాచ్యార్థంబు, దేహత్రయవిలక్షణంబు నవస్థాత్రయసాక్షియుఁ బంచకోశవ్యతిరిక్తంబు సచ్చిదానందస్వరూపంబు, నైన కూటస్థచైతన్యమాత్రంబు త్వంపదలక్ష్యార్థంబు సమష్టిశరీరావస్థాత్రయాత్మిక మైన మాయయు వైశ్వానరహిరణ్యగర్భావ్యాకృతనామకంబైన మాయాప్రతిబింబేశ్వరచైతన్యంబు సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వాది గుణంబులుంగూడి తత్పదవాచ్యార్థంబు దేశకృత కాలకృత వస్తుకృత పరిచ్ఛేదరహితంబు సజాతీయ విజాతీయ స్వగతభే

దరహితంబు సత్యజ్ఞానానందస్వరూపంబు నైన పరిపూర్ణాద్వితీయ
బ్రహ్మచైతన్యమాత్రంబు తత్పదలక్ష్యార్థం బగు విరుద్ధధర్మకంబు లైన
వాచ్యార్థంబులతో లక్ష్యార్థంబుల కైక్యంబు సంభవింపదు గావున
నొక్కదేశంబున నొక్కకాలంబున నొక్కరూపంబున నున్న పురుషు
ని వేఱొక్కదేశంబున మఱియొక్కకాలంబునఁ గొండొకరూపంబుచే
నుండంగనుంగొని తద్దేశతత్కాలతదవస్థావిశేషంబుల నేతద్దేశతత్కా
లైతదవస్థావిశేషంబుల గణించి లక్షింపక లక్ష్యభూతుం డైన యతం
డితం డని యొక్కనిఁగా నెఱింగిన తెఱంగున జహదజహల్లక్షణచేత
మాయికంబు లైన యుభయవాచ్యార్థంబుల నిషేధించి ద్వివిధ
లక్ష్యార్థచైతన్యంబుల కైక్యంబు దెలియు మిదియ యసిపదార్థం బిది
యె జీవేశ్వరైక్యజ్ఞానం బిదియె మహావాక్యార్థంబింక జీవబ్రహ్మైక్యం
బుపదేశించెద నాకర్ణింపు మని మఱియు నిట్లనియె. 64

తా. పావనీ! రజోగుణమను అవిద్యయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయకు జీవుడని పేరు. జీవుని శరీరత్రయమును అవస్థాత్రయమును విశ్వతైజసాదినామములును, కించిద్జ్ఞత్వకర్తృత్వాదిస్వల్పగుణములనుగూడి త్వంపదవాచ్యార్థభూతుండైన జీవస్వరూపము దేహత్రయ విలక్షణమై అవస్థాత్రయమునకు సాక్షియై పంచకోశవ్యతిరిక్తమై సచ్చిదానందరూపమగు ప్రత్యగాత్మయె త్వంపదమునకు లక్ష్యార్థము. సత్త్వగుణమను మాయయందు బింబితుఁడైన బ్రహ్మచ్ఛాయకు నీశ్వరుఁడని పేరు. ఈశ్వరుని శరీరత్రయమును అవస్థాత్రయమును అవస్థాత్రయాభిమానులును, సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వాదిమహాగుణయుతుఁడై త్వత్పదవాచ్యార్థభూతుఁడగు ఈశ్వరుని రూపదేశకాలాదులచే నభిన్నమయి సజాతీయవిజాతీయస్వగతభేదములేక, సత్యజ్ఞానానందరూపమే త్వత్పదలక్ష్యార్థము. విరోధస్వభావముగల జీవేశ్వరరూపములతో స్వభావధర్మములుగల ప్రత్యగాత్మపరమాత్మల చేరికసంభవింపదు గాన ఒకదేశమున నొక కాలమున నొక సమయమున నొక రూపముతో నున్న మనుష్యుని వేరొకదేశమున వేరొక కాలమున వేరొక రూపమున నుండుటజూచి ఆదేశమును, ఆకాలమును, ఆయవస్థాభేదములను ఈదేశమును ఈకాలమును యీయవస్థలను విమర్శింపక కనబడిన యాతడీతఁడని తెలియువిధమున విడచి విడువనిలక్షణముచేత మాయాస్వరూపములైన త్వత్పద త్వంపదములకు వాచ్యార్థములైన జీవేశ్వరులనువిడచి రెండువిధము

లైన తత్పదత్వంపదములకు లక్ష్యార్థములగు ప్రత్యగాత్మపరమాత్మలకు పొందిక తెలియంగును. ఇట్లు చెప్పబడినదే అసిపదార్థము. ఇదియే నీవు బ్రహ్మమైతి వనుటకర్థము. ఇదియే జీవేశ్వరవివేకము, ఇదియే మహావాక్యార్థము. ఇంకను శివజీవులకైక్యము గలిగెడు విధముపదేశించెదను వినుమని యిట్లు చెప్పెను.

### జీవబ్రహ్మైక్యవిచారము.

సీ. గగనరజ్జుస్థాణుమృగతృష్ణికాశుక్తి
  తతులాదిమధ్యమాంతములయందు
స్వస్వభావములచే వసియించి యన్నియు
  వరుసతో నజ్ఞానవశమువలన
నీలతాహిమనుష్యనీరరౌప్యంబులై
  కనుపట్టి వివరించి కాంచునెడలఁ
గల్పితరూపముల్ గడుమిథ్యలై పోవఁ
  దత్త్వంబులైనచందమున నాత్మఁ
తే. డయ్యు నతఁడు ననాద్యవిద్యాత్మశక్తి
వలన జీవుఁడై తోఁచి కేవలనిజస్వ
రూపము నెఱుంగుచోఁ బూర్వరూప ముడిగి
యద్వయానందమూర్తియై యలరు ననఘ. 65

తా. అజ్ఞానమున నాకాశము నల్లగాను, త్రాడు పాముగను, దారువు పురుషుఁడుగను, ఎండమావులు నీటిపట్లుగను ముత్యపుచిప్ప వెండిగను, తోఁచి పరిశీలింపగా ఆకాశము మున్నగువానియందలి భ్రాంతికల్పితములైన రూపము లనిత్యములై ఆకసము శ్వేతముగను, త్రాడుత్రాటిపలెను, ఎండమావులెండమావులట్లును, శుక్తికములు ముత్తైపుచిప్పలట్లుగను గాన్పించునట్లు ప్రత్యగాత్మ పరబ్రహ్మమయ్యు అదిలేని అజ్ఞానస్వరూపమయిన తనయొక్క స్వభావముచే జీవరూపియై తోఁచి ప్రధానమగు తన స్వభావము దెలిసికొనువేళ తొల్లిటిజీవరూపమునువిడచి పరిపూర్ణమయిన సుఖస్వరూపక పరబ్రహ్మమయి ప్రకాశించును.

వ. ఇవ్విధంబున రజ్జ్వజ్ఞానంబువలన రజ్జువునందు భుజంగం బారోపితంబయి యాప్తవాక్యములచేతఁ దత్సర్పభ్రాంతి వినాశం బగుచుండ

రజ్జువురజ్జు వయిన తెఱంగున నఖండసచ్చిదానందస్వరూపుం డాత్మా జ్ఞానంబువలనఁ దనకుఁ దాన జీవుం డయి తోఁచి యనంతరంబున శ్రీగురువాక్యంబుచేత నీవు జీవుండవు గావు పరిపూర్ణ చైతన్యమాత్రుండ వని యెప్పుడు బోధితుం డగు నప్పు డాతండు దేహేంద్రియ ప్రాణమనోబుద్ధిచిత్తాహంకారాత్మభ్రాంతి నివర్తించుచుండఁబ్రత్యగభిన్నాద్వితీయబ్రహ్మచైతన్యమాత్రుం డగు నిది జీవబ్రహ్మైక్యం బింక నోంకార స్వరూపం బెఱింగించెద విను మని యి ట్లనియె. 66

తా. ఈవిధమున నజ్ఞానముచే రజ్జువునందు కలిగిన సర్పభ్రాంతిహితుల మాటలచే నశింపఁగ రజ్జువురజ్జువైనట్లు సమానరహితమైన సద్రూపచిద్రూప ఆనందస్వరూపుఁడైన పరబ్రహ్మము స్వరూపజ్ఞానమున తనకుతానే జీవరూపముగాఁ గనబడి అనంతరము గురువాక్యములచే బోధితుఁడగు పురుషుఁడు స్థూలాదిశరీరములు, జ్ఞానకర్మేంద్రియములు, దశవిధప్రాణములు, అంతఃకరణచతుష్టయము, భ్రమ యివి నశించుచుండగా విభాగింపబడనట్టిదియు, అద్వితీయమయినదియు సత్యజ్ఞానానంద నిత్యపరిపూర్ణ పరబ్రహ్మమేయగును. ఇదియే జీవాత్మపరమాత్మలఐక్యమనబడును. ముందు ఓంకారస్వరూపమును దెలిపెదను వినుము.

ఓంకారస్వరూపనిరూపణము.

సీ. ఘనతరదేహజాగ్రద్విశ్వవైరాజ
సు లకారమాత్ర మారె సుగుణధుర్య
తనువిగ్రహస్వప్నతైజససూత్రాత్మ
కులు నుకారార్ధ మారె లలితచరిత
పృథులకారణసుషుప్తి ప్రాజ్ఞసర్వేశ్వ
రు ల్మకారార్ధ మారె రుచిరవర్ణ
సంతతపరిపూర్ణ సచ్చిదానందాత్మ
తత్త్వ మోంకార మారె సత్త్వమూర్తి
తే. అట్లు గావున వర్ణత్రయాత్మకం బ
నాత్మ రూపక మైనవాచ్యార్థ మగుటఁ

గాను బ్రణవస్వరూపుఁడ కే నేన టంచుఁ
దెలిసి భావింపవలయు నిర్మలవిచార. 67

తా. ఆంజనేయా ! వ్యష్టిసమష్ట్యాత్మక స్థూలదేహములును, వ్యష్టిసమష్టిజాగ్రదవస్థలు విశ్వనామకజీవుఁడును విరాట్టును బ్రణవార్థమైన బ్రహ్మముయొక్క అవిద్యాపాదాత్మకమైన అకారప్రణవార్థమగును. వ్యష్టిసమష్ట్యాత్మకములగు సూక్ష్మశరీరములును ఆయుభయశరీరావస్థలగు స్వప్నములును తైజసుఁడును, హిరణ్యగర్భుఁడును యీశ్వరుఁడును బ్రహ్మప్రణవార్థమందలి విద్యాపాదాత్మకమయిన ఉకారప్రణవార్థమగును. వ్యష్టిసమష్టికారణశరీరములును ఆయుభయశరీరావస్థలగు నిద్రావస్థలును, ప్రాజ్ఞుఁడును జీవుఁడును అవ్యాకృతుఁడను యీశ్వరుఁడును బ్రహ్మప్రణవమందలి ఆనందస్వరూపమగు మకారప్రణవార్థమగును.

సర్వకాలములందును వ్యాపించియుండునదియును,నిత్యమయినదియును సౌఖ్యస్వరూపమయినదియు జ్ఞానస్వరూపమైనదియు ప్రత్యగ్బ్రహ్మచైతన్యము తురీయపాదాత్మకమయిన ఓంకారమను అర్థమాత్రమగును. ఇట్లర్థమాత్రమగుటవలన అవిద్యావిద్యాఆనందపాదాత్మకమగు అకారవుకారమకారములు వీని కూడికయొక్క స్వరూపమగు చివరపాదమగు కామ్యావస్థయును, అవిద్యారూపమయి యిదియెల్ల జెప్పుటకు దగిన యీవాచ్యార్థమేనుగను, నేను ఓంకారస్వరూపుఁడను నే నను లక్ష్యార్థమెఱింగి బ్రహ్మప్రణవమునకు లక్ష్యార్థమయిన పరబ్రహ్మము నేనని యూహింపవలయును.

వ. ఇట్లు దేహత్రయావస్థాత్రయ తాపత్రయ సుఖత్రయ కర్మత్రయ కర్తృత్రయ బుద్ధిత్రయ శ్రద్ధాత్రయ ధృతిత్రయ గుణత్రయ శక్తిత్రయ కాలత్రయ లోకత్రయ దేహత్రయ మూర్తిత్రయ వృత్తిత్రయ స్థానత్రయ జీవత్ర యేశ్వరత్రయ విరక్తిత్రయ భక్తిత్రయ దీక్షాత్రయ నేత్రత్రయ లక్ష్యత్రయ జ్ఞానత్రయ మండలత్రయ ముక్తిత్రయాత్మకంబయిన వర్ణత్రయం బారోపితం బయిన వాచ్యార్థంబు గావున నేతత్సర్వంబుం గ్రమంబున నకారంబున నకారంబు నుకారంబున నుకారంబు మకారంబున మకారంబు నోంకారంబునం బ్రవిలాపంబు నొందించి యంతటఁ దత్ప్రవిలాపంబును విశ్వాధిష్ఠానంబుఁ బరిపూర్ణంబుఁ దురీయంబు నగు లక్ష్యార్థంబు నయిన శుద్ధోంకారమాత్రంబు

గా నవలోకించి నిరంతరంబు దత్స్వరూపమాత్రుండవై ప్రకాశిం
పుము. 68

తా. పైనజెప్పబడినప్రకారము స్థూలసూక్ష్మకారణశరీరములు జాగ్రత్స్వప్నసుషుప్తులు, ఆధ్యాత్మిక అధిదైవిక అధిభౌతికము లనుతాపములు, విషయానంద, వాసనానంద, బ్రహ్మానందములు, పుణ్యపాపమిశ్రకర్మములు, జీవేశ్వరప్రత్యక్కర్తృత్వములు, సాత్వికరాజసతామసబుద్ధులు, సాత్వికరాజసతామసశ్రద్ధలు, సాత్వికరాజసతామసగుణములు, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు, భూతభవిష్యద్వర్తమానము లను త్రికాలములు, ముల్లోకములు, వసురుద్రాదిత్యులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుత్రిమూర్తులు, శాంతఘోరమూఢవృత్తులు, నాభిహృదయభ్రూమధ్యములగు మూడుస్థానములు విశ్వతైజసప్రాజ్ఞు లనుజీవులు, విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతు లనుయీశ్వరులు, ఐహికఆముష్మికమిశ్రమము లనువైరాగ్యములు, బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తులు, దృగ్వాక్స్పర్శదీక్షలు, కుడియెడమభ్రూమధ్యనేత్రములు, అంతర్లక్ష్యమధ్యలక్ష్యబాహ్యలక్ష్యములు, సంజ్ఞానవిజ్ఞానప్రజ్ఞానములు, ఇనశశివహ్నిమండలములు, క్రమముక్తిజీవన్ముక్తివిదేహముక్తి అను త్రివిధముక్తులు, వీనియొక్క స్వరూపముగాగల అకార ఉకార మకారములు కల్పితంబైన పలుకదగిన యర్థముగావున యీచెప్పబడినదంతయును ఓంకారమునందు చేర్చి అనంతరము చేర్పబడిన అర్థమాత్రస్వరూపమయిన శుద్ధసత్త్వమును, ప్రపంచమునకు స్థానమయినదియును, విభాగింపరానిదియును, నాశనములేనిదియును, తద్రూపమయినదియును అగుదీనిని నిర్మలమయిన ప్రణవముగా దిలకించి యెప్పుడును, ఆయవికల్పావికల్పమాత్రుడవై ప్రకాశింపుము.

మ. అని బోధించిన నాంజనేయుఁ డపు డాత్మారామునిం జూచి యో
యనఘా యేవరయుక్తిచే నొకట వాచ్యార్థంబుఁ బోఁద్రోచినం
తనె లక్ష్యార్థము చూడఁగా నలయు నంకోదం బొప్ప నాయుక్తి హె
చ్చినకూర్మి న్వినిపింపు భక్తవరదా శ్రీరామ సీతాపతీ. 69

తా. ఇట్లు తెలుపుమండ నాత్మయందే క్రీడించుచున్న శ్రీరామున కాంజనేయుడిట్లనియెను. పుణ్యపురుషుడవును, భక్తులకోరిక లీడేర్చువాడవును, అగురామచంద్రా! ఒక్కకాలమునందే వచింపదగినయర్థమును, వాచ్యార్థమును వదలినమాత్రముననే యథార్థమగుపరబ్రహ్మమును దిలకింప ననువుపడునట్టి యుపాయమును తెలియజేయుము.

క. అని తనపదపద్మములకు
ఘనభక్తిని వందనములు గావించు మహా

త్మ్మని హనుమంతునిఁ గని యి
ట్లనియెఁ శ్రీరామచంద్రుఁ డానందమునన్. 70

తా. అతిశయించినభక్తితో తనపాదములకు నమస్కరించి ప్రార్థించిన యాంజనేయుని జూచి శ్రీరామచంద్రుడు సంతోషముతో నిట్లుజెప్పుటకు మొదలుపెట్టెను.

పంచకోశములవివేచనము.

సీ. అన్నజసంభూత మన్నవర్ధిత మగు
తను వన్నమయకోశ మనఁగ నొప్పు
ప్రాణకర్మేంద్రియపంచకంబులు గూడి
విను ప్రాణమయకోశ మనఁగఁ దనరు
జ్ఞానేంద్రియోపేతమానసచిత్తంబు
లును మనోమయకోశ మనఁగఁ జెల్లు
శబ్దాదివిషయపంచకసమన్వితబుద్ధి
విజ్ఞానమయ మన వెలయు చుండు
తే. మోహజప్రియమోదప్రమోదవృత్తి
సంయుతోరుసమస్తదృశ్యప్రపంచ
కారణానాద్యవిద్యాంధకారపటల
మంచితానందమయకోశ మనఁగఁ దనరు. 71

తా. ఆంజనేయా! అన్నముచే బుట్టిన రేతస్సుచేపుట్టి అన్నముచే వృద్ధినొందుచున్నదై స్తంభమువలె స్థూలమై కరచరణాదులగు అవయవములుకలదై షడ్భావవికారములు లేనిదై, ఆరుకోశములుగలదైయున్నది. షట్కోశాత్మకమైన స్థూలశరీరమే అన్నమయకోశము, కర్మేంద్రియములైదును పంచప్రాణములనుగూడి ప్రాణమయకోశము, మనస్సు చిత్తమును జ్ఞానేంద్రియములనుగూడి మనోమయకోశము, బుద్ధియు శబ్దస్పర్శరూపరసగంధములైదునుగూడి విజ్ఞానమయకోశము, ప్రమోదవృత్తులుగలదై జగత్తుయొక్కపుట్టుకకు ప్రధానమైన యనాదియగు యజ్ఞానమే ఆనందమయకోశము.

పంచకోశాదిక మనాత్మయని నిరూపించుట.

సీ. మహనీయకలితాన్నమయకోశమగు నాత్ముఁ
డనిపల్కుదురు కొందఱజ్ఞు లగుచు
మహితేంద్రియప్రాణమయకోశమగు నాత్ముఁ
డనిపల్కుదురు కొందఱజ్ఞులగుచు
మంజులతరమనోమయకోశ మగు నాత్ముఁ
డని పల్కుదురు కొందఱ అజ్ఞు లగుచు
మానితవిజ్ఞానమయకోశ మగు నాత్ముఁ
డని పల్కుదురు కొందఱ అజ్ఞు లగుచు

తే. సుషుప్తియం దేమితోఁపని శూన్యతత్త్వ
మాత్ముఁ డని పల్కుదురు కొంద ఱ అజ్ఞు లగుచు
రూఢి నానందమయకోశరూపుఁ డగు మ
హాత్ముఁ డని పల్కుదురు కొంద ఱ అజ్ఞు లగుచు. 72

తా. ఆంజనేయా! వివేకములేనివారు కొందఱు పూజ్యత కలిగిన అన్నమయకోశమే పరబ్రహ్మమనిచెప్పుదురు కొంతమంది మూఢులు ప్రాణమయకోశమే పరమాత్ముఁడందురు. మరికొందఱు మనోమయకోశమే సచ్చిదానందస్వరూపుఁడని పల్కుదురు కొందఱు విజ్ఞానమయకోశమే పరమాత్ముఁడందురు. కొందఱు నిద్రయందేమియు దోఁపని శూన్యతత్త్వమే పరిపూర్ణబ్రహ్మమని వచింతురు. మరికొందఱు ఆనందమయకోశ స్వరూపుఁడే పరమాత్మయందురు.

వ. మఱియును. 73

క. పరమాణు వనుచు మధ్యమ
పరిమాణుం డనుచు విభుఁడు పరుఁ డనుచును ని
ద్దరఁ గొందఱు వాదింతురు
పరిపూర్ణాత్ముఁ డని యెఱుఁగు ప్రాజ్ఞత లేమిన్. 74

తా. కొందఱు జగమంతయును నిండియుండు వాడనను తెలివిలేక త్రసరేణువుల లో 5 వ భాగమైన పరమాణుస్వరూపుఁడనియు, త్రసరేణువులలో మూడవభాగమైన

మధ్యమ పరిమాణ స్వరూపుడనియు, సమస్తమూర్తద్రవ్యములయందు గూడిన వాడనియు, ప్రకృతికంటె నితరమైనవాడనియు తర్కింతురు.

తే. మఱియుఁ జిద్రూపుఁ డనుచుఁ గొందఱు గణింతు
రలఘుచిదచిత్స్వరూపకుం డంద్రు గొంద
అరసి సద్రూపుఁ డనుచుఁ గొందఱు వచింతు
రాత్మ నెఱుఁగక నిజవిమోహాంధు లగుచు. 75

తా. కొందఱు జ్ఞానముచే జ్ఞానస్వరూపుఁడే పరబ్రహ్మమని తలంతురు. కొందఱు గొప్పవియగు జ్ఞానాజ్ఞానములను స్వరూపముగాఁ గలవాఁడని వచింతురు మరికొందఱు మూడవస్థలయందును నశింప నిరూపముఁగలవాడని పలుకుదురు.

క. కావున సచ్చిత్సుఖమయ
భావాతీతాద్వయాత్మపరతత్త్వము సం
భావించి తెలియఁజెప్పెదఁ
గేవలమతిచే గ్రహింపు కీశాధీశా. 76

తా. అంజనేయా ! పరమాత్మ విషయమై తెలియమిచే పెక్కురు పెక్కులైరంగులగు నభిప్రాయములను బడుచుందురు. కావున సద్రూపుడును జ్ఞానస్వరూపుడును ఆనందస్వరూపుడును అను జ్ఞానమును వదలి తనకంటె భిన్నము కాని రూపముగల పరమాత్మను బాగుగా నూహించి తెలియునట్లు జెప్పెద నాలింపుము.

మహాస్రగ్ధర.

ఘటము న్వీక్షించువాఁ డేగతిని ఘటము దాఁ గాక వేఱైనభంగిం
బటుదేహద్రష్టనై చిత్పరమసుఖమయబ్రహ్మమైనట్టి నే నె
న్నటికిన్ దృశ్యంబుమాయానగరసమమసన్నామరూపాత్మకంబున్
గుటిలావిద్యాకృతం బాకులదమగుతనూకోశముంగానువత్సా. 77

తా. ఆంజనేయా ! కుండను జూచువాఁడు కుండకంటె వేఱైనట్లు దృఢమగు శరీరమును చూచునట్టి జ్ఞానస్వరూపమును ఆనందస్వరూపమును పరబ్రహ్మమునునైన నేను సర్వకాలములందు గనబడునదియును మాయానగరసమమైనదియును, యెల్లపుడునుండని నామరూపములుఁగలదియు కుటిలమగు కార్యోపాదియైన యవిద్యచేత కల్పింపబడినదియును వ్యాకులమునిచ్చునట్టిదియును, నైన స్థూలోపాది నేను గాను,

మ. సమతం మేను నెఱుంగుచందమున నీకున్ సర్వేంద్రియప్రాణచి
త్తమనోహంకృతులం గనుంగొనుచుఁ జైతన్యంబునై యొప్పునే
ను మహత్పూర్తి తదింద్రియాదికము నెందేనుం గాను నాకింక ల
క్ష్యములౌ వానిజనిప్రణాశములు జాగ్రత్సుప్తులం దారయన్. 78

తా. పావనీ! అభేదముచే శరీరమును దెలిసికొనునట్లు యీకనబడుచున్న దేహేంద్రియములను పంచప్రాణములను చంచలాత్మకమైన చిత్తమును సంశయాత్మకమైన మనస్సును కర్తవ్యాత్మకమైన అహంకారమును దిలకించుచు పరబ్రహ్మస్వరూపినై వెలింగెడు నేను అశరీరేంద్రియ ప్రాణాదులెప్పుడును కాను పరమాత్మనై నాకు అశరీరేంద్రియప్రాణాదుల యుత్పత్తిస్థితి లయములు జాగ్రత్సుప్తులజూడబడిన వగును.

వ. అదియునుం గాక.

సీ. నామందిరం బిది • నాసువర్ణం బిది
నాతల్ప మిది యని • నరుఁడు దాను
దన్మందిరసువర్ణ • తల్పంబులకు విల
క్షణసాక్షి యై యవి • గాలిపగిది
నాశరీరం బిది • నాయింద్రియము లివి
నాప్రాణమిది యిది • నామనంబు
నాయహంకృతి యిది • నాబుద్ధి యివి యని
బహువిధదృశ్యరూపముల నెల్ల
తే. నాయవి యటంచుఁ దెలిసి నిర్ణయము సేయ
నేను దత్తచ్ఛరీరాది • నిఖిలవస్తు
సంఘమునకు విలక్షణసాక్షి నగుదుఁ
గాని యందెద్దియును గాను • వానరేంద్ర. 80

తా. ఆంజనేయా! జనుడు యిది నాయిల్లు, యిదినాధనము, ఇది నాభార్యయని తానాగృహతల్పము లకు వ్యతిరిక్తుడైన సాక్షుడై యాగృహధనతల్పము తాను గానట్లు, ఇదినాప్రాణవాయువు, ఇది నా మనస్సు యిదినాగర్వము, యిది నాబుద్ధి యిది నా తెలివి యని యనేకవిధములైన చూడబడు నాకారములన్నిటిని నావని తెలిసి నిశ్చయము

చేయు నేను ఆయాదేహము మొదలైన సమస్త వస్తువులయొక్క సమూహమునకు భిన్నుఁడనగు కూడస్థుఁడనగుదునుగాని ఆవస్తుసమూహమునందు నేదియును గాదు.

తే. బుద్ధ్యహంకారములతోడి పొందు గలిగి
నేను నేనను వాఁడను నేనుజుమ్మ
నేను నేనను వాఁడను నే నటంచుఁ
దెలియఁబడువృత్తి నెఱిఁగెడి తెలివి నేను. 81

తా. బుద్ది అహంకారములతో చేరికకలిగి నేను నేనను వాఁడను నేనే. నేను నేనను వాఁడు నేనే యని తెలియబడుచున్న వృత్తిని తెలిసికొను జ్ఞానమును నేనే సుమా.

సీ. శ్రవణేంద్రియంబుచే వివిధశబ్దంబుల
నేర్పఱించి యెఱుఁగు నెఱుక నేను
స్పర్శేంద్రియంబుచే స్పర్శగుణంబుల
నేర్పఱించి యెఱుంగు నెఱుక నేను
నేత్రేంద్రియంబుచే నిఖిలరూపంబుల
నేర్పరించి యెరుంగు నెఱుక నేను
రసనేంద్రియంబుచే రసముల నన్నింటి
నేర్పఱించి యెఱుఁగు నెఱుక నేను

తే. ఘ్రాణకరణంబుచే సర్వ గంధములను
నేర్పఱించి యెఱింగెడి యెఱుక నేను
ఘనమనముచేత నఖిలసంకల్పములను
నేర్పఱించి యెఱింగెడి యెఱుక నేను. 82

తా. చెవులచే విను శబ్దములన్నిటిని విభాగించి తెలిసికొను తెలివి నేను సుమా. ముక్కుచే వాసనల విభాగించి తెలిసికొను జ్ఞానము నేనే సుమా. త్వగింద్రియముచే మృదుకఠిన శీతోష్ణముల గుర్తించి యెఱుంగు తెలివి నేనే సుమా. కన్నులచే చూచు సమస్త రూపముల విభాగించి తెలిసికొను జ్ఞానము నేనే సుమా, జిహ్వచే నాఱురుచులను గుర్తించి తెలిసికొను తెలివి నేనే సుమా. గొప్పదైన మనముచే నభిప్రాయముల విభాగించి తెలిసికొనెడి జ్ఞానము నేనే సుమా.

క. పలుకుల దానాదానం
బుల గమనాగమనములను ॥ మూత్రపురీషం
బుల రాకడ పోకడలను
దెలియు తెలివి నేను సర్వ॥దృక్కు నగుటచేన్. 83

తా. సమస్తాంతర బాహ్యవ్యాపార సాక్షినగుటచే వాటివ్యాపారములైన సుళ్ళాదికములను చేతులతోఁజేయు యిచ్చిపుచ్చుకొనుటలను, పాదములచే రాకపోకడలను పాయూపస్థలకు విషయములగు మలప్రస్రావముల రాకపోకలును తెలిసికొను జ్ఞానము నేనే సుమా.

క. సర్వోపాధిస్థుఁడనై
సర్వవ్యాపారములు వేసం జేయుచుఁ ద
త్సర్వమునంటక వెలిఁగెడు
సర్వాత్ముఁడ నేన సుమ్ము ॥ సజ్జనతిలకా, 84

తా. ఆంజనేయా ! సమస్తమైన స్థూలసూక్ష్మకారణ శరీరముల నున్నవాఁడనై అన్ని యింద్రియముల వ్యాపారములు చేయుచున్నట్లు చేయబడినవ్యాపారముల నంటక యుండు పరబ్రహ్మమును నేనే:

క. అపరిచ్ఛిన్నావ్యయని
త్యపరంజ్యోతిర్మయుండ ॥ నై శశిహుతభు
క్తపనాదుల వెలిఁగించుచు
నెపు డంతట నొక్కరీతి ॥ నేను వెలుఁగుదున్. 85

తా. సచ్చిదానందస్వరూపుడనైన నేను సంపూర్ణమైనదియు శాశ్వతమైనదియు అయిన ప్రకృతికంటె భిన్నమగు తేజస్సు నేరూపముగాగలవాఁడనై చంద్రసూర్యులను న్నగు సప్తతేజోమూర్తులను ప్రకాశింపజేయుచు సమస్తదేశములందును సర్వకాలములందు ను ప్రకాశించు చుందును.

క. ఔపాధిక నామంబులు
రూపంబులు లేవు నాకు ॥ రూఢిగ సకల
వ్యాపారముఁ గను సర్వ
వ్యాపకచిన్మయుఁడ నేను ॥ వాయుతనూజా. 86

తా. ప్రాకృతమగుసమస్త స్థూల సూక్ష్మ కారణోపాధులయొక్క- విశ్వతైజసప్రాజ్ఞజీవవిరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత ఈశ్వరనామములు, మాయోపాధుల వలనగల్గిన రూపములు నిజముగా నాకు లేవు. నేను చతుర్దశేంద్రియములను వ్యాపారమును దిలకించుచు బాహ్యాంతరప్రపంచమందు వ్యాపించియుండు జ్ఞానస్వరూపుడను. అట్టినాకు ఉపాధిజన్యములగు నామరూపములులేవు.

సీ. ఏను శరీరంబు నే గా నింద్రియంబులు
గాను ప్రాణమ్ములు నే గాను మనము
గాను జిత్తంబును నే గా నహంకారంబు
గాను శూన్యంబును నే గాను బుద్ధి
గాను దీర్ఘంబును నే గాను కుబ్జంబును
గానుస్థూలమును సూక్ష్మమును గాను.
గా నతికృష్ణరక్తశ్వేతపీతవ
ర్ణంబులును బంచభూతములు గాను
తే. గాను గానను వాడును నే గాను వినుము
కాను గానను వానిని నే గాంచువాడ
గాంచువానిని సతతంబు నే గాంచువాడ
నౌను గానను వికృతులు నే లేనివాడ. 87

తా. నేను దేహమునుగాను, ఇంద్రియములుగాను, ప్రాణములుగాను, మనస్సునుగాను, చిత్తమునుగాను, అహంకారమునుగాను, లేనిదియునుగాను. బుద్ధినిగాను, బొడుగు, పొట్టి, లావునుగాను, నలుపు తెలుపు వర్ణములుగాను. పంచభూతములుగాను శరీరాదులుగాను; నేనుగానను జీవుడనుగాను శరీరాదులు నేను గాసను జీవునకు సాక్షిని-సాక్షియైనవానికి సాక్షిని, సర్వమును నేనుగాను అవుదును అను వికారములులేనివాడను ప్రకృతిధర్మములులేనివాడను.

చ. అచలచరేంద్ర దీపము ఘటాదిపదార్థముల న్వెలుంగఁజే
యుచును వెలుంగుకీలిని సముజ్జ్వలమానసచక్షురాదిదృ
శ్యచయము నెల్ల నాత్మవిషయంబులయుంచుఁ జకించునట్లు చూ
చుచు వఱి యేను సాక్షి నగుచు న్విలసిల్లుదు నిర్వికారతన్. 88

తా. పావనీ ! దీపము ఘటాదులను ప్రకాశింపజేయుచు తానును ప్రకాశించునో అట్లే నేను సమస్తేంద్రియసమూహమును దమదమపనుల నిర్వర్తించునట్లుజేయుచు సాక్షిభూతుడనై మానసాదుల నంటనివాడనై ప్రకాశింతును.

మత్తకోకిల.

భానుతేజము నాశ్రయించి స్వకీయభావకర్మములందు నీ
మానవుల్విహరించుకైవడి మత్ప్రకాశమునంటి ధీ
మానసేంద్రియముల్స్వకీయసమస్తకార్యములం దొగిన్
మానకం జరియించు నెం దభిమానపూర్వకవృత్తులన్. 89

తా. జనులుసూర్యునితేజమునునుసరించి స్నానసంధ్యాదికముల నెట్లుచేయుదురో యట్లు నాయొక్కతేజము నాశ్రయించి సమస్తేంద్రియములును తమతమ కార్యములందు ప్రవర్తించుచుండును.

వ. అట్లు గావున. 90

తే. ఎఱుకమఱపుల నెఱిఁగెడి యెఱుక నేను
విధినిషేధములనుగాంచు విభుఁడ నేను
దర్క్యములనెల్లఁ దర్కించు తత్త్వమేను
నేను నేనని వివరించు నేతనేను. 91

తా. అట్లు తిరుగుటవలన జ్ఞానాజ్ఞానములను తెలిసికొనుజ్ఞానమును నే నగుచున్నాను. విధిశాస్త్రవిహితకర్మములనుశాస్త్రనిరోధకర్మములను దెలుసుకొనునాయకుడనై యున్నాను. వాదములను వాదించునట్టి నిక్కమగు పరబ్రహ్మమును నేనై యున్నాను. నేను నేనని తెలియజెప్పు యధికారినిగూడ నేనైయున్నాను.

క. నే ననిన నన్ను మూర్ఖుఁడు
మే నని వీక్షించుఁ గాన మేల్కని సత్య
జ్ఞానానందమయునిఁగా
జ్ఞానముచే నెఱుఁగవలయు సద్గుణశాలీ. 92

తా. నే ననగా పంచకోశాత్మకమైన శరీరముగా జూచువాడు మూఢుడు, గాన జాగ్రత నొంది సచ్చిదానందస్వరూపుడనైన పరమాత్మగా నన్ను దెలియవలయును.

క. నేననిన దనువునకు నభి
మానమునకు నర్థ మగు బ్రమాదమువలనం
గాన నివి రెండనర్థము
లౌ నే నన నేన కేవలాత్ముండ ననఘా. 93

తా. ఆంజనేయా! జనులు భ్రాంతిచే నే ననుశబ్దమునకు శరీరమనియు, అహంకారమనియు నర్థమని తలంతురుగాని యది పొరపాటు. అట్లు తలంచుట భ్రాంతిమూలకము. ఆరెండును నే ననుశబ్దమున కనన్వయములు, నే ననుటకు శరీరమునకును, అహంకారమునకు భిన్నమైన ప్రత్యగాత్మసుమా!

క. నానానూనుని నని న
న్నే నే నన నిన్ను నన్ను నే నన ననిరా
నే నను నే నన్నా నా
నే నను న న్నెన్ని నన్ను నిను నే ననినా. 94

తా. ఆంజనేయా! సర్వజ్ఞత్వాదిగుణములతో గూడుకొనినవానివలె దోచు నన్ను అంతట నిండియుండువానినిగా జెప్పితిని. అవిద్యాసంబంధమువలన కించిద్జ్ఞత్వాదిగుణములుగల జీవునివలెగాన్పించు ప్రత్యగాత్మయైన పరబ్రహ్మమని చెప్పితిని. అఖండసచ్చిదానంద నిత్యపరిపూర్ణమైన నన్ను అవిద్యచే కల్పింపబడిన స్థూలసూక్ష్మకారణశరీరత్రయాభిమానియగు కూటస్థుడని వచింపలేదుగాన నీవు పంచకోశాతివ్యతిరిక్త అఖండసచ్చిదానంద పరమాత్ముండ నే ననెడు నన్ను చక్కగా విచారించి సమస్తమైన యుపనిషత్తులకు సారమైన నేతి నేతియను మహావాక్యములచే మాయ, విద్యలనువదలి నేను అనుపదమునకులక్ష్యార్థస్వరూపమును సర్వసాక్షియునైన నన్నును నీవు అనుపదమునకు లక్ష్యార్థభూతమును జీవసాక్షియునునైన నిన్నును, సత్యజ్ఞానానంద నిత్యపరిపూర్ణపరమాత్మయే యని తెలిసిపలుకుము.

క. మేను మనము మానము మును
నే నను మననమ్ము మాని నేనమ్మన న
న్నే నేనని నమ్మిన నీ
మాన మనూనానుమానమై మనునెమ్మిన్. 95

తా. తొలుత శరీరము మనస్సు, అహంకారమును నేనే యనుస్మరణనుమాని నిష్ఠతో పరమాత్మరైన నన్ను నే నని తలంచినయెడల నీసంశయము తక్కవగాని యనుమాన రూపప్రమాణముగల దై వృద్ధిజెందును.

క. మన మేపనిజేసిన నది
మనమే చేసితిమటంచు కే మది దోఁచు సనా
తనమై ద్యోతనమై చే
తనమై తగు మనకుఁ గల్పితంబిది యనఘా. 96

తా. వత్సా! శాంతఘోరమూఢవృత్తులనుగూడిన మనంబు దైవమానుషాసురకృత్యములలో దేనిని జేసినను అకృత్యమ్ముగ సమిరువురమే గావించితిమని దోచును. శాశ్వతమును ప్రకాశమానమును ఆత్మస్వరూపమును నైయొప్పు మనయిద్దరకు నిట్లు స్ఫురించుట కల్పితము.

ఉ. నమ్ము మనస్సులో ననుదికనమ్ము వెలుంగు చిదాత్మ సత్ప్రభా
సమ్ము నిజమ్ము నేను నిధకనమ్మును సంజననమ్ము రూపవ
ర్ణమ్ములు గర్తృకార్య కరణమ్ములు వర్ణగుణాశ్రమాభిమా
నమ్ములు నాకు లేవను ఘనమ్మగు నావచనమ్ము నెమ్మదిన్. 97

తా. ఎల్లపుడును మనంబున దేజరిల్లునట్టి సచ్చిదానందపరబ్రహ్మముయొక్క తేజము నేనవి సత్యము నమ్మియుంకుము. పుట్టుక, వర్ణము, రూపము అహంకర్తృత్వ, కార్యములు కరణమ్ములును జాతులును గుణములును ఆశ్రమములును అభిమానములును (విశ్వతైజస ప్రాజ్ఞాభిమానములును) నాకు లేవు అని పలుకుము. ఈనావాక్యము నీమనంబున సత్యమని దలంపుము.

చ. అరుచి జనింప నింపగు మహావిషయేచ్ఛలు మాని మానిత
స్ఫురదభిమానమానస వచోఘనకాయవివాసవాసనం
బొరయకు మేను నే ననెడి కే బుద్ధిని దోఁచుటచేతఁ జేత నే
తరమును గానుగానఁ బరతత్త్వమె విశ్వ మభావభావనన్. 98

తా. ప్రపంచముపై జనించిన విరక్తివలన ప్రియములై దోచు విషయవాంఛలను వదలికొని యాడదగినదియు, ప్రకాశమానమైనదియు, త్రివిధాహంకారమున జనించిన మనస్సు నాక్కస్థూలశరీరము. వీనిస్థానభూతమైనదియగుకోర్కెను పొందకుము. ప్రత్యగా

త్మయగు పరబ్రహ్మమును జ్ఞానమువలన విచారింప పరబ్రహ్మముకంటె నిరతముకావని తోచుటవలన నేనే పరబ్రహ్మమునని నిశ్చయింపుము.

చ. ఇలువుగ నెన్న నెన్న డొక కొంచుక లేకయ యున్న యున్నతిం
బొరలు వికారకారణ మబోధము దీని తెలుంగు రంగుగా
నెఱిఁగి శమించి మించి పరమేశ్వర భావముఁ బొంది బొందిఁ దా
మఱచిన ధీరధీరుచిర మార్గుఁడు మోక్షముఁ జేరు జేరువన్. 99

తా. అనుభవజ్ఞానముచే పరిశీలింపగా నెప్పుడును వస్తురూపముగా గనబడకనే వస్తువువలె దినదినాభివృద్ధినొందుచున్న షడ్విధవికారములకు కారణ మజ్ఞానమగుచున్నది. ఈఅజ్ఞానలక్షణమును దెలిసికొని ప్రకృతిని నశింపజేసి ప్రజ్ఞానముచే నతిశయించి పరబ్రహ్మస్వరూపియై తాను శరీరమును మరచిన చంచలముకానిబుద్ధిగలవాడు చిరకాలములోనే మోక్షము నొందగలడు.

వ. అని యుపదేశించి వెండియు నాత్మస్వరూపం బతిస్పష్టంబుగా నెఱుం
గుకొఱకు నింక నొక్క పరమరహస్యంబు జెప్పెద సావధానచిత్తుం
డవై యాకర్ణింపుమని యిట్లనియె. 100

తా. ఇట్లుపదేశించి మరియు పరమాత్మను స్పష్టముగా తెలిసికొన గోప్యమును దెల్పెదను వినుమని యీక్రిందివిధముగా జెప్పసాగెను.

దృగ్దృశ్యవివేకము.

సీ. కలిత శబ్దశ్రోత్ర ఘనమనోహంకృతు
లుదృశ్యము లీవనికి దృక్కు నేను
స్పర్శత్వగింద్రియాం చన్మనోహంకృతు
లుదృశ్యము లీవనికి దృక్కు నేను
సలలితరూపలోచన మనోహంకృతు
లుదృశ్యము లీవనికి దృక్కు నేను
గమనీయరసరసజ్ఞామనో హంకృతు
లుదృశ్యము లీవనికి దృక్కు నేను

తే. అతిసురభినాసికామనో హంకృతులును
దృశ్యములు గాన వీనికి దృక్కనేను
బహువిధాంతర్బహిస్స్థ ప్రపంచమెల్ల
దృశ్యమట్లాటఁ బరిపూర్ణ దృక్కనేను. 101

తా. కర్ణేంద్రియమును ఆశబ్దాదులతోఁగూడిన మనస్సు, మనస్సుతోఁజేరిన అహంకారమును దృశ్యములు, వీనికి నేను ద్రష్టను. పంచవిధస్పర్శములతోనుండు చర్మముతోనుండు మనస్సు అహంకారమును దృశ్యములును. దీనికి నేను ద్రష్టను. దశవిధరూపసహితమగు నేత్రేంద్రియముతోఁగూడి మానసాహంకారములు దృశ్యములును వీనికి నేను ద్రష్టను, సప్తవిధరసములతోఁగూడుకొన్న జిహ్వతోఁగూడుకొన్న మనోహంకారములు దృశ్యములు, వీనికి నేను ద్రష్టను. త్రివిధవాసనలతో నొప్పునాసికతోఁజేరిన మనోహంకారములు దృశ్యములు, వానికి నేను ద్రష్టను. ఇట్లు స్థానభూతుఁడనగుటవలన దృశ్యములగు అంతఃప్రపంచమును బ్రహ్మము మొదలు పిపీలికాపర్యంతముండునట్టి బహిఃప్రపంచమును నిత్యనిరంజన నిర్వికారుఁడనై జూచువాడను.

వ. అది యెట్లంటేని. 102

సీ. శబ్దాదివిషయపంచకము దృశ్యంబగు
శ్రవణాదికరణపంచకమునకును
శ్రవణాదికరణ పంచకము దృశ్యంబగుఁ
దతమనోబుద్ధ్య హంకృతుల కరయఁ
దతమనోబుద్ధ్య హంకృతులు దృశ్యంబగుఁ
బరిపూర్ణదృఙ్మయ బ్రహ్మమునకుఁ
బరిపూర్ణదృఙ్మయ బ్రహ్మంబు నగు నాకు
దృశ్యత్వ మెంచఁ జింతింప లేను

తే. గాన నిరతిశయ స్వప్రకాశ నిర్వి
కార నిర్విషయావ్యయాకాశకల్ప
కల్పనాతీత సచ్చిత్సుఖ స్వరూప
సురుచిరాఖండశుద్ధ వస్తువును నేను. 103

తా. ఆలోచింప కర్ణేంద్రియములు మొదలగు యింద్రియపంచకమునకు ధ్వనియే మొదలుగాగల పంచవిషయములును చూడదగినవి. మనోబుద్ధ్యహంకృతులకు శ్రవణాది యింద్రియపంచకము చూడదగును. అట్టి మనోబుద్ధ్యహంకారములకు సర్వత్రనిండియుండు దృక్స్వరూపుడనై నేనుద్రష్టను. పరిపూర్ణుడనైన నేను చూచుటయేగాని నన్ను జూచువాడులేడు. సర్వోత్కృష్టమైనదియు, స్వప్రకాశమైనదియు, షడ్విధవికారరహితమైనదియు, విషయశూన్యమైనదియు, నాశనములేనిదియు, చిదాకాశస్వరూపమైనదియు అపవాదవ్యతిరిక్తమైనదియు, సచ్చిదానందరూపమున ప్రకాశించునదియును అయి విభజింపరాని నిర్మలపరబ్రహ్మమును నేను.

వ. అట్టి దృగ్వస్తువునైన నాకు దృశ్యత్వంబు గలుగ దెట్లనిన వినుము. దృక్కనను సంవిత్తను జిత్తను జ్ఞప్తియు జ్ఞానంబును బోధంబును చైతన్యంబును నను నివి ఘటకుంభకలశశబ్దంబులభంగి బర్యాయనామంబు, లట్లగుట దృక్కనైన నన్నవలోకించునది దృగన్యంబనిన దీపభాస్యంబులై జడంబులైన ఘటాదులు భాసకంబైన దీపంబుం బ్రకాశింపంజేయ నేరనిపగిది నాచేతఁ బ్రకాశ్యంబులై యచేతనంబులైన యహంకార మనోనేత్రరూపాదికంబులు ప్రకాశకంబైనమత్స్వరూపంబుం దెలియనోపవు, దృగంతరంబనిన నాదృగంతరంబు స్వల్పప్రభారూపంబైన ప్రదీపం బనల్పతేజోవంతుండగు భానుమంతుని వెలింగింపలేనిచందంబున నికృష్టంబై యెఱుంగ సమర్థంబుగాదు, సమానంబై తేజరిల్లంజేయుననిన రత్నంబు స్వసదృశరత్నాంతరంబును భాసిల్లంజేయ క్షమంబుగాని పోలిక మత్సమంబై విలసిల్లంజేయ శక్తంబుగా, దదియునుంగాక వేదాంతంబులయందు చైతన్యద్వయం బనుక్తంబది యట్లుండనిమ్ము; సముత్కృష్టంబై కాంచుననిన నదియు మఱియొక దృగంతరంబునకు దృశ్యంబు గావలయు, నట్లయిన దానిం గనుంగొను దృగంతరాంతరం బింకొక్కటి యనిన నిత్తెఱంగున నసంఖ్యాత దృగంతరాంగీకారంబు దోఁచు నందువలన ననవస్థాదోషంబు ప్రాప్తంబగు, నట్లుగాక కొన్ని దృగంతరంబులు

నూహించి యొక్కటినిలిపి యిటమీఁద దీనికి ద్రష్ట లేఁడనిన నన్నిం
టికిం గలుగ నితని కెట్లు లేకుండు, గలఁడనిన వానికి వ్యభిచారంబు
వచ్చు, నివ్విధంబుగాక మొదటిదృగంతరంబు నిరతిశయంబనిన
నెయ్యది సర్వకారణంబై నిష్కారణంబై తనకంటె నితరంబైనసర్వం
బును సాధనంబులేక తాన వీక్షించునదియె నేను గావున స్వప్ర
కాశపరిపూర్ణదృఙ్మయబ్రహ్మంబు నగుదునని యుపదేశించి మఱియు
నిట్లనియె. 104

తా. అట్టి దృగ్వస్తువునైన నాకు దృశ్యత్వము లేదు. అదియెట్లని ప్రశ్నింతువేమో వినుము. దృక్కును సంవిత్తును, చిత్తును జ్ఞప్తియు జ్ఞానము, బోధచైతన్యము అనునవి పర్యాయపదములును అభిన్నార్థకశబ్దములును. అట్లగుటచే సాక్షినగు నన్ను దిలకించునది వేరొకదృక్కని వచించిన దీపికచే వెలుంగజేయబడు జడములగు ఘటాదులు తమ్ము వెలుంగజేయు దీపికను వెలుంగజేయనేరని విధమున నాచే ప్రకాశించు నచేతనములగు నహంకారాదికములు నాస్వరూపమును దెలియజాలవు. నే నెట్లు ప్రకాశింపజేయుచుంటినో యట్లే నన్ను ప్రకాశింపజేయు నేరొకదృక్కు గలదనుట, స్వల్పమగు తేజముగల దీపము సూర్యుని ప్రకాశింపజేయు ననుట నంటిదగును. అధికప్రకాశముగల నాస్వరూపమును నీచమగు దృగంతరము తెలియజాలదు. నన్ను నాతో సమానమగు దృక్కు ప్రకాశింపజేయగూడదాయను శంకకలిగినయెడ నొకయత్నము నేరొకయత్నమును ప్రకాశింపజేయజాలనియట్లు నాతో సమానమగుదృక్కు నన్ను ప్రకాశింపజేయ శక్తియుక్తమైనది గాదు. వేదములందును యుపనిషత్తులలోను నాకు సమానమైనవస్తువు జెప్పబడియుండ లేదు గావున పైసందేహము నివృత్తియగుచున్నది. నాకంటె ప్రకాశమైన దృక్కు నన్ను వీక్షించుచున్నదనిన యెడల నాదృక్కును వేరొకదృగ్వస్తువునకు గోచరించునది గావలయును. ఇట్లే అనేక అన్యదృక్కుల యపేక్షగల్గును. అట్లగుటచే ననవస్థాదోషము గలుగును. ఇంతియెగాక గొన్నిదృగ్భేదములూహించి యొక్కటి నిర్ధారణగావించి దీనికి యిఁక ద్రష్టలేదనిన అన్నిటికినియుండు ద్రష్ట దీనికిమాత్రము లేకుండు టెట్లని సంప్రశ్నము రావచ్చును. కలడనిన ఆచెప్పబడిన ద్రష్టకు నిషేధముగలుగును. ఇట్లు వచింపక మొదటి దృగ్వస్తువు శ్రేష్ఠమైనదనిన యేదృగ్వస్తువు సమానరహితమైనదియు, తనకంటె నితరములేనిదియు, సమస్తమునకు హేతుభూతమైనదియు, సకలంబును నకారణముగా తానే దిలకించునో యదియే సర్వోత్తమమైన నేను కావున నేను స్వప్రకాశుఁడను, పరిపూర్ణుడను పరమాత్మను అగుదునని బోధించి మరల యిట్లనియెను.

తే. తెలియఁబడుచున్న విశ్వంబు - దృశ్యమంచు
దెలివి నై సర్వమును గాంచు - దృక్కు నేను
మిగుల నాకంటె నన్యమే - మియును లేదు
సత్య మిది సర్వవేదాంత - సంగ్రహంబు. 105

తా. గోచరమగుచున్న ప్రపంచమంతయును దృశ్యము, జ్ఞానము గలవాడనైన నేను చూచువాడను, నాకంటె నితరమెద్దియును లేదు. ఇది నిక్కువము. ఇదియే సకలోపనిషత్తులసారము.

క. జీవత్రితయతనుత్రిత
యావస్థాత్రితయములకు - నతిరిక్తుఁడుఁ ద
ద్భావాభావజ్ఞుఁడు నగు
కేవలచిన్మయుఁడ నేను - గీశాధీశా. 106

తా. ఆంజనేయా! నేను సత్యజ్ఞానానందస్వరూపుడనై విశ్వతైజసప్రాజ్ఞులకంటెను శరీరత్రయముకంటెను, జాగ్రత్స్వప్న సుషుప్తులకంటెను నతిరిక్తుడనైనవాడను. జీవత్రయదేహత్రయ అవస్థాత్రయములయొక్క యుండుట లేకపోవుటను ఎఱింగినవాడనగు ప్రధానజ్ఞానస్వరూపుడను నేను.

క్షరాక్షరవిచారము.

సీ. భూతపంచకమును - బుద్ధ్యహంకారంబు
లవ్యక్తమును నింద్రియములు పది ను
నొక్కటి విషయపం - చకమును జేత నే
చ్ఛాద్వేషసుఖదుఃఖ - సంఘధృతులు
క్షరము క్షేత్రంబనఁ - గడునొప్పు నిది యప
రాప్రకృతి యనఁగఁ - బ్రకృతి యనఁగ
నలరు నీప్రకృతితోఁ - గలసి వర్తించు చి
దాభాసుఁ డక్షరుఁ - డాత్ముఁ డనఁగ
తే. బరఁగు క్షేత్రజ్ఞుఁడనబరా - ప్రకృతినాఁగ
బురుషుఁడనఁగ నీరెంటికిఁ - బొందుగలుగ

నొనరఁగనుఁగొను నేఁ బురుషోత్తముఁడనఁ
బరుఁడనగ వెల్గుచుండుదుఁ బవనతనయ. 107

తా. ఆంజనేయా! పంచభూతములు, బుద్ధి, అహంకారము, మూలప్రకృతి కర్మేంద్రియజ్ఞానేంద్రియములు వీనికధిష్ఠానములగు మనస్సు శబ్దస్పర్శరూపరసగంధములు, మనోవృత్తివాంఛ అప్రియము సుఖదుఃఖములు దేహేంద్రియాది సమూహమును ధైర్యమును యివి క్షేత్రమనియు అక్షరమనియు చెప్పబడును. పైజెప్పినవాని రూపముగానుండునది అపరాకృతియనియు, ప్రకృతియనియు జెప్పబడును. మూలప్రకృతితో గలసియుండు జీవుడక్షరుఁడనియు, ఆత్మయనియు, క్షేత్రజ్ఞుఁడనియు చెప్పబడును. ప్రకృతిపురుషుల దిలకించు నేనేపురుషోత్తముడనగుదును. నేనే పరుండన ప్రకాశించెదను.

క. నేననుచు నక్షరుం డ
జ్ఞానముచే క్షరము నెఱుఁగుచందంబున వి
జ్ఞానముచే నప్పురుషుని
నే నని వీక్షింతు వేఱు నిజముగ లేమిన్. 108

తా. అజ్ఞానముచే కూటస్థుఁడు దేహమును నేననిదెలియు చందమున అనుభవజ్ఞానముచే నాయక్షరపురుషునికంటె యన్యములేమిచే నాయక్షరుఁడే నేనని తెలసికొందును.

తే. పరుఁడ నగు నాకు నక్షరపురుషునకును
భేద మేమియు లేదు కన్నెట్టిచూడఁ
గలదె వేఱెంచుకైన లోకమున ముఖ్య
బింబమునకును దత్ప్రతిబింబమునకు. 109

తా. విజ్ఞానదృష్టిచే బరికింప పరమాత్మయగు నాకును ప్రత్యగాత్మకును భేదము లేదు, ఎట్లయిన ప్రధానబింబమునకును దాని ప్రతిబింబమునకును భేదములేదుగదా అట్లే ప్రత్యగాత్మ పరమాత్మలకు భేదములేదు.

తే. ఘటము వొలిసినఁ దద్ఘటాకాశ మాక
సమునఁ జెందినకరణి విజ్ఞానదృష్టి
క్షరము నెడఁబాసి నిర్మలాక్షరుఁడు నన్నుఁ
బొంది బ్రమ్మఱఁబొరయఁడు పూర్వసంజ్ఞ. 110

తా. కుండ నశింపగనే యాఘటమునందలి యాకసమును మహదాకాశమును బొందినవిధమున నక్షరుఁడు జ్ఞానదృష్టిచే శరీరమును వదలి పురుషోత్తముఁడై నన్ను బొందిమరల క్షరుడనబడును.

వ. ఇట్లు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును మనోబుద్ధ్యహంకారములును వీనికిఁ గారణంబైన యవ్యక్తంబును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థ లను దశేంద్రియములును శబ్దస్పర్శరూపరసగంధంబు లను పంచవిషయంబులుం గూడ యిరువదినాలుగు తత్త్వంబు లగు నొండెఱు వాగాదికర్మేంద్రియ పంచకంబును శ్రోత్రాదిజ్ఞానేంద్రియపంచకంబును శబ్దాదివిషయపంచకంబును బ్రాణాదివాయుపంచకంబును మానసాద్యంతఃకరణచతుష్టయంబును గూడి యిరువదినాలుగుతత్త్వంబు లని చెప్పుదు రీచతుర్వింశతితత్త్వంబులను శరీరత్రయంబనియుఁ బంచకోశంబు లనియుఁ బండితులు గణింతురిది మదీయాపరాకృతి యిది క్షేత్రంబు క్షరంబు ప్రకృతి యనాత్మ దృశ్యం బసత్తు జడంబు దుఃఖాత్మకంబు సంసారం బన నొప్పు దప్తాయఃపిండంబుతోఁ గూడి ప్రకాశించు కృశానునిచందంబున మిథ్యాతాదాత్మ్యాధ్యాసంబుచేత దీనితో నెనసి ప్రవర్తించు మదంశభూతుండైన జీవుండు పంచవింశకుం డితం డస్మదీయపరాప్రకృతిక్షేత్రజ్ఞుం డక్షరుఁడు పురుషుం డాత్ముఁడు ద్రష్ట సద్రూపకుఁడు చేతసుం డానందమయుండు సంసారి యనం దేజరిల్లుచుండు నది యెట్లనినఁ బూర్వోక్తతత్త్వంబులలో బ్రధానావయవంబు సర్వకార్యకారణాశ్రయంబు సకలవాసనామయం బనాద్యనిర్వచనీయాజ్ఞానకల్పితంబునైన బుద్ధ్యహంకారాత్మకాంతఃకరణవృత్తివిశేషంబునందు జలఘటంబునం దాదిత్యప్రతిబింబంబు దర్పణంబునందు ముఖాభాసంబుఁ దోఁచినవిధంబున నస్మచ్ఛాయ ప్రతిఫలించి తదుపాధికుండై కరణభోజ్యాజ్ఞానప్రమాణశబ్దవాచ్యంబైన స్థూలగోళకోపహితజ్ఞానకర్మేంద్రియ

ప్రాణపంచకసమన్విత మనశ్చిత్తాత్మకాంతఃకరణవృత్తివిశేషసాధనంబుచేత గార్యభోగజ్ఞేయ ప్రమేయశబ్దవాచ్యంబులైన శబ్దాదివిషయంబుల ననుభవించుచుఁ గర్తయు భోక్తయు జ్ఞాతయుఁ బ్రమాతయు శ్రోతయు స్పృష్టయు ద్రష్టయు రసయితయు ఘ్రాతయు వక్తయు దాతయు గంతయు విసర్జయితయు నానందయితయు బ్రాణియు మంతయు దేహియు జీవుఁడు ననం బ్రసిద్ధుం డై సమధికశరీరజాగ్రదవస్థాభిమానియై విశ్వుం డన సూక్ష్మదేహస్వప్నావస్థాభిమానియై తైజసుండనఁ గారణాంగ సుషుప్త్యవస్థాభిమాని యై ప్రాజ్ఞుఁ డన విలసిల్లి నిఖిలవాసనాసమేతుం డై యయస్కాంతసాన్నిధ్యంబు వలన నయస్సు చలించెడుతెఱంగున సూర్యాలోకంబు నాశ్రయించి స్వస్వవ్యాపారంబులం బ్రవర్తించు జనంబుభంగి సర్వాధిష్ఠానభూతుండుఁ బ్రధానపురుషేశ్వరుండుఁ బురాణపురుషోత్తమాఖ్యుండుఁ దనకు ముఖ్యబింబభూతుండు షడ్వింశకుండుఁ బరుండు బరమాత్ముఁడు నైన నాసన్నిధానంబువలన నస్మదీయతేజంబు సంశ్రయించియు నన్నెఱుంగక తన్ను నామహాపాత్మకునిఁగా దలంచి సంసృతిచక్రంబునం బరిభ్రమించుచుండు నిట్లనాద్యనంతకాలంబు ప్రవర్తించు చుండి యెట్టకేలకు ననేకజన్మార్జితపుణ్యపుంజపరిపాకవిశేషంబువలన మదనుగ్రహంబువలనఁ బరిశుద్ధహృదయుండు సాధనచతుష్టయసంపద్విశిష్టుండై సద్గురుచరణంబు శరణంబు నొంది తత్ప్రసాదలబ్ధాత్మానాత్మవివేకజ్ఞానసహితుం డై యక్షరుండు గాయాద్యహంకృత్యంతంబైన క్షరంబంతయుఁ దాను గానని నిరాకరించి కలశజలనాశాంతరంబున నుపసూర్యకంబు మార్తాండునిం జెందినకైవడి ముకురవియోగంబగుచుండ వదనాభాసంబు ప్రధానాననంబున గలిసినకైవడి మఠ ఘట కుడ్య కుసూల స్తంభ పటాద్యఖిలమూర్తద్రవ్యంబుల వేర్వేఱ వి

భజించిన నశేషవస్తునిషేధావధీభూతంబు చిన్మూర్తంబు నగు తదన
చ్ఛిన్నాకాశంబు మహాకాశం బైనపగిది దశాత్రయవిలక్షణుండు నవ
స్థాత్రయసాక్షియుఁ బంచకోశవ్యతిరిక్తుండు నై యఖండాద్వితీయ
సచ్చిదానందస్వరూప పరిపూర్ణపరబ్రహ్మతత్త్వమాత్రుం డగు క్ష
రాక్షరాతీతపురుషోత్తమతత్త్వం బేనని చెప్పి మఱియు నిట్లనియె.

తా. భూజలాగ్నివాయుగగనములును, మనస్సు, బుద్ధి అహంకారములును, వీనికి కారణమైనవిక్షేపశక్తియు, దశేంద్రియములును, శబ్దస్పర్శరూపరసగంధములును, కలసి యిరువదినాలుగు తత్త్వములు, అని కొందరును, మఱికొందరు కర్మేంద్రియపంచకమును, జ్ఞానేంద్రియపంచకమును, విషయపంచకమును, వాయుపంచకమును, అంతఃకరణచతుష్టయమును గలసి యిరువదినాలుగుతత్త్వములందురు, ఈ 24 తత్త్వములను, శరీరత్రయమని పంచకోశములని, బ్రహ్మవేత్తలువచింతురు. ఇదే నాసంబంధమైనఅపరయని పేర్కొనబడు ప్రకృతి. ఈప్రకృతి, క్షేత్రమనియు క్షరమనియు, ప్రకృతియనియు, అనాత్మయనియు, దృశ్యమనియు అసత్తనియు, జడమనియు, దుఃఖస్వరూపమైనదనియు, సంసారమనియు, అనునట్లుగా నొప్పుచుండెను. ఎఱ్ఱగాగాలిన యినుపగుండుతోఁజేరి యగ్ని ప్రకాశించునట్లు అసత్యస్వరూపమగు ప్రకృతియే నేననుభావముతోఁ జేరి చరించుచున్న నాయొక్క కళచేత జనించిన జీవుఁడు యిరువదియైదవవాఁడు. నాసంబంధమగు పరయను పేరుగల ప్రకృతియే యీజీవుఁడు. ఈజీవుని క్షేత్రజ్ఞుఁడనియు, అక్షరుడనియు, పురుషుఁడనియు ఆత్ముఁడనియును సాక్షియనియు, కాలత్రయముచే బాధింపబడని స్వరూపముగలవాఁడనియు, జ్ఞానస్వరూపుఁడనియు జెప్పుదురు. జీవుఁడీపేరులచే నెట్లుప్రకాశించుచున్నాఁడనగా, ముందుగాజెప్పిన 24 తత్త్వములందునను ముఖ్యమైనదియును, సమస్తకార్యములకును, యింద్రియములకును, ఆధారమైనదియు మలినశుద్ధమిశ్రరూప సంసృతి స్వరూపముగాగలదియును, ఆది లేనిదియును, వచింపరానిదియును, నజ్ఞానముచే నిర్మింపబడినట్టి నిశ్చయాత్మకమైన బుద్ధియు, కర్తవ్యాత్మకమైన అహంకారమును రూపముగా గలదియునగు అంతరహృదయముయొక్క నిర్మలవృత్తియందు, జలఘటములో సూర్యబింబమును, అద్దములో ముఖమును గాన్పించునట్లుదోఁచి ఆఅంతఃకరణవృత్తిరూపోపాధి కలవాఁడై వ్యాపారకారణములగు చక్షువులుమున్నగు నవియును అనుభవయోగ్యములగు పదార్థములనెడి, జ్ఞానమనెడి, ప్రమాణములనెడి, వానిచే పలుకదగిన, స్థూలశరీరసంబంధమైన నవకాశకాస్థానములయందు, జేరిన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ప్రాణపంచకముతోడను గూడిన సంశయస్వరూపమగు మనస్సుయొక్కయు చంచలాత్మకమగు చిత్తముయొక్కస్వరూపమై పన

అంతరింద్రియవ్యాపారమను గొప్పసాధనముచే చక్షురాదికరణములచేత బుట్టిన కార్యములనునట్టియు ప్రాప్తమైన భోగమనునట్టియు జ్ఞానముచే నెఱుంగదగినట్టియు, ప్రమాణములైన కారణములచే గల్గిన ప్రమేయశబ్దములచే వచింపదగిన పంచవిషయముల ననుభవించుచు చేయువాడును భుజించువాడును తెలిసికొనువాడును, ప్రమాణములచే ప్రమేయముల విచారించువాడును, వినుట, తాకుట, జూచుట మొదలగు పనులను గావించువాడును, దేహముగలవాడును, జీవుడును, అనునట్లు యాగా పేరులచే ప్రకాశించుచు, స్థూలశరీరమునకును జాగ్రదవస్థకును కర్తయై విశ్వుడను పేరుచేతను, లింగశరీరమునకును స్వప్నావస్థకు కర్తయై తైజసుడను పేరునను, కారణశరీరమునకును, సుషుప్తికిని కర్తయై ప్రాజ్ఞుడనియును, జెప్పబడుచు వాంఛాన్వితుండై సూదంటురాతి చేరికగల యినుపముక్కవలె సూర్యదర్శనము ననుసరించి తమతమపనుల వర్తించు జనములవలెను, విశ్వమున కాశ్రయమైనవాడును ప్రకృతికిని జీవునకును ప్రభువైనవాడును, ప్రాచీనులగు సదరుచారాదులకంటె నుత్తముడును పరబ్రహ్మమే తనకు ముఖ్యాలంబమగువాడును, ఇరువదియారవవాడును, జ్ఞాతకుపరమైనవాడును, పరమాత్మయును నైన నాసాన్నిధ్యమువలన నాదివ్యతేజమును పొందినప్పటికిని సన్నెఱుంగలేక, జీవుని నామరూపసహితునిగా దలంచుచు సంసారచక్రమున దిరుగుచుండును. ఇట్లనేకజన్మల సంచరించి పెక్కుజన్మల నార్జించిన పుణ్యమువలన, పరిపక్వముజెంది నాయనుగ్రహమున స్వచ్ఛమగు మనస్సుగలవాడును, నిత్యానిత్య వస్తుపరిజ్ఞాతయు, ఇహపరలోకభోగవిరక్తిగలవాడును శమాదిషట్కసంపత్తిగలవాడును సద్గురుబోధచే నిది పరమాత్మ యిది ప్రకృతి యనువిమర్శన జ్ఞానముగలవాడును నైనజీవుడు స్థూలదేహము మొదలుకొని అహంకారమువరకుగల ఆత్మకు భిన్నమైనదంతయును నేను గానని నిరాకరించి కుండయందలి జలముపోయినపిమ్మట సూర్యుని ప్రతిబింబము సూర్యుని గలసినట్లు అద్దము భిన్నమైన ప్రతిబింబము ముఖమునగలసినట్లును సమస్తవస్తువుల వేర్వేర విభజించిన నశేషవస్తునిషేధావధీభూతము సమూర్తంబునగు నవసరమున అవిచ్ఛిన్నాకాశము మహదాకాశమైన స్థూలసూక్ష్మకారణదేహములకంటె వేరైనవాడును, జాగ్రత్స్వప్నసుషుప్తుల దిలకించువాడును, పంచకోశములకంటె భిన్నుడును నై భాగింపబడనట్టియు ఒక్కటైనట్టియు, సమీప అసంగరూపమైనట్టియు, అంతటను నిండియున్నట్టియు, బ్రహ్మస్వరూపమే యగును అట్టిపరబ్రహ్మస్వరూపమే పంచకోశాత్మకమగు శరీరముకంటెను జీవునికంటెను, వేరైన ఆత్మస్వరూపము అట్టిఆత్మస్వరూపమే నేను, అని వచించి మరల నిట్లు చెప్పుచున్నాడు.

## సాక్షిత్వమననము.

ఆ. పంచవిషయములను బంచేంద్రియములచేఁ
గాంచు తెలివి నేను కపివరేణ్య
పంచకోశములను బంచభూతంబుల
నెంచి చూచునట్టి యెఱుక నేను. 112

తా. ఆంజనేయా! శబ్దస్పర్శరూపరసగంధములను చెవిచర్మము నేత్రము పంచకోశములను పంచభూతములను విభజించి తెలియు తెలివియు నేను.

లయవిభాతి. తెలిసె నిది నా కిపుడు తెలియ దది లెస్సగను
దెలియ వివరింపుదను దెలిసెద నటంచున్
బలికితిని బలుక నిఁకఁ బలికెద నటంచు మదిఁ
దలఁపను దలంచితిని దలఁచెద నటంచున్
వెలుపలను లోపలను దెలియఁబడు వృత్తులను
దెలియుచు వెలుంగులను వెలుఁగు లగుచుండన్
గలయ వెలిఁగించు తొలితొవెలుఁగుసుమి నేను ననుఁ
దెలియుము వివేకదశ గల మనముచేతన్. 113

తా. ఇపుడు నాకిది తెలిసినది, ఆవిషయము తెలియలేదు, ఈవిషయమును తెలియ జెప్పగలను, అది తెలిసికొందును. అని బలికితిని యిక బలుకను, చెప్పెదనని మనస్సులో దలంపను తలంచితిని. తలంచెదను అని అంతర్బాహ్యముల గోచరములగు నింద్రియవ్యాపారములను దెలిసికొనుచు ఇనశశివహ్నుల ప్రకాశింపజేయునట్టి సనాతనమైన ప్రకాశమును నేనే అట్టి నన్ను విజ్ఞానమనంబున నన్ను దెలియవలయును.

మ. నతదేవా వెలిలోఁ బదార్థముల నానాఛిద్రభాండోదర
స్థితదీపం బెటులఁగించుచందమున హృన్నేత్రప్రాణసర్వేంద్రియా
న్వితదేహస్థుఁడ నైన నే ననిశమున్ నిస్త్రైతుకాజ్ఞానక
ల్పితబాహ్యాంతరనామరూపతతులన్ లీల న్వెలింగింపుదున్. 114

తా. అనేకతూట్లుగల ఘటమునందున్న దీపము వెలుపలివస్తువులను జూచుటకు తోడ్పడునట్లు మనస్సుబుద్ధి 10 ప్రాణములు జ్ఞానకర్మేంద్రియములతోడనుగూడి శరీరము

నందున్న నేను అవివేకముచే నారోపితమై అంతర్బాహ్యములనుండు నామరూపసమూహమును సకారణముగా ప్రకాశింపజేయుదును.

ఉ. తమ్ము నెఱుంగలేవు విహితమ్ముగ దేహము ప్రాణపంక్తిచి
త్తమ్ము దశేంద్రియమ్ములుచితమ్ముగ నన్యము గాన లేమి స
త్యమ్మగు నోకపీంద్ర సతతమ్మును వానిఁ దదీయకార్యజా
తమ్మును నేను గాంతు ననృతమ్ముగ నన్ను ఋతమ్ముగాఁ దగన్.

తా. దేహమును ప్రాణములును జ్ఞానకర్మేంద్రియములును నిక్కముగా తమ్ము తాము తెలిసికొన జాలవు. తమ్ము తామే తెలియని యితరము నెట్లు తెలియఁగలవు. సర్వసాక్షినైన నేను దేహేంద్రియాదులయొక్క వ్యాపారమును అసత్యముగాను, పరమాత్మనైన నన్ను సత్యముగాను దిలకింతును.

శా. ధీచేతోవిషయాత్మకంబు లగు జ్ఞాతృజ్ఞానవిజ్ఞేయముల్
సూచించుం దగఁ దల్లయోదయములన్ సుప్తిప్రబోధంబు లే
నాచిత్రంబుల వానిఁ జేయు నిజమాయన్ సాక్షినై చూచుచున్
రోచిష్ణుత్వముచే వసింతు సదసద్రూపాతిరిక్తంబుగాన్. 116

తా. తెలిసికొనువాఁడు తెలివి, జ్ఞానము ఇవి మనస్సు ప్రజ్ఞలయొక్క సంకల్పవృత్తులే స్వరూపముగాఁగలవి. అట్టివానియొక్క యుత్పత్తినాశనములను సుషుప్తి జాగ్రదవస్థలు జూపుచుండును. నేను సాక్షినై యా యాశ్చర్యములను, ఆయవస్థలు కల్గించు ప్రకృతిని దిలకించుచు వెలుఁగుచే నుండియుండని వస్తువులకంటె విలక్షణుఁడనై యుందును.

క. మత్సాన్నిధ్యమువలన న
చిత్తాహంకారపవనచిత్తేంద్రియముల్
వత్సా చలియించు సురం
గత్సదయస్కాంతసూచికలచందమునన్. 117

తా. వత్సా! అయస్కాంతసన్నిధిని సూదులు చలించెడివిధమున అవ్యక్తమును అజ్ఞానిచే బుట్టిన అహంకారముతోగూడి ప్రాణాదివాయువులును మనస్సు జ్ఞానకర్మేంద్రియములు నచేతనములగుటచే స్వయముగా ప్రకాశింపక నాసన్నిధిని ప్రకాశించును.

క. తప్తాయఃపిండాంత
ర్వ్యాప్తానలమండలంబుకైవడువున మాయా
గుప్తబ్రహ్మాండసము
ద్దీప్తచిదాత్మకుఁడ నేను ధీరవరేణ్యా. 118

తా. పావనీ! కాల్చబడిన యినుపగుండు లోపలను వెలుపలనుండు అగ్నివలె నేను అవిద్యచే యానరింపబడిన ప్రపంచమును వెల్గించు జ్ఞానస్వరూపుడను.

సీ. ధరణీజలానలమరుదంబరాంతరా
విష్టాఖిలాధారద్రష్ట నేను
ఆదిత్యచంద్రగ్రహర్క్ష తారాతటి
త్సంవ్యాప్తదివ్యతేజంబు నేను
అమరమానవతిర్యగాదిచేతనధీప్ర
కాశమానజ్ఞానఘనుఁడ నేను
బ్రహ్మాదిదేవతాప్రార్థనీయానంత
కల్యాణగుణకవిగ్రహుఁడ నేను
తే. కార్యరూపంబులైన జగంబులకును
స్ఫురదుపాదానకారణంబును నిమిత్త
కారణము నైన నిర్మలాకారసత్త్వ
పరమమాయాసమన్వితేశ్వరుఁడ నేను. 119

తా. భూమి ఉదకము అగ్నివాయువు ఆకాశము వీటియందువ్యాపించిన సమస్తమున కాధారభూతమైనసాక్షిని నేను. సూర్యుఁడు చంద్రుడు మొదలగు గ్రహములయందును నక్షత్రములయందును మెరపులయందును వ్యాపించియున్న అప్రాకృతమగు తేజమును నేను. దేవమానవులు మృగములు పక్షులు మొదలైన చేతనములబుద్ధిని వికసింపచేసెడు మహాజ్ఞానసంపన్నుడను నేను, బ్రహ్మ మొదలగు సమస్తదేవతలచేత నుతింపబడునటువంటి శసదమాద్యవంత కల్యాణగుణయుతమగు శరీరముగలవాడను. కార్యరూపములను 14 లోకముల కుపాదానకారణుడను, అగు నేను నిమిత్తకారణమైన కారణోపాధిమైన మాయతోగూడిన పరమాత్మను.

తే. వేదశాస్త్రాగమములచే ♦ వేదితవ్య
మైనవస్తువు నేను మహాత్మకులకు
జపతపోదానయజ్ఞసంచయముచేత
వరసమారాధనీయుఁడనై ♦ వంబు నేను. 120

తా. వేదములు శాస్త్రములు ఆగమములచేతను తెలియదగిన పరబ్రహ్మమును నేను. సద్వస్తువును దెలిసిన మహనీయుల జపములయొక్క నిత్యనైమిత్తికాది తపస్సుల యొక్కయు దానములయొక్క యజ్ఞములయొక్కయు మున్నగువాని సమూహముచే పూజింపదగినవాడను అయి నేనుంటిని.

తే. అనఘసాకారుఁడను గాను ♦ విను సమష్టి
ఘనతనుద్వయతాదాత్మ్య ♦ మునకుఁ జొరమి
సరి నిరాకారుఁడను గాను ♦ సాక్షి నగుచుఁ
గారణశరీర మే నను ♦ కలఁక లేమి. 121

తా. వత్సా! నేను సర్వమునకు సాక్షినై యీశ్వరుని స్థూలసూక్ష్మశరీరముల చేరి కయందు ప్రవేశింపమి నేను సాకారుడనుగాను. స్థూలసూక్ష్మశరీరములకు సమానమయిన కారణశరీరము నే ననెడు భ్రమకలుగనందున నిరాకారుడనుగాను.

తే. అఖిలభూతములందు నే ♦ నఖిలభూత
ములును నాయందుఁ గలుగఁగ ♦ బొరయ నెందు
వాని నవియు న న్నంటవు ♦ వానరేంద్ర
సమత నొప్పారు గగనంబు ♦ చందమునను. 122

తా. వత్సా! ఆకాశమునం దన్నివస్తువులును, అన్నివస్తువులయం దాకాశమును యున్నను గగనమును సమస్తవస్తువులును, సమస్తవస్తువులను గగనమును యంటనియట్లు నాయందు భూతములును, భూతములందు నేనును వసించినను నావికారములు భూతము లకుగాని, వానివికారములు నాకుగాని యంటవు.

క. మృగతృష్ణికల నెఱింగినఁ
దగ జలము లభావ మగు విధమునఁ దెలివిచే
నగుణుఁ డగు నన్ను దెలిసిన
జగములు నాయందు లేవు ♦ సత్యం బనఘా. 123

తా. పావనీ! తొలుత ఎండమావులు జలములని భ్రమసి పిమ్మట నిక్కువమెఱింగినపిమ్మట వానియందు నీరులేనటుల నన్నెఱింగినవారికి జగములు గాన్పింపక నేనే గాన్పింతును.

చ. అనృత మచేతనం బసుఖ మైనజగంబు ఋతంబుఁ జేతనం
బును సుఖమై విమూఢులకు భోగముగాఁ గనుపట్టు నెల్ల న
న్నెనయుటచేతఁ జుమ్మిది కపీంద్ర! ఘృతాన్వితదుగ్ధపూరముల్
ఘనమధురంబు లై వెలయుఁ గైవడి భక్తజనానురంజనా. 124

తా. ఆంజనేయా! నేతితోఁగూడినపాలు మిక్కిలి మధురములైన యట్లు యీ కనబడుచున్న సత్యాచేతనమగు శరీరసంజ్ఞకల యీజగంబు అజ్ఞానులకు నిక్కమయినదిగను, చైతన్యస్వరూపమయినదిగను, ఆనందరూపముగను అనుభవైకయోగ్యముగను జూపట్టుటగూడ సత్యజ్ఞానానందస్వరూపుడనగు నావలననేయని యెఱుంగుము.

క. జ్ఞానుల కఖండసత్య
జ్ఞానానందస్వరూపసాక్షి నగుచు వి
జ్ఞానముచేఁ దెలియంబడి
నేనై సాక్షాత్కరింతు నిక్కం బనఘా. 125

తా. బ్రహ్మజ్ఞానులకు సర్వత్రనిండియున్న సద్రూప చిద్రూప ఆనందస్వరూపుడనై పరోక్షరహితజ్ఞానముచే దెలియబడుదును. ఇట్లు నేను సాక్షాత్కరించుట నిక్కము సుమా!

తే. అట్లు గావున ననఘ మహాత్ము లెల్ల
సచ్చిదానందమయునిఁగా సర్వకర్తృ
కరణకార్యములకు సాక్షి గాఁగ నన్ను
దెలిసి యనవరతంబు చింతింపవలయు. 126

తా. అట్లగుటవలన బ్రహ్మజ్ఞానులు నన్ను సత్యజ్ఞానానందస్వరూపునిగాను, సమస్తకర్తృత్వములకును కరణములగు 14 యింద్రియములకును యింద్రియవ్యాపారములకు అధిష్ఠాతనుగా నెఱింగి నన్ను స్మరింతురు.

క. అన విని హనుమంతుఁడు రా
మునిదివ్యపదారవిందములకు న్ఘనవం

దన మాచరించి పలికెఁ
వినయము భక్తియును దృఢవివేకము మెఱయన్. 127

తా. ఇట్లు చెప్పగావిని హనుమంతుఁడు రాముని దివ్యపాదములకు నమస్కరించి అడకువయు ప్రేమయు నిశ్చయజ్ఞానమునుగల్గి యిట్లుపల్కెను.

ఉ. ఏనియమంబులుం గలిగి యేసమయంబున నెవ్విధంబునన్
మానము పూనిరో యదియు మానిరొ మంత్రము తంత్రమెద్దియో
నీనయరూప మారయఁగ నిర్గుణమో సగుణంబొ నెమ్మదిన్
ధ్యానము సేయఁగా వలయు నన్నియుఁ బ్రేమ నెఱుంగఁ జెప్పవే.

తా. రామచంద్రా! భవత్స్వరూపమును ధ్యానింపవలయునుగాన నీరూపమెట్టిదో, ఎట్లుధ్యానింపవలయునో (ఎప్పుడు, యేకాలములందు యేవ్రతములందు) నాకు కరణించి దెలియబరుపుము.

క. అనినఁ జిఱునవ్వు నవ్వుచు
మనమున దేహాత్మబుద్ధి మల్లడిగొన ని
ట్లనియెడు నాహనుమంతునిఁ
గనుఁగొని రాముండు పలికెఁ గౌతుక మలరన్. 129

అని పలుకగా విని రాముడు చిఱునవ్వున నాతనిఁగనుఁగొని (శరీరమే పరబ్రహ్మమని తలంచునాలని) సంతోషముతో నిట్లనియెను.

ఉ. వానరనాథ దేహమును వాయువు లింద్రియపంక్తి చిత్తమున్
మానసబుద్ధు లే ననుచు మానము పూనిన మానవాళికిన్
మానము దేశకాలనియమంబులు మంత్రము తంత్రము ల్విధుల్
వానిని జూచు సాక్షి ననువానికిఁ గల్గునె తద్వికారముల్. 130

తా. ఆంజనేయా! శరీరమును 10 విధములగు ప్రాణవాయువులును, యింద్రియములును, మనస్సు బుద్ధియు నేనని యభిమానమునుపొందినవారలకు మౌనవ్రతములతోగాని దేశకాలభేదములతోగాని మంత్రతంత్రములతోగాని శరీరేంద్రియాదుల వికారములతోగాని నిమిత్తములేదు.

## ఆరూఢునిలక్షణము.

శా. ఆత్మానాత్మలు రెండువస్తువులు లక్ష్యంబు ల్గదా యం దనా
త్మాత్మ భ్రాంతి యనాదినుండి సహజంబై యుండఁగా నిప్పుడీ
వాత్మజ్ఞప్తి వటంచుఁ జెప్పితిఁక నన్యం బేమియు న్లేను శు
ద్ధాత్మప్రత్యగభిన్నపూర్ణపరమాత్మారామునిం దక్కఁగన్. 131

తా. పంచలక్షణయుతుడగు పరబ్రహ్మ నామరూపములుగల ప్రకృతిఅనియు రెండు ఆత్మానాత్మలు ఇందుపరబ్రహ్మము భావరూపము ప్రకృతి అభావరూపము,ఆరెండు వస్తువులందు దేహేంద్రియాదులే నేననుభవ మనాదినుండియు గలదు. ఇపుడు జ్ఞప్తి కళామాత్రమయిన యక్షరస్వరూపుడనని చెప్పితిని. ఇంక వచింపబోవునదేమన; కూటస్థ చైతన్యముకంటెను పరబ్రహ్మముకంటెను, భిన్నముగాని నిరతిశయమయిన అంతరాత్ముడుగాక యన్యమేమియునులేదు.

క. అసమానసమగ్రతురీ
యసమాధినిఁ బొందు మింద్రియమనోబుద్ధి
శ్వసనగ్రసనాభ్యసన
వ్యసనము వెస నుడిగి సమరసాత్ముఁడ వగుచున్. 132

తా. జ్ఞానకర్మేంద్రియములను మనస్సును బుద్ధిని పంచప్రాణములను లయింపజేయవలయునను నభ్యాసమందలి వ్యాకులమును వదలి యేకీభావము గలవాడవై అసమానమయినదియును సంపూర్ణమయినదియును నగు నిర్వికల్పసమాధి జెందుము.

క. మాయామయజాయాసుత
కాయేంద్రియమానసాదికపరిత్యాగో
పాయజ్ఞేయామేయ
ధ్యేయాత్ముఁడ వీవు గురువిధేయాత్మవరా. 133

తా. వత్సా! నీవు మాయావికారములగు దారాపుత్రాదులను దేహేంద్రియములను అహంకారచతుష్టయంబును వీనిని విడచుటకు దగినయుక్తిని దెలిసిన ప్రమాణాతీతమయిన జ్ఞేయస్వరూపుడవు నీవు.

సీ. ఏదేశమున నైన నేకాలమున నైన
నేమి సేయుచు నైన నెట్టు లైన

నఖిలవికారంబు ♦ లావిద్యకంబులు
నే నవికారుండ ♦ నిష్ప్రపంచ
నిర్వికల్పాఖండ♦నిశ్చలనిర్మలా
వ్యయసచ్చిదానంద♦మయనిరీహ
పరిపూర్ణనిర్గుణ♦ప్రత్యగాత్మాభిన్న
పరమాత్ముఁడ నటంచుఁ ♦ బరమనిష్ఠ
తే. సంతతంబును దనుఁ గాంచు ♦ సజ్జనునకు
మంత్రతంత్రంబు లేల క♦ర్మంబు లేల
జపతపోవ్రతదానయ♦జ్ఞంబు లేల
నామవర్ణాశ్రమాభిమా♦నంబు లేల. 134

తా. ఏస్థలమందైనను యేపనులగావించుచునైన మరియేవిధముగనైన సమస్తవికారములును అజ్ఞానకల్పితములనియును తాను వికారరహితుఁడనియును విశ్వముశూన్యమయినదనియు, కల్పనారహితమయినదనియును, పరిపూర్ణమనియు నచలమనియు పరిశుద్ధమయినదనియు నాశనరహితమయినదనియును, సత్యస్వరూపమయినదనియును జ్ఞానస్వరూపమయినదియు భవదుఃఖముల నడంచునదియు సౌఖ్యరూపమయినదియు ఆకారరహితమయినదియు సర్వత్రనిండియున్నదియు గుణాతీతమయినదియు, కూటస్థునికంటె భిన్నము గానిదియునునగు పరమాత్మను నేనని తురీయసమాధిచే నాత్మావలోకన మాచరించుపురుషులకు మంత్రములు శాస్త్రములు కర్మములును మంత్రజపమును తపస్సులు వ్రతములు దానములు కర్తృత్వాద్యభిమానములును నిరర్థకములు.

తే. వాయుసుత సర్వవాసనా♦వాసితంబు
సూక్ష్మదేహంబు జడ మగు ♦ సుమ్ము దాని
నంటక వెలుంగుచుండు చి♦దాత్ముఁ డచ్చి
దాత్ముఁ డగువానివికృతు లె♦ట్లంటు ననఘ. 135

తా. ఆంజనేయా! లింగశరీరము కోరికలకు స్థానమయినదియు, నజ్ఞానమయినదినైయున్నది. పరబ్రహ్మ మాయజ్ఞానరూపమగు లింగశరీరమునంటకనే తేజరిల్లుచుండును. అట్టి బ్రహ్మమే తానుగా నున్నవానిని ప్రకృతివికారము లెట్లునుస్పృశింపవు.

సీ. ఘటగతనానావికారము ల్తత్ప్రకా
శకసూర్యునంటని చందమునను
దేహేంద్రియప్రాణధీమనోహంకార
తద్ధర్మతతులు తద్భాసకుండు
సాక్షియై యొప్పారు సచ్చిదానందమ
యాత్మునిఁ బొరయవయ్యాత్ముఁ డగుచు
వెలుఁగుపండితున కెవ్విధమునఁ గల్గు వ
ర్ణాశ్రమాచారాదు లరసిచూడఁ
తే. కర్త గాఁడు గానఁ గరణకార్యములును
భోక్త గాఁడు గాన భోజ్యభోగ
ములును లేవు సర్వమును గల్గ దతనికి
సర్వరూపుఁ డగుట సాధువర్య. 136

తా. ఆంజనేయా! ఘటమున ప్రతిబింబితమయిన బింబముయొక్క చలనాదికము లు బింబమున కధిష్ఠానమయిన భాస్కరుని పొందనట్లు శరీరత్రయమును జ్ఞానకర్మేంద్రియములను ప్రాణములు బుద్ధిని మనస్సును అహంభావమును అవస్థలను దేహేంద్రియాదిధర్మములను, వెలుఁగుజేయుచు సాక్షియైయుండు సద్రూపజ్ఞానస్వరూపసుఖస్వరూపుడును నైన పరబ్రహ్మము నంటవు. ఆలోచింపనట్టి పరబ్రహ్మస్వరూపియైయొప్పు బ్రహ్మవిదునకు వర్ణములును ఆశ్రమములును దానినియమములును గలుగనేరవు. బ్రహ్మవేత్త కర్తగాడు గావున 10 యింద్రియములయొక్క వ్యాపారములును లేవు. భోక్తగామి ననుభవింపదగినవి లేవు. బ్రహ్మవేత్త సకలవస్తు స్వరూపుడుగాన నేదియు నితనికిలేదు.

క. జ్ఞాని యనఁగ వే ఱొక్కఁడె
నేనసుమీ తెలియ నాతనికి నాకును సు
జ్ఞానముచేఁ బరికించినఁ
గానఁబడదు భేద మెందుఁ గవినుతచరితా. 137

తా. బ్రహ్మవేత్త నాకంటె నితరుఁడుగాడు. బ్రహ్మసాక్షాత్కారముచే నాలోచించినయెడల బ్రహ్మవేత్తకును పరమాత్మనైన నాకును భేదములేదు.

క. జ్ఞానికి నేను పరోక్షుఁడఁ
గాను పరోక్షుండు నాకు ♦ గాఁడతఁ డిది సు
జ్ఞానం బజ్ఞున కిది మది
గానఁ బడకు తన్ను నన్నుఁ ♦ గానమి ననఘా. 138

తా. వత్సా! కేవలమాత్మయగు నేను జ్ఞానియైనవానికన్యుఁడనుగాను. అతఁడు నా కన్యుఁడుగాఁడు. ఇదియె జ్ఞానము. అజ్ఞానుఁడు నన్నును తన్నును గనలేనివాఁడగుటంజేసి యీసుజ్ఞాన మతనికి గోచరింపదు.

క. త్రిగుణాత్మిక యగు ప్రకృతిం
దగిలినచో సగుణుఁ డంద్రు ♦ దాని విడుచుచో
నగుణుఁ డని యంద్రు నన్నతి
సుగుణులు నీరెండు గాను ♦ జు మ్మవి లేమిన్. 139

తా. కొందఱు త్రిగుణాత్మకమైన ప్రకృతిగూడినయెడల సగుణుఁ డనియు,దానిని విడచునెడల నిర్గుణుడనియు బలుకుచుందురు. కాని ప్రకృతితో సంయోగవియోగాదులు లేకపోవుటచే సగుణుండను నిర్గుణుండను గాను.

లయగ్రాహి.

భృంగములయందును బతంగములయందును వి
హంగములయందును గురంగములయందున్
సింగములయందును బ్లవంగములయందును దు
రంగములయందును భుజంగములయం దే
కాంగు లగు దేవమునిపుంగవనరాది ఘన
జంగమములందును నజంగమములందున్
సంగమును భంగము గలుంగ కొకభంగిని వె
లుంగు నను నే నని కనుంగొనుము వత్సా. 140

తా. వత్సా! నేను తుమ్మెదలు, మిడుతలు, పక్షులు, సింహములు, లేళ్లు, మర్కటములు, గుఱ్ఱములు, పాములు, మనుజులు, దేవతలు, మునులు మున్నగు చరములగు జంతువులతోను అచరములగువానితోను గూడియు గూడకనుండక నేకరీతిగా ప్రకాశించుచుందు.అట్టినేను నీకంటె భిన్నుఁడనుగాను. కావున నన్ను నీవేయని యెఱుంగుము.

తే. తనువు తా నను దృష్టియె ♦ ధనువు కర్త
కనిశము గుణత్రయమ్ములతో ♦ నెనసి యున్న
యమ్మనమె యమ్ము దాని కాఁ ♦ యమ్ము లతిన
యమ్ము లై తోఁచు దుర్విష ♦ యమ్ము లనఘ. 141

తా. ఆంజనేయా ! అభిమానియగు జీవుడు శరీరము తానే యనుదృష్టి విల్లుగను త్రిగుణాత్మకమనంబు బాణముగను ఆబాణములకు చెడుయింద్రియవ్యాపారములు లక్ష్యములుగాను నున్నవి.

క. మానస మఖిలంబునకుఁ బ్ర
ధానంబు ప్రధానమే ప్ర ♦ ధానము మదికిన్
దాని విడిచి నను గను మది
తానవముం బొంది యంతఁ ♦ దా నవిసి చెడున్. 142

తా. సమస్తమునకును మనస్సుప్రధానమైనది. మనస్సునకు ప్రకృతిప్రధానము, దానినివదలి కేవలము ఆత్మనగు నన్నుతిలకించినంతటనే ప్రకృతి తనంతటనే క్షీణత్వము నొందుచుండును.

ఆ. ప్రకృతి వికృతి దాని ♦ ప్రకృతి యెఱింగి యో
సుకృతి నన్నుఁ గనుము ♦ ప్రకృతముగను
నాత్మ నెఱుఁగునప్పు ♦ డా ప్రకృతియె యప
కృతి యొనర్చు చుండు ♦ నెపుడు గడఁగి. 143

తా. వత్సా ! ప్రకృతి వికారరూపముగలది. కావున ప్రకృతిస్వభావమునుదెలసి పరబ్రహ్మమునైన నన్నుదిలకించుము. ప్రకృతి పరబ్రహ్మము నెఱుంగునప్పు డపకారియగు చుండును.

క. ఖంబుసుమీ మదివిషయసు
ఖంబుసుమీ త్రిజగదభిము ♦ ఖంబుసుమీ దుః
ఖంబుసుమీ యది తద్విము
ఖంబుసుమీ నిరతిశయసు ♦ ఖంబు కపీంద్రా. 144

తా. కపీంద్రా! మనస్సు ఆకాశమువలె శూన్యమైనదియు శబ్దాదివిషయసుఖరూపమైనదియు బహిర్ముఖమైనదియు దుఃఖస్వరూపమైనదియు బ్రహ్మానందమునకు పరాఙ్ముఖమైనదియునైయున్నది.

క. విను వినువీథి తెఱంగున
ఘనఘనమయి విభువు సర్వగతమయి తగు చే
తనుఁ దనుఁ దనుతనువునఁ గని
మనుమనుజుని బ్రతుకుబ్రతుకు మారుతతనయా. 145

తా. వత్సా! పరమాత్మ ఆకసమువలె పొడవైనదియు సర్వత్ర నిండియున్నదియై యున్నది. అట్టి ఆత్మస్వరూపుడగు తన్ను అనుభవదృష్టివలన దెలిసి జీవించు బ్రహ్మవేత్తలజన్మమే జన్మము.

క. సారాసారవిచారవి
శారదుఁ డగు సుకృతి వికృతిజనికృతితతికిన్
శారదనీరదవారవి
దూరవియత్తలముభంగిఁ దొలఁగి వెలుఁగున్. 146

తా. ఆత్మానాత్మవిమర్శయందు నేర్పరియగువాడు శరదృతుగగనము మేఘములకు దూరమైనయట్లు వికారమువలన జనించినవిశ్వమునకు దూరగుడగును.

క. పరమై సురుచిరమై సుఖ
కరమై తగు మానసాదికరణావళి స
త్పరమా పరమాదరమా
స్థిరమోదాకరసదాత్మధీరతి గలుగన్. 147

తా. పరబ్రహ్మము నిత్యమైనదియు, సంతోషమునకు స్థానమైనదియు, త్రికాలముచేబాధింపబడనిదియు, నైయున్నది. బ్రహ్మజ్ఞానములభింప 14 యింద్రియములు పరబ్రహ్మముకంటె భిన్నముకానందున నుత్తమముగాను, అందముగాను, ఆనందదాయకముగాను నుండును.

క. తరమా పరమానందే
తరమా జగ మనుచుఁ జూడ ధర మూఢున కా

చరమార్థము దెలియుట దు
ష్కరమా గురుకరుణ వడయు కే సర్వజ్ఞునకున్. 148

తా. అజ్ఞానికి విశ్వము పరమాత్మస్వరూపమని తెలియుటకష్టము. గురుననుగ్రహ-
మువలన విశ్వము పరబ్రహ్మేతరముగాదని సునాయాసముగా దెలియబడును.

వ. అని యివ్విధంబున నుపదేశించి హనుమంతునితో శ్రీరామచం
ద్రుండు మఱియును. 149

ఉ. మాయను మిథ్యగా దెలియుకేమా యను దత్కృత మెల్లఁ గల్ల సు
మ్మా యను మేను నే ననకుకేమా యను సాక్షివి నీవు చూచుకొ
మ్మా యను జూడఁగా నితరకేమా యను నే నని నిశ్చయించుకొ
మ్మా యను గాక పో నితరకేమా యనుమానము మానుమాయనున్.

తా. కారణోపాధియైన మాయ నసత్యముగా తెలియుము. అనిపలుకును. మాయా-
చేష్టితములన్నియు నసత్యములు అనివచించును. పిండబ్రహ్మాండరూపమైన శరీరము నేనని
పలుకకుమా యని బల్కును. నీవు ద్రష్టవు కావున చూచుకొనుమా యని పచింపుము.
నీవు సాక్షికంటె భిన్నుడవా యనును. నేనాసాక్షినని నిర్ణయింపుమా యనును. సాక్షివి
నీవు గాకుండుటకు, ఆసాక్షి యన్యమా యను సంశయమును మానుమని వచించును. (అన
గా నేనే సాక్షినను నిశ్చయముకలిగియుండుము.)

వ. అని వెండియు నిట్లనియె, ఇది యారూఢునిప్రకారం బింక నారు
రుక్షునిమార్గంబు వివరించెద. 151

తా. ఇపుడుచెప్పినది బ్రహ్మవేత్తయొక్కవిధము. ఇంక జ్ఞానభూమికలవరుసగా
బొందువానిమార్గమును దెలిపెదనాలింపుము.

తత్త్వోపదేశార్హుం డగు నారురుక్షునిలక్షణము.

సర్వతఃప్రాససీసము:—

అస్తోకసద్గురూకేపా స్తిచే సతతవి
ధ్వస్తకాముండు నిరస్తమోహుఁ
డస్తంగతాంశుం డకేపా స్తలోభుండు స
న్యస్తరోషుండు విశ్రస్తమదుఁడు

గ్రస్తనిస్తుత్యేంద్రియస్తోముఁ డశ్రాంత
విస్తారితవిధి ప్రశస్తుఁ డగుచు
స్వస్తిస్వమస్తకన్యస్తనిజాచార్య
హస్తాబ్జవిదితచిద్వస్తుతత్త్వఁ
తే. డమితశమదమముఖగుణసముదయయుత
సుముఖసమరసవిమలహృత్కమలుఁ డఖిల
విషమవిషసమసకలుషవిషయవిముఖుఁ
డైన మేధావి తత్త్వబోధార్హుఁ డనఘ. 152

తా. వత్సా! బ్రహ్మజ్ఞానమున కెట్టివాఁడు ఆగునో, చెప్పెదనాలింపుము. విహితమగుగురూపదేశమున ద్రవ్యము భూములుమున్నగునవి సంపాదింపనాశలేనివాడును, నశించిన యజ్ఞానముగలవాడును, కోపములేనివాడును, ధనవిద్యాదికములమదించనివాడును, ఇంద్రియనిగ్రహముగలవాడును, ధర్మానుష్ఠానముల ప్రసిద్ధికెక్కినవాడును, గురునిచేవిధివిధానమున బ్రహ్మతత్వమును బోధింపబడినవాడును, సద్గుణాన్వితుడును, ప్రసన్నభావయుతమైన సమచిత్తుడును, యింద్రియార్థవిముఖుడునునై యుండవలయును.

సాధకునిలక్షణము.

సర్వతఃప్రాససీసము:—

మేధావి మొదలఁ దా సాధూక్తశాస్త్రాది
సాధనాసాధితబోధుఁ డై స
దా ధీంద్రియముల నిరోధించి మనములో
శోధించి కామసుక్రోధముఖవి
రోధియూథంబున వేధించి బాధించి
బాధమోగ్యాఖిలోపాధులను ని
షేధించి సర్వనిషేధావధీభూత
సాధిభూతాధిదైవాధియజ్ఞ
తే. బోధమయనిరుపాధికాగాథలసద
బాధకానందవిమలపాథోధి యగుచు

వ్యాధుల మహాధుల జయించునట్టి ఘనస
మాధిసుఖలోలుఁ డగువాఁడె సాధకుండు. 153

తా. తత్త్వశాస్త్రమున మేధావియగువాఁడు తొలుత వేదాంతమును సాధనములచే నలవరచుకొని బ్రహ్మజ్ఞానసముపార్జనగావింపవలయును. తదుపరి జ్ఞానేంద్రియములను లోబరచుకొని మనస్సునందు అనురాగాదిశత్రుసంఘమును జయించి దుఃఖకారణములైన స్థూలసూక్ష్మకారణశరీరముల త్యజింపవలయును. అట్లు సమస్తమును వదలినకడపటిదైనదియు ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికములను తాపత్రయయుతమైన శరీరసంబంధమైనవ్యాధులను గెలువజాలు నిర్వికల్పనిష్టచే గల్గిన ఆనందమునందవేతఁ జనించును. అతఁడే యుపాసకుఁడనబడును.

సర్వతఃప్రాసనీసము—

శ్రీసదాచార్యసుశాసనాభిజ్ఞుఁ డ
భ్యాసనాసీనుఁ డభ్యాసనాది
వాసనారాయణోపాసనామ్నాయాంత
వాసనావాసితోల్లాసహృదయుఁ
డై సనాతననిరాభాసనానార్థావ
భాసకానందసత్త్వాసమాన
ధీసాక్షివరచిదాభాసైక్యసంతతా
భ్యాసవివర్జితాయాసుఁ డగుచుఁ

తే. గాసువీసంబుపై సుదతీసుతార్థ
దాసదాసీజనములపై నాసఁ జేసి
మోసపోవక దోసము ల్మోసికొనక
వాసుదేవాత్ముఁడై చిద్విలాసుఁ డగుచు. 154

తా. సద్గురుశిక్షచే వస్తుతత్త్వమెఱింగినవాఁడును, పద్మాసనాసీనుడును బ్రహ్మమొదలు సమస్తదేవతలకు నివాసభూతుఁడైన పరబ్రహ్మమునందలి నిష్ఠచే నుపనిషత్సారవిచారజ్ఞానముగల్గియు, వికసించిన హృదయముగలవాఁడై అనాదియైనదియును ప్రతిబింబరహితమైనదియును యింద్రియార్థములు ప్రకాశింపజేయునదియును ఆనందస్వరూపమయినదియును నిత్యమయినదియు, ప్రతిలేనిదియు, ప్రజ్ఞానసాక్షియైనదియు, నగుపరబ్రహ్మ

మునందు జీవునకేకీభావముయొక్క- యభ్యాసముచే నాశనముగావింపబడిన ఆయాసముగల వాఁడై దారాపుత్రాదుల ఆశనుబాఁది భ్రష్టుఁడైనదై బ్రహ్మహత్యాదిపాపములగావింపక పరమాత్మస్వరూపియై స్వస్వరూపజ్ఞానమనుక్రియలుఁగలవాఁడై (ముముక్షునకన్వయము).

సర్వతఃప్రాససీసము—

శిష్టవరేణ్యనిర్దిష్టోపదిష్టార్థ
దిష్టవిశిష్ట సంతుష్టుఁ డగుచుఁ
గష్టమై మూఢసంజుష్టమై త్రిగుణసం
శ్లిష్టమై పరమనికృష్ట మగుచు
దుష్టమై పరఁగు యీవ్యష్టిసమష్టిరూ
పాష్టప్రకృతిమయ దృష్టజగము
భ్రష్టంబుగాఁ గడు నష్టంబుగా నాత్మ
దృష్టిచేఁ గని యవశిష్టుఁ డగుచు
తే. విష్టపస్రష్టమై తదస్పృష్టుఁ డగుచు
ద్రష్టమై నిత్యనిర్మలోత్కృష్టుఁడై వి
చేష్టుఁ డగు తన్నుఁ గాంచి విస్పష్టముగ న
భీష్టఫలసిద్ధిఁ బొందు సంతుష్టుఁ డగుచు. 155

తా. బ్రహ్మవిద్వరిష్ఠులచే నుపదేశింపబడినదియు, శాస్త్రప్రమాణములచేతను అనుభవముచేతను నిర్ణయింపబడిన మోక్షప్రయోజననియతియుతమగు ఆనందమునొందునదియును, అసాధ్యమైనదియును, తిరోధానశక్తిచే గనబడనదియును, త్రిగుణయుతమైనదియును, నీచమైనదియును, మాయాసంబంధమైనదియును జీవేశ్వరరూపములైన పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములతోఁగూడినదియును, ప్రపంచమును అనుభవజ్ఞానదృష్టిచే పతితముగను మిగులనశించినదిగను గుర్తెఱిఁగి, మిగిలినవాఁడైభూర్భువస్సువరాదిలోకములు సృజించువాఁడై వానినంటనివాఁడై వానికిసాక్షియై కాలత్రయములందుండు వాఁడై 14 ఇంద్రియవ్యాపారరహితుఁడై తన్నుఁజూచియానందించువాఁడు మోక్షమునుబొందును.

సర్వతఃప్రాససీసము—

దాంతుఁడై సకలవేదాంతతాత్పర్యప,
ర్యాలోచనైకాశయంబు చేతఁ

చేతనాచేతనవ్రాతసంయుతపంచ,
భూతాత్మకద్వైతజాత మెల్ల
మెల్లనఁ దనయందమిథ్యగా భావించి,
నిరుపమానందాంబునిధి మునింగి
నింగిభంగి నెసంగి నిరవయవాత్ముఁడై
కారణకార్యవికారరహిత
తే. హితనిరీహనిరామయనిర్వికల్ప,
కల్పనాతీతసచ్చిత్సుఖస్వభావ,
భావనాభావ్యశూన్యచిద్బ్రహ్మమగుచు,
సంతసించుచు నుండు సజ్జనవరుండు. 156

తా. సత్పురుషుడు 14 యింద్రియములను జయించినవాఁడై యుపనిషత్పరిశీలనోద్భవమైన జ్ఞానముచే చరాచరసంఘముతోఁ గూడిన పంచభూతమయమైన నీవు నేను నెడు భిన్నభావములన్నిటిని తిన్నగానైన ప్రత్యగాత్మయందే అసత్యమని తలంచి సాటిలేని నిజానంద వారాసిమునింగినవాఁడై గగనమువలె నిర్వికారుఁడై వెలుంగుచు కారణములైన దేహేంద్రియాదులను, కార్యములగు శబ్దస్పర్శాదివిషయములను స్థూలదీర్ఘహ్రస్వాదివికార రహితమైనదియు నుత్తమమయినదియు కోర్కెలులేనిదియు జరత్వము, ఆకలిదప్పికలు రూపరోగము మున్నగునవి లేనిదియు, మనశ్శూన్యమైనదియు అవస్థాత్రయమున నశింపనిదియును అపరోక్షజ్ఞానమును ఆనందమును స్వరూపముగాగల వూహాయునూహింపదగిన వస్తువును లేని జ్ఞానస్వరూప పరబ్రహ్మమై ఆనందించుచుండును.

సర్వతఃప్రాససీసము—

డెందంబు నింద్రియబృందంబు నొకట ని,
ష్పందంబుఁ గావించి క్రిందుపఱచి
యందంబుగ మనోరవిందంబునకు మూల,
కందంబు నౌ చిదానందజలధి
నందంబు బిందువమందంబుగా నొందు,
చందంబునం బొంద మందు లెల్ల

నిందించినను సభనందించినను మేలు,
జెందించి ననుగీడు జెందునప్పు

తే. డెందు దగులుక విందుగా నందుకొనుచు,
సందియంబులసందడి డిందఁజేసి
కందులేనిమనీషిసనందనాది,
వందనీయుండ నైన నాయందుఁ గలవు. 157

తా. నిర్మలజ్ఞానయుతుని మనస్సు జ్ఞానకర్మేంద్రియములు కలియకుండునట్లును నశించునట్లును గావించి అందముగా మనస్సను కమలమున కాదికారణమగు యపరోక్షజ్ఞానజనితసుఖవార్ధి చొక్కమగు బుద్ధిజడత్వములేక కలసియుండగా శ్రుతియుక్త్యనుభవరహితులు దూషణభూషణలొనర్చినను సుఖదుఃఖముల చేకూర్చినను జిక్కుకొనకసంతోషముతో ననుభవించుచు సంశయరహితుఁడై మునిశ్రేష్ఠులచేగూడ నమస్కరింపదగిన పరమాత్మనగు నాయందైక్యమగును.

క. కావున నీవును పావన,
భావనచే నింద్రియముల భజియించి మనీ
షావిల మడంచి యనిశము,
భావింపుము నన్ను విజనపదగుఁడ వగుచున్. 158

తా. కాన నపరోక్షజ్ఞానయుతుడవైన నీవు బ్రహ్మభావముచే 14 యింద్రియముల నణచి బుద్ధియందలి కల్మషమును పోనడచి యేకాంతముననుండి సత్యజ్ఞానానందస్వరూపుడనైన నన్ను నిన్నుగా దలపోయుము.

ఆ. ఆంజనేయ సచ్చిదానందమయునిఁగా,
నన్ను గాంచు తెలుఁగు విన్నవింతు
నమలమనముచేత నవధరింపుము నీదు,
సకలసంశయములు సమసిపోవు. 159

తా. వత్సా! పరబ్రహ్మస్వరూపుడనైన నన్ను సత్యజ్ఞానానందస్వరూపునిగా దిలకింపదగిన మార్గమును దెలుపుచున్నాను నిశ్చలమానసుడవై యాలించిన నీసందేహము లన్నియు తొలగిపోవును.

## సదూ్రపలక్షణము.

పంచచామరము. అనాదికాల మాదిగా ననంతదేహవర్ణగో
త్రనామరూపసౌఖ్యదుఃఖధర్మపాపకోటులున్
వినాశ మొందుచుండఁబూని వీని జూచుచుందునే.
ననాది నౌట సత్స్వరూపుఁ డంద్రునన్ను మారుతీ. 160

తా. వత్సా! సృష్ట్యాదినుండియు, ననేకశరీరములు, వర్ణములు, గోత్రములు, నామములు సురనరస్థావరాదిరూపములు సౌఖ్యములు, దుఃఖములు, ధర్మములు పాపములు, వీనియొక్క సమూహము నశించుచుండగా పరమాత్మనైన నేను జననమరణాదికరహితుడనై సమస్తమును జూచుచుండుదును. కాన నన్ను నాశనములేనివాడని జెప్పుదురు.

పంచచామరము. ఖగంబులున్ దురంగపన్నగంబులున్ వనంబులున్
మృగంబులు న్నగంబులున్ మహీధరాదికంబులున్
జగంబులున్ లయంబు నొంద సాక్షినై సమస్తమున్
దగంగఁజూచుచుండుదున్ సదాసదాత్మకుండనన్. 161

తా. పక్షులు, గుర్రములు, సర్పములు, అరణ్యములు, మృగములు, వృక్షములు, పర్వతములు, లోకములు నశించుచుండగా నేను సత్యస్వరూపుడననుసట్లు సాక్షినై సమస్తమును దిలకించుచుందును.

సీ. దేహేంద్రియప్రాణ ధీమనోహంకార,
చిత్తముల్మతమ చేష్టలుడిగి
యలఘుసుషుప్తియం దజ్ఞానమున లయ
మొందినవేళ నే నుంటఁజేసి
యేమియు లేదని యెఱుఁగుదు వాని య
భావ మంతయును స్వభావమునను
గావున విను తదభావానుభావము
స్మరియింతు మేల్కొన్న సమయమునను

తే. వరుసతో నిట్లు జాగర స్వప్నసుషుప్త
లనుదినం బేగుదెంచుచు నరుగుచుండ

నేకరూపుఁడనై వాని కె నెపుడుఁ గనుచు
నునికివలనను సదూపుఁడను గపీంద్ర. 162

తా. ఆంజనేయా! శరీరములు, జ్ఞానకర్మేంద్రియములును పంచప్రాణములును బుద్ధి మనస్సు అభిమానమును చిత్తమును తమతమ వ్యాపారములనుమాని గాఢనిద్రయందు నవివేకముచే నశింపుచుండ నేనుమాత్రము మిగిలియుండుటవలన నిజబోధయందు పైజెప్పినవాటిలో నొక్కటియులేదని నేనెఱింగియుందును. కావున అంతఃకరణాదివృత్తులు తమతమ వ్యాపారము లొనరించునపుడు ఆదేహేంద్రియాదులులేనను యనుభవమును బాగుగ దలంతును. ఇట్లు క్రమమున జాగ్రత్స్వప్న సుషుప్తులను త్రికాలములందును చూచుచుండుటవలన నశింపనిరూపముగలవాడను.

ఆ. జాగరంబునందు కె స్వప్నసుషుప్తులు
స్వప్నమున సుషుప్తి కె జాగరములు
సమసుషుప్తియందు కె స్వప్నజాగరములు
గలుగ నేను వీని కె గాంతు నెపుడు. 163

తా. ఆంజనేయా! జాగ్రదవస్థయందు స్వప్నసుషుప్తులును, సుషుప్తిన స్వప్నజాగరములును, స్వప్నమున జాగ్రత్సుషుప్తులు గలుగగా వీనిని నేను గాంతును. (త్రిగుణము లవస్థలుగాన నొకదానియందు మిగిలినవి జనించి నశించుచుండుట దిలకింతును.)

సీ. భువి నవస్థాత్రయంబున నేకరూపత
నొకదివసంబునం కె నున్నయట్లు
విను మతీతాగామి కె దినవారపక్షమా
సాబ్దయుగప్రకల్పాంతములను
నొక్కచందంబున కె నూహనుగాంచు
స్వద్రూపుఁడను వినిశ్చయము సుమ్ము
అదిగాక బాధయోగ్యములైన దేహేంద్రి
యప్రాణధీమనోహంకృతులును
తే. నేను గానని భావింప కె నిఖిలదృశ్య
చయనిషేధావధీభూత కె సర్వబాధ

వర్జితాశేషసాక్షినై నే వఱలు చునికి
వలన సత్యస్వరూపుఁడ నే నలఘుచరిత. 164

తా. వత్సా! వినుము. శరీర మను భూమియందు నవస్థాత్రయమునందేకాకారముగా నొకదినమునం దుండినట్లుగనే భూతభవిష్యద్వర్తమానములందు బ్రహ్మాదిప్రళయపర్యంతముండును గావుననే నేను సత్యస్వరూపుడను ఇయ్యదియె నిశ్చయము. ఇంతియెగాక ఉపద్రవకారణములైన శరీరత్రయమును 14 యింద్రియములునుపంచప్రాణములును నేనుగానని దలంచుటవలన సమస్తములైన బాహ్యాభ్యంతరదృశ్యసమూహమును త్యజించుటకు హద్దుగానున్నట్టి సకలములైనదుఃఖములను దొలగింప సర్వసాక్షినై ప్రకాశించు సత్యస్వరూపుడను.

పంచప్రళయముల వివరణము.

వ. మఱియు లఘ్వక్షరోచ్చారణమాత్రకాలంబు నిమేషం, బట్టినిమేషంబులు పదునెనిమిది యైన గాష్ఠ, యవి ముప్పదియైన గళ, యవి యన్నియైనం గళం, బవి పండ్రెండు ముహూర్తం, బమ్ముహూర్తంబు ముప్పదియైన నహోరాత్రంబులు గడచు, నయ్యహోరాత్రంబులందు శరీరేంద్రియప్రాణాంతఃకరణంబులు స్వస్వవ్యాపారంబులఁ జాలించి తమకుఁ గారణంబైన సుషుప్తిరూపావిద్యాంధకారమ్మునందు లయంబు నొందు, నప్పుడు జాగ్రత్స్వప్నాత్మకంబగు నఖిలప్రపంచంబు వాసనారూపమాత్రంబై పల్లవ పత్రపుష్ప శలాటు ఫల మూల శాఖోపశాఖాత్మకం బయిన వటంబు తదీయబీజంబునందు నానావిధవర్ణరక్తం బయిన మయూరంబు తదీయాండాంతర్గలంబునందు నున్నచందంబున నుండు నిది నిత్యప్రళయం బననొప్పు, నయ్యహోరాత్రపంచదశకంబుపక్షంబయ్యె,శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు మాసం బిది పితృదేవతల కొక్కదినం బగు, నమ్మాసద్వయంబు ఋతువు, ఋతుత్రయం బయనంబు, దక్షిణోత్తరసంజ్ఞికాయనద్వయంబు హాయనం బది వేల్పుల కొక్కదినం బగుఁ, దద్దివసవార పక్షమాసక్రమంబుచేత ద్వాదశసహస్రవత్సరంబు లైనఁ గృత త్రే

తా ద్వాపర కలియుగంబులు నాలుగుం జను, నయ్యుగచతుష్టయం బును మహాయుగం బని చెప్పుదు, రవి డెబ్బదియొక్కటి యైన మన్వంతరంబు చెల్లు, నమ్మన్వంతరంబులు పదునాలుగు చనిన నలు వకు నొక్కపగలగు, నది చతుర్యుగసహస్రపరిమితం, బాపగటిలోఁ జతుర్దశమనుప్రళయంబులు ననేకయుగాంతరప్రళయంబులుఁ బ్రవ ర్తించు, నవియు నైమిత్తికప్రళయంబు లనం బ్రసిద్ధంబు లగు, నం దనంతభూతజాతంబులు నశించు, నయ్యహరవసానంబున ద్రుహిణుం డు నిద్రించు, నతని నిద్ర యవ్యక్తం బనందగు, నందు బ్రహ్మాండం బునం గల సర్వప్రాణివ్యవహారం బుపరతంబగు, నత్తరి మహాభూ తంబులుమాత్రంబు శేషించు నది దైనందిన ప్రళయం బన విలసిల్లు, నయ్యజున కహఃపరిమాణంబంతియ రేయి యగు, నట్టిదినసంఖ్యా క్రమంబుచేత శతాబ్దంబులు చనిన శతానందుండు నాకంబుఁ జెందు, నయ్యెడ మృత్యువు సమస్తజీవుల నొక్కపెట్టం బరిమార్చు, రుద్రుం డు చిచ్చుకన్ను దెఱచి చూచు, నాదిత్యుండు పండ్రెండుమూర్తులుఁ గైకొని ప్రకాశించు, నవ్వేళ ప్రజ్వలజ్జ్వాలాభీలం బగు మహానలం బు జనియించి విశ్వవిశ్వంబు భస్మీభూతంబుగాఁ జేయు సప్తమారు తంబు లొక్కపెట్ట విసరు, నవమేఘంబు లుప్పతిల్లి యమోఘంబులై నూఱుదివ్యవర్షంబులు మహావర్షంబు వర్షించు, నందువలనసప్తసము ద్రంబులుం గలసి యేకార్ణవంబై మహామహీమండలంబు నాక్రమిం చుచు నంతట ధరణీచక్రం బమ్మహాసలిలమధ్యంబున మహోదకం బుల స్వల్పలోష్టపిండంబువిధంబున విరిసి చెడుఁ, దత్తోయః పిండం బొకతోయకణంబుం బీల్చినకైవడి బడబాగ్ని విజృంభించి యమ్మ హాంభోరాశి శానంబు సేయు, దీపంబు గాలియార్చినభంగి నమ్మహా తేజోమండలంబును మహావాయువు దెగటార్చు, నమ్మహాజంఝూ సమీరంబు నిరాధేయం బగుటంజేసి యంతరిక్షంబునం గలయుం

దిరిగి యందు సుషుప్తియందు ప్రాణులపోలిక ప్రగ్గు, శబ్దరూపం బయిననింగి శ్రోత్రరూపంబయిన సంకల్పంబు ప్రింగిన తెఱంగు న య్యాకాశంబు మహామనంబు గ్రసించు, బంచతన్మాత్రసహితం బయిన యమ్మహామానసంబు నిద్రాసమయంబు గబళించుచాడ్పున నహంకారంబు గబళించు, నయ్యహంకృతి మహాబుద్ధినొసంగు, నమ్మహాబుద్ధియే మహత్తత్త్వంబని చెప్పనొప్పు, నమ్మహత్తత్వంబు నవ్యక్తంబు తనయందు విలీనంబు గావించి యడంచుకొను, నది మాయావిద్యావ్యక్తతమస్సుషుప్తి ప్రకృత్యానందాదిశబ్దవాచ్యంబయిన ప్రధానం, బదియే బ్రహ్మప్రళయం బగు, నయ్యనాద్యనిర్వచనీయాజ్ఞానంబు సద్గురూక్తజీవేశ్వరైక్యజ్ఞానానుభవసమయంబున నభావం బగు నదియే మహాప్రళయం బగు, నిట్టి నిత్యనైమిత్తికదైనందిన కల్పాంతమహాప్రళయంబులయం దే నొక్కటిచేత బాధింపఁబడక సాక్షినై వాని నన్నిటిం జూచుచు భూతభవిష్యద్వర్తమానకాలంబులయం దేకరూపంబుగా నుంటం జేసి సద్రూపకుండ నగుదు నని యుపదేశించి వెండియు నిట్లనియె. 165

తా. అకారముచ్చరించునంతకాలము నిమేషము. 18 నిముషములొకకాష్టము. 30 కాష్టములు కళ, ముప్పదికళలొకక్షణము. 12 క్షణములొక ముహూర్తము, 30 ముహూర్తములొకదినము. దినమునందు, శరీరత్రయమును, దశేంద్రియములు దశవిధప్రాణములును అంతఃకరణమును మనస్సును తమవ్యాపారములుమాని తమకుగారణమైన నిద్రారూపమగు నజ్ఞానమను తిమిరముననణంచును. అపుడుజాగ్రత్స్వప్నరూపమైనదియు, ఇంద్రియరూపమైనదియు, నగు విశ్వము పృథివి యందలిగంధగుణంబును బోలెనుండి గొప్పదగు మఱ్రివృక్షము చిన్నవిత్తునందున్నచందమున – అనేకరంగులతో నొప్పు నెమలియండములోని నీటియందున్నవిధమున ప్రకృతిలో లీనమైయుండును. దీనికి దినప్రళయమందురు,

15 దినములొకపక్షము, 2 పక్షములొకమాసము, 2 మాసములొక ఋతువు. 3 ఋతువులొకఅయనము, 2 అయనములొకసంవత్సరము, అట్టివత్సరము దేవతలకొకదినము.. అట్టిదినములు, వారములు మాసములు క్రమముగా దేవతల 12000 ఏండ్లైనయెడలమానవులకు 1728000 వత్సరములుగలకృతయుగము, 1296000 వత్సరములుగల త్రేతాయుగము

864000 వత్సరములుగల ద్వాపరము, 432000 వత్సరములుగలకలియుగము అతిక్రమించును. ఈనాల్గుయుగములొక మహాయుగము. మహాయుగములు 71 అయిన మన్వంతరమగును. మన్వంతరములు 14 బ్రహ్మకు ఒకపగలగును. అది వేయిమహాయుగములపర్యంతముండును. బ్రహ్మపగటియందే 14 గురు మనువుల ప్రళయములను, అనేకయుగసంధులుగల ప్రళయములును జరుగును. ఈప్రళయములకు నైమిత్తికములు, ఆగంతుకప్రళయములనియు నందురు. బ్రహ్మదేవునిపగటియందనేకజీవులునశించును. అట్టిదినాంతమున బ్రహ్మనిద్రించును, ఆనిద్రయే మహామాయయందురు, అపుడు మహాభూతములుమాత్రము శేషించియుండునది దైనందినప్రళయమందురు. బ్రహ్మకుపగలెంతయో రాత్రియునంతకాలంబైయుండు, అట్టిదినప్రమాణసంఖ్యాక్రమమున నూరువత్సరములైనయెడల బ్రహ్మ మృతుండగును. అపుడు మృత్యువుసమస్తజీవరాశులనొక్కపెట్టునచంపును. రుద్రుడు మూడవకన్ను తెరచిచూచును. సూర్యుడు 12 మూర్తులధరించివెలుంగు, అపుడుమహాగ్నిజనించి లోకములను భస్మీభూతముగావించును. వాయువులేడును ఒక్కమారువిసరును, 9 మేఘములును నూరుదివ్యవర్షంబులువర్షించును, అందుచే సప్తసముద్రములును యేకమగును. అందుభూమండలము అగొప్పజలమునందు చిన్నమంటిపెల్లవలె కరగిపోవును. అపుడుమహాగ్నిజనించి కాల్చినయినుపగుండు నీటిచుక్కను బీల్చినయట్లు యాజలమును హరించును, దీపమును గాలియార్పినయట్లు నమ్మహాగ్నిని మహావాయువుదెగటార్చు, ఆవాయువు నిరాధేయమగుటజేసి యంతరిక్షమునుజేరి గలయదిరిగి యందణగ్గును. శబ్దరూపమైన యాకాశము శ్రోత్రరూపమైన సంకల్పమును మ్రింగినతెరగున ఆయాకాశము మహామనంబుగబళించు పంచతన్మాత్రలతోగూడుకొనిన యామానసమును నిద్రాసమయంబుగబళించు విధమున నహంకారము గబళించును.ఆయహంకారమును మహాబుద్ధిగబళించును. అమ్మహాబుద్ధియే మహత్తత్త్వమని చెప్పదగును. అమ్మహత్తత్త్వమును మూలప్రకృతి తనలో జేర్చుకొనును. ఆమూలప్రకృతియే మాయయనియు, అవిద్యయనియు, అవ్యక్తమనియు, తమస్సనియు సుషుప్తియనియును ప్రకృతియనియు, ఆనందమనియు జెప్పబడును. అదియే బ్రహ్మప్రళయమని జెప్పబడును. తుదమొదలులేనిదియు, ఇట్టిదట్టిదని వచింపనసాధ్యమైనదియునగునది అజ్ఞానము. అట్టియజ్ఞానము సద్గురువుచే నుపదేశింపబడిన జీవేశ్వరులయొక్క ఐక్యసంధాన అనుభవకాలమున నశించును. అట్టి అజ్ఞాననాశనమే మహాప్రళయము, దీనిని ఆత్యంతికప్రళయమందురు. ఇట్టి నిత్యనైమిత్తికదైనందిన ప్రళయములందు నేను బాధింపబడక సాక్షినై యాప్రళయములన్నిటినిజూచుచు కాలత్రయమునందునను ఒక్కతీరుననే యుండుటవలన సర్వకాలపరిచ్ఛేదశూన్యుడ నగుదును. అని బోధించి మరియు నిట్లనియెను.

## చిద్రూపలక్షణము.

సీ. ఇది ఘటం బిది పటం | బిదిగృహం బిదికుడ్య
మిది యరణ్యము శైల | మిదియటంచు
నిది భూమి యిది జలం | బితఁడు వైశ్వానరుం
డిది గాలి యాకసం | బిది యటంచు
నితఁడు దివాకరుం | డితఁడు నిశాకరుం
డివి తారలు గ్రహంబు | లివి యటంచు
నివి యచేతనము లౌనివి చేతనము లంచు,
నితఁ డాతఁ డతఁ డితఁ|డే నటంచు
తే. నరయ నాకంటె భిన్నంబు | లై జడంబు
లైన బాహ్యపదార్థసంఘాతుల నెల్ల
సాధనము లేక వెఱ్ఱిఁగెడి|సాక్షి నగుట
నేను జిదూ)పకుఁడసుమ్ము | వానరేంద్ర. 166

తా. వత్సా! ఇది కుండ. యిది బట్ట, గోడ, యడవి, కొండ, నీరు, నిప్పు, వాయువు ఆకాశము సూర్యుఁడు చంద్రుఁడు నక్షత్రములు గ్రహములు జడపదార్థములు యిది తెలివి గలది. ఈపురుషుఁడాపురుషుఁడు, ఆతడీతఁడు నేను అనియు నాలోచింప నాకంటె భిన్నమయి, అచేతనములైన వెలుపలదోచుచుండెడి దృశ్యపదార్థములన్నిటిని దెలియుటకు వేఱు సాధనములేక దెలిసెడివాడనగుటచే నేనే జ్ఞానస్వరూపుడను.

సీ. ఇది శరీరం బిది | యింద్రియదశకంబు,
లివి పంచవిషయంబు | లిదియప్రాణ
మిదిమనం బిది చిత్త | మిది యహంకారంబు
నిది బుద్ధి యిది విద్య | యిది యవిద్య
యిది కామ మిది క్రోధ | మిది లోభ మిది మోహ
మిది మహామత్సర | మిదిమదంబు
నిదిజాగరముస్వప్న | మిదిసుషుప్తి రీతుయ
మిదియిదియనుచు నా | మెఱుఁగఁ దోఁచు

తే. నాంతరపదార్థములనెల్ల - ననవరతము
సాధనం బేమియును లేక - సాక్షి నగుచు
నే నెఱుంగుదుఁ గావున - నిత్యవిమల
చిత్స్వరూపుఁడ నగుదు రాజీతవిచార. 167

తా. ఆంజనేయా! ఇదిదేహము, ఇవి యింద్రియములు, యివి విషయములు, యివి ప్రాణములు, యివి అంతఃకరణచతుష్టయమనియు ఇది జ్ఞానము, యిది అజ్ఞానము, ఇదివాంఛ, ఇది రోషము, యిది లోభము యిదిమోహము యిదిక్రోధము ఇది మమత యిది జాగ్రదవస్థ యిది స్వప్నావస్థ యిది సుషుప్తి యిది తురీయావస్థయని నాయెదుట గాన్పించు అంతర్దృశ్యమును యెప్పుడును అకారణముగ దిలకించువాడనై పైజెప్పబడిన శరీరేంద్రియాదులను దెలిసికొందును గాన నేను నిత్యనిర్మలజ్ఞానస్వరూపుడ నగుదును.

ఆనందలక్షణము.

శా. వరుసం బ్రాప్తము లైన దుఃఖములఁ బోషవం జూచుచు న్భూరిసు
స్థిరసౌఖ్యోన్నతిఁ జెంది యుండుటకు నై - చింతింపుదుం గాన నేఁ
బరమప్రేమరసాస్పదుండ నగు నట్టి - భావింప నశ్లాటచేఁ
బరమానందమయాత్ముఁడం జుమీ జగత్త్రాణాత్మజా నిత్యమున్.168

తా. వత్సా! విచారింపగా నెప్పుడును సంభవించుదుఃఖముల దొలఁగ జూచుచు నుత్తమమైనట్టియు, చలనములేనట్టిదియునగు సౌఖ్యమును బొందుటకై యోచింతునుగాన నిరతిశయానందమునకు నేనుస్థానభూతుడనైయుంటిని. కాన నే బ్రహ్మానందస్వరూపుడను.

తే. వివిధదుఃఖాత్మకము లైన - విషయతతులు
తోడరి యత్యంతసుఖములై - తోఁచు నెల్ల
నతులితానందమయుఁడ నై - నట్టినాదు
సలలితాభాసమాత్రంబు - వలనఁ జువ్వె. 169

తా. పెక్కులగు దుఃఖమయములగు శబ్దస్పర్శాదిదృశ్యమంతయు ఆనందకరముగా దోచుటయంతయు అతులితానందస్వరూపుడనగు నేను ప్రతిబింబించుటచేనని యెఱుంగుము.

తే. దుఃఖ మాగంతుకం బయి - తోఁచు చుండు
సుఖము స్వాభావికము నాకు - సూరివర్య

యట్లు గావున నిరతిశయాప్రమేయ
నిరుపమానందమయుఁడను నేను బుత్త్రీ. 170

తా. ఆంజనేయా! నాకు దుఃఖముకల్పితముగను ఆనందము సహజముగను దోచును. సుఖదుఃఖములు స్వాభావికాగంతుకములుగాన సంపూర్ణముగ నేను పరమమైనదియు ప్రమాణములకందనిదియును, సాటిలేనిదియును అగు ఆనందమే స్వరూపముగా గలవాఁడను.

అఖండలక్షణము.

వ. ఇట్లు కాలత్రయాబాధ్యత్వంబువలనను స్వారోపితాశేషపదార్థభాసకత్వంబువలనను బరమప్రేమరసాస్పదత్వంబువలనను సచ్చిదానంద స్వరూపకుండ నయిన నేను మణి కనక రజత తామ్ర లోహ కాంస్య మృణ్మయ ఘటంబుల లోపల వెలుపల నంటక నాకాశంబు వ్యాపించియున్న చందంబున వియత్పవనతేజోజలభూదేవమానవతిర్యక్స్థావరాదిచరాచరంబులయందు బాహ్యాభ్యంతరంబుల నసంగుండనై నిండియుండుటంజేసి నాకు దేశకృతపరిచ్ఛేదంబు లేదనాద్యనిర్వచనీయమాయాకల్పితభూతవర్తమాన భవిష్యత్సమయముల యందేకరూపత్వంబుచేత సాక్షినైయుండియు వానినెల్ల నెల్లప్పుడు దృశ్యంబుగా నెఱుంగుటవలనఁ గాలకృతపరిచ్ఛేదంబు గలుగదు, మఱియు వృక్షంబునకు వృక్షాంతరంబు సజాతీయం బయి శిలాదికంబు విజాతీయం బయి పత్ర పుష్ప ఫలాదికంబులు స్వగతంబులై యొప్పినట్లు వడి నీయనాత్మప్రపంచంబసద్రూపం బగుటవలన నిరవయవంబు వ్యాపకంబు నసంగంబునైన గగనంబునకు నభావరూపంబ స్వభావం బగుటవలనను శశవిషాణంబెద్దియునుం గానిపగిది సజాతీయవిజాతీయ స్వగతంబులు గానేర వట్లగుట వస్తుకృతపరిచ్ఛేదంబు శూన్యం బగు నివ్విధంబునఁ ద్రివిధపరిచ్ఛేదరహితత్వంబువలన నద్వితీయపరిపూర్ణ ప్రత్యగభిన్న పర బ్రహ్మచైతన్యం బగుదు నని వెండియు నిట్లనియె.

తా. త్రికాలముల బాధింపబడకుండుటవలనను, చతుర్దశేంద్రియములను ప్రకాశింపజేయువాడనగుటవలనను, మిక్కిలి అతిశయించిన ఆనందమునకు ఆశ్రయమైయుండుటవలనను సత్యజ్ఞానానందస్వరూపుడనైన నేను ఘటపటాదులలోపల వెలుపల వ్యాపించియున్న నేను ఆకాశమువలె, ఆకసము, గాలి అగ్ని భూమి దేవతలును మనుష్యులు మున్నగు స్థావరజంగమములందు వెలుపలను లోపలను నిండియుండుటవలన దేశభేదశూన్యుడనై, అనిర్వచనీయుడనై త్రికాలముల నొకరూపముచేత సాక్షిభూతుడనైయున్న నేను త్రికాలముల నన్నింటిని విషయములని తెలియుటచే నాకు కాలకృతపరిచ్ఛేదము లేదు. చెట్టునకు చెట్టుకొమ్మ సజాతీయమైనదై రాయిరప్పలు విజాతివై పువ్వులు పండ్లు స్వగతములైయుండు తెరంగున లోకము నశించునదగుటచే నవయవశూన్యమైనదియు, సర్వత్రనిండియుండునదియు, దేనితోడను జేరనిదియునైన యాకాశమునకు శూన్యరూపమే స్వభావమగుటచే కుండేటికొమ్ము విధంబుననున్నదియు లేనిదియుగాక సజాతీయ విజాతీయ స్వగతభేదములు గలుగవు. ఈమూడును లేనందువలన దేశకాలవస్తుపరిచ్ఛేద శూన్యమగును. అట్లగుటవలన రెండవదిలేనిదియు, అంతటనిండియుండు కూటస్థునికంటె వేరుగానిదియు నగు పరబ్రహ్మము తానగును.

ఆ. ఏ నఖండసచ్చి ♦ దానందమయుఁడ నై
యిట్లు వెలుఁగు చునికి ♦ నెఱిఁగి నన్ను
నే నటంచుఁ దెలియు ♦ నిపుణులు మత్స్వరూ
పాత్ము లగుచు ముక్తు ♦ లగుదు రనఘ. 172

తా. ఆంజనేయా ! నే నఖండసత్యజ్ఞానానందస్వరూపుడనై ప్రకాశించుచుండుటెఱింగి అట్టి నన్ను తామని తెలిసికొను బ్రహ్మాదులు నాయొక్క సత్యజ్ఞానానందస్వరూపముగలవారై జీవన్ముక్తులగుదురు.

సీ. అని యిట్లు బోధించి ♦ యానందమయుఁ డగు
శ్రీరాఘవుఁడు నిజ ♦ శ్రీపదార
విందంబులకు భక్తి ♦ వందనంబులు సేయు
హనుమంతుఁ గనుఁగొని ♦ యప్పు డతని
శిరసును పూర్వాద్రి ♦ శిఖరంబుపై స్వక
రార్కమండలము డా ♦ యంగఁ జేర్చి

తనరు నీహస్తమస్తకయోగ మిప్పుడే
తెలివి యెఱుంగు నా తెలివి నీవు
తే. తెలివి నీ వని దెలుపఁగా దెలియు నెద్ది
యదియె నీ వను వెలుఁగుచే ననిలసుతుని
ధీగతానాద్యవిద్యాంధతిమిర మెల్లఁ
బాపి కేవలతత్త్వరూపంబుఁ జూపె. 173

తా. ఇట్లు బోధించి బ్రహ్మానందస్వరూపుఁడగు రామభద్రుఁడు పురుషార్థప్రదంబులగు పాదములకు భక్తితో వందనమాచరించుహనుమంతుని జూచి శిరంబను నుదయాచలశృంగముపై యభయహస్తమను యపరోక్షజ్ఞానకిరణసహితమగు సూర్యమండలను నిల్పి యీహస్తమస్తకముల చేరికచే సూక్ష్మశరీరాది పిండాండబ్రహ్మాండాంత జగత్సృష్టికికారణమైన విక్షేపశక్తియను ప్రధానాంతఃకరణవృత్తియుతమైన యేతెలివి తెలిసికొనుచున్నదో అట్టి తెలివినీవు. ఆప్రజ్ఞానమే నీవు. అని యుపదేశింప నేతెలివి తెలియుచున్నదో ఆతెలివియే నీవనుస్వయం ప్రకాశముచే నిన్ను బొందియున్నదనియు, జగత్సృష్టికి నాదియైనదియునగు నజ్ఞానమను తిమిరమును దొలగించి ముఖ్యమైనట్టిదియు, నిక్కమైనట్టిదియునగు బ్రహ్మస్వరూపమును జూపెను.

వ. ఆ సమయంబునను. 174

చ. అటఁ బొడఁగాంచె మారుతి హృదంబురుహాంతరబింబితస్ఫుర
చ్ఛటులపునఃపునశ్చలదసద్విషయస్పృశదింద్రియాన్వితో
త్కటపటుధీప్రవృత్తినిహితజ్ఞకళాగ్రనివేశముం విశం
కటనిజభాప్రకాశితజగద్వ్రజకోశము స్వప్రకాశముం. 175

తా. పిమ్మట పావనిహృదయకమల మధ్యప్రదేశమున గాన్పించుచున్నదియును, తేజోవంతములై మనోహరములై, చలించునవియై, అమృతతుల్యములైనవియునగు శబ్దస్పర్శాదివిషయములనబడు జ్ఞానకర్మేంద్రియములతో గూడినదియును సామర్థ్యముగలదియునగు అంతఃకరణవృత్తియందు ప్రతిఫలించుచున్న చిత్కళయొక్క తుదయే స్థానముగాగలదియు తన తేజముచే నుత్తేజితమైన 14 లోకములయొక్క సమూహమునకును స్థానమైనదియునగు స్వయంజ్యోతిని దిలకించెను.

ఆ. అట్టి తన్నుఁ గాంచి యానందమూర్తియై
చిత్రరూప మట్లు చేష్ట లుడిగి
తనువు మఱచి కొంత తడ వూరకుండె నా
యాంజనేయుఁ డో హిమాద్రితనయ. 176

తా. పార్వతీ హనుమంతు డట్టి స్వయంజ్యోతిని దిలకించి నిత్యనిరుపాధికనిరతిశయానంద సుఖస్వరూపుడై ప్రతిమవలె శరీరమును మఱచియుండెననియె.

తే. లిప్తమాత్రం బవిద్యావిలిప్తమాత్ర
మైన ఘను లెన్న లేరు బ్రహ్మాదు లనఁగ
క్షణము సర్వజగద్విలక్షణముఁ బొందు
వాని నుతియింపఁ దరమె యే వారికైన. 177

తా. ఒకలిప్త మాత్రకాలము అజ్ఞానపటలముచే నావరింపబడనట్టి బ్రహ్మమొదలగువారు స్తుతింపజాలరనునపుడు క్షణకాలము మూడులోకములకు భిన్నుడైన పరమాత్మను బొందువానిని యెవ్వరికైన స్తోత్రముచేయ శక్యమా !

తే. అట్టి విజ్ఞానయోగసమాధి నొంది
యనుపమానందమూర్తియై యాంజనేయుఁ
డట్టకేలకు మేల్కాని యెదుర నున్న
రామచంద్రునిఁ జూచి సంభ్రమముతోడ. 178

తా. ఆంజనేయుఁడట్టి యఖిలజగద్విలక్షణమగు బ్రహ్మజ్ఞానముతోఁగూడిన జీవేశ్వరులయొక్క యైక్యరూపసమాధినొంది సాటిలేని పరబ్రహ్మస్వరూపుఁడై యొకింతవడికిఁ జాగ్రదవస్థనుబొంది కట్టెదుటనున్న రామచంద్రునిజూచి తొట్రుపాటుతో—

క. మూఢత్వ ముడిగి యోగా
రూఢుండై భక్తి పాదల మ్రొక్కిన నపు డా
ప్రౌఢమతిఁ జూచి రాముఁడు
గాఢాలింగనము చేసె గారవ మలరన్. 179

తా. అజ్ఞానము సందేహాదికములగు బుద్ధివ్యాపారములనువిడచి బ్రహ్మనిష్ఠాపదమునుబొందినవాడై భక్త్యతిశయమున నమస్కరింపగా నాసమయమున రామభద్రుఁడు పావనిని విశేషప్రేమతో నాలింగన మొనరించెను.

వ. ఇట్లు గారవంబుఁ జేసిన నయ్యాంజనేయుం డప్పరమేశ్వరున కనేకవిధపూజానమస్కారస్తోత్రంబులుం గావించె ననిన విని పార్వతీదేవి యటమీఁద శ్రీరామస్వామి యేమియుపదేశించె నని శ్రీమహాదేవు నడుగుటయును. 180

తా. ఇట్లు తన్మాలింగనమాచరించి గౌరవించిన శ్రీరామచంద్రుని యనేకవిధములపూజించి నమస్కరించి నుతించెనని పలుకగా విని పార్వతి తదనంతరము శ్రీరాముఁడు హనుమంతునకేమి బోధించెనో దెలుపవలయునని యడిగెను.

చ. కలుషవిదూర నిర్గతవికార సురాంబుజసూర సూరిహృ
జ్జలజవిహార చారుసుఖసాగర విశ్వశరీర భూరిని
ర్మలగుణవార వారిధిసమానగభీర సుమేరుధీర స
న్నలినభవాభవాచ్యుతమనఃకలితాత్మవిచారకారణా. 181

తా. పాపములకు దూరుడగువాడా, వికారములులేనివాడా, దేవతలను కమలములకు సూర్యునివంటివాడా, బ్రహ్మవేత్తహృదయకమలములందు సంచరించువాఁడా, యానందవార్ధీ, విశ్వమేశరీరముగా గలవాఁడా, నిర్మలములునైన గుణములచే నొప్పువాఁడా, సముద్రునితో సమానమగు గాంభీర్యముగలవాఁడా, మేరువుతోసమమగు ధైర్యముగలవాఁడా ! బ్రహ్మాదులకుగూడ జ్ఞానమొసంగువాఁడా !

క. సర్వేశ్వర సర్వోత్తమ
సర్వవ్యాపారసాక్షి ! సర్వాధారా
సర్వజ్ఞ సర్వతోముఖ
సర్వాధిష్ఠానభూత ! సర్వాకారా. 182

తా. విశ్వమునకు అధిపతియైనవాడా, జీవులలో నుత్తమమైనవాఁడా ! సమస్తవ్యాపారములకును సాక్షియైనవాడా, సమస్తమును రక్షించువాఁడా, సర్వమెటింగినవాడా, సర్వత్రనిండియున్నవాడా, ప్రణవస్వరూప ప్రపంచస్వరూపుఁడా !

మాలినీ. ప్రణమితమునిజాలా ! భాసురానంతలీలా
ప్రణుతనిఖిలదేవా ! భవ్యదివ్యప్రభావా

ప్రణవజపనిధానా ౯ బ్రహ్మవిద్యానిధానా
గుణనిధి జగదీశా ౯ కోటిసూర్యప్రకాశా. 183

తా. నమస్కరించు మునులుగలవాడా! తేజోవంతుడగు యపరిమితవిలాసము గలవాడా! దేవతలచే స్తుతింపబడువాడా, శుభకరమైనదియు అప్రాకృతమైనదియు నగు మహత్వముగలవాడా! ఓంకారజపమునకు నిక్షేపమైనవాడా, ఆత్మజ్ఞానమున కాధికార ణమైనవాడా ! అనంతకళ్యాణములకు నిధియైనవాడా ! 14 లోకములకు ప్రభుడైనవాడా! కోటిసూర్యులవలె ప్రకాశించుచువాడా !

గద్య. ఇది శ్రీమన్నారాయణ మహాదేవ గురుకరుణాకటాక్ష వీక్షణ విమలీకృత నిజహృదయకమలకర్ణికాంత సందర్శితాఖండ సచ్చిదానందరసైకస్ఫూర్తి షట్చక్రసీతారామమూర్తి పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి ప్రణీతంబైన శ్రీసీతారామాంజనేయ సంవాదంబను యోగశాస్త్రంబునందు సాంఖ్యయోగానుభవవిచారం బనునది.

ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీరస్తు.

# శ్రీసీతారామాంజనేయసంవాదము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీయోగీశ్వర దత్తా
త్రేయ పదాంబుజ విధేయ ! ధీరనికాయ
ధ్యేయా ఘనసచ్చిత్సుఖ
కాయ మహాదేవదేశిక ప్రభురాయా. 1

తా. శ్రీదత్తాత్రేయమహర్షి యొక్క పాదపద్మయుగళమును సేవించువాఁడా, ఆత్మానాత్మవివేకజ్ఞానుల సమూహముచే ధ్యానముచేయదగినవాఁడా, అఖండమైనట్టిదియు కాలత్రియముచే బాధింపబడనిదియు ఆనందస్వరూపమైనదియునగు శరీరముగలవాఁడా! మహాదేవగురువర్యా !

వ. అవధరింపుము శ్రీమహాదేవుం డమ్మహాదేవి కిట్లనియె, నట్లాంజనేయుండు పరమసాంఖ్యరాజయోగసమాధివలన మేల్కని బ్రహ్మానందభరితాంతఃకరణుండై తనముందర నున్న శ్రీసీతారామగురునిం గనుంగొని యనేకసాష్టాంగదండప్రణామంబు లాచరించి నిటలతటఘటితాంజలిపుటుండై యిట్లని వినుతించె. 2

తా. పార్వతీ వినుము. అట్లాంజనేయుండు సాంఖ్యయోగనిష్ఠవలన మేల్కొని కడుంగడు సంతసించిన అంతరంగముగలవాఁడై తనకట్టెదుటనున్న శ్రీసీతారామగురుని జూచి యనేకసాష్టాంగనమస్కారములాచరించి మూర్ధమునఁజేర్పబడిన యంజలిపుటముగలవాఁడై ఇట్లు రామచంద్రుని స్తుతించెను.

ఆంజనేయుఁడు శ్రీరాముని వినుతించు దండకము.

దం. శ్రీరామరామా త్రిలోకాభిరామా పరంధామ నిష్కామ సంపూర్ణకామా బుధేంద్రాంతరంగాబ్ధిసోమాలసద్దివ్యనామా విరాజద్గుణా

స్తోమ యుష్మత్ప్రకాశస్వరూపం బనాచ్యం బచింత్యం బనంతం బసం
గం బఖండం బబాధ్యం బబోధ్యం బసాధ్యం బభేద్యం బవిచ్ఛేద్య
మాద్యంతశూన్యం బజం బప్రమేయం బవిజ్ఞేయ మధ్యేయ మద్వం
ద్వ మవ్యక్త మగ్రాహ్య మధ్యాత్మ మేకం. బరూపం బనాఖ్యం బరక్తం
బశుక్లం బకృష్ణం బపీతం బపీనం బసూక్ష్మం బదీర్ఘం బహ్రస్వం బబా
హ్యాంతరం బక్షరం బవ్యయం బింద్రియాగోచరం బప్రతర్క్యం బనిర్దేశ
మాద్యం బదృశ్యం బకంపం బలక్ష్యం బలిప్తం బశబ్దం బసంస్పర్శభూతం
బరూపం బసుస్వాదుగంధం బనాజ్ఞానసప్రాప్యమై పూర్ణమై నిత్యమై
సత్యమై శుద్ధమై బుద్ధమై ముక్తమై శాంతమై కేవలంబై నిరాకారమై
సచ్చిదానందరూపాత్మ చైతన్యమై సర్వభూతోరుదేహేంద్రియప్రాణహృ
ద్బుద్ధ్యహంకారచిత్తాది దృశ్యప్రపంచంబు నాదిత్యుఁడీవిశ్వ మెల్లన్
వెలింగింపఁగాఁ జేయుకీతిం బ్రకాశింపఁగాఁ జేయఁగా సాక్షివై యాక
శం బేకమై సర్వభాండంబులం దంతటన్ లోపలన్ వెల్పల న్నిండియున్న
ట్టు లాకాశ వా య్వగ్ని వాహ్యభూమి నానావిధా శేషభూతంబులం దం
తటన్ నిర్విలిప్తుండవై యుండి కర్తృత్వ భోక్తృత్వ మంతృత్వ భర్తృత్వ
ము ల్నామరూపక్రియోపాధివర్ణాశ్రమంబు ల్గుణంబు ల్వివేకావివేకంబు
లున్ శోకమోహంబులున్ లేక యీస్థూలసూక్ష్మాదులన్ జాగరస్వ
ప్నసుప్త్యాదులన్ బంచభూతంబులన్ బంచకోశంబులన్ జూచుచు న్నిర్వి
కారుండవై నిర్వికల్పుండవై నిర్విచేష్టుండవై నిష్ప్రపంచుండవై నిర్విశే
షుండవై నిర్గుణబ్రహ్మమాత్రుండ వై యొప్పు నీదివ్యతత్త్వంబు నీసత్కృ
పాసంభృతాంచత్కటాక్షంబుచేతం గనుంగొంటి దేవా నమస్తే నమస్తే
నమస్తే నమః. 3

తా. బ్రహ్మవిద్యాస్వరూపిణియగు లక్ష్మితో క్రీడించుమారా, భూర్భువస్సువ
ర్లోకముల క్రీడించువాడా! వాక్కునకు నివాసమైనవాఁడా, కోరికలులేనివాఁడా
బ్రహ్మవిదులహృదయములలో సంచరించుచు వెలుఁగువాడా, బ్రహ్మజ్ఞుల అంతరఙ్గ

మను సముద్రమునకు చంద్రునివంటివాడా, దివ్యమైననామముగలవాఁడా, అనంతకళ్యాణగుణములతోఁగూడినవాడా నీయొక్క తేజోరూపమిట్టిదని వచింపరానిది యిట్టిదని తలంపరానిది అనంతమైనది యితరవస్తుసంబంధములేనిది విభాగింపబడనిది త్రికాలములను బాధింపబడనిది యిట్టిదని యితరులకు బోధింపరానిది లోఁబఱచుకొనరానిది ఛేదింపరానిది శస్త్రాదులచే ఛేదింపరానిది వికారరహితమైనది త్రిమూర్త్యాత్మకమైనది యింతయనుపరిమాణములేనిది ఎఱుఁగశక్యముకానిది ధ్యానించుట కశక్యమైనది ద్వంద్వరహితమైనది ఎఱుకకుమీరినది యింద్రియములచే గ్రహింపబడనిది శరీరమునధిష్ఠించునది సజాతీయవిజాతీయములులేనిది అమూర్తమైనది రూపమువర్ణము పేరులేనిది స్థూలసూక్ష్మాదికములులేనిది బాహ్యాంతరములులేనిది వృద్ధిక్షయములులేనిది యింద్రియముల కగోచరమయినది ప్రతిపాదింపనసాధ్యమైనది నిర్దేశింపవీలులేనిది ప్రపంచమున కాదికారణమైనది ప్రత్యక్షముగానుండనిది కదలనిది దోషలక్షణములచే లక్షింపగూడనిది ప్రకృతిచే నావకింపబడినది చిదాకాశస్వరూపమైనది వాయుస్వరూపముగానిది రూపములేనిది పంచభూతములకంటె పరమైనది వాక్కు మనస్సులచే నందరానిది సర్వత్రనిండియుండునది నిత్యమై ప్రకృతిలీలన విడువబడినదై శుద్ధసత్త్వస్వరూపమై ముఖ్యమైనదై నిరాకారమైనదై సచ్చిదానందరూపమేతనయొక్క చైతన్యముగాగలదై సమస్తజీవుల స్థూలదేహములందలి యింద్రియప్రాణములను మనోబుద్ధిచిత్తఅహంకారములను మొదలగు గోచమగు ప్రపంచము సమూహామును సూర్యుడులోకమును వెలిగింపజేయునట్లు ప్రకాశింపజేయుచు సాక్షియై ఆకాశమొక్కటియైనను అనేకభాండములయందును వెలుపలను నిండియున్నట్లు అంతర్బాహ్యములందు నిండియున్నట్లు పంచభూతములందును సమస్తములైన జీవులయందును సర్వత్రచేరియుండి చేరుట అనుభవించుట తెలియుట రక్షించుట చంపుటను శివరామాదినామములును రక్తశ్వేతాదిరూపములును సర్వప్రియులును స్థూలసూక్ష్మాద్యుపాధులును బ్రాహ్మణాదివర్ణములును ఆశ్రమములును గుణములును ఎఱుకమఱపులును దుఃఖము భ్రమయులేక శరీరత్రయములను అవస్థలను పంచభూతములను పంచకోశములవ చూచునిర్వికారుఁడై నిర్వికల్పుఁడై చతుర్దశేంద్రియప్రవర్తనములేనివాఁడై వేరొకవిశేషములేనివాఁడై త్రిగుణరహితమగు బ్రహ్మస్వరూపమును నీకృపాదృష్టిచే నాలోచించితినిదేవా! నీకు నమస్కారము.

వ. అని మఱియు నిట్లనియె. 4

ఇంద్రవజ్రము. విశ్వాంతరావాసక ! విశ్వమూర్తి
విశ్వజ్ఞ విశ్వోదర ! విశ్వవంద్యా

విశ్వాక్ష విశ్వాతిగ కె విశ్వసాక్షి
విశ్వాది విశ్వేశ్వర కె విశ్వరూపా. 5

తా. ప్రణవాంతర్భూతమైన అకారార్ధమున నివసించువాఁడా ప్రణవస్వరూపుఁడా ప్రణవార్థము నెఱింగినవాఁడా ప్రణవముయొక్క గర్భస్థితుఁడై యుండువాఁడా ప్రణవార్ధముచే స్తుతింపబడువాఁడా ప్రణవార్ధదృష్టిగలవాఁడా ప్రణవమున కతీతుఁడైనవాఁడా, ప్రణవాధిష్ఠానుఁడైనవాఁడా, ప్రణవోత్పత్తికి కారణమైనవాఁడా, ప్రణవమే యాకృతిగాగలవాఁడా (ఇటువిశ్వశబ్దమునకు ప్రపంచమను నర్థాంతరముగూడ గలదు. అపుడు తాత్పరము సులభముగా తెలియనగును.

ఉపేంద్రవజ్రము. నిరీశ నిష్కారణ కె నిర్వికల్పా
నిరీహ నిర్వాణద కె నిర్వికారా
నిరామయా నిర్గుణ కె నిర్విశేషా
నిరంతరానంద వికెనిశ్చితాత్మా. 6

తా. తనకంటె నితరగుగు ప్రభువులేనివాఁడా జననకారణములేనివాఁడా, మనః కార్యమైనప్రపంచకల్పనములేనివాఁడా, వాసనలులేనివాఁడా! మోక్ష మొసంగువాఁడా, వికారములులేనివాఁడా, వ్యాధులులేనివాఁడా, గుణరహితుఁడా క్షరాక్షరాతీతుఁడా, అఖండమైన ఆనందముచే నిశ్చయింపబడిన ఆత్మస్వరూపము గలవాఁడా!

పృథ్వీవృత్తము. చరాచరకృతప్రపంచమయకెసర్వసాగభృత్త
రాక్షరవిరక్షణా గతవికెకారచిల్లక్షణా
పరాపరసనాతనా పరమకెపావనోద్యోతనా
పురాణపురుషోత్తమా కె పురుషపుంగ్న విద్వత్తమా. 7

తా. సత్త్వగుణమున ప్రతిఫలించిన విరాట్ఛరీరములకు ప్రభువా! (మాయయందు ప్రతిబింబితములైన హిరణ్యగర్భాద్యాకృతి ప్రకృతులకు ప్రభువా!) సత్త్వగుణస్వరూపమైన మాయయే శరీరముగాగలవాఁడా! మాయకంటె వ్యతిరిక్తుఁడా! జగదుత్పత్తి స్థితిలయములొనర్పగల మాయయనుశక్తిగలవాఁడా! మాయను మాయముసేయువాఁడా! జీవునికంటె భిన్నమైన పరబ్రహ్మస్వరూపుడవైన శ్రీరామచంద్రా!

భుజంగప్రయాతము. పరంధామ దివ్యప్రకెభావాభిరామా
పరాకాశ సంపూర్ణ కెభవ్యప్రకాశా

పరానంద దేవాధిపా విశ్వతుండా
పరానందసచ్చిత్స్వభావాత్మరూపా. 8

తా. సూర్యచంద్రాదులకంటె నుత్తమమయిన తేజముగలవాఁడా! అప్రాకృతమయిన సర్వజ్ఞత్వాదులచే నత్యంతమనోహరమయినవాఁడా! చిదాకారస్వరూపుఁడా! అఖండమై మనోహరమై యుండు తేజముగలవాఁడా! నిత్యమయినట్టియు, నిరతిశయమయినట్టియు, ఆనందముగలవాఁడా! బ్రహ్మాదులకుగూడ ప్రభువైనవాఁడా! ప్రణవస్వరూపమగు ప్రపంచము గర్భమందుగలవాఁడా! సచ్చిదానందమే స్వరూపముగాగల పరమాత్మస్వరూపుఁడా!

క. మాయాప్రతిబింబేశ్వర
మాయామయదివ్యదేహ మాయాతీతా
మాయావి మాయమాయా
మాయారహితాత్మతత్త్వమయజయరామా. 9

తా. సత్వగుణమున ప్రతిఫలించిన విరాట్ఛరీరములకు ప్రభువా! (మాయయందు ప్రతిబింబితములైన హిరణ్యగర్భాద్యాకృత ప్రకృతులకు ప్రభువా!) సత్వగుణస్వరూపమయిన మాయయే శరీరముగా గలవాఁడా! మాయకంటె వ్యతిరిక్తుఁడా! జగదుత్పత్తిస్థితిలయములొనర్పగల మాయయనుశక్తిగలవాఁడా! మాయను మాయము సేయువాఁడా! జీవునికంటె భిన్నమయిన పరబ్రహ్మస్వరూపుడవైన శ్రీరామచంద్రా!

క. భూతకర భూతభావన
భూతభరణ భూతహరణ భూతావాసా
భూతేశ్వర భూతాశ్రయ
భూతాత్మక భూతసాక్షి భూతాత్మ హరీ. 10

తా. జీవులను సృజించువాఁడా! జీవులచేధ్యానింపబడువాఁడా! జీవులను సంరక్షించువాఁడా! జీవులను హరించువాఁడా! జీవులయందువసించువాఁడా! సమస్తజీవులకు ప్రభుండైనవాఁడా! జీవులకునికిపట్టైనవాఁడా! సమస్తజీవస్వరూపుఁడా! జీవుల పుణ్యపాపకర్మలకు సాక్షియై యుండువాఁడా! సత్యస్వరూపుఁడా! చతుర్దశలోకములను మ్రింగినసమస్తసముద్రములయొక్క ప్రవాహరూపపయోధియందు మనస్సును వటపత్రముపై నిద్రించువాఁడా!

స్రగ్విణీవృత్తము. యోగయోగాంగసంయుక్త యోగప్రియా
యోగముద్రాన్వితా యోగనిద్రాంచితా
యోగలక్ష్యావనా యోగసిద్ధిప్రదా
యోగమాయాశ్రయా యోగయోగీశ్వరా. 11

తా. యోగముల నుత్తమమగు జ్ఞానయోగమునకు అంగములైన యమనియమాదుల తోఁగూడినవాఁడా! శివజీవైక్యమునందు యిష్టముగలవాఁడా! జ్ఞానముద్రాయుతుఁడా! యోగనిద్రారతా! యోగధ్యానదృష్టిగలవారల రక్షించువాఁడా! చతుర్విధయోగలభ్యము లగు అణిమాది సిద్ధులనపరోక్షసాక్షాత్కారము నొసంగువాఁడా! జగదుత్పత్తిస్థితిలయము లకు కారణమైనశక్తికి స్థానమైనవాఁడా! సనకాదియోగులకు ప్రభుఁడైనవాఁడా!

వసంతతిలకము. వేదాగమావిషయవిగ్రహ వేదవేద్యా
వేదాంగ వేదనుత వేదవివేకశీలా
వేదాది వేదమయ వేదగ వేదజిహ్వా
వేదాంతతత్త్వసువివేదన వేదితవ్యా. 12

తా. వేదములచేతను, ఆగమములచేతను తెలియరానివాఁడా! వేదములచే నెఱుఁగ దగినవాఁడా! శిక్షాదివేదాంగస్వరూపుఁడా! వేదములచే నుతింపబడువాఁడా! శ్రుత్యర్థమును ఎఱుగుటయే స్వభావముగాఁగలవాఁడా! వేదముల కాదియైనవాఁడా! వేదములచరించు వాఁడా! వేదములే వాక్కుగాఁగలవాఁడా! ఉపనిషదర్థముల నెఱింగినవారిచే దెలిసికొన దగినవాఁడా!

క. శాస్త్రాగమ పరికల్పక
శాస్త్రాచార్యోపదేశసారార్థజ్ఞా
శాస్త్రాగమార్థ తత్పర
శాస్త్రార్థవిచారగమ్య శాస్త్రప్రవరా. 13

తా. శాస్త్రాగమములను నిర్మించినవాఁడా! శాస్త్రాచార్యోపదేశముచే గలిగిన సారమగు తాత్పర్యమును దెలిసినవాఁడా! శాస్త్రాగమములందు ఆసక్తిగలవాఁడా! వేదాంతశాస్త్రతాత్పర్యపర్యాలోచనచే పొందదగినవాఁడా! శాస్త్రములందు ఉత్తముఁడా!

క. విద్యానిధి విద్యాప్రద
విద్యావిద్యాతిరిక్త విద్యావేద్యా

విద్యావతి విద్యామయ
విద్యాసందానితాత్మ ? విద్యాసారా. 14

తా. పదునాలుగు విద్యలకును స్థానమైనవాఁడా! బ్రహ్మజ్ఞాన మొసంగువాఁడా! జ్ఞానాజ్ఞానవ్యతిరిక్తుఁడా! జ్ఞానముచే నెఱుంగదగినవాఁడా! అరువదినాలుగు విద్యలకును ప్రభువైనవాఁడా! అపరోక్షజ్ఞాననిశ్చితమైనస్వరూపముగలవాఁడా! సమస్తవిద్యలయొక్క శిరాంశమయినవాఁడా!

మానిని. యజ్ఞవిధాయక యజ్ఞనియామక ? యజ్ఞఫలాశ్రయ యజ్ఞకరా
యజ్ఞఫలావన యజ్ఞఫలాశన ? యజ్ఞఫలప్రద యజ్ఞధరా
యజ్ఞవిధిప్రియ యజ్ఞసమర్చిత ? యజ్ఞసుసాధన యజ్ఞపతీ
యజ్ఞశరీరక యజ్ఞరహస్యక ? యజ్ఞపరాయణ యజ్ఞమయా. 15

తా. యాగకర్మల విధించువాఁడా! యాగకర్మల నియమించువాఁడా! యజ్ఞఫలమునకాధారమైనవాఁడా! యాగములకు యజమాన స్వరూపుఁడా! యాగసంరక్షకుఁడా! యాగవిధానమున నాసక్తిగలవాఁడా! యాగముల నర్చింపబడువాఁడా! యజ్ఞమునకు ప్రభువా! యాగమే శరీరముగాగలవాఁడా! యాగమంత్రములను పొందినవాఁడా! యాగమే శ్రేష్ఠమయిన స్థానముగాగలవాఁడా! యాగస్వరూపుఁడా!

క. మంత్రప్రభావదర్శక
మంత్రప్రియ సకలమంత్ర ? మంత్రార్థజ్ఞా
మంత్రార్థగమ్య మంత్రీ
మంత్రాధిష్ఠానదేవ ? మయ మంత్రాత్మా. 16

తా. సప్తకోటిమహామంత్రముల మహత్వమును చూపించువాఁడా! మంత్రములయందాసక్తిగలవాఁడా! సమస్తమంత్రములయొక్క సారమెఱింగినవాఁడా! మంత్రప్రయోజనముల నెఱింగినవాఁడా! మంత్రముల కాధారమయినవాఁడా! మంత్రస్వరూపుఁడా!

క. జపకల్పక జపతల్పక
జపకోట్యారాధనీయ ? జపతత్త్వజ్ఞా
జపజప్యజాపకాత్మక
జపయజ్ఞఫలస్వరూప ? జపలక్ష్యాత్మా. 17

తా. మంత్రావృత్తిని పుట్టించినవాఁడా! మంత్రావృత్తియే పాన్పుగాగలవాఁడా! మంత్రావృత్తిచే సేవింపబడువాఁడా! జపమునందలి యథార్థతత్వము నెఱింగినవాఁడా! జపము, జపిల, మంత్రము యీమూఁటియొక్కయు స్వరూపముగలవాఁడా! మననముచే విలకింపదగిన స్వరూపముగలవాఁడా!

క. ధ్యానప్రియ సంతత హృ
ద్ధ్యానధ్యేయాత్మరూపసత్తత్వ ధ్యాతృ
ధ్యానధ్యేయాధ్యాత్మ
ధ్యానపరాయణ సమస్తసత్తత్వాతీతా. 18

తా. ధ్యానయోగమున ప్రేమగలవాఁడా! ఎల్లప్పుడును మనస్సున ధ్యానము చేయుటచే తెలియదగిన నిక్కమయిన పరబ్రహ్మస్వరూపుఁడా! ధ్యానియు, ధ్యానింపదగిన వస్తువును అధిష్ఠానస్వరూపముగాగలవాఁడా! ధ్యానాసక్తులకు స్థానమయినవాఁడా! 36 తత్త్వములకంటె వ్యతిరిక్తమయినవాఁడా!

క. పూజావిధానదర్శక
పూజాతద్వస్తుపూజ్యసపూజకరూపా
పూజాఫలప్రదాయక
పూజాప్రియ పూజనీయ స పూజావిషయా. 19

తా. పూజావిధి గురురూపమున తెలియబరచువాఁడా! పూజాద్రవ్యములు, పూజింపబడు దైవము, పూజసేయువాడు ఈమూడును స్వరూపముగాగలవాఁడా! పూజాఫల మొసంగువాఁడా! పూజయం దిచ్ఛగలవాఁడా! పూజార్హుఁడైనవాఁడా! పూజకు కనబడనివాఁడా!

క. నామప్రియ నారాయణ
నామక విశ్వాద్యనంతసనామార్థజ్ఞా
నామప్రభావదర్శక
నామాదివికారరహిత స నతవిబుధహితా. 20

తా. విధినిషేధనామముల ప్రేమగలవాఁడా! నారాయణ నామముగలవాఁడా! విశ్వమున్నగు అనంతనామముల తాత్పర్యమెఱింగినవాఁడా! విశ్వమున్నగు అనంత

నామముల మహాత్మ్యములను దెలుపువాఁడా! విశ్వాదినామ వికారరహితుఁడా! విధేయు లగు పండితులయెడ నిష్టతగలవాఁడా!

క. గురుశిష్యభావకల్పక
గురుశిష్యాచారధర్మ గుణపరిపాలా
గురుశిష్యరూపధారీ
గురుశిష్యైక్యావబోధ గుణగురుమూర్తీ. 21

తా. గురుశిష్యవ్యాపారము గల్పించువాఁడా! గురుశిష్యుల ప్రవర్తనలను ధర్మములను పరిపాలించువాడా! గురుశిష్యస్వరూపములను ధరించువాడా! గురుశిష్యులయైక్యమే నైజధర్మముగాగల గురుస్వరూపుఁడా!

విద్యున్మాలావృత్తము. ధర్మారాధ్యా ధర్మాధ్యక్షా
ధర్మీ ధర్మాత్మా ధర్మజ్ఞా
ధర్మాధారా ధర్మాకారా
ధర్మాధర్మాత్యంతాభావా. 22

తా. వర్ణాశ్రమాచారములచే నారాధింపబడువాఁడా! సుకృతములకు ప్రభువైనవాఁడా! ధర్మముగలవాడా! ధర్మమునందు బుద్ధిగలవాఁడా! పుణ్యాత్మకుల నెఱింగినవాఁడా! ధర్మముల కాధారమయినవాడా! ధర్మస్వరూపుడా! పుణ్యపాపములు లేనివాడా!

సుకాంతివృత్తము.

ధనార్జనా, ధనప్రియా। ధనాధిపా, ధనంజయా. 23

తా. విజ్ఞానము, యశస్సు, విద్య, తపస్సు, పుత్రులు మొదలగు ధనముల నార్జించువాడా! ధనమునకధినేతయైనవాడా! ధనమును గెల్చువాఁడా!

ఉపజాతివృత్తము.

కామాది కామాదివికారశూన్యా
సమస్తకామప్రద సత్యకామా
కామఘ్న కామప్రియ కామకామీ
క్షమారమాకాముక కామరూపీ. 24

తా. కోరికపుట్టుటకు కారణమైనవాఁడా! కామక్రోధాదివికారములు లేనివాఁడా! సత్యసంకల్పా! కామమును నశింపజేయువాఁడా! కామమునం దిష్టముగలవాఁడా! సంకల్పస్వరూపుఁడా! (యోగీంద్రులచే కోరబడువాఁడా) కామముగలవాఁడా! శ్రీభూ దేవులందు కోరికగలవాఁడా! యిచ్చవచ్చిన రూపముధరించువాఁడా!

విభూతివృత్తము.

మోక్షలక్షణేక్షణా, మోక్షధర్మరక్షణా
మోక్షసౌఖ్యదాయకా, మోక్షరాజ్యనాయకా. 25

తా. మోక్షమునకు చిహ్నమైన విజ్ఞానమే దృష్టిగాఁగలవాఁడా! ముక్తియొక్క స్వభావములైన వైరాగ్యబోధోపరతులను రక్షించువాఁడా! మోక్షము నొసంగువాఁడా! మోక్షమను దేశమున కధీశ్వరుండైనవాఁడా!

క. లక్ష్మీకర లక్ష్మీధర
లక్ష్మీముఖకుముదచంద్ర ! లక్ష్మీనాథా
లక్ష్మీనివాస విద్యా
లక్ష్మీప్రదసత్కటాక్ష ! లవలక్ష్మీశా. 26

తా. సంపదలనొసంగువాఁడా! లక్ష్మీదేవిని వక్షమునధరించినవాఁడా! లక్ష్మీదేవియొక్క ముఖమును కమలమునకు చంద్రునివంటివాఁడా! లక్ష్మికి నాథుఁడైనవాఁడా! లక్ష్మికి స్థానమైనవాఁడా! బ్రహ్మజ్ఞానసంపదనిచ్చు నుత్తమమైన కటాక్షముల యొక్క సమృద్ధికధీశ్వరా!

మందాక్రాంతవృత్తము.

సర్వాధారా సగుణవిగుణా ! సర్వభూతాధివాసా
సర్వాధ్యక్షా సకలవరదా ! సర్వవాగీశ్వరేశా
సర్వవ్యాపీ సదయహృదయా ! సర్వసర్వాంతరాత్మా
సర్వాతీతా సమరసమయా ! సచ్చిదానందరూపా. 27

తా. ప్రణవరూపవిశ్వమున కధీశ్వరా! సగుణనిర్గుణస్వరూపా! సమస్తజీవులకు నివాసమైనవాఁడా! విశ్వమునకధీశ్వరా! సమస్తవాంఛితార్థముల నొసంగువాఁడా! ప్రణవశబ్దాధిదేవతలందు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు అధిపతియైనవాఁడా! సర్వత్రనిండియుండువాఁడా! దయార్ద్రహృదయముగలవాఁడా! సకలనామరూపప్రపంచమునను అంతర్యా

మిర్రై యుండువాఁడా! జగదతీతమైనవాఁడా ! అఖండరసైకస్వరూపా ! త్రికాలములచే నబాధ్యత్వము విజ్ఞానమును దుఃఖనివృత్తిపూర్వకానందమును స్వరూపముగాఁగలవాఁడా !.

వ. అని వెండియు నిట్లనియె. 28.

సీసదశకము.

ప్రకటపరాపర ౯ ప్రకృతిమంతుండవు
మఱియు వశీకృత ౯ మాయుఁడవును
సర్వజ్ఞుఁడవు సర్వ ౯ శక్తియుక్తుండవు
సర్వకర్తవు సర్వ ౯ జనకుఁడవును
సర్వరక్షకుఁడవు ౯ సర్వసంహర్తవు
సర్వేశ్వరుండవు ౯ సర్వగుఁడవు
సర్వగురుండవు ౯ సర్వతోముఖుఁడవు
సర్వసాక్షివి సర్వ ౯ సముఁడ వగుచు
తే. నిర్వికల్ప నిరంజన ౯ నిర్వికార
నిర్గుణ బ్రహ్మమై యొప్పు ౯ నిను భజింతు
సంతతం బాత్మమయత సాక్షాత్కరింపు
రామ రాఘవ శ్రీరామ ౯ రామ రామ. 29

తా. పర అపరఅను మూలప్రకృతిఁగలవాడవు, స్వాధీనమైన సత్త్వగుణస్వరూపమైన మాయఁగలవాడవు సర్వాధికారివి, సర్వజ్ఞుడవు, అనంతశక్తియుక్తుడవు, జీవులకు తండ్రివంటివాడవు, జీవులరక్షించువాడవు విశ్వనాశన మొనర్చువాడవు, అష్టసిద్ధులుఁగలవాడవు సర్వవ్యాపకుఁడవు సకలప్రపంచమునకు జ్ఞానోపదేష్టవు సమస్తప్రదేశములందుండువాడవు సకలసాక్షివి, సమస్తజీవులయందును శత్రుత్వమిత్రత్వములు లేనివాడవు వికల్పరహితుడవు, సాధనేతరముల వాంఛింపనివాడవు షడ్భావవికారరహితుఁడవు. త్రిగుణాతీతుడవు. సచ్చిదానందస్వరూపుడవై ప్రకాశించు నిన్ను సేవించుచు చున్నాను. రామరాఘవ శ్రీరామరామరామ శబ్దములచేత రామచంద్రా! నాకెల్లపుడును ప్రత్యగాత్మస్వరూపమును దర్శన మొసంగుము.

సీ. విశ్వంబునం దేను ౹ వెలుఁగుచు నుండుదు
విశ్వంబు నాయందు ౹ వెలయు ననుచు
నరసి యప్లాటయు ౹ వ్యతిరేకముగఁ జూచు
యుక్తియే భవదీయ ౹ యోగమాయ
యీయోగదృష్టిచే ౹ నెప్పుడు నను నీవ
కనుఁగొంచు సంతతా ౹ ఖండసచ్చి
దానందమయుఁడ వై ౹ యలరారు నీయున్కిఁ
గంటి భవత్కటా ౹ క్షంబుచేత
తే. నైన నిఁక నొక వర మిపు ౹ డడుగవలసె
గరిమ నీస్థితి నాస్థితి ౹ గా భజించు
నలలితాభేదదృష్టి నొ ౹ సంగు మయ్య
రామ రాఘవ శ్రీరామ ౹ రామ రామ. 30

తా. నేను ప్రణవస్వరూపప్రపంచమునందును ప్రణవస్వరూపప్రపంచము నాయందును విశ్వము తనయందును ప్రకాశించుటయోచించి తనయందు విశ్వమును విశ్వమునందు తానును లేనట్లు జూచుయుక్తియే నీసంబంధమైన యోగమాయ. అభేదలక్ష్యముచేత నవస్థాత్రయమందును పరబ్రహ్మమైన నిన్ను నీవే చూచుచు అనంతమైనదియు అఖండమైనదియు కాలత్రయముచే నబాధితమైనదియునగు విజ్ఞానమును సంసారదుఃఖనివృత్తిపూర్వకమైన యానందస్వరూపుడవై ప్రకాశించు నీయద్వయస్థితిని నీయనుగ్రహముచే తెలిసికొంటిని. అట్లు తెలిసికొనియున్నను యిపుడొకవర మడుగవలయునని యున్నది. గురుత్వము తోడినీయునికిని నాయునికిగా నుపాసింపదగినదియును మనోజ్ఞమైనదియు అఖండమైనదియునగు లక్ష్యమే నాకు కటాక్షించుము.

సీ. నారాయణియును వై ౹ ష్ణవియును దేవియుఁ
ద్రిగుణాత్మికయుఁ బ్రకృ ౹ తియుననంగ
నలరు భవచ్ఛక్తి ౹ యపరాప్రకృతిపరా
ప్రకృతినా ద్వివిధ మై ౹ పరఁగు నందుఁ

తతచతుర్వింశతి ౯ తత్త్వరూపిణి యైన
యపరయే దైవియు ౯ నాసురియును
నన రెండుదెఱఁగుల ౯ నమరు నాదైవియె
విద్యయు మాయ యనా ౯ విమల గాన
తే. నాసురి యవిద్య యారెంటి ౯ నంటి యీవ
యీశ జీవాత్మ సంజ్ఞల ౯ నెసఁగు దంత
గలిగి యవికారుఁడవు వీని ౯ గాంచుకతన
రామరాఘవ శ్రీరామ ౯ రామ రామ. 31

తా. నారాయణి, వైష్ణవి, దేవి, త్రిగుణాత్మిక, ప్రకృతియన నొప్పు నీయొక్క ప్రభావము అపరాప్రకృతియనియు పరాప్రకృతియనియు ప్రకాశించుచుండును. పరాపర ప్రకృతిద్వయమందు చతుర్వింశతితత్త్వస్వరూపిణియైన అపరాప్రకృతి దైవి ఆసురి యనబడును. ఆరెంటిలో దైవి శుద్ధసత్త్వప్రధానమైనదగుటచే విద్యయనియు, మాయయనియు పిలువబడుచున్నది. మలినసత్త్వప్రధానమైన ఆసురిఅనుప్రకృతి అజ్ఞానమే రూపముగా గలది అవిద్యామాయలనుపొంది నీవే మాయాసంబంధముచే ఈశ్వరుడనునట్టియు, అవిద్యాసంసర్గముచే జీవుడనునట్టియు పేళ్లచేత నొప్పుదువు. విద్యావిద్యారూపముగల ప్రకృతిసంబంధముచేత జీవేశ్వరసంజ్ఞలును, సమష్టివ్యష్టిజాగ్రత్స్వప్నసుషుప్తులును సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వాదులునుగలవాడవై ఈప్రకృతులును యీజీవేశ్వరులను సాక్షివై చూచుచుండుట వలన షడ్భావవికారములు లేనివాడవు.

సీ. అపరాప్రకృత్యవి౯ద్యాక్షరక్షేత్ర ప
దాదిశబ్దైకవా౯చ్యాత్మశక్తి
సన్నిధానజపర౯స్పరపరచ్ఛాయా ప్ర
సక్తిచే మిథ్యాభి౯యుక్తిచేత
సది పరాప్రకృతివి౯ద్యాక్షరక్షేత్రజ్ఞ
సత్పురుషాదిక౯సంజ్ఞ నొప్పు
నేన తద్ద్రష్ట నై ౯ నిర్వికారాసంగ
సాక్షినై విలసిల్లు౯చంద మెఱిఁగి

తే. రమణ ద్రష్టృత్వనిర్వికారత్వసాక్షి
త్వాదివిద్యోక్తధర్మజాతమును తొంటి
పగిదిఁ గడఁద్రోచి నీస్వరూపము భజింతు
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 32

తా. అపరాప్రకృతి అవిద్య క్షరము క్షేత్రము అనువదే మొదలుగాగల పదములచే పలుకదగిన ప్రకృతియొక్క సమీపమునందుండుటవలన పుట్టు బ్రహ్మప్రకృతుల శ్రేష్ఠమైన ప్రతిబింబముల యైక్యముచే మిథ్యాతాదాత్మ్యముచేత నాప్రకృతియే పరాప్రకృతియను నట్టియు, విద్యయనునట్టియు, క్షరమనునట్టియు క్షేత్రజ్ఞ అనునట్టియు సత్త్వనునట్టియు పేరుల ప్రకాశించు నేను అపర పరను ప్రకృతిద్వయముకంటె వ్యతిరిక్తమయినవాడనై ఆ ప్రకృతివికారములు లేనివాడనై వానినంటకయు సాక్షినై ప్రకాశించువిధమును తెలిసి రమ్యమైన అధిష్ఠానత్వము వికారశూన్యత్వము సాక్షియాదిగాగల వేదాంతవిద్యలందు జెప్పబడిన న్యాయసమూహమును పూర్వమువలె విడచి సచ్చిదానంద నిత్యనిర్మలమగు నీస్వరూపమును సేవింతును.

సీ. పరమవైరాగ్యంబు భాసురాత్మజ్ఞాన
మతులితైశ్వర్య మనంతవీర్య
మమితయశంబు సమగ్రలక్ష్మియుఁ గల్గి
సంపూర్ణ కారుణ్యశమదమములు
మహనీయతేజంబు మహితతపస్సత్య
శౌచధైర్యక్షమార్జవగుణంబు
లొప్పార నిజదివ్యయోగమాయామహా
శక్తి సర్వప్రపంచంబుఁ దీర్ప

తే. సచ్చిదానందలక్షణసగుణనిర్గు
ణాత్మక బ్రహ్మమైన నీవాత్మమయత
సంతత మతిస్ఫుటముగ సాక్షాత్కరింపు
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 33

తా. బ్రహ్మజ్ఞానవిషయికవైరాగ్యంబును, ప్రకాశించు బ్రహ్మజ్ఞానమును సమాన రహితమయిన పంచలక్షణలక్ష్మీ, యైశ్వర్యము, మహాకర్మత్వమహాభోక్తృత్వ మహాత్యాగిత్వాద్యపరిమితప్రభావమును సరిలేనియశమును సంపూర్ణమైన మోక్షలక్ష్మినిగల్గి సంపూర్ణములైన శమదమాదులు గొప్పదైనతేజము, గొప్పదియైన తపస్సు బ్రహ్మముసత్యమనుట బాహ్యాంతరపరిశుద్ధి, ధైర్యము, ద్వంద్వసహనము, ఋజుభావము, మొదలగుగుణములొప్ప తనయొక్క శివజీవైక్యమునకు కారణమైనట్టియు, కారణోపాధియైనట్టిదియు, త్రిగుణాత్మకప్రకృతితోగూడినట్టియు స్వరూపముగల పరమాత్మవైన నీవు సదాప్రత్యగాత్మస్వరూపమున దర్శనమిమ్ము. రామా !

సీ. ఘనఘటాకాశ మాకాశాంశ మగుచు నా
కాశంబునకు వేఱు కాగానిపగిది
క్షరముతోఁ గూడి యక్షరుఁడనై విలసిల్లు
నేను నీయంశంబు కా నిశ్చయంబ
యైన ననాద్యవిద్యాశక్తి గుణరాశి
నాయందు నారోపణముగఁ జేసి
జీవుఁడ నంచు సంసృతిఁ జెంది యుండితి
నిందాక నది యిపు డెఱిఁగికొంటిఁ
తే. గాన వివరింప భేద మింకేతైనఁ గలుగ
దిట్టి విజ్ఞానసంపద కా నెల్లప్రొద్దు
చిత్తమునను బ్రకాశింపఁజేయు మయ్య
రామ రాఘవ శ్రీరామ కా రామ రామ. 34

తా. మేఘమునందలి యాకసము, కుండయందలి యాకసము మహదాకాశము యొక్క భాగములై మహదాకాశముకంటె భిన్నములెట్లుగావో యట్లే జీవేశ్వరశరీరములతోచేరి కూటస్థుడనైన నేను నీయంశమేను. నేను నీయంశమైనను ఉత్పత్తిలేనిదియు నవిద్యయను నామముగలదియునగు శక్తిగుణసమూహము ప్రత్యగాత్మయైన నాయందున్న దానినిగానెంచి క్షేత్రజ్ఞుడని యిప్పటివఱకు జన్మవాసనను బొందియుంటిని. దానిని భ్రాంతిగా నిపుడు తెలిసికొంటిని. ఇపుడాలోచింపగా ద్వైతప్రపంచమింతైన లేదు. ఈ ద్వైతభ్రమలేని బ్రహ్మజ్ఞానమెల్లపుడును హృదయముననుండునట్లు జేయుమారామా !

సీ. నీకంటె నన్యంబు నే నెన్నఁ డెఱుఁగ నె
ట్లనిన నాయనుభవ మవధరింపు
వివిధేంద్రియములకు విషయ మీవిశ్వ మా
విశ్వరూపుఁడ వీవు వెతుక నేల
గావున నీవు సాక్షాత్కరించితివి యీ
విశ్వంబు నీ కగు వే ఱటంచు
దలఁచు నజ్ఞానమంతయుఁ బోయె నీదయా
మయదృష్టి నానందమయుఁడ నైతి
తే. సంశయము లేదు గాని యీ సర్వరూప
సమరసజ్ఞానభావన సంతతంబు
గలుగ వరము ప్రసాదింపవలయు దేవ
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 35

తా. రామభద్రా! నిన్ను గాక యితరులను దెలిసికొనను, అది యెట్లందు వేని నాయనుభవమును వినుము. వివిధేంద్రియములకు విషయము ప్రపంచము ఆవిశ్వరూపుడవు నీవు వెతుక నేల గావున నీవు సాక్షాత్కరించితివి యీవిశ్వము నీకంటె భిన్నమైనదగును అని తలంచు అజ్ఞానమంతయును నశించినవి. నీదయచే నానందమయుడ నైతిని. ఈవిషయమై సంశయములేదు. గాని యీసర్వప్రపంచమును బ్రహ్మేతరముగాదని దలంచునట్టి సద్వివేకము నాకెల్లప్పుడుండు నట్లను గ్రహింపుము.

సీ. తతచతుర్వింశతితత్త్వనాయకుఁడవు
పంచవింశకుఁడవు ప్రకృతికంటెఁ
బరుఁడవు గురుఁడవు పరమేశ్వరుండవు
పురుషోత్తముఁడవు నెప్పుడుఁ బ్రధాన
పురుషేశ్వరుండవు పూర్ణుఁడ వనుచు ని
న్నెఱిఁగితి గాని యీయెఱుకదృఢము
గా నిల్వ దజ్ఞానకార్యదేహాదికా
త్మధ్యానసంతతాభ్యాసవశత

తే. నట్లు గావునఁ గేవలాకారతాత్మ యోగ
దృష్టి మనమున నేప్రొద్దుఁ దేజరిల్లఁ
భూరికృపచే ననుగ్రహింపుము ప్రసంగ
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 36

తా. మహత్త్వములైన 24 తత్త్వముల కధీశ్వరుడవు. ఇరువదియైదవవాడవైనజ్ఞాతవు పరాపరప్రకృతికంటె భిన్నుడవు. పరాత్పరుండవు, అష్టసిద్ధులునుగలవాఁడవు, జీవులలో శ్రేష్ఠుఁడవు, త్రికాలములందును జీవునకును ప్రకృతికిని నియామకుఁడవు, పరిపూర్ణ సచ్చిదానందస్వరూపుడవు అని నిన్ను దెలిసికొంటిని. గాని యీజ్ఞానము అవివేకము యొక్క కార్యములైన శరీరేంద్రియాదులు నేననెడి యెడతెగని అభ్యాసవశముచేత నిశ్చలముగా నిల్వదు. కాన పరబ్రహ్మముయొక్కయు ప్రత్యగాత్మయొక్కయు ఐక్యజ్ఞానముల మనస్సునసర్వకాలము ప్రకాశించునట్లు దయతో ననుగ్రహింపుము.

సీ. అజుఁడ వవ్యయుఁడ వీ వాదినారాయణ
స్వామివి సాక్షివి సర్వమయుఁడ
వై యొప్పు నిన్ను మాయామానుషశరీర
ధరుఁడుఁ గించిజ్జ్ఞుండు నరుఁ డటంచు
నజ్ఞానవశతమోహంబుచేఁ దలఁచితి
నిందాఁక నది క్షమియించుకొనుము
సర్వజ్ఞ సర్వేశ సర్వభూతావాస
సర్వభూతాత్మక సర్వమూర్తి
తే. సర్వకర్మఫలాధ్యక్ష సర్వరూప
యని నుతించుచు మ్రొక్కెద ననవరతము
నెఱయ నామది నీయందు నిల్వఁ జేయు
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 37

తా. పుట్టుక నాశములేనివాడవు ప్రకృతికంటె పూర్వుడవు, నారాయణుఁడవు, సాక్షియు విశ్వరూపుడవునునై ప్రకాశించుచున్న నిన్ను మాయాకల్పిత మనుజశరీరము గలవాడవు, అజ్ఞానియు మనుష్యుడవునై యుంటివని అవివేకమువలనగలిగిన భ్రాంతిచే

ననుకొంటిని. ఇట్లు తలచినందులకు క్షమింప నో సమస్తము నెఱింగినవాఁడా! సమస్తమున కధీశ్వరుఁడా! జీవులకు నీవును నీకు జీవులును స్థానముగాగలవాఁడా! ఆకాశాదిపంచ భూతస్వరూపుఁడా త్రిమూర్త్యాత్మకస్వరూపుఁడా! సర్వకర్మలయొక్క ఫలంబులకు నధిపతియైనవాఁడా! ప్రణవస్వరూపుఁడాయని కొనియాడుచు నమస్కరించెను.

సీ. తతచతుర్వింశతితత్త్వాత్మకంబగు
క్షరము నేఁ గాను నిక్కముగ నరయఁ
దత్కృతంబులు మత్కృతంబులుగావు కా
వున సర్వధర్మములు ద్యజించి
యక్షరపురుషుండనై క్షరాక్షరతత్త్వ
ములమీఱి పురుషోత్తముండు నాత్మఁ
డన నొప్పు నొకని నిన్నాశ్రయించెద శర
ణముగ నే నొగి ననన్యత్వ మలర

తే. నట్లగుటనింక నేసంశయములు నన్నుఁ
బొరయ కుండఁగఁ జేసి యాపూర్ణబోధ
మతిదృఢంబుగ వర మిమ్ము సతతమాత్మ
రామ రాఘవ శ్రీరామ రామ రామ. 38

ఆలోచింప నిక్కముగా 24 తత్త్వములే స్వరూపముగాగల శరీరము నేనుగాను, మరియు నాదేహవ్యాపారములు నావ్యాపారములును గావు. అట్లగుటవలన 14 యింద్రియవ్యాపారములనువదలి జ్ఞాతనై దేహము దేహిని అతిక్రమించి బ్రహ్మస్వరూపుడు ప్రత్యగాత్ముడు అను నామములనొప్పునద్వితీయుడవైన నిన్ను నన్ను సంరక్షింపప్రార్థింతును. ఇట్లు నిన్నాశ్రయించుటవలన భేదబుద్ధికలగకుండునట్లును, ఎట్టి సందేహములును కలుగకుండునట్లును ననుగ్రహించి యఖండబ్రహ్మజ్ఞానమునందు నామనస్సు నిశ్చలముగా నుండునట్లు వరమొసంగుము.

వ. అని యిట్లఖండపాండిత్యంబుచేతఁ బెక్కుభంగుల వినుతించు హనుమంతుని సాదరంబుగాఁ గరుణాకటాక్షవీక్షణంబుచేతఁ గనుంగొని భూరిప్రేమధాముండుఁ బరంధాముండు నైన యాత్మారాముం డిట్లనియె. 39

తా. ఇట్లు అఖండవిద్యాతిశయమున పెక్కువిధముల దన్ను నుతించు ఆంజనేయుని అతిశయించిన కరుణకు నిలయమైనవాఁడును, శ్రేష్ఠమైనకాంతిగలవాఁడును, సర్వత్రనిండియుండువాడును అగు శ్రీరామచంద్రుడు క్రీఁగంటిచూపున దిలకించి యిట్లనియెను.

శ్రీరాముఁ డాంజనేయుని కమనస్కయోగంబు దెలుపుట.

తే. సంతసము మీఱఁ జిత్తవిశ్రాంతికొఱకు
సతత మాత్మసమాధిఁ గోరితివి గానఁ
గడఁగి యమనస్కరాజయోగంబు నీకుఁ
దెలియఁ జెప్పెద వినుము సందేహ ముడిగి. 40

తా. వత్సా! ఆంజనేయా! నీమనస్సు సంతోషముతో నెల్లప్పుడు నిండియుండుటకు బ్రహ్మనిష్ఠను గోరితివి గావున నీకమనస్కయోగమును దెలిపెద నాలింపుము. అమనస్కయోగము లభించునో లభింపదోయను సందేహమునుమాని వినుము.

చ. అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్కరీతిగాఁ
గలయఁగ నీఁదవచ్చును నగంబుల నచ్చనగండ్లుగాఁ గరం
బులఁ గొని యాడవచ్చు నభమ్ముఁ గబళింపఁగ వచ్చు గాని యి
య్యల నమనస్కయోగము గ్రహింపఁగ రాదు దలంప నేరికిన్. 41

తా. సప్తసముద్రములను యిద్దరద్దులకు శ్రమలేక యీదవచ్చును. సప్తకుల పర్వతములను గచ్చకాయలవలె చేతితోఁబట్టుకొని యాడుకొనవచ్చును. ఆకాశమంతటిని కబళింపవచ్చును. కాని యాలోచింప నీయమనస్కయోగమెట్టివారికిని దెలిసికొనరానిది.

భూతిలకవృత్తము.

కావున నయ్యమనస్కయోగము గాఢదుర్లభమారయన్.
కేవలతత్త్వవిచారముం బరికింప నేరనివారికిన్
భావమునందున నాత్మనాత్మని బాగుగా విభజించుమే
ధావికి నిత్యసుఖంబుగా విశదంబుగా సులభం బగున్. 42

తా. బ్రహ్మజ్ఞానులకే గ్రహింపకష్టమైన యీఅమనస్కయోగము తత్త్వవిచారమెఱుంగని వారికెట్లు లభించును. భావమున పరమాత్మను ప్రకృతిని చక్కగా దెలియునట్టి విజ్ఞానికి శాశ్వతసౌఖ్యదాయినియగు నీయమనస్కయోగము సులభముగా పొందనగును.

తోదకవృత్తము. చెలువుగఁ బుష్పములఁ ◆ జీఁబుటకంబెన్
బొలుపుగఁ గన్నవ ◆ మూయుటకంబెన్
నలు వగు నీయమనస్కపదంబే
సులభము సౌఖ్యము ◆ సూక్ష్మము వత్సా. 43

తా. వత్సా! ఆత్మానాత్మవివేకనుకీణుల కీ యమనస్కము పుష్పములుగోయుటకం బెను కన్నులుమూయుటకం బెను సునాయాసముగా బొందదగినదియు సౌఖ్యమొసంగునదియును సూక్ష్మమునునై యున్నది.

తోటకవృత్తము. అమృతంబు సుఖంబుగ ◆ నానినయ
ట్లమనస్కముఁ బూని యహర్నిశమున్
సమతం దనుఁ గన్గొను ◆ సజ్జను న
య్యమృ ౦గన చేకొను ◆ నందముగాన్. 44

తా. అమృతము ద్రావినచందమున నమనస్కముఁబూని రాత్రింబవళ్లు అభేదముగా కేవలాత్మయైన తన్ను జూచునట్టి బ్రహ్మవేత్తను ముక్తికాంతపరిగ్రహించును.

సీ. పాలు చాలఁగఁ గ్రోలఁ ◆ జాలునే తగ నాల
పొనుఁగులఁ బిసుఁగులు ◆ బొదలుచున్న
లోపలిరస మాన ◆ నోపునే యిలఁ గోఁతి
నారికేళఫలంబుఁ ◆ జేరి కన్న
సంసార రతులచే ◆ సుఖియింప నేర్చునే
మందుండు మఱి రంభ ◆ సరస నున్నఁ
దనమోముసొగసుఁ గ ◆ న్గొనునె పుట్టంధుఁడు
మించుటద్దంబు చే ◆ నుంచుకొన్నఁ

తే. గలుగునే నిత్యనిర్మలా ◆ ఖండసుఖము
నలఘుతారకసాంఖ్యయో ◆ గా శ్రితులకుఁ
దత్తదుచితోరుధర్మల ◆ బ్ధతలపగిది
విలసదమనస్కయోగా ప్తి ◆ వలనఁ గాక. 45

తా. అమనస్కయోగము అభ్యసింపకున్నయెడల ఆవులయొక్క పొదుగులయందు పిడుందులు నిండుకొనియున్నను పాలుద్రావనేరనట్లు వానరము కొబ్బరికాయను బ్రద్దలు కొట్టి యందలి నీరమును ద్రావనేరనియట్లు నపుంసకుఁడు రంభచెంతనుండియు రతిసుఖము నొందలేనట్లు జాత్యంధుఁడు అద్దముచెంతనుండియు దననుఖమును జూచుకొనజాలనట్లు నిత్యమైనట్టియు, మాలిన్యరహితమైనట్టిదియు, అఖండమైనదియు, సంపూర్ణమైనదియు నగు బ్రహ్మానందమును బొందజాలఁడు.

తరల. స్ఫురిత తారక సాంఖ్యము ల్విను పూర్వపక్షము లుత్తమం
బరయఁగా నమనస్కయోగ మనాద్యముం గడుహృద్యముం
బరమగుహ్యము రాజయోగము బ్రహ్మవిద్యసుహృన్మనో
హరము కేవలనిర్వికల్పసమాధి సుమ్మిది మారుతీ. 46

తా. వత్సా! తారకసాంఖ్యములు రెండును అనాదరణీయములు. అమనస్కము మిగుల ప్రాచీనమైనదియు నంగీకరింపదగినదియు నతిమనోహరమైనదియు, మిగులగోప్యమైనదియు నుత్తమమైనదియు, బ్రహ్మజ్ఞానమయినదియు, బ్రహ్మవిదులకు రమణీయమయినదియును, ముఖ్యమయినదియు, నిశ్చలమయినదియు. బ్రహ్మనిష్ఠమైనదియునై యున్నది.

క్రౌంచపదవృత్తము:—

సారపదార్థం బారయుచుం దా సకలనిగమములు చదివిన నైనన్
జారువిశిష్టాచారఘనుండై జపములు తపములు సలిపిన నైనన్
స్ఫారసమస్తోదారసుతీర్థాచరణము లనిశము జరిపిన నైనన్
గారవసుం జేకూఱఁగ నీయోగజపరమసుఖము గలుగదు వత్సా.

తా. ఆంజనేయా! స్థిరాంశములైన వాక్యములయర్థమును విచారించుచు వేదములన్నిటిని జదివినను, మంచినియమములచే నజపాగాయత్రిచేయుచున్నను కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములుచేసినను అనేకపుణ్యతీర్థముల గ్రుంకులిడినను అమనస్కయోగమభ్యసించి నందువలనగలుగునట్టి బ్రహ్మానందము గలుగ నేరదు.

తే. అట్లు గావునఁ బరమరహస్యమైన
విలసదమనస్కయోగంబు విస్తరించి
నీ కెఱింగింతు విమలవివేకయుక్త
సూక్ష్మదృష్టిని గను మతిసుకరముగను. 48

తా. ద్వైవిధములుగా బ్రహ్మానందములభింపదు గావున మిగులగోప్యమయినదియు ప్రకాశించునదియునగు యమనస్కమును నీకు బోధపరచెదను. నీవు పావనమయిన జ్ఞానయుతమయిన లోజూపుచే నతిసులభముగా బొందుము.

పంచచామరము.

మనంబె స్థూలసూక్ష్మము ల్ప్రమాతృమానమేయముల్
మనంబె కామరాగరోషమత్సరాదివృత్తులున్
మనంబె సర్వధర్మము ల్మనంబె బంధమోక్షముల్
మనంబె దృశ్య మంతయుం గ్రమంబుచే నెఱింగినన్. 49

తా. పృథివ్యాదిస్థూలద్రవ్యములును, పరమాణువుమున్నగు సూక్ష్మద్రవ్యములును ద్రష్టయును, ప్రమాణమును దర్శనము ఘటపటాదులును మనస్సుకంటె భిన్నముగావు. కోరికయింద్రియముల కభీష్టవస్తులాభముకల్గిన ప్రీతి, ప్రతికూలవస్తులాభసంజనితద్వేషము, అసూయమున్నగునవి మనోరూపములే. వర్ణాశ్రమధర్మమును మనంబుకంటె భిన్నములుగావు. బంధమోక్షములును మనంబుచే, నామరూపములతో గూడుకొనియున్న ప్రపంచమంతయును నీవు ప్రపంచముగా నెఱింగినది మనస్సుకంటె భిన్నముగాదు.

తే. సర్వసంసారమును మానసమున నొదవు
సర్వసంసారమును మానసమున నుండు
సర్వసంసారమును మానసమున నడఁగు
సర్వసంసారమును మానసంబ యగును. 50

తా. మనసు సప్తవిధముల సారముగాదోచెడి పుత్రమిత్రకళత్రాదిరూపమునకు జన్మనిలయముగను అధిష్ఠానముగను లయస్థానముగను సంసారరూపముగాను యున్నది.

వ. అది యెట్లంటేని. 51

చ. మనసు సుషుప్తియం దెనసి మ్రగ్గిన నేమియుఁ దోఁప కుండు న
మ్మన మటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గి తోఁచు నీ
ఘనతరబంధమోక్షమయకారణకార్యము లెల్లఁ దాన యై
యనిశము లో వెలిం దిరుగు నారయ నెమ్మన మట్లు గావునన్.

తా. మనస్సు సుషుప్తినిలయింపగ నేవిషయమును దోచకుండును. అట్లు లయించిన మనస్సును జాగ్రత్తను బొందిన 14 లోకములునుపుట్టి గాన్పించును, ఇట్టి యాగో

పముయొక్క అపవాదముయొక్క స్వరూపమయిన కారణము జాగ్రత్స్వప్నము లనియును తానై యెల్లప్పుడు మహాకారణాతీతావస్థయందు ప్రజ్ఞారూపమును జాగ్రత్స్వప్నముల మనోరూపమును పొంది దిరుగుచుండు నట్లు లోపలను బయటను తిరుగును.

వ. మఱియు నమ్మనంబు కార్యాకారం బై సంకల్పంబు సంసారంబు సర్వ వాసనామయంబు బంధమోక్షకంబు నన నొప్పుఁ గారణాకారం బై యవిద్య ప్రకృతి యజ్ఞానంబు మాయ యనం దనరు నట్టి మానసంబు లేమియ యమనస్కం బట్లగుటం జేసి.

తా. మనస్సు ప్రపంచరూపమయిన సంకల్పమని సంసారమని సకలవాసనారూపమయినదని బంధమోక్షస్వరూపియనియు చెప్పబడును. మరియు సుషుప్తిరూపమయి ప్రకృతియనియు, అజ్ఞానమనియు, అవిద్యయనియు మాయయనియు జెప్పబడును. అట్టి కార్యకారణరూపమగు మనస్సులేకపోవుటయే అమస్కయోగము.

సీ. ఆరోపితభుజంగ మై మమరఁ గన్పట్టునే
స్ఫురదధిష్ఠానరజ్జువును గనిన
నారోపితమనుష్యుఁ డై డలరఁ జూపట్టునే
భువి నధిష్ఠానదారువును గనిన
నారోపితోదకం బై బరయంగఁ దోఁచునే
కనదధిష్ఠానార్కకరముఁ గనిన
నారోపితాచ్ఛరౌప్యము లక్ష్య మగునె య
ధిష్ఠాన మైన శుక్తికను గనినఁ
తే. దలఁప నారోపితాసితత్త్వంబు మరలఁ
గాన నగునె యధిష్ఠానసుఖంబు గనినఁ
దెలియ నారోపితమనంబు దృశ్య మగునె
తగ నధిష్ఠానపూర్ణతత్త్వమును గనిన. 54

తా. చీకటియందు సర్పభ్రాంతిని కలుగజేసిన రజ్జువును పరికింపగా సర్పముగాన్పింపనట్లు దొంగయనుభ్రమ కల్గించిన కొరడును చూచినపిదప దొంగగాన్పింపనట్లును, ఎండమావులజలములని తలంచుటకు సూర్యకిరణములు నిమిత్తములని దెలిసినపిదప వానియందు

జలముగనబడనట్లు ముత్యపుచిప్పనుజూచి వెండియని భ్రమించి యథార్థమెఱిగినపిదప నద్దాని
యందారోపితమయిన వెండికానట్లు గగనమందు భూసంబంధముచే నలుపు మొదలగు వర్ణ
ములోచగా నాకసము నిర్మలమయినదని యెఱిగినపిమ్మట వర్ణములుదోపనట్లు అఖండ
సచ్చిదానంద పరిపూర్ణబ్రహ్మదర్శమునముగల్గిన యెడమనస్సులోచక లయించి పరబ్రి
హ్మమే కనబడును.

వ. అది యెట్లనిన వినుము సాధనచతుష్టయసంపత్తిపూర్వకంబుగాఁ
బూర్ణాధికారివైయున్న సమయంబున స్వాధిష్ఠాన చిదాభాసుండ
వైన నీకు నావరణంబులైన చతుర్వింశతితత్త్వాత్మకపంచకోశంబుల
వేర్వేఱ విభజించి నేతినేతి యను మహావాక్యంబు చెప్పినవిధంబున
నేను గానని నిషేధించి కేవలకూటస్థచైతన్యమాత్రుండనైతి నని
తెలిసి యంతట నీప్రకారంబున దేవతిర్యఙ్మనుష్యాదిసర్వభూతంబు
లఁ బంచకోశంబులఁ బంచమహాభూతంబుల నొక్కపెట్ట నిరాకరించి
యచ్చటఁ బరబ్రహ్మచైతన్యం బుండ భావించి యామీఁదటఁ ద్వం
పదాహంపదాత్మపదప్రజ్ఞానపదలక్ష్యార్థభూతప్రత్యగాత్ముండ నైన
నేన తత్పద బ్రహ్మపద లక్ష్యార్థభూత పరమాత్ముండ ననియుఁ దత్స
త్యజ్ఞానానందస్వరూప పరమాత్ముండ సచ్చిదానందలక్షణప్రత్యగా
త్ముండ నైన నే ననియు ని ట్లన్యోన్యాఖండసమరసైక్యం బనుభవిం
చి నిరావరణాధిష్ఠాన పరిపూర్ణా ద్వితీయ శుద్ధచైతన్యప్రకాశమా
త్రుండవై ప్రకాశించు నీకుఁ బ్రచండమార్తాండున కంధకారంబు
గనుపట్టని తెఱంగున సర్వకారణకార్యాత్మకం బైన మనంబు గలు
గదు. రజ్జ్వారోపితసర్పంబు గని యిదిసర్పంబు గా దని త న్నిరసనం
బు గావించి మఱి యిది రజ్జు వని విధించి యయ్యధిష్ఠానంబు నెఱిం
గిన పిమ్మటఁ గల్పితభుజంగం బభావం బై రజ్జుమాత్రంబు శేషించు
తెఱంగున శరీరత్రయం బాత్మ కా దని కడఁద్రోచి యాత్మమా
త్రుండ వైన నీకు మనంబు లేదు మఱియును. 55

తా. మనస్సు కనబడకయుండుటయెట్టిదో వివరించెద నాలింపుము. సాధనచతుష్టయసంపత్తిగలవాడవును, జ్ఞానోపదేశమునకుదగు సమస్తలక్షణములచే పరిపూర్ణాధికారముగలవాడవునైయున్న సమయమున తనంతనే యాధారమయిన బ్రహ్మజ్ఞానప్రతిబింబమాత్రుడగు జీవుడవైన నిన్నుగ్రమ్ముకొనియుండు 24 తత్త్వములు రూపముగాగల పంచకోశాదికము నీవుకాదు నీవుకాదని వేదాంతమహావాక్యములుపలికినట్లు పంచకోశాదికము నేనుగానని త్యజించి ప్రధానమయిన ప్రత్యగాత్మయొక్క చేతన స్వరూపుడనని తెలియవలయును. అట్లు తెలిసినపిమ్మట దేవతలు మనుష్యులుమున్నగు సమస్తజీవులును పంచకోశములను పృథివ్యాది భూతములను ఒక్కసారిగా త్యజించి సమస్తజీవశరీరములయందును పరబ్రహ్మ స్వరూపముండునట్లు యెంచవలెను. అట్లు భావించినపిదప నీవు నేను తాను శబ్దములకును ప్రజ్ఞానశబ్దమునకును వాచ్యార్థనిరాకరణపూర్వక లక్ష్యార్థస్వరూపమయినట్టియు కూటస్థుడైనట్టియు నేనబ్రహ్మపదమునకు ప్రధానార్థమయిన పరబ్రహ్మమనియును ఆట్టి సచ్చిదానందస్వరూపముగల పరబ్రహ్మమే సచ్చిదానందరూపమే గుర్తుగాగల కూటస్థుడను నేననియును, ఉభయచైతన్యములు లేనట్టిదియును, ఐక్యసంధానమనుభవించి వెనుకజెప్పబడిన యావరణములు లేనట్టిదియును సర్వాధారమయినట్టిదియును సర్వత్రవ్యాపించియుండునదియు తకకంటె నితరములేనిదియును నిర్మలమయినదియునునగు ప్రజ్ఞానరూపపరమాత్మవై వెలుంగునీకు మిగులవేడిమిగల సూర్యుని అంధకారము పొందనట్లు సమస్త యింద్రియములను వాని వ్యాపారములను రూపముగాగల మనస్సును యుండదు. రజ్జువునుగాంచి పాముని భ్రమించి పరిశీలించిన పాములేనట్లును రజ్జువని నిశ్చయించి త్రాడుత్రాడని తెలిసికొనినపిమ్మట త్రాడుమాత్రమే మిగిలినట్లు శరీరత్రయము బ్రహ్మముకాదని తెలిసినపిమ్మట పరమాత్మ స్వరూపుడవగు నీకు సంశయాత్మకమయిన మనస్సులేదు. మరియు వివరించెదవినుమని యిట్లు జెప్పనారంభించెను.

క. శోభితస్వాధిష్ఠానచి
దాభాసుఁడ వైన నీకు నఖిలముఁ దోఁచున్
శోభితకేవలనిత్యని
రాభాసుఁడ వైన దృశ్యమంతయు నడఁగున్. 56

తా. ఆశింపబడిన ప్రత్యగాత్మకంటె నభిన్నమయిన పరమాత్మ కాశ్రయమయిన ప్రతిబింబమయితివేని నీకు ప్రపంచమంతయును భిన్నముగా గనబడును. ప్రకాశించు

-చున్న ముఖ్యుడవును, ప్రతిబింబరహితకూటస్థుడవును అయిన బాహ్యాంతర ప్రపంచము నశించును.

క. కనుమూసినఁ గనుదెఱచిన
ఘనసచ్చిత్సుఖమయాత్మఁ గనుఁగొన కున్నం
గనుమూసినఁ గనుదెఱచినఁ
గనఁబడు వెలిలో మనోవికారమె వత్సా. 57

తా. సుషుప్తునను జాగ్రత్తునను శ్రేష్ఠమగు సచ్చిదానందరూపపరబ్రహ్మమును జూడకున్నను కన్నులుమూసికొనినను తెరచినను అంతర్బాహ్యముల మనస్సుయొక్క వికల్పమే కానబడును.

మ. ఘనతం దారకసాంఖ్యయోగములచేఁ గష్టింపగా నేల నె
మ్మనము బట్టఁగ నేల యింద్రియములన్ మర్దింపఁగా నేల చ
క్కనగా ముందటఁ గానుపించునటముం గన్నట్లు బ్రహ్మంబు గాఁ
దనుఁ దాఁ గాంచినయాతఁ డఖిలముం దానై వెలుంగుం దగన్.

తా. తారకసాంఖ్యనిష్ఠలచే నెలశ్రమపడనలయును మనస్సును యేల నిలుపవలయును. 14 ఇంద్రియములను స్వాధీనపరచుకొను టెందులకు స్పష్టముగా గాన్పించు చుండను చూచినట్లు తన్ను పరమాత్మగా తాముజూచిన నామరూపాత్మకప్రపంచమంతయు తానైన పరబ్రహ్మముగా ప్రకాశించును.

క. తనుఁ దాఁ గానని మనుజుని
మనము నిరోధింపఁబడక మసలుచుఁ దిరుగున్
దనుఁ దాఁ గను సత్పురుషుని
మన మానందాబ్ధియందు మగ్నత నొందున్.

తా. కూటస్థుఁడైన తన్ను దాను తెలిసికొనినవాని మనస్సులోఁబడక లోలత్వము గలదై సంచరించును. ప్రత్యగాత్మయైన తన్నుదాను గనుసత్పురుషుని మనస్సు బ్రహ్మానందసముద్రమున మున్గియుండును.

మ. వనితానందనచందనాదివిషయవ్రాతంబులం బొంది చ
య్యన నంతంతకుఁ జొక్కునెమ్మనము బ్రహ్మానందవారాశివా

సన యెక్కించుక సోఁకెనేని బ్రబవినాశం బొందు నానావ్రపు
ష్పనటద్భృంగము చంపకప్రసవసంస్పర్శాప్తిఁ గూలుం గతిన్.

తా. స్త్రీలుబిడ్డలుమున్నగు యింద్రియభోగవిషయసమూహములనుగూడి యంత కంతకు పరవశతనొందు చిత్తము బ్రహ్మానందమను సముద్రముయొక్క వాసనకొంచెమేని సోకిన అనేకవృక్షములయొక్క పుష్పములయందుదిరుగు తుమ్మెదలు సంపెగపువ్వు స్పర్శ తగులుటచే నశించినట్లు బ్రహ్మానందమున లయించును.

క. చక్కెరయును లవణంబును
గ్రక్కున నుదకములయందుఁ గరఁగినరీతిన్
మిక్కిలి తనుఁ గను ఘను మది
చొక్కుచు నానందజలధి సుడిసి నశించున్.

తా. పంచదారయు ఉప్పును నీటకరిగినట్లు మిగుల బ్రహ్మస్వరూపమయిన తన్నుజూచెడు బ్రహ్మవేత్తమనస్సు బ్రహ్మానందమను సముద్రమున సుడిదిరిగి పరవశమగుచు నశించును.

తే. ఇతరసంకల్పములు లేక యెపుడు దాను
సచ్చిదాత్ముఁడ నని సుప్రసన్నవృత్తిఁ
దన్నుఁ గనువానిచిత్తంబు దనకుఁదాన
పొలియుఁదనయంద నింధనాశనలముపగిది. 62

తా. శుద్ధసత్త్వరూపమయిన తా నితరతలంపులులేక నిర్మలవృత్తిచే నెల్లప్పుడు పరబ్రహ్మమునునని పరబ్రహ్మమగు తన్ను దిలకించువాని మనస్సు తనంతటతానే కట్టెలలోని నిప్పు కట్టెలనుగాల్చి తానును చల్లారినట్లు తనలోపలనే నశించును.

క. ఇనుఁ డస్తమించుతటి నా
తనికిరణము లతనితోడఁ దగఁ జనురీతిం
బెనుమానసంబు పొలిసిన
మనుకొని తద్గతవికారములు పొలియుఁ గడున్. 63

తా. రవిగుంకినతోడనే యాతనికిరణములాతనితో బోయినట్లుత్కృష్టమయిన మనస్సు లయింపగనే యందుద్భవించిన సత్త్వరజస్తమోగుణ జనితవికారము లడంగును.

శా. నానాకర్మజవాసనాన్వితమనోనాశంబుగాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్డు డి
య్యానందాంబుధి నోలలాడకయ బాహ్యాభ్యంతరార్థానుసం
ధానోద్భూతనితాంతదుఃఖమయసంతాపంబు చల్లాఱునే. 64

తా. పెక్కువిధములగు ఆగామిసంచిత ప్రారబ్ధకర్మానుభవముతోగూడిన మనోనాశముగాకున్న యెడల బ్రహ్మానందానుభవం బెట్లు కలుగును. అట్టి బ్రహ్మానందవార్ధి నీదులాడక బాహ్యాభ్యంతరదృశ్యములతో జేరుటచే గల్గిన నెడ తెగని దుఃఖమయమయిన తాపత్రయము శమించునా ?

వ. అని మఱియు నిట్లనియెఁ బరమభాగవతోత్తమా! నీవు దేహావ్యతిరిక్తుండ వగుటం జేసి జన్మాస్తిత్వవృద్ధిపరిణామాపక్షయవినాశంబులును, బాల్యకౌమారవయోజరావస్థలును, వర్ణాశ్రమకులగోత్రనామరూపదేశకాలాదికంబులును, స్థూలత్వకృశత్వదీర్ఘత్వహ్రస్వత్వనీలత్వరక్తత్వాదికంబులును, నిరింద్రియుండ వగుటం జేసి వచనాదానగమనవిసర్గానందకర్మంబులును శబ్దస్పర్శరూపరసగంధ విషయసంగంబులును, అప్రాణుండ వగుటం జేసి చలనధావనకంపనాకుంచనప్రసారణాదికంబులును క్షుత్పిపాసాదికంబులును, అమనస్కుండ వగుటం జేసి సంకల్పవికల్పంబులును రాగద్వేష కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యేర్ష్యాసూయాదంభదర్పాహంకారేచ్ఛాతృష్ణావిచికిత్సా లజ్జాదయా భయశోక ధైర్యాధైర్యదైన్యాదికంబులును, నిత్యానిత్యవస్తువివేకవైరాగ్యశమదమోపరతి తితిక్షాశ్రద్ధాసమాధానముముక్షుత్వశ్రవణమనన నిదిధ్యాసన జ్ఞానాదికంబులును, ధీవిలక్షణుండవు నిరహంకారుండ వగుటం జేసి వక్తృత్వ దాతృత్వ గంతృత్వ విసర్జయితృత్వానందయితృత్వంబులును, శ్రోతృత్వ స్ప్రష్టృత్వ ద్రష్టృత్వ రసయితృత్వ ఘ్రాతృత్వంబులును, కర్తృత్వ భోక్తృత్వ స్మర్తృత్వ జ్ఞాతృత్వ మంతృత్వ హంతృత్వ ప్రమాతృత్వ ధ్యాతృత్వాదికంబులునునీకు

లేవు, నీవు కేవలశుద్ధచిద్రూపప్రత్యగభిన్న బ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండనని నిన్ను నీవు విలోకించు సమాధిసమయంబున సకలవికారసమన్వితమహారహితుండవు గావే, భూతభవిష్యద్వర్తమానకాలంబుల నివ్విధంబునఁ బ్రకాశించుటవలన నిరతంబును నిర్వికల్పుండవై ఏకరూపుండవై యుండుటం గాదె సర్వవికారశూన్య సహజామనస్కరాజయోగసమాధియని దెలిపినం దెలిసి హనుమంతుండు సీతాకాంతున కిట్లనియె.

65

తా. నీవు శరీరముసకంటె వేరైనవాడవగుటవలన షడ్విధవికారములును 4 అవస్థలును 4 వర్ణములును 4 ఆశ్రమములును కులములును గోత్రములును నామములును శ్వేతాదివర్ణములును దేశములును మొదలైనవియును బలియుట కృశించుటమున్నగునవియును లేవు. నీవు కర్మేంద్రియజ్ఞానేంద్రియములు లేనివాడవగుటచే నీకు కర్మేంద్రియవ్యాపారములు, వర్ణాత్మకధన్యాత్మకశబ్దములును, రూపములును, గంధములును, అనుజ్ఞానేంద్రియవ్యాపారములును లేవు. నీవు ప్రాణములు లేనివాడవగుటచే కదలుట పరుగెత్తుట మున్నగునవియు, ఆకలిదప్పికలును లేవు. నీవు అవిదునస్కుడవగుటచేత నీకుకోరుట కోరకుండుట ప్రేమ ద్వేషము ధనాదికములు సంపాదింపవలయుననువాంఛ తనప్రియత్నము నకు విఘాతముగలిగించు వానియెడ ద్వేషములేవు. అంటుచే ఐశ్వర్యగర్వమున నిది చేయదగినది, ఇది చేయదగనిది అనుటయు నే జేసిన పనులన్నియు జెల్లుననియు యితరులయు త్కర్ష ఓర్వలేకుండుటయు తనదుఃఖములు పరులకు రాకూడదాయని తలంచుటయు పరుల సౌఖ్యముచూచి ఓర్వలేకుండుటయు, తన ప్రవర్తనమెల్లరును మెచ్చవలయునని దలంచుటయు లేవు, అమనస్కుడవగుటచే నీకు జెప్పనలవికాని అంతస్సబహిశ్శబ్దాదిక్రియలజేయవలయునని తోచుటయు పరధనాశగ్రక్షణబుద్ధియు నేను బ్రహ్మనగుదునా కానాయను సందేహమును జీవకారుణ్యమును ఇహపరలోకనిరాశయు, ఇంద్రియనిగ్రహమును, విహితకర్మల శాస్త్రోక్తముగ త్యజించుటయు, ద్వంద్వసహనమును, గురువులయెడలను వేదాంతమునందును విశ్వాసమును ఇంద్రియముల వేదాంతవిచారణయందు నిలుపుటయు, మోక్షాపేక్ష మహావాక్యముల వినుట, గురువులచేవినినదాని నేకవాక్యముజేయుట, విజాతీయములవిడచి సచ్చిదానంద నిత్యనిర్మలపరిపూర్ణమే నేనను స్వానుభూతిగల్గి అపరోక్షజ్ఞానాదికములును, నిశ్చయాత్మకమైన బుద్ధికి విలక్షణుడవును నిరహంకారుడవును అగుటజేసి మాట్లాడుట ఈవి నడచుట మలమూత్రాదుల విడచుట సురతాదులచే ఆనందించుట లో

నుగాగలవన్నియు లేవు. ఏకమయి, నిర్మలమయి, జ్ఞానస్వరూపమయి, కూటస్థబ్రహ్మ ముకంటె వేరుగానిదియు, హీనాధికశూన్యమయినపరబ్రహ్మముయొక్క తేజస్వరూపుడవుగనుక కూటస్థుఁడనైన నేను దేహమును జ్ఞానకర్మేంద్రియములును ౕ ప్రాణములను, సంశయరూపక మానసమును నిశ్చయాత్మకబుద్ధియు, చిత్తమును, అహంకారమునుగాను, తనంత ప్రకాశించునదియు, కాలత్రియమునందుండునదియు, అపరోక్షజ్ఞానానందములే ఆకారముగా గలవాడనని నీవు నిన్ను జూచెడి సమాధిలో త్రిగుణవికారములతో జేరినమనస్సు లేనివాడవగుదువు. ఇట్లు మూడుకాలములనుండుటవలన వికల్పరహితుడవు.ఏకరీతిగా నుండువాడవునై యుండుటచే సలయనిక్షేపాదికములు లేనిదియు, తనంతట బుట్టినదియు అగు అమనస్కరాజయోగముయొక్కసమాధియని యెఱుంగుము అనిజెప్పగా. విని ఆంజనేయుడు సీతారాముల కిట్లనియెను.

సమాధియందు మనస్సు కలదా లేదా యని ప్రశ్న చేయుట.

క. ఇది యిది యనాత్మ నేఁగా
నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునపుడు నె
మ్మది కలదో లేదో యిది
విదితంబుగఁ దెలియఁ జెప్పవే శ్రీరామా. 66

తా. దృశ్యమగు నీప్రపంచమంతయు ప్రపంచాతీతనుయిన పరమాత్మయగు నేగానని తెలిసికొన్నప్పుడు అనృతజడదుఃఖాత్మకమయిన మనస్సుగలదా లేదాయను సంశయముగలుగుచున్నది ఈసంశయమును నివారింపవే.

వ. సమాధియందు మనంబు గల దంటేని. 67

సీ. మనసు గల్గిన బుద్ధియును దశేంద్రియములు
ప్రాణాదులును జతపడి వసించు
నవియు నీస్థూలదేహంబును విడిచియుం
డవు గాన నదియు నుండంగ వలసె
ఘనకారణము లేని కార్యంబు లిల లేవు
గావున దానినెక్కడయు నెప్డు
మూఁడుమేనులవంటి మొదలును దుది లేని
సంసారమంత యచ్చముగనుండు

తే. నట్టు లుండినచో సహజామనస్క
రాజయోగసమాధి నిరంతరంబు
నెవ్విధంబున సిద్ధించు నెంచి చూడ
జానకీరామ దేవతాసార్వభౌమ. 68

తా. రామచంద్రా ! అసత్యజడదుఃఖరూపమనస్సు సమాధినుండెనేని బుద్ధి, జ్ఞానేంద్రియకర్మేంద్రియములును ప్రాణాదివాయువులును చేరియుండును.ఆమనస్సు మొదలగునవి యీస్థూలదేహమును విడువవుకాన, స్థూలశరీరముగూడ నుండవలసియేయున్నది. ఘటాదులకు దండచక్రాదులుండవలయునట్లు కార్యములగు సూక్ష్మశరీరముండుటచే నీ సూక్ష్మశరీరమునకు కారణమగు కారణశరీరముగలదు. అట్టి శరీరత్రయమునుపొంది ఆద్యంతశూన్యమయిన యహంకారవ్యాపారము స్పష్టముగానుండును.చింతింపగా నహంకారమున్నయెడ సహజమయినట్టిదియు మనశ్శూన్యమయినదియు నుత్తమమయినదియు సాక్షాత్పరబ్రహ్మస్వరూపసమాధి సర్వదాలభింపదు.

వ. అట్లగుటం జేసి మనంబు లేదంటేని. 69

మ. తనర న్నెమ్మది యంతయుం బొలియఁగాఁ దత్త్వాత్ముఁడై యుండినం
బునరుత్థానము గల్గ దాతనికి నీ సోహం దొప్పిన న్ధాత్రిమై
గనఁ డాత్మానుభవంబు గాంచి యమనస్కం బెంచి బోధించు స
జ్జను లాచార్యులు గల్గ రంచు మదిలో శంకింతు సీతాపతీ. 70

తా. రామా ! చిత్తమంతయు నశింపగా పరబ్రహ్మస్వరూపుడై నిష్ఠయందుండువాడు సమాధినుండి మరల లేచుటగలుగదు. ఇట్లు లేవకుండుటయే సంభవించిన భూమిపై నెవ్వడును సమాధినిష్ఠ బొందజాలడు. అట్టియెడ బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై అమనస్కరాజయోగసమాధుల విమర్శించి శిష్యుల కుపదేశముచేయువారుండరని సందేహించుచున్నాను.

క. బోధాచార్యులు లేరని
సాధించిన రాజయోగిసంతతికిని ద
ద్బోధంబునకుఁ దదీయ స
మాధికి బాధకము వచ్చు మది కడు లేమిన్. 71

తా. బ్రహ్మజ్ఞానోపదేశముచేయు గురువులు లేరనిన నుత్తములైన యోగీంద్రుల పరంపరకును, వారిబోధకును బోధింపబడినవారి బ్రహ్మనిష్ఠకును సమాధియందు లేశ మేని మనంబులేకుండుట ప్రతిబంధకముగా నుండును.

వ. ఇవ్విధంబున గాక జ్ఞానవిజ్ఞానసంపన్నులైన మహానుభావులు సమాధియందుఁ గొంతతడవు మనోరహితులైయుండి కొండొకసేపునకు మేల్కని మెలంగుదు రనిన బరమపదంబు నొందినవారికిఁ బునరావృత్తి ప్రాప్తించు నట్లైనమోక్షంబున కనిత్యత్వంబు వచ్చు నిట్లు బహువికల్పసమన్వితం బైన మాసంశయంబు నిశ్శేషంబుగా నివర్తించునట్లు పరమరహస్యార్థం బుపదేశించి నిరతిశయకరుణాకటాక్షవీక్షణంబుచేత ననుగ్రహింపవే యని ప్రార్థించిన నయ్యాంజనేయుని కుశలతీవ్రసూక్ష్మప్రజ్ఞావిశేషంబునకు మెచ్చి సచ్చిదానందస్వరూపాభినాముం డైన యాత్మారాముండు పరమానందభరితాంతఃకరణుండును వికసితముఖారవిందుండు నై సాదరంబుగ నిట్లనియె. 72

ఇట్లు నిర్బంధముగల్గుటయేగాక బ్రహ్మజ్ఞానమను అనుభవమయిన జ్ఞానసంపదగలవారు యోగసమాధియందొక కొంతతడవుండి యనంతరము ప్రపంచజ్ఞప్తి గలవారగుదు రన నుత్తములై మోక్షసముపార్జనముగావించినవారికి పునరావృత్తి గలుగుచున్నది. ఇట్టి యనేకకల్పనలలో నిమిడియున్న నాసందేహ మెట్లుదీరును. నాసందేహ నివారణమగునట్టిదియు మిగుల రహస్యమయినట్టిదియు నుత్తమమయినదియును మార్గమును బోధింపవే యనియడుగ నాంజనేయుని ప్రజ్ఞావిశేషమునకు మెచ్చి సత్యజ్ఞానానందస్వరూపుడును తనయందే క్రీడించువాడును అగు రామచంద్రుడు సంతోషితాంతఃకరణుండై యాంజనేయుని యాదరించి యిట్లు పలికెను.

సమాధియందు మనస్సు గల్గినను తద్వికారంబు లంట వనుట.

క. ఇది యిది యనాత్మయేఁ గా
నిది బ్రహ్మము నే నటంచు నెఱుఁగునె జడమై

కదలనిమది యిటు లామది
గదిసి తెలియునట్టెడె స్వప్రకాశాత్ముండగున్. 73

తా. దృశ్యమగు విశ్వము ప్రకృతియనియు, ఆప్రకృతి తాను గాననియు, తాను మాత్మనియు యీజడపరనుగు మనస్సు తెలియజాలదు. అట్టిజడమగు మనస్సునుపొంది బ్రహ్మము వెలుంగువాడే స్వప్రకాశాత్ముడగును.

చ. మనసు జడంబు దృశ్య మణుమాత్ర మసన్నియతావితర్క్యమున్
జననవినాశయుక్తమును సంశయరూపము దీనియున్కిచే
తను సుఖచిత్ప్రకాశమయమౌ తం దగు నీకుఁ గళంక మేమి చ
క్కనిశశిశృంగదోషములు గల్గునె సూర్యుని కెన్నఁడేనియున్. 74

తా. మనస్సు జడంబు విషయరూపముగ గనంబడును, అతిస్వల్పమగురూపము గలది, అనిత్యములైన దేహేంద్రియాదులు నిత్యములని ప్రతిపాదించునది పుట్టుకనాశనము గలది సందేహమే స్వరూపముగాగలది ఇట్టి మనంబునుగల్గియున్న నీకు చంద్రునికిగల్గు క్షీణవృద్ధులు భాస్కరునికి గలుగనట్లు మానసికసంశయములు నీకు గలుగవు.

తే. శశవిషాణంబునకు నాతపంబునకును
గలుగునె ప్రసంగ సంగంబు దలఁచిచూడ
మనమునకు సచ్చిదానందమయుఁడ వైన
నీకుఁ బొందిక యెన్నఁడేనియును గలదె. 75

తా. కుందేటికొమ్మునకును ఆకాశమునకును సంబంధముగలుగనట్లు జడమగు మనస్సునకును సచ్చిదానందరూపుడవైన నీకును సంబంధమెన్నడును గలుగదు.

తే. స్వప్రకాశుండ వగు నిన్ను సన్మనో వి
కారములు పొందునే పటికంపుకొండ
నెన్నఁడేనియుఁ గలలోన గన్నయట్టి
సంజకెంజాయలంటునే యాంజనేయా. 76

తా. వత్సా! సంధ్యారుణరాగములు స్ఫటికపర్వతమునంటనియట్లు స్వప్నమున దిలకించిన మానససంబంధములైన సంకల్పవికల్పాదులు స్వయంప్రకాశముగల నిన్నంటనేరవు.

వ. కపీంద్రా ! జడఘటపటాదియు క్తంబు లైన ఛిద్రత్వాచ్ఛిద్రత్వశ్లక్ష్ణ
త్వస్ఫుష్టిమత్త్వాస్ఫుష్టిమత్త్వాదివికారంబులు విశ్వప్రకాశకుండైన
యాదిత్యునిం బొరయ నేరని తెఱుంగుననహంకారధీమానసేంద్రియశరీ
రాదివివిధగుణదోషంబులు స్వయంప్రకాశాత్మకుండ వైన నిన్ను బొం
దవు, వాయుతేజోజలభూములును దత్కార్యంబులును దనయందుఁ
గలిగియు దా నన్నింటియందు వ్యాపించియు నేమిటినంటని మింటివగి
దిఁ జిత్తాదిసర్వకారణకార్యంబులును నిన్నాశ్రయించి నీయందు నిలి
చియుండ సర్వవ్యాపకుండ వయ్యు నసంగుండ వైన నీ వేమిటిం
జెంద వ ట్లగుటం జేసి. 77

తా. జడపదార్థములగు కుండలు వస్త్రములు మున్నగువానియందు చేరియుండి. చిల్లిపోవుట చిల్లులేకుండనుండుట సన్నగానుండుట ముదుగుగానుండుట మొదలైన వికారములు జగమంతయును ప్రకాశింపజేయు సూర్యునిపొందజాలనట్లు అహంభావము నిశ్చయాత్మకమగు బుద్ధి మనస్సు జ్ఞానకర్మేంద్రియములు శరీరత్రయమున్నగువాని విరుద్ధములైన గుణంబులవలని దోషములు స్వప్రకాశుఁడవగు నిన్ను పొందజాలవు. ఆకాశము పృథివ్యాదిచతుర్భూతములందును వాటికార్యములగు స్పర్శాదిగుణములును ఆకాశమున వ్యాపించియుండకను, ఇంక ఆకాశము దేనిని అంటకయుండునట్లు యీసమస్త హేతువులగు యింద్రియములు యింద్రియార్థములయిన సంకల్పవికల్పాదులు నిన్నాశ్రయించియున్నను సర్వత్ర నిండియున్నవాడవగుటచే నీవు దేనితోడను జేరవు.

తే. ఇంద్రియమనంబు లటు చలియించెనేని
నేఁ జలించితి నంచు నీ ♦ వెఱుఁగఁ బోకు
నిశ్చలుఁడ నంచుఁ దెలియుము ♦ నిన్నుఁ గాంచి
యవియు నతినిశ్చలము లగు ♦ నంతమీఁద. 78

తా. ఇంద్రియములును మనసును చలించినను నేను చలించితినని, దలంపకుము. నేను నిశ్చలుఁడనని నిన్ను నీవెఱింగితివేని యింద్రియములు మానసముగూడ నతినిశ్చలమగును.

తే. ఆత్మతేజంబు వీక్షించు ♦ నతనిమాన
సేంద్రియంబులు చేష్టల ♦ నెడల విడిచి

యొదిఁగి చెదరక కదలక ॥ యూరకుండు
సింగములఁ గన్న గజములభంగి ననఘ. 79

తా. వత్సా ! ఆత్మపరికాశమునుగనుంగొను బ్రహ్మజ్ఞానియొక్క మానసేంద్రియములు సంకల్పాదికములవదలి సింహమునుజూచిన యేనుగులవలె చలింపక చెదరక యొక పరిదేశమున నొదిగియుండునట్లు చెదరక నొదిగియుండును.

చ. అవి యచలంబులైనయెడ ॥ నారయ నే నచలుండ నంచు నీ
ప్రవిమలదృష్టిఁ జూడకుము ॥ పావని ! వానిచలాచలత్వముల్
దవులవు నిన్ను నీవు సతతంబును వాని నెఱుంగుచుండు సా
క్షివి హృదయేంద్రియావిషయ॥ కేవలనిర్గుణమూర్తి వెప్పుడున్. 80

తా. వత్సా ! మానసేంద్రియములు గదలని సమయముల నేనును గదలనివాడనని తలంపకుము. మానసేంద్రియముయొక్క చలాచలత్వములు పరిత్యాగాత్మవైన నిన్నంటవు. కూటస్థుడవగు నీవు సర్వకాలములను మానసేంద్రియములను తెలిసికొనుదృష్టవు, జ్ఞానేంద్రియకర్మేంద్రియాంతఃకరణముల కగోచరుండవైనట్టియు ఏకమయినట్టియు గుణరహితమయినట్టియు రూపముగలవాడవు. ఇట్టిరూపమే పరబ్రహ్మస్వరూపము గావున నీవును పరబ్రహ్మస్వరూపుడవు.

సీ. మును దండకారణ్య॥మున నొక్క పుణ్యాశ్ర
మమునఁ దాపసవేష ॥ మమరఁ దాల్చి
బ్రహ్మర్షిలోక స॥భామధ్యమంబున
నురుసుఖాసీనత ॥ నొప్పుచున్న
ననుఁ జూడఁగాఁగోరి ॥ మునికన్యకలు సీత
ముందట నిడుకొని ॥ ముదిత యితఁడో
యతఁడో నీపతి యని ॥ యచటి మానులఁ బ్రీతి
విభజించి యడుగ నం॥ వ్వేలఁది సిగ్గు

తే. కలిమివారలనందఱఁ ॥ గాఁడు కాఁడ
టంచుఁ దల యూఁచుచుండి న॥గ్నాంచివప్పు

డొకట నొఁగాఁ డనక యూరకుండె నత్తె
ఱంగుఁ గని సంతసిల్లి రారమణులెల్ల. 81

తా. తొల్లి దండకాటవియందలి యొక ఋష్యాశ్రమమున తాపసవేషమును ధరించి బ్రహ్మర్షి సమూహముయొక్క మధ్యను నేను గూర్చుండియుండ నన్ను జూడదలచిన తాపసకన్యలు సీతను ముందిడుకొని జానకీ! నీభర్త ఇతఁడా, ఇతఁడాయని యొక్కొకరినే యడుగుచుండగా సీత వారినెల్లరను కాదు కాదని తలయూచి చెప్పుచు చెలులు నను జూపి యితఁడు నీభర్తయా యని ప్రశ్నించిరి. అంతనామె నేను తనభర్తనగుటచే నగునని యు కాదనియు ననకనూరకుండెను. అయ్యదిజూచి మునికన్యకలు యితఁడీమె భర్తయగుటచే తనేయూరకుండెనని నిశ్చయించి సంతసిల్లిరి.

మ. స్థిరవైరాగ్యవివేకయుక్త యగు సద్ధీవృత్తి యాతి న
వ్వరమాభాసున కాత్మచిత్సుఖరసప్రత్యక్షపర్యంతముఁ
గరిమన్ దేహగతేంద్రియాసుహృదహంకారంబులం దోఁచు నా
త్మరతి న్నేనది కాను కాననిన నంత న్నిల్చుఁ గాష్ఠాకృతిన్. 82

తా. స్థిరమయిన విరక్తితోడను బ్రహ్మజ్ఞానముతోడను గూడినదియగు నాశ్రేష్ఠమగు దేహేంద్రియాదులందుదోచు వృత్తిజ్ఞానమునై సీతవలెనే నిరతిశయుఁడగు ప్రత్యగాత్మనకు పరబ్రహ్మముయొక్క చిదానందరసానుభవముగలుగునంతవరకు శరీరమందును, యింద్రియములందు 5 ప్రాణములందును తానను తలంపునందును తోచుచుండును. పరబ్రహ్మమందలి యపేక్షచే నే నాదేహేంద్రియాదుల దోచువృత్తిజ్ఞానమునుగానని త్యజించినపిదప చిత్తవృత్తిస్థిరమయి కొయ్యవలెనుండును.

తే. ఆ చిదాభాసుఁ డాబుద్ధినధిగమించి
యాత్మచైతన్యతేజంబునందుఁ దనదు
వెలుఁగు నైక్యంబుఁ జేయధీవృత్తి లేక
యొడలో దీపమున్నయట్లుండు ననఘ. 83

తా. ప్రత్యగాత్మ వృత్తి జ్ఞానము నధిగమించి పరమాత్మసంబంధమయిన జ్ఞానతేజమున తనయొక్క తేజమును జేర్పగా బుద్ధివృత్తి లేనిదై యొడయందలి దీపమువలె నుండును.

వ. ఇట్లు శరీరేంద్రియప్రాణమనోబుద్ధిసమన్వితంబైన యహంకారంబుతో సహజతాదాత్మ్యంబు గల స్వాధిష్ఠానచిదాభాసుండు నిద్రావసరంబున సర్వవ్యాపారంబులఁ జాలించి శయ్యాతలంబున స్థూలదేహంబు డించి యింద్రియంబుల విడనాడి ప్రాణంబుల డిగ్గ విడిచి మనశ్చిత్తంబుల నహంకారంబునం దడంచి యయ్యహంకృతిని ధీవృత్తియందొడఁగించి యంతర్ముఖుండై యవిద్యాధిష్ఠానచైతన్యసాన్నిధ్యంబు నకు సుఖంబుగా నరిగి ప్రియమోదప్రమోదాదివృత్త్యాత్మకానందమయ కోశంబునం దనకు నుపాధిభూతంబై నానావిధవాసనావాసితం బగు ధీవృత్తిఁ దిగనాడి యనాద్యనిర్వచనీయాజ్ఞాన తమోభిభూతుండై యంతట నిత్యనిరుపాధికనిరతిశయ బ్రహ్మానుభవసాగరమగ్నుం డైన చందంబునఁ బూర్ణాధికారియై సమాధిసమయంబున మొదల నేదృశ్యంబుగాను ద్రష్టనియు ద్రష్టనుగాను ద్రష్టనువృత్తియు దృశ్యంబు గావున దీనికి ద్రష్టనియు నివ్విధంబున విజాతీయప్రత్యయతిరస్కార సజాతీయ ప్రత్యయవ్యవహారాంగీకారపూర్వకంబుగాఁ గేవలనిజానందానుభవపర్యంతంబ శేషదృశ్యవృత్తినిషేధం బొనరించుచు ధీవృత్తి సాక్షికూటస్థచైతన్యసామీప్యంబునకుఁ జనుచుండ నెప్పు డఖండ సచ్చిదానంద స్వరూపాత్మసాక్షాత్కారంబగు నప్పుడు ప్రచండాతప మధ్యనిక్షిప్తకర్పూరదీపంబుభంగిఁ బరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మ చైతన్యంబుతో నేకీభూతుండై యానందించుచుండు నిట్లుండు నతండు తన్నుఁ దాఁ గనుంగొనుచుఁ దనకు నభిముఖుండై యుండమిం జేసి యమ్మనంబు జడంబు గావున నివాతదీపంబుభంగిఁ గదలకయుండియు సంకల్పరూపంబుగాఁ బరిణమింపమిం జేసి లేనియ ట్లుండు నిదియే సహజామనస్కరాజయోగసమాధి, యిదియే జీవన్ముక్తి యని యుపదేశించు నెడ నిజముఖారవిందంబు విలోకించుచు ముసిముసినగవులు నగు సీతాదేవి నెమ్మొగంబు వీక్షించి వికసితవదనకమలుండై యవ్విశుద్ధ

సత్త్వబ్రహ్మైక్యజ్ఞానాకారవృత్తియే యిప్పరమపతివ్రతాశిరోమణి యగు జుమ్మి నాకు నిత్యానపాయినియు సర్వాభీష్టఫలప్రదాయినియు వశవర్తినియు నై యుండు నే నీ ధీవృత్త్యధిష్ఠానవిశుద్ధచైతన్యంబు మత్స్వరూపానుభవంబు సేయు మని జ్ఞానముద్రచే నభినయించి చూపి క్రమ్మఱ ని ట్లనియె. 84

తా. ఇట్లు స్థూలసూక్ష్మకారణోపాధులతోడను, యింద్రియములతోడను ప్రాణములతోడను నిశ్చయాత్మకమగు బుద్ధితోడను గూడినట్టియు కర్తవ్యాత్మకమగు యభిమానసంబంధయుతమయినదియు తనకు ఆశ్రియమయినదియు జ్ఞానప్రతిబింబస్వరూపము నగు జీవుడు నిద్రావస్థలో యింద్రియధర్మములనిలిపి శయ్యపై స్థూలశరీరమునుంచి జ్ఞానకర్మేంద్రియములనువిడచి ప్రాణములై దింటెనివదలి మనస్సును చిత్తమును అహంకారమును బుద్ధియందుజేర్చి వెలుపలివ్యాపారములులేక పరబ్రహ్మమున కెదుటునిలిచి పరబ్రహ్మముయొక్క సామీప్యమును సులభముగాపొంది వాంఛితవస్తుసందర్శనానుభవంబులు గలుగునట్టి యానందములే రూపముగాగల యానందమయకోశమున జీవుడు బాధారూపములగు వాంఛలకుఁబుట్టినిల్లగుబుద్ధివ్యాపారములను వదలి ఆద్యంతములులేనిదియు వచింపరానిదియునగు అంధకారము నడచినవాఁడై కాలత్రియముచే నబాధితమయినదియు, స్థూలాద్యుపాధులులేనిదియు ఉత్తమమయినదియు బ్రహ్మనందసముద్రమునందు మునింగినవానివలె నిండు అధికారముగలవాడై సమాధిసమయముల మొదట నేను దృశ్యంబనని యు, పిదప ద్రష్టననియు, అటువెనుక నేను ద్రష్టనుగాను ద్రష్టనువృత్తి దృశ్యంబుగావున నద్దానికి ద్రష్టననియు యీవిధమున దనకంటె వేరుగాదోచెడు నీవనునదియును తదంగోపాంగములగు శరీరేంద్రియాదులయొక్క వ్యవహారముల నంగీకారపూర్వకంబుగా కేవల నిజానందానుభవమువరకు సమస్తములైన అంతర్బహిస్ద్రశ్యములను నిషేధించుచు బుద్ధివ్యాపారములకు సాక్షియగు పరబ్రహ్మసామీప్యమున పోవుచుండగా నెప్పుడు అఖండసచ్చిదానందరూప పరబ్రహ్మసాక్షాత్కారము గలుగునప్పుడు మంచియెండలో నుంచబడిన కర్పూరదీపంబుభంగి పరిపూర్ణమైనట్టియు, కూటస్థ చైతన్యముకంటె వేరుగానిదియు, సర్వోత్కృష్టమైనదియు, అగు బ్రహ్మచైతన్యముతో కలసినవాఁడై ఆనందించుచుండును. ఇట్టివాడు పరబ్రహ్మస్వరూపుడైన తన్ను తానే జూచుచు దనకు దానభిముఖుఁడైయుండకుండుటవలన మనసు అచేతనమైనదగుటవలన గాలి తగులని దీపమువలె కదలకుండ నుండియు వృత్తిరూపముగా వ్యాపింపకుండుటచేత లేనియట్లే యుండును. ఇట్లుండుటయే సహజామనస్కరాజయోగము. (తనంతట గల్గిన మనశ్శూన్యమైన యుత్త

మనైన రాజయోగము.) ఇవియే జీవన్ముక్తియని యుపదేశించుచు సీతాదేవినెమ్మొగంబు దిలకించి నవ్వుచు వికసించినపద్మమువంటిముఖముగలవాఁడై కళంకరహితమైన యాశుద్ధసత్త్వమగు పరమాత్మను, ప్రత్యగాత్మను చేర్పదగిన తెలివియే యాకృతిగాఁగల జ్ఞానస్వరూపమే యీసీత- పరబ్రహ్మమైననాకు నెల్లపుడును విడువరానిదియును, సమస్తకోరికలనొసంగునదియును, నాకునశవర్తినియై నడచుకొనునదియును నైయుండును. నేనిపుడు బోధించిన వృత్తిజ్ఞానమున కాధారమైనదియు నిర్మలమైనదియు నగు పరమాత్మను నా యొక్క సచ్చిదానంద నిత్యనిర్మలత్వాదికములను విమర్శించి తెలిసికొనుచుని ప్రజ్ఞానరక్షణముచే బ్రహ్మభావమును బుద్ధికందజేసి, బ్రహ్మభావమును జూపి మరలయిట్లువచించెను.

తే. ప్రేమ మీఱంగ శ్రీరామ రామరామ
యనుచు సతతంబు మత్స్వరూపానుభవముఁ
జేయువారలఁ దక్క నీసీత మిగుల
నెట్టివారలఁ జిక్కులఁ బెట్టు ననఘ. 85

తా. వత్సా! ఎల్లపుడును శ్రీరామ రామయని బల్కుచు నాయొక్కసచ్చిదానంద నిర్మలస్వరూపమునె ధ్యానించువారలనుదక్క నితరులను వారెంతమహనీయులైనను-వారికి యీసీత మూలప్రకృతి; అనేకములగు భ్రమల దగుల్కొనజేయును.

సీ. ఉన్నది లేదని యూహింపఁగా నేర్చు
లేనిది కల దన లెస్స నేర్చు
నజడంబు జడ మని యాగడింపఁగ నేర్చు
జడ మజడం బని చాట నేర్చు
సుఖము దుఃఖంబుగాఁజూపి చెప్పఁగ నేర్చు
దుఃఖంబు సుఖ మనఁదోలుత నేర్చు
నిది యది గా దని యింపుగా నన నేర్చు
నది యిది గాదని యనఁగ నేర్చుఁ

తే. బిదపఁ గలదియె కలదు లేనిదియె లేదు
కడఁగి యజడంబె యజడము జడమ జడము
సుఖమె సుఖము తలంప నసుఖ మసుఖము
అదియె యిది యిది యది యని యాడనేర్చు. 86

తా. నాయొక్క స్వరూపానుభవము లేనివా రెట్టి భ్రమల జిక్కుకొనియుందు రో దెల్పెద నాకర్ణింపుము. సత్యమగు పరబ్రహ్మమసత్య మని దలంతురు. అసత్యమగు విశ్వము సత్యమందురు. జ్ఞానమజ్ఞానమని వికల్పముగా జెప్ప నేర్తురు.అజ్ఞానమును జ్ఞానమం దురు బ్రహ్మానందమును ప్రపంచరూపదుఃఖముగను, విశ్వరూపమగుదుఃఖమును బ్రహ్మా నందముగ జూపుదురు. ఇట్టి ప్రత్యక్చైతన్యముబ్రహ్మము గాదనియు, పరబ్రహ్మము కూటస్థచైతన్యము గాదనియు పలుకనోపుదురు. పిమ్మట సద్రూపమైన పరబ్రహ్మమే యున్న దనియు అసద్రూప మగు విశ్వము లేదనియు జ్ఞానమజ్ఞానమనియు, అజ్ఞానముజ్ఞా నమనియు, విశ్వాత్మకమగు దుఃఖము దుఃఖమనియు, ప్రత్యగాత్మపరమాత్మ లభిన్నులని యుబలుకుదురు.

వ. అట్లు గావున నతిదుర్ఘటకారిణియు బ్రహ్మైకత్వవిద్యాస్వరూపిణి
యు మదీయయోగమాయాశక్తియు నిత్యానపాయినియుఁ బరమ
పావనియుఁ బ్రసన్నముఖియు నైన యీసీతాభగవతి నభిముఖిం గా
వించుకొనుము, నీ కతిశీఘ్రంబుగా నిత్యనిరుపాధికనిరతిశయనిర్మల
నిజానందానుభవంబు గలుగు నయ్యుపాయంబుఁ జెప్పెద నాకర్ణింపు
మని యి ట్లనియె. 87

తా. కావున, పొందనశక్యమైనవస్తువుగూడ పొందజేయునదియును, పరమాత్మ కును ఆత్మకును ఐక్యము గలుగజేయునదియును, నాయందు విడువకయుండునదియగు మాయాశక్తియు, చంద్రుని చంద్రికవలె నెప్పుడెడబాయ కుండునదియు నిర్మలమైనదియు ను, అనుగ్రహయుక్తమైనదియును, అయిన యీసీతాదేవిని నీవు నీయెడ ప్రసన్నురాలై యుండునట్లు గావించుకొనుము-అట్లైన-నిత్యమైనట్టియు అధికము లేనిదియును నిక్కమై నదియును అగు ఆనందముయొక్క అనుభవము లభించునందులకు గలయొక్క సులభో పాయమును జెప్పెద నాలకింపుము.

క. గౌరీశివాదు లాత్మా
కారాకారితసువృత్తిసగతి నాయందుం
జేరి రమించుచు నుండుట
కారణముగ రామపదము స గలిగె న్నార్యా. 88

తా. పార్వతీపరమేశ్వరులు మొదలుగాగల సమస్త స్త్రీపురుషులును ప్రత్యగాత్మ లై తనస్వరూపమును బ్రహ్మకారముగాజేయు అపరోక్షజ్ఞాన సరణిచే నఖండమైనట్టియు

సత్యమైనట్టియుజ్ఞానానందస్వరూపమైన నాయందైక్యమై యానందించుటయే కారణముగా పరమాత్మయగు నాకు రామయను పేరుగలిగెను.

ఆ. జగతి నిట్లు రామశబ్దవాచ్యుఁడ నైన
నేను బుధులు బుద్ధి మానసేంద్రి
యాంగములన నాత్మయని కడఁద్రోయంగ
మిగులుదును జితాత్ము నగుచు నెపుడు. 89

తా. రామనామముచే పలుకదగిన స్వయంప్రకాశము గలవాడనగు నేను బ్రహ్మవేత్త బుద్ధి మనస్సు కర్మేంద్రియములను శరీరత్రితయమును విడువగా మిగులువాడను.

క. సారబ్రహ్మాకారా
కారితధీవృత్తినాకుఁ గలుగుటవలనన్
శ్రీరామనామ మొప్పెను
శ్రీరమణియ బ్రహ్మవిద్య శ్రీ యనఁ దగుటన్. 90

తా. నాకు సత్తామాత్రమైన పరమాత్మనైన నాయాకారమును తెలియజేయు వృత్తిజ్ఞానము కలుగుటవలన నిత్యవిభూతి కధిదేవతయగు లక్ష్మియే బ్రహ్మవిద్యను దెలుపునట్టి జ్ఞానము. అట్టిజ్ఞానము శ్రీశబ్దముచే చెప్పబడుటవలన తత్పదలక్ష్యార్థమైననాకు శ్రీరామనామము కలిగెను.

తే. తలఁప ధీవృత్తి కేప్రొద్దు ద్రష్ట నగుచుఁ
బ్రత్యగాత్ముఁడ నైన నాభావ మరసి
తెలియుటకు నొప్పు మఱి యాద్వితీయరామ
నామము సమస్తవేదాంత ధామ మగుచు. 91

తా. వృత్తిజ్ఞానమున కెపుడును సాక్షియు, కూటస్థుడును నగు నాయునికి శోధించి దెలియుట మేలగును. రెండవదియగు రామనామము సమస్తవేదములయొక్క అంతములగు ఉపనిషత్తులు నివాసమగునని సూచించును.

తే. ఆతత ప్రత్యగాత్ముఁడ నైన నేను
బ్రహ్మరూపుఁడ నని నాస్వభావ మరసి

తెలియుటకునొప్పు మఱియాత్మకేతీయరామ
నామము క్షరాక్షరవిలక్షణమునగుచు. 92

తా. సర్వత్రనుండు కూటస్థుడైన నే నసత్యజ్ఞానానందస్వరూపుడనని నాయునికి దెలియుట, కామూడవరామనామము నశించుభూతభౌతికములకంటెను నాశనమునొందని భూతభౌతికాదికముల వ్యాప్తమైన కూటస్థచైతన్యముకంటె వ్యతిరిక్తమగు ననిపదమై యుండును.

తే. ప్రేమచే నిట్లు శ్రీరామ రామ రామ
యనుచు నన్ను భజించు మహాత్ములకును
మిగుల నిత్యానపాయిని యగుచు యోగ
సిద్ధిఁ గావించు చుండు నీశ్రీవధూటి. 93

తా. భక్తితాత్పర్యములతో శ్రీరామరామరామయని కేవలాత్ముడనైన నన్ను సేవించు నట్టివారలను నీబ్రహ్మవిద్యా స్వరూపిణియైన సీతాదేవి యెల్లపుడును విడువనిదై వారలకైక్యము సిద్ధించునట్లుజేయును.

వ. అట్లు గావున. 94

మ. తలఁపం బూర్ణము నిర్వికార మగు తత్త్వం బిట్లు భాసిల్లఁగా
దెలియ న్నేరక మూఢులైన నరు లీ దేహేంద్రియప్రాణబు
ద్ధుల నెల్లప్పుడు నిగ్రహించుటకు నెంతో రక్తులై యాత్మనిం
దెలియం జూతురు వారికిం గలుగునే ధీసాక్షి నీక్షింపఁగన్. 95

తా. వితర్కింప నిండినదియును వికారరహితమైనదియును నై బ్రహ్మతత్వము త్రివిధరామరూపమున భాసిల్లుచుండగా నవివేకులట్టి పరతత్వమును దెలియజాలక శరీరేంద్రియత్రయమును జ్ఞానకర్మేంద్రియములును ప్రాణపంచకమును గెలుచుటయందనురాగముగలవారై యత్నింతురు. అట్లు దేహేంద్రియాదుల నిగ్రహింపగోరువారు పరబ్రహ్మమును దిలకింప నేర్తురే.

క. సర్వేంద్రియములచేఁ ద
త్సర్వవిషయముల నెఱుంగుకేచందంబునఁ ద
త్సర్వజ్ఞు సర్వగతునిఁ
సర్వమయుం దెలియ వచ్చు సమరసదృష్టిన్. 96

తా. సకలేంద్రియములచే నింద్రియవిషయముల నన్నిటి నెఱుగు చందమున నింద్రియములను యింద్రియవిషయముల దెలియునట్టియు యింద్రియవిషయముల బొందినట్టియు ఆయింద్రియవిషయస్వరూపుడగు పరమాత్మ నభేద దృష్టిచే దెలియవచ్చును.

వ. అట్లు గావున. 97

సీ. ఘటశరావాదిమృత్కార్యజాతంబుల
నెంచి మృత్తిక యని కాంచుపగిది
నమలకుండలకిరీటాదిభూషణముల
స్వర్ణం బని యెఱుంగుచందమునను
నసికుంతశూలచక్రాదికంబుల నెల్ల
నిను మని యరసి కన్గొనినభంగిఁ
బొలుపారు ఫేనబుద్బుదతరంగంబుల
మంచినీ రని విలోకించురీతిఁ
తే. దనరు బహువిధపటములఁ దంతు వనుచుఁ
దెలియుకైవడి మొదలిసందియము విడిచి
భ్రాంతిని దొరంగి సర్వంబు బ్రహ్మమనుచు
సుఖముగా సంతతంబును జూడు మనఘ. 98

తా. వత్సా! కడవ మూకుడు మున్నగునవి మట్టియని తెలియునట్లు, పోగులు కిరీటాదిభూషణములు బంగారమని తెలియునట్లు, కుంతము శూల చక్రాది ఆయుధములు యినుమని తెలియునట్లు—బుడగలును నురగయు మంచినీరని తెలియునట్లు, వస్త్రమువారములు ప్రోవని తెలియునట్లు మొదటిసందేహముల వదలి భ్రాంతినుడిగి సకలమును పరబ్రహ్మమేయని సర్వకాలములందును సంతోషముతో దిలకింపుము.

సీ. స్థూలశరీరంబు సుస్థిరంబుగ నుండు
సకలేంద్రియము లుపశాంతి నొందు
సన్మనఃపవనముల్ సంచలింపక యుండుఁ
గామాదిశత్రువర్గము నశించు

స్ఫురదమానిత్వాదిసుగుణము లమరుఁ
ఘనగుణాతీతలక్షణము నొందవుఁ
బాలుపారు వైరాగ్యబోధోపరతులు సం
పూర్ణంబులై మదిఁ బొదలు చుండుఁ

తే. బరమసుఖవార్ధి యుప్పొంగి పాఱుచుండు
ముందట వసించు మోహించి మోక్షలక్ష్మి
సంశయము లేక దృఢముగా సంతతంబు
సర్వమును బ్రహ్మ మని చూచు శాంతినిధికి. 99

తా. చిత్తలయసంపదగల బ్రహ్మవిదునకు స్థూలదేహము గదలనిదైయుండును. జ్ఞానకర్మేంద్రియములు తమతమ వ్యాపారముల మాని యుండును. ప్రాణాదులైదును మనస్సును చలింపకుండును. అరిషడ్వర్గము నశించును-స్వోత్కర్ష జెప్పుకొనకుండుటాది సద్గుణములు లభించును, గుణముల నుత్తమమైన శుద్ధసత్వము నతిశయించిన బ్రహ్మలక్షణము గల్గును. ఇహపరలోక భోగవిరక్తియు ఆత్మజ్ఞానము తన్మయత్వము అనూనముగా మనస్సునందు వృద్ధినొందును. బ్రహ్మానందసముద్ర ముప్పొంగి ప్రవహించును. మోక్షలక్ష్మి పురోభాగమున వసించును.

క. రాజత్వ మమరినంతనె
భూజనములు వానిఁ జేరి పూజించుగతిన్
రాజిలి సర్వముఁ దనుఁగా
యోజించినయపుడె పొందు నుత్తమగుణముల్. 100

తా, రాజైనతోడనే జనులారాజును జేరిపూజించువిధమున స్వయంజ్యోతియై సమస్తమును తానని యెంచినపుడు సర్వజ్ఞత్వాదికములన్నియు నాతని జెందును.

తే. తరుణివేషంబుఁ గైకొన్న పురుషుఁ డరయఁ
బురుషుఁ డగుఁ గాక పరికింపఁ దరుణి యగునె
జీవభావంబుఁ జేకొన్న కేవలాత్ముఁ
డాత్ముఁ డగుఁ గాక మఱి జీవుఁ డగునె తెలియ. 101

తా. స్త్రీవేషధారియగు పురుషుడు పురుషుఁడే యగునట్లు జీవత్వమును గైకొన్న కూటస్థుడు-పరబ్రహ్మమేయగును గాని జీవుడు గానేరడు.

తే. దంతిరూపంబుచే నొప్పు దారు వరయఁ
దారు వగుఁ గాక పరికింప దంతి యగునె
విశ్వరూపంబుచేఁ దోఁచు విష్ణుమూర్తి
విష్ణుఁ డగుఁ గాక పరికింప విశ్వ మగునె. 102

తా. ఏనుగయొక్క రూపముననుండు వాహనము- ఏనుగగాక మ్రానైనభంగి విశ్వముయొక్క రూపమున గనబడు పరమాత్మ సర్వవ్యాపకమగు పరమాత్మయే యగును గాని విశ్వముగాడు.

ఉ. వారణ మంచు భ్రాంతుఁ డగు వానికి దారువు దోఁప దాక్రియన్
దారు వటంచు గాంచు విహితజ్ఞునకుం బరికింపఁ గల్గునే
వారణ మట్లు సర్వ మను వానికి బ్రహ్మము గానుపింప ద
ట్లూరక బ్రహ్మమందుఁ గను యోగికి సర్వము గల్గి తోఁచునే. 103

తా. మ్రానును జూచి యేనుగయని భ్రమజెందువానికి మ్రాను గనబడనిచందమున గనబడు ప్రపంచమంతయును జగమను తలంపుగలవానికి పరబ్రహ్మముదోపదు. దారువని నిశ్చయించువానికి యేనుగభ్రాంతి గలుగనిచందమున విశ్వమంతయును పరబ్రహ్మమని దలంచువానికి ప్రపంచము పరమాత్మయనియే దోచును.

వ. అనిన విని హనుమంతుండు సీతారామున కిట్లనియె. 104

సర్వము బ్రహ్మ మనెడి వానివర్తన మెట్లుండు ననుట.

క. మీరలు నుడివిన వడువున
నారసి సర్వంబు బ్రహ్మ మని కను ఘనుఁ డే
ప్రారబ్ధ వ్యవహారం
బేరీతిం జేయు దీని నెఱిఁగింపుఁ డనన్. 105

తా. మీరు బోధించునట్లు సర్వమును పరబ్రహ్మమని దలంచు మహనీయుల ప్రారబ్ధవ్యవహారాదికము లెట్లుండునో దెలుపవలసిన దని యాంజనేయుడు ప్రార్థించెను.

వ. అనిన శ్రీరామచంద్రుం డవ్వానరేంద్రున కిట్లనియె. 106

చ. ఘటకటకోర్మికాపటని కాయముల న్నవివేకదృష్టిచేఁ
దటుకున మృత్సువర్ణ జలతంతువు లంచు నెఱింగినంతఁ ద
త్స్ఫుటతరనామరూపములు పోవమి నన్నియుఁ గార్యకోటి కె
ప్పటివలె వచ్చు వచ్చినను బాధక మున్నదె హేతుదృష్టికిన్.107

తా. ఆంజనేయా! కడవలు, కడియములు, కెరటములు, వస్త్రములు వీని సమూహములను మన్ను సువర్ణముజలము దారము అని వస్తుతత్త్వజ్ఞానమున దెలియుటచే వానివాని యాకారములు చెడకుండుటవలన ఆయానామరూపాదులు కార్యములకు పూర్వమువలె వాడుట కుపయోగించు చుండును. ఇట్లువాడుకొన నుపయోగించిన నాఘటకటకాదులు మృత్సువర్ణాదులని దెలిసిన కారణదృష్టికి విరోధములేదు.

శా. ఆరీతిన్ సకలంబు తత్త్వ మని దివ్యాధ్యాత్మయోగంబుచే
నారూఢిం గనుయోగి కియ్యెడఁ దదీయాంగేంద్రియాత్మాళికిం
బ్రారబ్ధానుభవంబు గల్గునటు లొప్పారంగఁ దా ద్రష్ట యై
సారోదారవిచారదృష్టి నరయున్ సర్వంబు బ్రహ్మంబుగాన్.108

తా. ఇట్లు నామరూపాత్మక ప్రపంచమును బ్రహ్మమని అప్రాకృతమైన జీవేశ్వరైక్య జ్ఞానముచే నిశ్చయముగా దిలకించు బ్రహ్మవిదునకు- తన శరీరము, జ్ఞానకర్మేంద్రియమును బుద్ధి వీటియొక్క- తత్కాలికానుభవరూపప్రారబ్ధముయొక్క- అనుభవముగల్గునట్లుతోచిన యాబ్రహ్మవిదుడు ద్రష్టయై యాత్మానాత్మవిచారజ్ఞానముచే ప్రపంచకమంతయును పరమాత్మ స్వరూపముగానే దిలకించును.

శా. గానంబు న్నటనంబుఁ దాళగతులం గావించుచుంజారువి
ద్యానై పుణ్యముఁ జూపుచున్ శిరముమీఁదం గల్గు మెందొంతరం
బూనం గైకొను నాట్యశీలునిగతిన్ బుంఖానుపుంఖోజ్జ్వల
న్నానార్థానుభవజ్ఞుఁడయ్యు బుధుఁ డానందాత్ముఁగాంచున్ మదిన్.

తా. గానము నృత్యము తాళములయొక్క- గతులజూపుచు మనోహరమైన దశవిధగమక భేదములతో గానముసందలి నేర్పును జూపుచు తలపై కలశములధరించుటకు పూనుకొను నాట్యవిశారదునివలె తండోపతండములై వెలుంగు యింద్రియార్థములందలి సుఖానుభవమున్న వాడయ్యు సచ్చిదానందపరమాత్మను మనసున్న దిలకించును.

చ. స్వకృతవిచిత్రపట్టణ మసన్మయ మంచు నెఱింగి భ్రాంతి నొం
దక యిల నింద్రజాలకుఁడు దాని సృజించువిధంబున న్నిజ
ప్రకృతికృతప్రపంచము నభావముగా వినరించి కాంచి త
ద్వికృతులఁ జెందకే ఘనవివేకి యొనర్చు సమస్తకార్యముల్. 110

తా. గారడివాఁడు తనవిద్యచే నిర్మించిన నాశ్చర్యకరమైన పట్టణమును నిర్మింప గా భ్రాంతినొందక యది దబ్బరయని తెలిసికొనిన పగిది, బ్రహ్మజ్ఞాని గారడివాని చందమున తనమనస్సుచే గల్పింపబడిన పంచభూత వికారమగు ప్రపంచమును శూన్యముని తలంచి యట్టిమాయాకల్పితమగు ప్రాపంచిక షడ్విధ వికారములను జెందకయే వర్తమాన కార్యము లొనర్చుచుండును.

మ. శివజీవైక్యసమాధియందు విలసచ్చిన్మాత్రతత్త్వంబు దా
నవలీలం గని పూర్ణుఁడై పిదప మాయాసంస్సృతిం జెందినం
దవుల న్నేర్చునె యోగి పాలు పెరుఁగై ద్రచ్చంగ వే ఱైనయా
నవనీతం బిఁక జల్లలోఁ గలయునే నానాప్రకారంబులన్. 111

తా. శివజీవైక్యసమాధి యందు నుండి నిర్వనిర్వికల్ప విజ్ఞాన స్వరూపమైన యథార్థమగు పరబ్రహ్మమును తాను సునాయాసముగా సందర్శించి తాను బ్రహ్మమైన పిమ్మట మరల సంసారమును జెందినను యందలి వికారము లాతని నంటవు. పాలు పెరుగై చిలకబడి వెన్న తీయబడిన తరువాత యావెన్న మరల మజ్జిగలో గలియునా ?

తే. ప్రజ్వలత్పావకావృతపర్వతంబు
నాశ్రయించునె మృగవిహంగాదికములు
బ్రహ్మమయుఁడై ప్రకాశించు బ్రహ్మవిదుని
నంటునే పుణ్యపాపంబు లాంజనేయ.. 112

తా. కారుచిచ్చుచే చుట్టబడిన పర్వతమును జంతుపక్షిసముదాయము చేరనట్లు తత్వస్వరూపుడై యుండు బ్రహ్మవిదుని పుణ్యపాపము లంటవు.

కవిరాజవిరాజితము:—

తరణి సమస్తరసంబులఁ గ్రోలుచుఁ దద్రసనిష్ఠవికారములం
బొరయనిచందమున న్విషయంబులఁబొందుచుఁ దద్గుణదోషములన్

నిరతము నంటక యోగివరుం డతినిర్మలనిశ్చలమానసుఁ డై
పరమసుఖామృతవార్ధిని గ్రుంకుచుఁ బావనుఁడై విలసిల్లుఁదగన్.

తా. సూర్యుడు దనకిరణములచే వాపీకూప తటాకాదుల యందున్న జలము నింకించుచు వాటియందలి యడుసు నాచు మున్నగుదాని నంటని చందమున యోగిపుంగవుడు విషయములందుండియు వాని దోషములనంటక నిశ్చలచిత్తుడై సర్వోత్కృష్టమైనట్టియు పునరావృత్తిరహితమైనట్టియు నమృతసముద్రమున నోలలాడుచుండును.

తోదకవృత్తము:—

చారువివేకి యసార మహా సం
సారముఁ జెంది యసంగత నుండున్
నీరజపత్రము నీరము నే ప్రా
ద్దారయ నంటియు నంటనిభంగిన్. 114

తా. తామరాకునందలిజలము తామరాకునంటనిచందమున బ్రహ్మవిదుఁడు నిస్సారమైనదియు గొప్పదియునగు సంసృతినిజెందియు కూడికలేనివాడై యుండును.

ఆ. పావకుండు సర్వభక్షకుం డయ్యు ని
ర్దోషుఁ డైన భంగి దూరదర్శి
విషయరాగి యయ్యు వీతరాగియు నై వె
లుంగుచుండు ముక్త సంగుఁ డగుచు. 115

తా. అగ్ని సర్వమును భక్షించియు నిర్దోషుఁడైనట్లు బ్రహ్మవిదుఁడు యింద్రియార్థాపేక్షగలవాఁడయి సంగరహితుడై ప్రకాశించును.

తే. తనరు సాత్త్వికరాజసతామసములఁ
బొంది పొందఁడు నిర్గుణానందపరుఁడు
మంటిసెంటియు నంటక యొంటిమెలఁగు
విమలమృత్కీటకంబు చందమున ననఘ. 116

తా. మట్టిలోనుండు కుమ్మరపురుగు మట్టినంటక దిరుగునట్లు బ్రహ్మానందాపేక్షగల బ్రహ్మవేత్త ప్రకృతిస్వరూపముగల త్రిగుణవికారముల నంటియు నంటక యుండును.

చ. పరపురుషానురక్తి గల భామిని యెల్లపనుల్ గృహంబునం
బొరిఁబొరిఁ జేయుచుం బ్రియుని పొందు సుఖంబుగఁ జూచురీతి భా
స్వరపరతత్త్వవేది నిజ వర్ణనిజాశ్రమయోగ్యధర్మముల్
నిరతము సల్పుచుం బరమ నిర్మలసౌఖ్యము గాంచు నెమ్మదిన్. 117

తా. పరపురుషునియం దాసక్తిగలకాంత యింట నన్నిపనులను క్రమముగా జేయుచు జారునిసాంగత్యము సుఖముగాదలంచుచందమున పరబ్రహ్మమును దెలిసిన బ్రహ్మవేత్త తనవర్ణాశ్రమములకు దగు పుణ్యకర్మము లాచరించుచు స్వస్థచిత్తుడై నిర్మలుఁడై త్రిమలరహితుఁడై బ్రహ్మానందము ననుభవించును.

వ. అట్టి మహానుభావుండు ప్రారబ్ధవశంబుచే స్వవర్ణాశ్రమోచితధర్మంబులయందుఁ బ్రవర్తించుసమయంబున. 118

ద్విరదగతిరగడ. మొదలు సరిగాఁగఁ గను మోదమును ఖేదమును,
వదలుకొనియుండుఁ బర వాదమును భేదమును। గలఁకపడిసల్పఁడు
వి కర్మమును గర్మమును, దలఁపఁ డొకయించుక య ధర్మమును
ధర్మమును। మఱలుకొని చేయఁ డభి మానమును మానమును,
మఱచియును మానఁ డతి వమానమును జ్ఞానమును। గ్రందుకొని
పొందఁడు సు కాంతలను వింతలను, జెందఁ డతిదుర్విషయ చింత
లను వంతలను। సొలయక జయించు నతి సుప్తియు నసుప్తియును,
దెలిసి కను నాత్మసుఖ తృప్తియును జ్ఞప్తియును। లౌల్య మతి
దాల్పఁడభి లాషమును వేషమును, దుల్యముగఁ గాంచు ఘన
తోషమును రోషమును। జెలులపై నుంచఁ డిల స్నేహమును
మోహమును, దెలియఁ డిది సత్యమని దేహమును గేహమును।
విరసముగ నెంచునల విత్తముల మొత్తముల। సరసముగ నెంచు
మది సత్తములఁ జిత్తముల। భ్రమ గొని భజింపఁ డిలఁ పౌత్రు
లను బుత్త్రిలను, సమముగ దలంచు నురు శత్రులను మిత్రులను।
గర మఖిలపింపఁడొక కల్మియును బల్మియును, సిరి యనుకొనఁడు

బుధుల కె చెల్మియును దాల్మియును। నడలఁ డొకయింతయును కె
శాంతియును, ధాంతియును గడకరుగనీఁడు ముఖకెకాంతియును ఘశాం
తియును। బ్రాపనుచుఁ జూచు గురుకెభక్తియు విరక్తియును, నోపిక
నెఱుంగు శ్రుతికెయుక్తియును ముక్తియును. 119

తా. అట్టిసమయములందు వాంఛితార్థము లభించుటచే గల్గుసంతోషమును లభిం పనినిగల్గు దుఃఖమును తత్కారణమగు మనస్సుచే సమముగాక ఇతరుల మతవాద ములను విని బ్రహ్మవ్యతిరిక్తము గలదను భేదబుద్ధిని విడచును. వేదశాస్త్రదూషితమైన కర్మమును వేదాది విహిత కర్మములని మనశ్చలనమును పొందిసేయడు. మేళ్లు కీళ్లు కొంచె మైనను సమముగా జూచును భేదబుద్ధిగల్గియుండడు, సతీసుతాదులు తనవారను బుద్ధిని పంచకోశమయమగుశరీరము నేనుయంతఃకరణ వృత్తియు దద్వృత్త్యతిశయమునందు సంతో షమును తద్వృత్తినాశనమునందు శోకమును జెంది తద్వృత్తియందాసక్తిగలవాఁడై యేమి యు జేయకుండును, మౌనమును బ్రహ్మజ్ఞానమును యేమరుపాటున నేని విడువడు. 14 యింద్రియములను స్త్రీలను, యింద్రియవిషయములను ప్రకృతివికృతుల యలజడినొంది త్వరపడడు. కామక్రోధాదిసంకల్పములను, వానిచేగల్గు దుఃఖములను బొందడు. ఆవరణ జన్యమగు నిద్రావస్థను, విక్షేపశక్తిచేజనించిన జాగ్రిదవస్థను స్థిరబుద్ధితోజయించును. ప్రత్య గాత్మసంబంధమగు ఆనందానుభవముచే గల్గు తుష్టిని ఆత్మవిజ్ఞానముచే తెలిసి పొందు చుండును. చలచిత్తము గల్గినవాఁడై వాంఛలను, ఆడంబరవేషములను వైకొనడు. ఆనంద మును క్రోధమును సమముగా దిలకించును. స్థిరవసతులయెడలను మిత్రులయెడలను ఆసక్తి యు, స్నేహమును గల్గియుండడు. పంచకోశాత్మకమగు దేహమును గృహముగా నిశ్చ యముగా నెఱుంగును. ధనమును, బాంధవులను విరోధులుగా దలంచును. బ్రహ్మనిష్ఠ లను, సాక్ష్యనుసంధాననిష్ఠలను నొక్కటిగాదలంచును. సుతులయందును మనుమల యందును వ్యామోహము జెంది వారిలో జేరడు. హితులను విరోధులను సమముగా దిల కించును. ఐశ్వర్యములకాంక్షింపడు. బ్రహ్మజ్ఞానులస్నేహమును సాంగత్యమును పరమయి శ్వర్యముగా దలంచును. శుద్ధసత్వవృత్తిని, యింద్రియనిగ్రహమును విడువడు, ఆత్మస్ఫుర ణమును శాంతమును సహనమును తొలగనీయఁడు, తనకు బ్రహ్మజ్ఞాన ముపదేశించిన గురునియెడల విశ్వాసముంచును, త్రిగుణాత్మకమగు ప్రకృతిని నిరాకరించుటయే దనకు దగిన పోద్బలమని నమ్మియుండును. వేదాంతమహావాక్యములయందలి జీవబ్రహ్మైక్య యోగమును, జీవన్ముక్తిని విదేహముక్తిని సహనభావమున తెలిసికొనుచుండును.

వ. అని మఱియు నిది శాస్త్రోక్తప్రకారం బింక ననుభవంబు వినుము.

మ. తలఁపన్ గాఢవిరక్తియున్ స్ఫుటతరాద్వైతాత్మవిజ్ఞాన ము
జ్జ్వలసర్వేంద్రియమానసోపరతియున్ సంపూర్ణమై నిత్యమున్
వెలయంగాఁ దనుఁ గాంచు కేవలునకున్ విశ్వంబు చూపట్టునే
కలలోఁ గన్నగజంబు మేలుకొనినం గన్పట్టునే మారుతీ. 121

తా. వత్సా! అవ్యక్తమహదహంకారాదితత్త్వముల తిరస్కరణ బుద్ధియు, సంపూర్ణముగా వికసించినట్టిదియు, అద్వితీయమయినదియునగు పరబ్రహ్మమును బాగుగ నెఱుంగదగిన యెఱుకయును పరిశీలించు 10 ఇంద్రియములయొక్కయు మనస్సుయొక్కయు బ్రహ్మమున జేరుటయు సమస్తకాలములయందు సంపూర్ణముగా ప్రకాశింప దన్ను జూచు బ్రహ్మవేత్తకు స్వప్నమందు చూచినయేనుగ జాగ్రత్తునొందగా గనబడని చందమున గనబడదు.

## బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠుల లక్షణము.

వ. ఇంక నొక్కవిశేషతాత్పర్యంబు వివరించెద నాకర్ణింపుము, బ్రహ్మవిదుండు బ్రహ్మవిద్వరుండు బ్రహ్మవిద్వరీయుండు బ్రహ్మవిద్వరిష్ఠుండన మత్స్వరూపతత్త్వజ్ఞులు నలువురు గల రందు దేహేంద్రియాదికర్తృత్వంబును గర్మఫలకాంక్షయు లేక నిత్యనైమిత్తికంబులైన యజ్ఞదానతపఃప్రముఖవైదికకర్మంబుల యథావిధిగా నాచరించుచుఁ గామ్యకర్మంబుల విడిచి శాస్త్రగర్హితంబులు గాని లౌకికకర్మంబుల యథోచితంబుగా నొనర్చుచుఁ బుత్రమిత్రకళత్రవిత్తక్షేత్రాదుల యందు వైరాగ్యంబు గలిగి యదృచ్ఛాలాభసంతుష్టుండుఁ గామరాగద్వేషభయలోభమోహ మదమత్సరాది నానావిధచిత్తవికారరహితుండు సతతవిజితశరీరేంద్రియప్రాణాంతఃకరణుండు నిరహంకారుండు నిత్యప్రసన్నచిత్తుండుఁ బరమకారుణికుండుఁ బరమశాంతుండు జ్ఞానవిజ్ఞానసంపన్నుండు నంతస్సుఖుండు నంతరారాముండు నంతఃప్రకాశుండు నాత్మరతుండు నాత్మతృప్తుండు నాత్మసంతుష్టుండు నై సంచరించుచుండు బ్రహ్మవిదుండు, మఱియు సకలవైదికలౌకికకర్మంబుల విధిపూర్వకంబుగా సన్న్యసించి పూర్వోక్తలక్షణంబుల విల

సిల్లి సంప్రాప్తదుఃఖంబుల ద్వేషింపక నివృత్తసుఖంబులఁ గోరక ప్రకాశవృత్తిమోహంబుల నుదాసీనునిచందంబునఁ జూచుచు సుఖదుఃఖమోహాదికార్యాకార్యగుణంబులయందుఁ జిత్తేంద్రియాది వికారకారణగుణంబులు ప్రవర్తించుచుండ వానిచేతం జలింపఁజేయంబడక నిశ్చలుండు సమదుఃఖసుఖుండు స్వస్థుండు సమలోష్టాశ్మకాంచనుండుఁ దుల్యప్రియాప్రియుండుఁ దుల్యనిందాస్తోత్రుండుఁ దుల్యమానావమానుండుఁ దుల్యశత్రుమిత్రపక్షుండు సంపరిత్యక్తసర్వారంభుండు నగు గుణాతీతుండు బ్రహ్మవిద్వరుం డనందగు, మున్ను వివరించిన గుణంబు లన్నియుఁ బ్రకాశించుచుండ సంతతసహజామనస్కరాజయోగనిష్ఠాగరిష్ఠుండై యెడనెడఁ బరులవలన మేలుకొలుపంబడి కించిదాహారంబుగొనుచు సుప్తుండైనవాని తెఱంగున విశ్వంబు మఱచి యుండునతండు బ్రహ్మవిద్వరీయుండు, దనవలన నొరులవలనఁ బునరుత్థానంబు లేక బాహ్యాభ్యంతరంబులు మఱచి నిరంతరనిర్వికల్పసమాధినిష్ఠుఁడై పరిపూర్ణప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుం డై వెలుంగు నతండు బ్రహ్మవిద్వరిష్ఠుం డనందగు, నందు మొదలియిరువురకుఁ బ్రారబ్ధంబు దోఁచియు మిథ్యాభూతంబైయుండు, వరీయునందుఁ గలిగియు లేకుండు, వరిష్ఠున కేమాత్రంబు లేదు గావున నిమ్మహానుభావులయనుభవంబులు నీ వడిగినప్పటినుండి యేర్పఱచి చెప్పితిఁ గాదే యని వెండియు ని ట్లనియె. 122

తా. మరియొక విశేషము తెలిపెదనాలకింపుము. నన్నెఱిగినవారు 4 తెరంగుల నుందురు. 1. బ్రహ్మవిదుఁడు 2. బ్రహ్మవిద్వరుఁడు 3. బ్రహ్మవిద్వరీయుఁడు. 4. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

1. బ్రహ్మవిదుఁడు. దేహేంద్రియాది కర్తృత్వమును యిహపరలోక ఫలవాంఛయులేనివాఁడును నిత్యనైమిత్తికముల నాచరించువాఁడును. కామ్యములవిడచి, శాస్త్రనిషిద్ధములు కాని కర్మలొనరుచ్చు, పుత్రమిత్రకళత్రాదులందు వైరాగ్యముకలవాఁడై

యాదృచ్ఛికముగా గలిగినలాభమునకు సంతోషించువాడును, రాగాదుల జయించినవాడును శరీరేంద్రియములను జయించిన వాడును, అహంకారములేనివాడును, ఎల్లప్పుడు ప్రసన్నుఁడగువాడును దయాయుతుండును, శాంతియుతుండును జ్ఞానియు, అంతస్సుఖ మనుభవించువాడును, అంతఃప్రకాశముగలవాడును సంతృప్తిఁహించిన ఆత్మగలవాడును, నిత్యసంతుష్టుడు నైనవాడును నైయుండును.

2. బ్రహ్మవిద్వరుఁడు:—సమస్తలౌకికకర్మలను శాస్త్రక్రమమున బ్రహ్మవిదుని లక్షణములుగల్గి దుఃఖములద్వేషింపక జరిగిపోయిన సుఖముల మరల నపేక్షింపక అహంకారసంబంధములగు విషయచాంచల్యముల సాక్షియై వడి దిలకించుచు సుఖదుఃఖమోహాదుల చిత్తమునుచలింప నీయక నిశ్చలుఁడై ద్వంద్వములనోర్చి స్వస్థమైన మనస్సుగలవాడును, మట్టిని బంగారును సమముగాజూచువాఁడై నిందాస్తోత్రములందుదాసీనుఁడై మానావమానముల నోర్చువాఁడును శత్రుమిత్రులు లేనివాడు, సమస్తప్రయత్నముల వదలినవాడును, త్రిగుణాతీతుడును, అగువాడై యుండును.

3. బ్రహ్మవిద్వరీయుడు పైజెప్పినలక్షణములుగల్గి ఎల్లప్పుడును అమనస్కరాజయోగాభ్యాసుడై అపుడపుడు పరులచే ప్రబోధితుఁడై కొలదిగాభుజించుచు లోకమును మరచియుండువాడునై యుండును.

4. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు:—తనవలనగాని పరులవలనగాని ప్రబోధములేక బాహ్యాంభ్యంతరములు మరచి నిరంతరనిర్వికల్పసమాధినిష్ఠుఁడై పరిపూర్ణమైనట్టియు, అఖండమైనట్టియు, పరబ్రహ్మచైతన్యప్రకాశము మాత్రముగలవాఁడై వెలుంగుచుండును.

వీరిలో మొదటియిరువురకును ప్రారబ్ధంబుదోఁచియు మిథ్యాభూతమైయుండును. వరీయునందు కలిగియు లేకుండును. వరిష్ఠున కేమియులేదు. వీరి యనుభమునుగూర్చి నీవడిగితివి గావున నింతవరకు విస్తరించితి నింకను వినుమని యిట్లనియెను.

## వైరాగ్యబోధోపరతులతారతమ్య కారణమాపకార్యవిచార ప్రకారము.

తే. అతులవైరాగ్యబోధోపరతులు మూఁడు
గలవు తారతమ్యంబుల కే నలువురకును
సుఖము లారీతి నించుమించులుగ నలరు
గాని కేవలమోక్ష మొక్కటియె వత్స. 123

తా. వత్సా! పై నలువురకును ఇహపరలోకవిరక్తి బ్రహ్మజ్ఞానము తన్మయత్వసిద్ధి యెక్కువతక్కువలచే నున్నవి. వారి యానందము ఎట్లు ప్రకాశించినను ముక్తియొక్కటే యగును.

తే. అతులవైరాగ్యబోధోపరతులు యతుల
మతుల నెడఁబాయ వన్యోన్యగతుల నెనసి
సూటిఁ దప్పి యొకానొకచోట నొండు
రెండు ప్రతిబంధవశమున నుండు ననఘ. 124

తా. వత్సా! సాటిలేనివగు పాశవిరక్తియు ఆత్మజ్ఞానము మనోవిలయము యీ మూఁడును ఒకదానినొకటి అనుసరించుటవలన మానసేంద్రియముల ప్రజ్ఞల నెడబాయవు, వీదో యొక యడ్డుతగిలిన యెదోయొక స్థలమందు, వైరాగ్యబోధోపరతులయందు ఒకటిగాని రెండుగాని యుండును.

తే. వీనిలో బోధ మెక్కుడ్డౌజ్ఞానమునకు
గడమ రెండును దగ సహకారు లరయ
వరుస నీమూఁడు గలిగినవారలకును
గరతలామలకంబు మోక్షంబు వత్స. 125

తా. ఇందు వైరాగ్యబోధోపరతులలోపల అపరోక్షజ్ఞానమధికము. బ్రహ్మజ్ఞానమునకు మిగిలిన వైరాగ్యోపరతులు రెండును సహకారులు. కాన యీమూటిని కలిగిన వారలకు ముక్తి కరతలామలకము.

క. అక్షరతత్త్వజ్ఞానము,
సాక్షాన్మోక్షప్రదంబు సంసారికదుః
ఖక్షయకర మగుఁ దక్కిన,
లక్షణములు సుఖకరములు లలితాత్ములకున్. 126

తా. నిర్మలులకు పరబ్రహ్మమును నిక్కముగా నెఱుంగదగిన యొఱుక ప్రత్యక్షముగా ముక్తినొసంగునదియు ప్రకృతివికృతిరూప సంసారబంధమువలనగలుగు దుఃఖతాపత్రియాదుల నశింపజేయునదియునై యున్నది. తక్కిన వైరాగ్యోపచిహ్నములానందమును గలుగజేయునవియై యున్నవి.

క. కారణము దోషదృష్టియె,
వైరాగ్యమునకు జహాసపరరూపము సం
సారికసుఖముల మరలం,
గోరక యుండుటయె సుమ్ము గురుకార్య మగున్. 127

తా. ప్రకృతివికృతి సంగపరిత్యాగమునకు త్రిదోషవికారములు గలవని యెఱుంగుటయే కారణము, ప్రకృతిద్వయమును విడచుటయే శ్రేష్ఠమైనది. ప్రకృతిద్వయముచే గలుగు సంసరణాదివాంఛావిరక్తియే ప్రయోజనము.

మ. శ్రవణాదిత్రితయంబు కారణ మసత్సత్సంవిభాగంబు శు
ద్ధవిబోధంబునకుం స్వరూపమున నాత్మస్వాత్మతాదాత్మ్యసం
భవరాహిత్యము కార్య మా యమముఖాభ్యాసాత్మధీనిగ్రహ
వ్యవహారక్షయము ల్తలంప నుపరత్యాదిస్వరూపార్థముల్. 128

తా. నిర్మలమైనట్టి పాశరహితమైనట్టియు అపరోక్షజ్ఞానమునకు వేదాంతమును వినుట మొదలగు 3 పనులును హేతువులగును. ప్రకృతియొక్కయు, పరబ్రహ్మము యొక్కయు సంవిమర్శనమును ఆకారమును ప్రకృతికిని, పరమాత్మయైన తనకును, నైక్యము కలుగకపోవుట కార్యమగును. అనునస్కమున జెప్పబడిన అనుష్ఠానమును మనస్సుయొక్క నిశ్చలవృత్తియొక్క వ్యవహారక్షయములు యోచింపగా చిత్తలయముయొక్క కారణము స్వరూపమును కార్యమును అగును.

శా. వైరాగ్యంబు దృఢంబుఁ జేసి పరతత్త్వజ్ఞాన మార్జించి స
ర్వారంభోపరమంబుఁ గైకొని తుకీయం బంది యీశ్రీ యో
గారూఢుం డగువానికిం గలుగునే యాగామియు న్సంచిత
ప్రారబ్ధంబులు సంతతంబును పరబ్రహ్మాత్ముఁడై యుండఁగాన్.

తా. విరక్తిని దృఢముచేసినవాడును, బ్రహ్మమును దెలియదగు తెలివిని సంపాదించినవాడును, కార్యోపరతిగలవాడును, త్రిశరీరాభిమానములవదలినవాడును శివజీవైక్యమున నిశ్చలముగలవాఁడును అగు మానవునకు భవిష్యను ననుభవించుటకై యీజన్మ నొనర్చిన కర్మములుగాని తొల్లిటిజన్మపరంపరలనొనర్చిన కర్మములు గాని యంటవు.

వైరాగ్యశబ్దార్థవిమర్శనము.

క. వైరాగ్యం బింతటికిని,
గారణ మానందకరము గావున నది చే
కూఱిన సమస్తమును సమ,
కూరుం దనుదాన పరమగుహ్య మిది సుతా. 130

తా. వత్సా! సమస్తమునకు విరక్తి హేతువును బ్రహ్మానందమును గూర్చునదియు నై యున్నది. అట్టి విరక్తిగల్గిన బోధోపరతులతో సమస్తమును లనంతటతానే సమకూడును.'

వ. అది యెట్లనిన వినుము, మూలప్రకృతి యాలవాలంబు సుఖదుఃఖంబులు ఫలంబులు త్రిగుణంబులు మూలంబులు ధర్మార్థకామమోక్షంబులు రసంబులు పంచేంద్రియంబు లూడలు షడూర్ములు స్వభావంబులు సప్తధాతువులు పొరలు అష్టప్రకృతులు విటపంబులు నవరంధ్రంబులు కోటరంబులు దశవిధప్రాణంబులు పత్రంబులు శబ్దాదివిషయంబులు పల్లవంబులు రాగద్వేషాదు లుపశాఖలు నానావిధకర్మంబులు పుష్పంబులు జీవేశ్వరులు పక్షులుగాఁ గలిగి మందిరారామక్షేత్ర పుత్రమిత్రకళత్రబంధుమధ్యస్థద్వేష్యజన తీక్ష్ణదుష్కంటకతరుగుల్మలతాసంకీర్ణంబుఁ గామాదిచోరదుస్సంచారంబు రోగవ్యాఘ్రభయంకరంబు దుఃఖదావానలసమావృతంబు మృత్యుసింహభయగ్రస్తంబు జరాపిశాచసమన్వితంబు దైన్యపర్వతసంకటంబు దురితరాక్షసఘోరంబుఁ దృష్ణాభీకరకాకోదర సమాకులంబు హర్షామర్షజంఝానిల దూషితంబు స్వర్గ నరక దుర్మార్గ తిరోహితాపవర్గసన్మార్గంబు నైన మహాదుఃఖారణ్యంబునం గాడుపడి పుణ్యాపాపవిధేయుండై జీవుం డంతటం దిరిగి తిరిగి చీకాకుపడి యెచ్చోట విశ్రాంతిఁ గానక విసివి ముందరఁ గాంచి యనంతం బని వెనుకఁ జూచి సనాది యని గలయం గనుంగొని యసాధ్యం బని తెలిసి మహాగాఢదుఃఖ భయ శోక వ్యాకులిత చిత్తుండుఁ దాపత్రయాదిత్యప్రదీప్తాతపసంతప్తుఁడు నై యంతట నిరంతర నితాంతాగమచ్ఛాయల నాశ్రయించి స్రక్చందనవనితాధనధాన్యపశుసంతానశయ్యాని కేతనోద్యానప్రముఖ విషయసంపాదనసాధనంబు లైన కృషి వాణిజ్య సేవా యాచ్ఞాది లౌకికకర్మంబులఁ బరిహరించి స్వర్గాదిసత్యాంతపరలోకవిషయసుఖ

సాధనంబు లైన నిత్యనైమిత్తికాదికర్మంబులు ఫలకాంక్ష చేతఁ జేయక పరమేశ్వరార్పణంబుగా నాచరించి యప్పరమేశ్వరానుగ్రహంబువలనఁ బరిశుద్ధహృదయుం డై యమానిత్వ మదంభిత్వ మహింస యార్జవంబు క్షాంతి యాచార్యోపాసనంబు శౌచంబు స్థైర్యం బాత్మవినిగ్రహం బింద్రియార్థంబుల వైరాగ్యం బనహంకారంబు జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనంబుఁ బుత్త్రదారగృహాద్యనాసక్తి యనభిష్వంగంబు నిత్యేష్టానిష్టోపపత్తిసమచిత్తత్వంబు మదనన్యయోగనిశ్చలభక్తి వివిక్తదేశసేవిత్వంబు జనసంగాసక్తివివర్జనంబధ్యాత్మజ్ఞాననిత్యత్వంబుఁ దత్త్వజ్ఞానార్థదర్శనం బను వింశతిగుణంబులెప్పుడు సంగ్రహించు నప్పు డాత్మబ్రహ్మైక్యసాక్షాత్కారవిచారాధికారి యగు నింతవట్టుం గూడి వైరాగ్యశబ్దంబునకుఁ దాత్పర్యార్థం బింక బోధస్వరూపం బెఱింగించెద నాకర్ణింపు మని యిట్లనియె. 131

తా. ఆంజనేయా! రహస్యమెట్టిదో దెల్పెద నాకర్ణింపుము. సంసారవృక్షము అవ్యక్తమనుపాదు, సుఖదుఃఖములనుఫలములు, గుణత్రియములను వేళ్లు చతుర్విధపురుషార్థములే మధురాదిరసములుగను, చెవులు చర్మము కండ్లు జిహ్వానాసికలే యూడలుగను, ఆశ, తృష్ణశోక, మోహజరామరణములే సహజములుగను, చర్మమాంసరక్త మేదస్సు అస్తిస్నాయువులే పట్టలుగను, భూజలాగ్నివాయుగగనమానసు అహంకారములు కొమ్మలుగను, నవద్వారములే కోటరములుగను, 10 విధములగు ప్రాణవాయువులే ఆకులుగను 14 యింద్రియవిషయములే చిగురాకులుగను, 14 యింద్రియవృత్తులే యుపశాఖలుగను, వివిధకర్మములే పుష్పములుగను, జీవేశ్వరులే పక్షులుగను గలదియై యున్నది. అట్టి సంసారమునందున్న జీవుడు తోట దొడ్డి సతిసుతులు మిత్రులు శత్రుమిత్రత్వము లేనివారు, విరోధులు అను వాడిముండ్లుగల వృక్షములచేతను పొదలచేతను తీగలచేతను నావరింపబడినదియును, భోగాసక్తమున్నగు దుర్గుణము లనుచోరులయొక్క దుష్ప్రవర్తనగలదియు వ్యాధులను పులులచే భయంకరమైనదియును, శోకదవానములచే నావరింపబడినదియు మరణమను సింహముచే మ్రింగబడినదియు, జరాభూతముతో గూడియున్నదియు, దారిద్ర్యమను పర్వతములచే నిరుకైనదియు, పాపములను రాక్షసులచే భయదమైనదియు, ఆశయను కాకోదరసర్పముల కలతపెట్టబడినదియు సంతోషతామసములను

పెనుగాలిచే నిండింపబడినదియు స్వర్గనరకములనెడి తప్పుతోవలచే నిరుకైనదియు, మోక్షమను సన్మార్గము గలదియునైన ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములను వ్యసనము లుగల యటవియందు దారితప్పి సుకృతదుష్కృతములకులోబడి నలుకెలంకులదిరిగి దిరిగి వ్యాకులతజెంది యెందునను సౌఖ్యములేక ముందునకుజూచి తుదలేనిదియును, వెనుకకు జూచి మొదలులేనిదియు, (తుదమొదలెఱుంగలేక) తలంచి మిగులవ్యసనమును జెందిన వాఁడై తాపత్రయంబను సూర్యాతపంబున గాల్చబడినవాఁడై నిరంతరమధికవికాసముగల కామికాద్యాగమములను తరుచ్ఛాయల నాశ్రయించి, పూవులు చందనము స్త్రీలు ధన ధాన్యములుమున్నగువాని యొక్కసంపాదనమునందు సాధనములగు సమస్తలోకవ్యవహా రములను వదలి స్వర్గముమొదలు సత్యలోకపర్యంతముఁగల పరలోకభోగములకు సాధన ములైన నిత్యనైమిత్తికాదికర్మలను ఫలకాంక్షతో నొనర్పక బ్రహ్మార్పణముగావించుచు నిర్మలచిత్తుఁడై తన్ను దాస్తుతించుకొనుట తనధర్మముల ప్రకటింపక హింససేయక సత్ప్ర వర్తనము శాంతము గురుచరణరాజీవసేవ, బాహ్యాంభ్యంతరపరిశుద్ధి సుస్థిరస్వభావము మనోజయము, శబ్దస్పర్శాదులగు 14 యింద్రియములయందు విరక్తిగలిగినదని గర్వింపకుం డుట జననమరణజరావ్యాధిదుఃఖములను బొందక, సతీసుతాదులయందును గృహారామ ములయందును యిష్టములేకుండుట అనన్యాత్మభావనాలక్షణమగు యాసక్తి విశేష ములేకుండుట ప్రాప్తములయందు సమబుద్ధినుంచుట తనకంటె నితరములేదను ధ్యానమున స్థిరభక్తినిల్పుట జనావాసముల బాసియుండుట కోర్కెలను త్యజించుట బ్రహ్మజ్ఞాన మందును, నిరంతరభావమోక్షజ్ఞానమునందును, ప్రయోజనదృష్టి అను 20 లక్షణముల నెప్పుడు పొందునో యపుడు పరబ్రహ్మముయొక్క చేరికనుమర్మజ్ఞానముచే నొనర్ప గల్గిన యధికారియగు. ఇయ్యది వైరాగ్యశబ్దార్థము. ఇంకమీదట బోధశబ్దార్థమెఱిగించెద నాలింపుము అని యిట్లు చెప్పనారంభించెను.

బోధశబ్దార్థవివరణము.

తే. అట్టి సుగుణాభిరాముఁడశాన్త్యర్తితోడ
శాంతచిత్తుండుఁ గారుణ్యైకసాగరుండు
జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడైనగురుని
వినయభయభక్తు లమర సేవించు నసఘ. 132

తా. పైనుదాహృతగుణయుతుండు పరితాపముతో సత్త్వవృత్తితోఁగూడిన మన స్సు గలవాడును, దయాయుతుండును త్వత్పదత్వంపదార్థ పరిజ్ఞానియు, బ్రహ్మజ్ఞానియు అగు గురుని వినయమునను భక్తితోడను యుపాసించుచు.

గురువే పరబ్రహ్మమని బోధించుట.

క. గురుఁ డజుఁడు గురుఁడు విష్ణుఁడు
గురుఁడు మహాదేవుఁ డఖిల ◌ గురుఁడు గురుఁడు స
ద్గురుఁడె పరబ్రహ్మం బని
గురుని నుపాసించు నతఁడు ◌ గురుతరభక్తిన్. 133

తా. గురుఁడు బ్రహ్మ, ఉపదేశకుఁడు, విష్ణువు, ఆతఁడే శివుడు ఆతఁడే తండ్రి అట్లగుటవలన ఆచార్యుఁడె ప్రకృతికి పరమయిన పరమాత్మయని సేవింపవలయును.

గురుశుశ్రూష ముఖ్యంబని చెప్పుట.

సీ. గురుపదాంభోజముల్ ◌ గొలువక గల్గునే
ప్రవిమలవైరాగ్య◌భాగ్యమహిమ
గురుపాదతీర్థంబుఁ ◌ గ్రోలక కల్గునే
జ్ఞానవిజ్ఞానయో◌గానుభవము
గురుసుప్రసాదంబుఁ ◌ గొన కున్నఁ గల్గునే
ప్రతిలేని చిత్తోప◌రతిసుఖంబు
గురుతత్త్వమాత్మఁ గ◌న్గొన కున్నఁ గల్గునే
నిరతిశయం బైన ◌ పరమపదము
తే. అట్లు గావున విద్యార్థి ◌ యైనయోగి
వినయభయభక్తు లెదలోనఁ ◌ బెనఁగొనంగ
నలచతుర్విధ శుశ్రూష ◌ లాచరించి
కొనుచు ననిశంబు గురువులఁ ◌ గొలుచు నలఘు. 134

తా. గురుపాదపద్మములను సేవింపకుండ అత్యంతనిర్మలమగు వైరాగ్యమను మహాభాగ్యము గలుగునా? శ్రీగురుపాదతీర్థమును త్రావకున్నయెడల మంచిచెడ్డల విమర్శించు జ్ఞానమును, అపరోక్షజ్ఞానయోగానుభవమును లభించునా? గురుప్రసాదమును పైకొనకున్నయెడల సమానరహితమగు చిత్తవిశ్రాంతివలనగల్గు యానందము గల్గునా? పరబ్రహ్మస్వరూపమును ఆత్మయందు గనుగొనజాలకున్నయెడల సత్యోత్తమమయిన మోక్షపదము లభించునా? కావున మోక్షాపేక్షగలవాడు గురునియెడల భయభక్తులు

గలవాడై, గురువునకు చతుర్విధ శుశ్రూషలసల్పుచు యెల్లప్పుడును గురువులను సేవించుచుండును.

క. వారలయుపదేశముచేఁ
దారకసాంఖ్యామనస్కసతత్త్వాత్మక మా
శ్రీరాజయోగమార్గం
బారూఢముగా నెఱుంగు నంతట ననఘా. 135

తా. ఆగురువులయొక్క యుపదేశముచే తారకయోగ సాంఖ్యయోగ అమనస్కయోగములే నిశ్చయమైన స్వరూపముగా గలదియును, శుభదమైనదియు, తేజోవంతమైనదియు నగు జీవబ్రహ్మైక్యముయొక్క మార్గమును నిశ్చయముగా నెఱుంగును.

మహావాక్యార్థవివరణము.

మ. క్రమ మొప్పార నహంపదంబునకు నీకాయేంద్రియప్రాణచి
త్తమనోహంకృతిబుద్ధిరూపజడజాతం బెల్ల వాచ్యార్థ మా
ద్యము సచ్చిత్సుఖరూప మై తనరు శుద్ధప్రత్యగాత్మ ప్రకా
శము లక్ష్యార్థము వేదశాస్త్రగరహస్యం బింత నిక్కంబగున్. 136

తా. ఆవాచ్యార్థలక్ష్యములు వరుసగా నాద్యంతములైన అకారహారములందు గోప్యముగా నుంచబడిన సమస్తాక్షరములును, వానితో నేర్పడిన మాటలు, మాటలచేనైన వాక్యములు, వాక్యములుగల స్మృతి శృతి పురాణేతిహాసములు వీటి నన్నిటినిగల్గియున్న అహం అనుశబ్దమునకు స్థూలశరీరము, 10 యింద్రియములు 5 ప్రాణములు, చిత్తము, మనసు, బుద్ధి వీనిస్వరూపమైన అజ్ఞానవృత్తులసమూహము వాచ్యార్థమును ప్రధానమైనదియును, సత్యజ్ఞానానందస్వరూపమైనదియును నిర్మలమైనదియు, లక్షణమైనదియు నగు ఆత్మప్రకాశమే లక్ష్యార్థము. అని తెలియుట వేదాంతరహస్య మెఱుంగుట.

క. సర్వము వాచ్యార్థము త
త్సర్వాధిష్ఠానశుద్ధ చైతన్యము చి
త్పూర్వకలక్ష్యార్థంబు సు
పర్వవినుత! వినుము బ్రహ్మ పదమున కరయన్. 137

తా. బ్రహ్మశబ్దమునకు పిండాండమాది సదాశివ మాయాండమువరకుగల సకలమును వాచ్యార్థము, ఆ పిండాండమాది మాయాంతమువరకు ఆధారమైనది, శుద్ధప్రకృత్యతీత

మైనది, సచ్చిదానందములు, జ్ఞానస్వరూపపరబ్రహ్మమే మొదలుగాగల ర లక్షణములచే బొందదగినవస్తువు.

తే. ఉభయవాచ్యార్థములతోడ ‡ నొప్పుచున్న
యుభయలక్ష్యార్థముల కైక్య ‡ మొదవ దట్లు
గాన వాచ్యార్థముల రెంటిఁ ‡ గడకుఁ ద్రోచి
యెనయ లక్ష్యార్థమొకటిగా ‡ నెఱుఁగవలయు. 138

తా. అహం పదవాచ్యార్థమైన శరీరేంద్రియాంతఃకరణాది భేదములతో, బ్రహ్మపద వాచ్యార్థమైన పిండాండము మొదలు మాయాండమువరకుగల యంతరములతో వెలుంగు ప్రత్యగాత్మకును సచ్చిదానంద నిత్యనిర్మలాఖండరూపమైన పరమాత్మకును కూడికలు గుదురవు. కావున అహం పదవాచ్యార్థమైన బుద్ధ్యాదులును, బ్రహ్మపదవాచ్యార్థమై పిండాండాది మాయాండమువరకుగల శరీరములను వానియందు ప్రతిబింబించు జీవేశ్వరులను వదలి అహం పద లక్ష్యార్థమయిన పరబ్రహ్మకూటస్థుల నేకముగా దెలియవలయును.

వ. అది యెట్లంటేని.

సీ. అద్వితీయప్రత్య ‡ గాత్ముండ నగు నేను
బరిపూర్ణ నిర్గుణ ‡ బ్రహ్మ మగుదుఁ
బరిపూర్ణ నిర్గుణ ‡ బ్రహ్మంబె యద్వితీ
యప్రత్యగాత్ముండ ‡ నైన నేన
టంచు నీరీతి నహంబ్రహ్మపదముల
వాచ్యార్థముల నెల్ల ‡ వదలి శుద్ధ
లక్ష్యార్థములఁ గొని ‡ లక్షణచేఁ దత్త
దన్యోన్య సమరసై ‡ క్యంబు గనుట

తే. యస్మియను పదమున కర్థ ‡ మగును గాన
నిమ్మహావాక్యతాత్పర్య ‡ మిట్లు సద్గు
రుప్రసాదంబువలన నిరూఢముగ న
బాధకంబుగ నెఱుఁగుట ‡ బోధ మనఘ. 140

తా. సాటిలేని కూటస్థుడనగు నేను మాయాండము మొదలు పిండాండమంతటను నిండియున్న నేను గుణరహితమగు పరబ్రహ్మమునగుదును. పరిపూర్ణమైనట్టి నేనే సాటిలేని కూటస్థుడైన నేను అని అహంపద బ్రహ్మపదవాచ్యార్థములను అన్నిటిని వదలి నిర్మలులైన కూటస్థపరమాత్మలను చేపట్టి జహదజహల్లక్షణచే నాకూటస్థ బ్రహ్మల అన్యోన్యము సమమయిన ఆనందముయొక్క కూడికను పొందుటే అయితి ననుపదమున కర్థమగును. కనుక అహం బ్రహ్మాస్మి అను నీమహావాక్యార్థముయొక్క అనుభవార్థము గురువుల అనుగ్రహముచే నిశ్చలముగాను బాధకములు లేనట్లు తెలియుటయే జ్ఞానము.

క. నిత్యముగా దేహాత్మ,
ప్రత్యయ మజ్ఞునకుఁ గల్గుకైవడి పాటిఁ దగం
బ్రత్యగభిన్నబ్రహ్మ,
ప్రత్యయ మొప్పారవలయుఁ బండితున కిలన్. 141

తా. అజ్ఞునకు శరీరమే యాత్మ యనునమ్మకము గల్గియున్నట్లు బ్రహ్మజ్ఞునకు బ్రహ్మవిచారణ కనుకూలమయిన భూమియందే కూటస్థచైతన్యమున కంటె వ్యతిరిక్తము కానిదే పరబ్రహ్మమని తలంపు జనింపవలయును.

తే. ఇదియె బోధప్రకారమా నింక నీకు,
నుపరతివిధంబు వినిపింతు నొనర వినుము
ఉత్తమోత్తమ మై యొప్పు చిత్తశాంతి,
బ్రహ్మవిద్యాగమమునకు ఫలము వత్స. 142

తా. ఇపుడు జెప్పినది బోధశబ్దార్థక్రమము. ఇంకను చిత్తలయానందమునుగూర్చి వచించెద నాలింపుము. సర్వోత్కృష్టమయిన చిత్తశాంతి బ్రహ్మజ్ఞానము గలుగుటవలని ఫలము.

చ. ఉపకృతి దానభోగముల కొప్పనిమర్త్యునికల్మి శీల మె
ల్లపుడును లేనివిప్రు నిగమాధ్యయనంబును నెమ్మనంబునన్
విపులశమంబు గైకొనని వీరతపస్వితపంబు నింద్రియో
ద్యుపరతిసౌఖ్యముం గనని యోగివివేకము రిత్త యారయన్. 143

తా. దయతో నిచ్చుట దానముచేయుట అనుభవించుట లేనివాని కలిమియు, మంచిప్రవర్తనలేని విప్రుని వేదపఠనమును, తాలిమిలేనివాని తపమును, మనస్సు నిలుపుటయందుగల యానందము నెఱుంగని యోగియొక్క ఆత్మజ్ఞానము వ్యర్థము.

సీ. వేదశాస్త్రంబులు వివరించి బుధులచే,
జదివింపవచ్చు దాఁ జదువవచ్చు
యజ్ఞదానతపంబు లధికారిజనముచేఁ,
జేయింపవచ్చు దాఁ జేయవచ్చు
నిలలోనఁ గలతీర్థముల కేగ నన్యుల,
బోధింపవచ్చుఁ దాఁ బోవవచ్చు
నష్టాంగయోగవిద్యల నార్యులకు నుప,
దేశింపవచ్చు సాధింపవచ్చు
తే. గాని యెవ్వారి కైన విజ్ఞానయోగ,
గతిని దేహేంద్రియము లరికట్టి మనము
నాఁగి యంతర్ముఖముఁ జేసి యనవరతము,
నిశ్చలసమాధినిష్ఠచే నిలుపరాదు. 144

తా. వేదశాస్త్రములను పండితులచే చదివింపవచ్చును, లేదా తానే చదువవచ్చును. యజ్ఞము, దానము, జపము మున్నగునవి స్వయముగా దాను జేయవచ్చును యితరులచే జేయింపవచ్చును. భూమిలోఁగల సమస్తతీర్థముల సందర్శింపుడని యితరులకు బోధింపవచ్చును. తానును దర్శింపవచ్చును. అష్టాంగ యోగవిద్యలను యితరుల కుపదేశింపవచ్చును, దాను సాధింపవచ్చును. కాని ఎవ్వరికినిగూడ విజ్ఞానయోగమార్గమును దేహేంద్రియములను స్వాధీనము చేసికొని మనస్సును లనకై మరలించుకొని ఎల్లపుడును నిర్వికల్పసమాధియందు నివసింప నసాధ్యము.

క. చిత్తేంద్రియోపరమము మ,
హత్తర మిది యెల్లవారి కబ్బదు విను మా
యుత్తమదశ గలిగిన వి,
ద్వత్తముఁ డతిదుర్లభుఁడు సదా మన్మయుఁడున్. 145

తా. చంచలమగు చిత్తమును జ్ఞానకర్మేంద్రియములను జయించుట మిక్కిలికష్టము. అట్లు జయించుటకే మానసికేంద్రియలయమందురు. ఇయ్యది సర్వజనసాధ్యముగాదు. ఇట్టి మానసేంద్రియలయముండగు బ్రహ్మవేత్త లభింపడు. అట్టివాడే నాస్వరూపుడు.

తే. కొంత ఆత్మతత్త్వము నెఱుఁగుదు మటంచు
గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి
నుపరతిసుఖంబుఁ గానక విపులవిషయ
రాగలోలతఁ జెడుదు రూరక మహాత్మ. 146

తా. కొంద ఱజ్ఞులై బ్రహ్మస్వరూపము మాకు దెలియునని గర్వించి మానసముల జయింపలేక చిత్తవిశ్రాంతిచే గలిగిన యానందము నొందలేక యింద్రియార్థముల యభిలాషల జిక్కువడి నశింతురు.

తే. జ్ఞానవిజ్ఞానయుతుఁ డయ్యు సంతతంబు
నాత్మభావన లేకున్న యతనియింద్రి
యంబులు మనంబు తమకు వశంబు సేసి
విషయసుఖముల చవిఁ జూపి వెతలఁ బెట్టు. 147

తా. తత్త్వపదార్థ చింతన జ్ఞానంబును, అనుభవజ్ఞానంబును గల్గి యనుదినంబును పరమాత్మకంటె భిన్నుడనుకాని ప్రత్యగాత్మనని దలంపకుండువాని నింద్రియములు జయించి యింద్రియభోగముల నాసక్తిగల్గించి తాపత్రియాగ్నిముంచును.

సుస్థితప్రజ్ఞుని లక్షణము.

సీ. అట్లు గావున నింద్రియమనంబుల నజస్ర,
మాత్మభావనచేత నాఁగఁబట్టి
యంతర్ముఖములుగా నలరించి యామీఁదఁ,
గామాదిశత్రువర్గము నడంచి
విమలబోధాకారవృత్తిచేఁ గేవల,
పరిపూర్ణతత్త్వరూపంబుఁ గాంచి
యానందమూర్తియై యఖిలంబుఁ దనయందు,
సమయించి చిత్తవిశ్రాంతి నొంది
తే. యెఱుక మఱపులఁ బొరయని యెఱుక యైన
పరమపురుషుండు సుస్థితప్రజ్ఞుఁ డన గు

ణాత్రయాతీతుఁ డన నమరనస్కారాజ
యోగనిద్రాసమేతుఁ డై యుండు ననఘ. 148

తా. పావనీ! ఆవిధంబున దుఃఖములకు లోబడుచు యింద్రియములను, కారణరూపమయినమనస్సును సర్వదా పరబ్రహ్మముకంటె భిన్నముగాదని యెఱుకచే నడ్డగించి పరబ్రహ్మము నభిముఖము గావించికొనవలయును. పిమ్మట సంకల్పత్రుతినివహము నడంచి బ్రహ్మాకారమయినదియును, ప్రధానమయినదియు, అఖండమయినదియు, యథార్థమయినదియు నగు పరబ్రహ్మస్వరూపమును గాంచి సచ్చిదానందస్వరూపుఁడై మహదాది ప్రపంచమును తనలో లయింపజేసిన, చిత్తలయముగలవాఁడగును. అట్టివాఁడు అంటని జ్ఞానస్వరూపుఁడగు పురుషోత్తముడనని చలింపని విజ్ఞానంబుగలవాడగును. వాడే మూలప్రకృతిని మహదహంకారములను అంటనివాడైనవాడును, మనస్సు లేనట్టిదియును దివ్యప్రకాశమయినదియును అగు యోగనిద్రతోఁ గూడినవాడగును.

తే. ధర్మవిధి నెవ్వఁడు మనోగతంబు లైన
సర్వకామంబులను గడుసన్న్యసించి
యంచితాత్మాత్మసంతుష్టుఁ డగుచు నుండు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గుమార. 149

తా. ఎవ్వడు పుణ్యములం దాసక్తిగల్గి యమనియమాదులతో మనస్సు నావరించియుండు సమస్తకోరికలను విడచిపెట్టి పరబ్రహ్మమునందే మనస్సుగలవాఁడైయుండునో యాతడు జ్ఞానము తనయందుగలవాఁడై యుండును.

తే. ప్రాప్తదుఃఖములకు భయపడక యోర్చి
కొసరి యప్రాప్తసుఖములఁ గోరికొనక
వీతరాగభయక్రోధుఁ డై తనర్చు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గపీంద్ర. 150

తా. ఎవ్వఁడు సంప్రాప్తములైన దుఃఖములకు భయమువెందక యోర్చుకొన్ని, ముందు సుఖములు రావలయునని కోరిక అనురాగము భయము కోపము విడచియుండునో యాతడే స్థితప్రజ్ఞుడని యందురు.

తే. అఖిలవిషయానభిస్నేహుఁ డగుచు శుభము
నొంది మురియక యశుభంబు నొంది కినియ

కుండు నెవ్వాఁడు సమత నేప్పుండితుండు
సంస్థితప్రజ్ఞుఁ డగు సూరిజనవరేణ్య. 151

తా. ఏపురుషుఁడు శబ్దాదిసకలవిషయములందును వాంఛలేనివాఁడై సుఖదుఃఖముల సమముగా నోర్చి యుండునట్టియాతఁడే బ్రహ్మజ్ఞాని.

తే. కూర్మ మఖిలావయవములఁ గుదియ ముడుచు
మాడ్కి నేయోగి యింద్రియమానసముల
సమర మరలించు నింద్రియార్థములవలన
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగు మహాత్మ. 152

తా. ఎవ్వఁడు తాబేలు తనశరీరమునంతను లోనికి కుదియించుకొనునట్లు యింద్రియములను, మనస్సును శబ్దాదివిషయములనుండి మరలించునో యాతఁడే యోగివరుండు. (అహం బ్రహ్మాస్మి యను తెలిసినవాడు.)

తే. విను మొకరహస్య మెఱిఁగింతు వేయు నేల
యేమహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు
పంచిన ట్లాజ్ఞలో నిల్చి పనులు జేయు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁడగు బుధేంద్ర. 153

తా. నేయిపలుకు లెందుకు. ఒక్కరహస్యము దెల్పెద నాలింపుము. ఎవనికి మానసేంద్రియములు స్వాధీనములైయుండి వానియొక్క ఆజ్ఞలను తిరస్కరింపకుండునో యాతడే యాత్మస్థితప్రజ్ఞుఁడందురు.

ఆ. ఎల్లభూతములకు నెద్ది శర్వరి దాని
యందు మేలు కని మహాత్ముఁ డలరు
నఖిలజనము దేనియందు మేల్కనియుండు,
నదియె నిశి జితేంద్రియాత్మునకును. 154

తా, వివేకములేని సమస్తజీవులకు నే పరమాత్మజ్ఞానవిషయమయిన జ్ఞానము కనబడక యుండుటచే రాత్రివలె ప్రకాశములేనిదై యుండునో అట్టి జ్ఞానమును ఆత్మావలోకనమునందు వాంఛగలవాఁడు మేల్కొని యానందించునో యట్టిబ్రహ్మనిష్ఠాగరిష్ఠుండును, జితేంద్రియుండునుఅగు పురుషునకు ప్రాణిసమూహము యే చక్షురాదీంద్రియ ఆకాశప్రవృత్తి

జాగ్రతయందు బొందియున్నదో ఆ శబ్దాదివిషయికబుద్ధియే అవిద్యాస్వరూపము. కావు, ననే రాత్రివలె కనబడకపోవునది.

వ. అట్లు గావున నింద్రియమనంబుల ననాత్మ నిషేధపూర్వకాత్మాలోకనంబుచేత జయించి వశీకృతమానసేంద్రియుం డైన పుణ్యపురుషుఁడు సర్వభూతాద్వేష్టయు సకలలోకమిత్రుండు పరమకారుణికుండు నిర్మముండు సమదుఃఖసుఖుండు నిరహంకారుండు క్షమావంతుండు నిత్యసంతుష్టుండు యోగారూఢుండు నియతాత్ముండు దృఢాత్మనిశ్చయుండు నిఖిలజనాభయప్రదుం డఖిలలోకభయరహితుండు ముక్తహర్షామర్షభయోద్వేగుండు నిరపేక్షుండు శుచియు దక్షుం డుదాసీనుండు గతవ్యథుండు పరిత్యక్తసర్వారంభుం డిష్టానిష్టప్రాప్తి హర్ష ద్వేషవిహీనుండు సంప్రాప్తేష్టవియోగదుఃఖవిరహితుం డప్రాప్తార్థకామశూన్యుండు యదృచ్ఛాలాభసంతుష్టుండు శుభాశుభపరిత్యాగియు సమశత్రుమిత్రుండు సమలోష్టాశ్మకాంచనుండు సమశీతోష్ణసుఖదుఃఖుండు దుల్యప్రియాప్రియుండు దుల్యనిందాస్తవుండు మానావమానతుల్యుండు మౌనశీలుం డనికేతనుండు సుస్థితప్రజ్ఞుండు గుణాతీతుండు మద్భక్తుండు మదర్పితమనోబుద్ధియు మత్పరాయణుండు నై పరికాశించు యోగీంద్రుండు సంతతసహజామనస్కరాజయోగసమాధియందు సూర్యుండు సమస్తరసంబులం బీల్చిన తెఱంగున బడబానలంబు జలరాశిం బానంబుచేసినకైవడి మహాదవానలం బరణ్యంబునం గల తృణాదిసర్వపదార్థంబులం గబళించిన తెఱంగున నావిద్యకంబులైన యనంతగుణంబుల నశేషంబుగా మ్రింగి కేవలపరిపూర్ణశుద్ధచిన్మాత్రస్వరూపకుం డై యుండు నద్దశావిశేషం బుపరతి యననొప్పు నయ్యుపరతిప్రాప్తికి యమనియమత్యాగమౌనదేశకాలాసనమూలబంధదేహ సామ్యదృక్స్థితి ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధా-

రణ సమాధు లను పంచదశయోగాంగంబులు సాధనంబులు గావు
న వాని వేర్వేఱ విభజించెద నాకర్ణింపుము. 155

తా. కావున జ్ఞానకర్మేంద్రియములను మనస్సును, శరీరమును, పరిత్యజించుట ముందుగా నుండునట్లు పరమాత్మసందర్శనముచే జయించి మనస్సును యింద్రియములను వశపరచుకొనిన పుణ్యపురుషుండు సర్వభూతములకును ద్వేషిగాకుండగను, సమస్తజనుల కును స్నేహితుండును, దయాళుండును, మమకారరహితుడును, ద్వంద్వములసమముగ నోర్చువాడును, అహంకారరహితుండును ఓర్పుగలవాడును, నిత్యసంతోషియు, యోగా రూఢుండును, నియతుండును, చలింపనట్టి దృఢచిత్తముగలవాడును, సమస్తజనములకు నభయమొసంగువాడును, సమస్తలోకులవలనను భయములేనివాడును, త్యజింపబడిన సంతోషము, క్రోధము, భయము మున్నగువానియొక్క పుట్టుకగలవాడును, వాంఛా రహితుడును, పరిశుద్ధుడును, సమర్థుడును, సుఖదుఃఖములు లేనివాడును, నశించిన శోకముగలవాడును, విడువబడిన సమస్తమయిన ప్రయత్నములుగలవాడును, వాంఛి తార్థములప్రాప్తికి సంతసించుట, లభింపమికి విచారించుటలేనివాడును, ప్రాప్తమయి నవి పోయిన దుఃఖింపనివాడును, లభ్యములుకానివానియం దాసలేనివాడును, అప్రయత్న ముగా లభించినవాటితో సంతృప్తినొందువాడును, శుభాశుభముల వదలినవాడును, శత్రు మిత్రుల సమదృష్టి నరయువాడును, బంగారును మంటితో సమముగా జూచువాడును, శీతోష్ణములను, యిష్టాయిష్టములను, దూషణభూషణములను గౌరవాగౌరవములను సమముగ నెంచువాడును, మౌనివృత్తిగలవాడును, గృహమును త్యజించినవాడును, తలం చినస్థలమున నుండువాడును, నిశ్చలచిత్తముగలవాడును, గుణత్రితయమునతిక్రమించిన వాడును నాభక్తుడై, నాయందు లీనమయిన మనస్సుగలవాడై, నాయందు విశ్వాసము గలవాడునునై పరికాశించు బ్రహ్మవిద్వరిష్ఠుడు సదా విరామములేక సహజమగు జీవేశ్వరైక్యసమాధియందు భాస్కరుఁడు గుంటలు, చెరువులు మొదలగువానియందలి జలమును నావిరిచేయు చందమున, బడబాగ్ని సముద్రమును పానముచేసినట్లును, కార్చిచ్చు అడవియందలి సమస్తమును కబళించినట్లును, అజ్ఞానముతోగూడిన గుణత్రి తయమును మిగుల కుండనట్లుగా నశింపజేసి తనకంటె నితరము లేనివాఁడును పరిపూర్ణు డును, నిర్మలుండును స్వయంప్రకాశుండగు బ్రహ్మజ్ఞాన స్వరూపకుండునునై యుం డును. అట్టి యవస్థాభేదమే యుపరతి యనంబడు నయ్యది లభింప యమనియమాది పదునైదు యోగాంగంబులు సాధనంబులు గాన వానినిగూర్చి సవిస్తరముగా దెల్పెద నాకర్ణింపుము.

## పంచదశయోగాంగంబుల విభాగము.

మ. సమత న్భూజలవహ్నివాయుఖతనూ ♦ సర్వేంద్రియప్రాణచి
త్తమనోహంకృతిబుద్ధిరూపబహిరంతర్దృశ్యముల్ దృక్స్వరూ
పముగాఁ జూచుచుఁ దద్దృగాత్మకపర♦బ్రహ్మంబు దా నంచు ని
త్యము భావించిన నా యమం బిది యచింత్యం బంజనానందనా.

తా. సమబుద్ధితో పంచభూతములను, దేహ, జ్ఞానకర్మేంద్రియములు వీనిస్వరూపముగ వెలుపలివిషయమును దశవిధప్రాణములు, చిత్తము మనస్సు అహంకారము వీనిస్వరూపమగు లోపలివిషయమును సర్వసాక్షిరూపముని చూచుచు నిరంతరముదృక్స్వరూపమగు యీపరమాత్మ తానేయని తలంచిన నది యమమనుయోగము. ఇది వాఙ్మనోగోచరముగాదు.

సీ. వినుచు ముట్టుచుఁ గనుఁగొనుచు నానుచు మూరు
కొనుచుఁ బల్కుచుఁ బనుల్ ♦ గొనుచు జనుచు
వర్ణాశ్రమోచిత♦వ్యాపారముల నిచ్చ
సలుపుచుఁ దలఁచుచు ♦ మెలఁగునెడల
నీయింద్రియంబు లీయింద్రియార్థంబులఁ
బూని వర్తించునే ♦ వీని కెల్ల
సాక్షిని కేవల♦సచ్చిదానందస్వ
రూపుఁడ గుణజాతి♦రూపనామ
తే. రహితుఁడ నటంచుఁ దెలిసి ని♦రంతరంబు
దన్నుఁ దాఁ జూచుకొనుచు స♦త్యముగ నీయ
ఖండనియమంబు వదలక♦యుండు టరయ
నియమయోగం బనం దగు ♦ నిర్మలాత్మ. 157

తా. శ్రోత్రేంద్రియములచే ననేకవిధములైన శబ్దములును వినుచు త్వగింద్రియముచే స్పర్శలగ్రహించుచు, కండ్లచే పదివిధముల దృశ్యములచూచుచు జిహ్వచే షడ్రసంబుల రుచిగొనుచు, ముక్కుచే త్రివిధగంధముల వాసనజూచుచు, వాక్కుచే బలుకుచు చేతులచే బనులుగొనుచు పదములచే నడచుచు నాల్గువర్ణములకును ఆశ్రమములకునుఁ

దగిన పను లనొనర్చుచు మానసమున నిహపరవిషయములనుగూర్చి యాలోచించుచు సంచరించుకాలములయందు సమస్తేంద్రియములును నింద్రియార్థవిషయములనంటి ప్రవర్తించుననియును నేనయీయింద్రియార్థవిషయములకు సాక్షిననియు ప్రధానము లైనవియు కాలత్రయాబాధితములు కానివియునగు జ్ఞానానందములే స్వరూపముగా గలవాఁడననియు గుణరహితుడననియు వర్ణరహితుఁడననియు. దీర్ఘహ్రస్వాది రూపరహితుడననియు దేవదత్తాది నామరహితుఁడననియు, తెలిసికొని సర్వదా ప్రత్యగాత్మమైన తాను జీవైక్యభావముచే జూచుచు సత్యముగా సంపూర్ణమైన యీనియమమును వీడకుండుటయే నియమయోగము.

తే. ప్రత్యగాత్మస్వరూపుఁ డై పరఁగు తనకు
నన్య మైనట్టి దేహేంద్రియాదిదృశ్య
వితతి యంతయు నొల్లక విడుచు టరయఁ
ద్యాగ మన నొప్పు నిది రాజయోగతిలక. 158

తా. ఆలోచింప ప్రత్యగాత్మ స్వరూపుడగు తనకు శరీరత్రయము, 14, యింద్రియములు మున్నగు అంతర్బాహ్య దృశ్యసమూహము నొల్లకత్యజించుటయే త్యాగము.

కవిరాజవిరాజితవృత్తము.

పలుకుల కందక భావము నంటక భాసిలు బ్రహ్మము దా నగుచుం
బలుమఱుఁ బల్కక పల్కినచో నవి పల్కితి నంచుఁ దలంపకయే
తలఁపులు లేక నిరంతరసౌఖ్యసుధారస మానుచు నుండుట ని
ర్మల మగు మౌనము మారుతనందన మానక దీని భజింపఁ దగున్. 159

తా. పలుకులనిట్టి దనరానిదియు మనస్సుచే నూహింపబడనిదియు నై వెలుఁగు పరమాత్మ తానై పలుమరు పలుకకయుండువాఁడును, మాటలాడినను తాను మాటలాడితి నని తలపనివాడును, సంకల్పరహితుఁడును సదా బ్రహ్మానందామృత మనుభవించుటయే పరిశుద్ధమగు మౌనయోగ మగును.

సీ. ధీరులచేత నేదేశ మాచార్యోప
దేశంబుచే నర్థి దెలియఁబడియె

బరమపవిత్రమై భాసిల్లునేదేశ
మేదేశ మన్నింటి కెక్కుడయ్యె
నేదేశ మురుమానసేంద్రియప్రాణాది
సంచారశూన్య మై సమత నొప్పు
నేదేశమున సాధ్వసేచ్ఛామదక్రోధ
దుఃఖగంధలవంబు దోఁప కుండు

తే. గరము నిరుపద్రవంబు నిష్కంటకంబు
నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు
దివ్య మానంద మగుచు నేదేశ మలరు
నదియె యేకాంతదేశ మా నాంజనేయ. 160

తా. ఏస్థానము విబుధులచేతను గురునిచేతను దెలియబరుప బడినదో- ఏస్థానము శ్మశానభూమి లేడింటికంటెను యుత్తమమైనదో, యేదేశమునందు మనస్సు యింద్రియములు ప్రాణములు సంచారశూన్యములై యుండునో యేస్థానమునందు స్వేచ్ఛపదము క్రోధము దుఃఖమునను నవి లేకుండునో ఏదేశమున నెట్టిభయమును యెట్టియాతంకములు లేకుండునో- ఏదేశము సాటిలేనిదో ఏదినిత్యమైనదో- ఏదిత్రిమలరహితమైనదో- అప్రాకృతమయినదియును, నిరుపాధికసుఖస్వరూపమయినదియును నై యొప్పునది యాజ్ఞాకాశమే ముఖ్యమగు ప్రదేశము.

తే. అట్టి సువివిక్తదేశంబు నధిగమించు
ఘనునకు నిరంతరసుఖంబు గలుగుఁ గాని
యన్యవిజనంబు నొందు దేహాత్మవాది
కబ్బునే నిర్మలానంద మనిలతనయ. 161

తా. పైన నుదాహృతమయిన ప్రకృతిపురుష మహదహంకారాది తత్త్వజనశూన్య ప్రదేశము జేరుమహాత్ములకు యెల్లప్పుడును బ్రహ్మనందము గలుగును. గాని మరియొక నిర్జనస్థానముపొంది శరీరముతానని భావించి వాదించువానికి సంసారనివృత్తిపూర్వకమగు ఆనందము గలుగదు.

తే. కాల మెద్దానిచేఁ బరికల్పితంబు
నెల్లకాలంబు నొకరీతి నెద్ది వెలుఁగుఁ

గాలనియమంబు లెందేని * గానుపింప
వదియె కాలం బనాది యనంత మనఘ. 162

తా. ఎద్దానిచే కాలము పరికల్పింపబడుచున్నదో-ఏది సర్వకాలములందు నొక్క రీతిగా వెలుగుచుండునో ఎందు కాలనియమములు లేవో ఆకాలమే ఉత్పత్తిలేనిదియు నాశరహితమయినదియును నై యున్నది.

తే. అట్టి యాద్యంతరహిత కాలాత్మ కాత్ముఁ
డై నిమేషాది యై ప్రళయాంత మైన
కాలమును దూలకణము నఖండదావ
శిఖపగిది మ్రింగి యోగి భాసిల్లు ననఘ. 163

తా. బ్రహ్మవేత్త పుట్టుకనాశనము లేనికాలస్వరూపుడై రెప్పపాటు మొదలు గాగలదియగు బ్రహ్మవిష్ణురుద్ర ప్రళయముల వరకుండునదియగు కాలమును కార్చిచ్చు దూదికణమును దహించునట్లు కబళించును.

క. చలనము కాయక్లేశము
నలసతయును జాడ్యనిద్ర * లాయాసం బి
మ్ముల నెట్టి యునికివలనను
గలుగ నది సుఖాసనం బకల్పిత మనఘా. 164

తా. సూక్ష్మశరీరము నాశ్రయించిన ప్రాణవాయువు స్వధర్మమగు చలనమును, స్థూల శరీర స్వధర్మమగు శరీరపీడ కారణశరీరధర్మమగు బడలిక నిద్ర యేపరమాత్మ స్వరూపముగా నుండుటచే గలుగవో ఆయునికియే సుఖాసనముగాని వేరొక యాసనము గల్పింపగూడదు.

ఆ. ఎద్ది సిద్ధ మగుచు * నెప్రొద్దు విలసిల్లు
నరసి చూచి యెద్ది * యైన యపుడె
సర్వసిద్ధు లొకట * సమకూఱు నదియె సి
ద్ధాసనంబు కేవలాత్మరూప. 165

తా. ఏపరమాత్మ సర్వకాలములందును స్థిరముగానున్నదై ప్రకాశించుచుండునో అపరోక్షజ్ఞానముచే పరీక్షించి పరబ్రహ్మము తానైన యప్పుడు సర్వలాభములేక కాలమున నెప్పుడు గల్గునో యాపరమాత్మయే సిద్ధాసనమనబడును.

ఆ. బంధములకు మూలబంధంబు ప్రకృతి త
ద్బంధ మెద్ది గనినఁ బాయునపుడె
యఖిలతత్త్వములకు నాదిమూలం బెద్ది
యదియె మూలబంధ మాంజనేయ. 166

తా. వత్సా! త్రిమలసహితమయిన మూలప్రకృతియే అష్టవిధపాశబంధములలోఁ ప్రధానమయినది యేఆత్మ చైతన్యము తానని వీక్షించునప్పుడే బంధము వీడునో 36 తత్త్వములకు ప్రధానమెద్దియో ఆపరమాత్మయే మూల బంధమను యోగంబు.

క. వారినిధియందుఁ జెందిన
యేఱులగతిఁ జిత్సుఖమున నింద్రియవృత్తుల్
చేరి సమభాన మొందుట
యారయఁగా దేహసామ్య మగు వాయుసుతా. 167

తా. వత్సా! వార్ధిగలియు నదులవలె బ్రహ్మానందమున చతుర్దశేంద్రియవృత్తులేకీభవించి సమరసము గల్గియుండుటే దేహసామ్య యోగము.

సీ. ఏచూపు సకలబాహ్యేంద్రియార్థంబులఁ
గను నది వెలిచూపు కపికులేంద్ర
యేచూపు వివిధాంతరేంద్రియవృత్తులఁ
గను నది లోఁజూపు కపివరేణ్య
యేచూపు బాహ్యాంతరేంద్రియార్థంబులఁ
గను నది మధ్యలక్ష్యము కుమార
యేచూపు దగ మానసేంద్రియషట్కంబుఁ
గను నది షణ్ముఖి దనుజవైరి

తే. చూచు నేచూడ్కి యీనాల్గు చూపులను న
జస్ర మదిశాంభవీదృష్టి సంగరహిత
యిదియె యన్నిటిలో నెక్కుడిట్టు లగుటఁ
బరమగుహ్యతమం బగుఁ బవనతనయ. 168

తా. ఆంజనేయా! బాహ్యాభ్యంతరదృశ్యానువిద్ధసవికల్పకనిష్ఠల యేలక్ష్యము. 10 యింద్రియములయొక్క విషయములను జూచునో అది బాహ్యదృష్టి అగును. ఏది అంతశ్శబ్దదృశ్యానువిద్ధసవికల్పనిష్ఠల యేలక్ష్యము అంతరింద్రియవృత్తులకనునో యదిలో చూపగును. ఏదిబాహ్యాంతరసవికల్పకనిష్ఠల యేలక్ష్యము లోపలివెలుపలి యింద్రియ విషయములను గాంచునో యది మధ్యదృష్టి ఏచూపు మానసేంద్రియము లైదింటిని కను చుండునో యది షణ్ముఖీముద్రియగును. యీనాల్గుదృష్టులచేతను ఎల్లప్పుడును చూచు చున్నది శాంభవీముద్రియగును. ఈశాంభవీముద్రియే సకలలక్ష్యములలోనను యుత్కృష్టమయినది గుహ్యాతరమయినదియును.

మానినీవృత్తము.

దృశ్యమె నాకము దృశ్యమె వాయువు దృశ్యమె భూజలతేజములున్
దృశ్యమె దేశము దృశ్యమె కాలము దృశ్యమె దేహము నింద్రియముల్
దృశ్యమె ప్రాణము దృశ్యమె చిత్తము దృశ్య మహంకృతి ధీమనముల్
దృశ్యమె విద్యయు దృశ్య మవిద్యయు దృశ్యము గానిది దృక్కరయన్.

తా. వత్సా! ఆకాశము చూడదగినదిగానున్నది. వాయువు గనబడుచున్నది. భూమి అగ్ని జలము కనబడుచున్నది. ఉత్తర దక్షిణాద్యుపాధులచే రాజ్యముగనబడుచున్నది. నిముషము మొదలు ప్రళయముపర్యంతము కాలము గూడ దృశ్యమయినది. జ్ఞాన కర్మేంద్రియములు దృశ్యములు ప్రాణవాయువు గనదగినది. చిత్తము అహంకారము మనస్సు జ్ఞానాజ్ఞానములు గూడ గోచరించునది ఇట్లు సర్వము గోచరించునదైనను గోచరింపనిది ద్రష్టయగును.

తే. ద్రష్టృదర్శనదృశ్యవిరామ మెచట
నగు నచట దృష్టి నిలుపంగ నగును గాని
చెదరి నాసాగ్రమునఁ జూపుఁ జేర్పఁదగదు
కోరి యమనస్కరాజయోగులకు వత్స. 170

తా. వత్సా! అమనస్కరాజయోగి యగువాడు చూపురూపము లెచ్చట లయ మగుచున్నదో యచ్చటనే చూపు నిలుపవలయును కాని నాసాగ్రమునందు చూపు నిలుపరాదు.

శా. ప్రాణాంతఃకరణేంద్రియాద్యఖిలసద్భావంబులన్ భూషణ
శ్రేణిన్ స్వర్ణముగా నెఱింగినగతిన్ జిన్మాత్రముం గాఁగఁ ద

త్ప్రాణాంతఃకరణాదివృత్తులు నశింపఁజూచుం దన్నుఁగాఁ గాంచినం
బ్రాణాయామ మనంగ నొప్పు నిది సంభావ్యంబు మేధానిధీ. 171

తా. ఆంజనేయా! ఆభరణములన్నిటిని బంగారుగా నెంచినట్లు పంచప్రాణములు యింద్రియములు మున్నగువాని వృత్తులను పరమాత్మగాను ఆపరమాత్మను తానుగాను చూచునేని ముందుచెప్పబడిన సంశయాదివృత్తులు నశించును.ఇట్లుభావించుటయే ప్రాణాయామయోగ మనబడును.

మ. వెలిలోఁ గన్పడు నామరూపవితతిన్ వేమాఱు రేచించి యి
మ్ములఁ సచ్చిత్సుఖరూపతత్త్వము మదిం బూరించి యామీఁద ని
శ్చల మై తన్మయ మై తగన్ మనము నశ్రాంతంబు గుంభించినన్
నలువొప్పన్ బుధసేవ్యమై తనరు ప్రాణాయామయోగం బగున్.

తా. మనస్సనకు బాహ్యాభ్యంతరములందు గోచరమగు ప్రకృతిచే కల్పింపబడిన కామక్రోధాదికములను లోవెలి దృశ్యసమూహమున తాను గానని నిషేధించి సంశయా సంభావనలు లేక సచ్చిదానంద రూపమగు పరబ్రహ్మముచే నిండింపబడిన హృదయము గలవాడై నిశ్చలమగు పరమాత్మ స్వరూపముచే నొప్పారు మనస్సును పరబ్రహ్మము నందు లీనముచేయగా నొప్పారు యోగమే ప్రాణాయామ మనబడును.

క. సత్యానృతవిషయంబులఁ
బ్రత్యగ్బోధస్వరూపపరమాత్మునిఁగా
నిత్యము నవలోకించుట
ప్రత్యాహారం బనంగఁ బరఁగుఁ గపీంద్రా. 173

తా. వత్సా! నిక్కమగు పరబ్రహ్మముయొక్క గుణములగు సచ్చిదానంద నిత్య నిర్మల శాంతశమాదులను. అశాశ్వతమును అసత్యమయినదియునగు ప్రకృతిగుణములగు కామాదులను స్వాత్మజ్ఞానస్వరూపమయిన పరమాత్మగా సదా జూచుటయే ప్రత్యాహార యోగమనబడును.

తే. మహిత దేహేంద్రియప్రాణమానసాది
దృశ్యములు గాను నే వీనిఁ దెలియు చుండు
దృక్స్వరూపుఁడ ననుచుఁ జింతించు టరయ
ధ్యానయోగంబు బ్రహ్మవిద్యానిధాన. 174

తా. వత్సా ! శరీరత్రయము జ్ఞానకర్మేంద్రియములు దశవిధ ప్రాణములు మొదలగు దృశ్యము లగునవియెల్ల దానుగాననియు కేవలాత్మయగు తాను వైదృశ్యముల నెఱుంగు సాక్షిస్వరూపుడననియు తెలియుచుండుట ధ్యానయోగము.

క. మది యెద్ది దలఁచు మది యె
యృది గనుఁగొను నదియె బ్రహ్మ ◌ మను నగ్గుఱి నా
◌ ◌యంబున నిలుపుట దీ
నదయాపర పరమధారణాయోగ మగుఁ. 175

తా. ఆంజనేయా ! మనస్సుచే సంకల్పింపబడునదియు, జూడబడునదియు నైయొప్పునదే పరబ్రహ్మము. ఈనిశ్చయమును మనస్సునందు నిల్పుటయే ధారణయోగమనబడును. 14 యింద్రియముల వ్యాపారములును బ్రహ్మముకంటె భిన్నములుగావని యేమనస్సుచే దెలియునో యామనస్సు నిశ్చయముగ నిల్పుటే ధారణయోగము.

క. సర్వావస్థలయందును
సర్వంబును బ్రహ్మ మనుచు ◌ సతతము గనినన్
సర్వవికృతిరహితసహజ
నిర్వాణసమాధి యగు వినిర్మలహృదా. 176

తా. ఆంజనేయా ! జాగ్రత్స్వప్న సుషుప్తితుర్యావస్థలయందునను దోఁచిన సమస్త భోగములకు సాధనములుగానిసాక్షాత్కారములను సకలంబును పరమాత్మయని జూచిన నదియే చతుర్విధ కారణరహిత మయినదియు, స్వభావసిద్ధ మయినదియు అగు కైవల్యనిష్ఠయగును.

క. ఈ పదియేనంగంబుల
దీపితవిజ్ఞానసూక్ష్మదృష్టి ననిశమున్
జేపట్టి యభ్యసించు మ
హాపురుషున కబ్బుఁ బరమ ◌ మగు నుపరమమున్. 177

తా. వత్సా ! బ్రహ్మజ్ఞానముచే నీ 15 స నిర్గుణోపాసనాంగముల సూక్ష్మదృష్టిచే బరికించి యభ్యాసముచేయు బ్రహ్మవిద్వరిష్ఠునకు సునాయాసముగ చిత్తవిశ్రాంతి గల్గును.

## చిత్తలయముగల పురుషునిలక్షణము.

క. చిత్తోపరమము గల పురు
షోత్తముఁడు జగంబు మఱచి యుండుఁ బాలో
న్మత్తపిశాచనిభుండై
యెత్తఱి సుప్తునికరణి నిరింద్రియుఁ డగుచున్. 178

తా. చిత్తవిశ్రాంతిగల బ్రహ్మవిద్వరిష్ఠుఁడు 14 యింద్రియముల జయించి బాలునితోడను, పిచ్చివానితోడను, పిశాచములతోడను సమానుఁడై సర్వకాలములందును నిద్రించువాని చందమున లోకమును మరచి యుండును.

శా. గాలిం దూలిన వానచేఁ దడిసినన్ గాఢాగ్నిచేఁ గాలినన్
వ్యాలంబాత్మవిముక్తకంచుకముపై వ్యామోహముం దాల్ప న
ట్లాలోలాంగముపై నిరాఘమమతాహంకారము ల్లేక యా
త్మాలోకస్థితి నుండు పండితుఁడు నిత్యానందముం బొందుచున్.179

తా. ఆత్మజ్ఞాని సర్పము తాను విడచినకుబుసము గాలిచే దూలింపబడినను, వర్షమున దడిసినను, కార్చిచ్చుచే గాలినను నాకుబుసముపై యభిమానముంచదో యట్లే దేహమునందలి నిశ్చలములైన సేను నాదియనువృత్తులులేక బ్రహ్మానందముననుంచు పరమాత్మయందలి యునికిగల్గి నివసించుచుండును.

మ. మదిరాపానమదాంధుఁ డాత్మపటము న్మైనుండినన్ జాఱినన్
వదలై వ్రేలినఁ జూడఁ డప్పగిది జీవన్ముక్తుఁ డుద్యత్సమా
ధిదశాప్రాప్తసుఖామృతానుభవతృప్తి న్మత్తుఁడై మేను నె
మ్మది గూర్చుండిన లేచిన న్నడచినన్ మన్నింపఁ డేనంచు దాన్.

తా. మత్తుపదార్థములగొనిన మనుజుఁడు కన్నులుగానని వాడై శరీరమునను్న వస్త్రముజారినను, వదులై జీరాడినను, దానిని జూడకుండునట్లు జీవన్ముక్తుఁడు తానుండు బ్రహ్మనిష్ఠస్వరూపమగు యవస్థయందు లభించిన యానందామృతమును గ్రోలుటచే గల్గిన తృప్తిచే మైమరచి శరీర మేయేయవస్థలజెందినను గమనింపకుండును.

మ. తరుణీ నందన బంధు సాధు రిపు మిత్రవ్రాతము ల్తన్నుఁ బ
ల్మరు నిందించిన సన్నుతించిన మహామానావమానాదులన్

నెఱి నొందించిన నిర్వికారుఁ డగుచుర్వి నిశ్చేష్టుఁ డై యుండు భా
స్వరతత్త్వానుభవజ్ఞుఁ డెయ్యెడల జీవత్యక్తదేహాస్థితిన్. 181

తా. బ్రహ్మస్వరూపానుభవముగలవాడు ఎచ్చటనైనను తన్ను యితరులెవ్వరైన మాసించినను భూషించినను మానావమానములబొందక సుఖదుఃఖములజెందక యింద్రియ వ్యాపారములు లేనివాడై అచేతనమగు బొందివలెనుండును.

ఆ. బహుళసంకటములు ప్రాప్తంబు లైనచోఁ
దల్లడింపఁ డాత్మతత్త్వవిదుఁడు
వాయుశీతవహ్ని వర్షాతపంబుల
కించు కైన గిరి చలించనట్లు. 182

తా. పర్వతము గాలికి మంచునకు ఎండకు దవాగ్నికి కొలదిగానైనను చలింపని యట్లు బ్రహ్మవేత్త తనకెన్ని విధములగు సంకటములుగల్గినను వ్యాకులతజెందకుండును.

వైరాగ్యబోధోపరతులు గల యోగిలక్షణము.

వ. ఇట్టి వైరాగ్యబోధోపరతియుక్తుం డైన జీవన్ముక్తుండు ప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వసాక్షాత్కారప్రచండమార్తాండప్రకాశ నిరస్తానాద్యనిర్వ చనీయాజ్ఞానాంధకారపటలుండు పరిత్యక్తవర్ణాశ్రమాచారకోలాహ లుండు నిరంతరచిత్తవిశ్రాంతిపరాయణుండు విషయాసక్తివివర్జితుండు ప్రబలప్రారబ్ధాధీనశరీరచేష్టుం డంతస్సుఖుం డంతరారాముండంతఃప్ర కాశుం డాత్మరతుం డాత్మతృప్తుం డాత్మసంతుష్టుండు దూరీకృతదురితక్రి యుండు ప్రశాంతమానసుండు విజితేంద్రియుండు కృతకృత్యుండు ప్రాప్తాప్రాప్తవిహీనుండు సర్వవ్యవహారాతీతుం డశరీరుండు సర్వశరీ రస్థుండు నిరింద్రియుండు సర్వేంద్రియద్రష్టయు నప్రాణుండు సర్వప్రాణి ప్రేరకుండు సర్వేంద్రియోపశాంతిసుఖరసికుండు వివేకహృత్సంగుండు నిత్యాసంగుండు ప్రజ్ఞాప్రౌఢసఖిసహాయుం డసహాయుండు దృఢాప రోక్షాత్మనిశ్చయసంపన్నుండు వర్ణాశ్రమసదాచారదురాచారకామ క్రోధలోభమోహాదంభదర్పకూహకకౌర్యశౌర్యజాడ్యమాత్సర్యద్వే షకార్పణ్య నిందాస్తుతిమానావమానేర్ష్యాసూయాదయానైష్ఠుర్యవా

కామరుషాద్యాది నానావిధచిత్తవికారరహితుండు శ్రీవాసనార్థవాసనా ప్రతిష్ఠా వాసనాశాస్త్ర వాసనాదేహ వాసనాలోకవాసనాకర్తృత్వ భోక్తృత్వాదివాసనావివర్జితుండు విగతబ్రహ్మవేత్తృత్వాభిమానవాసనుండు నిత్యనిర్మలుండు నిత్యశాంతుండు నిత్యోదాసీనుండు నిష్ప్రపంచుం డవ్యక్తమహదహంకార పంచతన్మాత్రాకాశాది సర్వప్రపంచ మాయాగంధర్వనగరాశ్రయుండు నిరాశ్రయుండు సర్వావభాస కేవలచిదాకాశమాత్రుండు పరమసుఖైకస్వరూపకుండు దూరీకృతసంసారుండు దేహేంద్రియగుణాతిరిక్తుండు దేవతాస్పృహణీయశీలుండు నానాపాశవినిర్ముక్తుండు రాజసతామసవస్తుసేవాదూరుండు సాత్త్వికవస్తుసేవావిజితనిద్రుం డక్రియాత్మపూజాపరుండు మానజపపరాయణుం డచింతధ్యాననిష్ఠుం డనిచ్ఛాసుఖతత్పరుండు విశ్వవంద్యుండు యథేచ్ఛాసంసారశీలుండు ధీరుండు దాంతుండు నిత్యప్రబుద్ధచిత్తుండు స్వాత్మసమాధినిష్ఠుండు జగదింద్రజాలద్రష్టయు విశేషప్రాప్తాశేషపురుషార్థుండు త్యక్తాశేషవిశేషదుఃఖుం డధిగతపరమస్వాస్థ్యుండు సంగృహీతచిత్తుండు మితవాక్యుండు పరమకారుణికుండు సర్వభూతమిత్రుండు పేశలాచారమధురుండు పాణిపాత్రనిపతితమాత్రాశనుండు యోగారూఢుండు తితిక్షుండు పరమైకాంతికుండు నిష్కళంకుండు నిస్పృహుండు ప్రారబ్ధవశప్రాప్తదేహేంద్రియాదివ్యాపారరూపపుణ్యాపాపక్రియాకర్తృత్వాభిమానపూర్వకముఖవికాసదైన్యశూన్యుండు సదాప్రసన్నచిత్తుండు వికసితముఖుండు దుష్టశిష్టజనసంగదూరుండు సాధువిద్వజ్జనసంగుండు సర్వపదార్థోపేక్షాబుద్ధియుక్తుండు కుశలాకుశలక్రియాదూరుండు వేదాంతశాస్త్రవిచారఘోరదావానలభస్మీకృత సర్వవేదశాస్త్రాగమపురాణ గుర్వీశ్వరవిధిప్రతిషేధాదివాస నారణ్యుం డవ్యక్తలింగుం డవ్యక్తాచారుం డేకచారియు ననికేతనుండు గిరిగుహావిహారుండు మృత్యుభయవివర్జితుండు పరలోక

భయవిరహితుం డనిర్వ్యాజశాంతాత్మకుండు బంధమోక్షనిరాకాం
క్షుండు సర్వాతీతసర్వపరిపూర్ణాప్రతిద్వంద్వబ్రహ్మబ్రహ్మచైతన్య
ప్రకాశస్వరూపమాత్రుండు నై ప్రకాశించు మఱియును. 183

తా. పైనజెప్పిన వైరాగ్యయుతుండును, బ్రహ్మజ్ఞానముగలవాడును చిత్తవిశ్రాంతియుతుండును అగు బ్రహ్మవిద్వరిష్ఠుడు కూటస్థచైతన్యస్వరూపమగు పరబ్రహ్మము యొక్క అపరోక్షజ్ఞానమను సూర్యకాంతిచే నశింపజేయబడినదియు, జననములేనిదియు వచింపనలవిగానిదియు అగు అంధకారమగున్నడును బ్రాహ్మణాదివర్ణములను ఆశ్రమములను ఆచారములను సర్వకర్మములను వదలినవాడును' సర్వదాచిత్తవిశ్రాంతియం దాసక్తి కలవాడును, ఇంద్రియసుఖముల్ వాంఛింపనివాడును, ప్రారబ్ధమున కధీనుడైనవాడును, తా నేపనికిని కర్తగానివాడును ప్రత్యగాత్మయగు తనయం దానందించువాడును, పరమాత్మ యగు తనయందానందించువాడును తనయందే ప్రీతిగలవాడును, దనతృప్తికి తానే కారణుడును, తన యానందమునకు దానే కారణుడును పాపకృత్యముల వదలినవాడును, శాంతఘోరమూఢవృత్తిరహితుడును ఇంద్రియనిగ్రహముగలవాడును, ధన్యుడును కలిగిన కలుగబోవువానియందు వాంఛలేనివాడును, శరీరేంద్రియవ్యాపారములకు భిన్నుడైనవాడును జరామరణములులేమి శరీరములేనివాడును సమస్తశరీరములందున నుండువాడును, శబ్దాదివిషయశూన్యుడును 14 యింద్రియముల జూచువాడును, ఆకలిదప్పులు లేనివాడగుటచే ప్రాణములేనివాడును సమస్తజంతువుల దమదమధర్మముల నడచునట్లుజేయువాడును 14 యింద్రియముల వెలుపలివ్యాపారమునువదలి తనయందు ప్రవర్తించునట్లు జేయువాడును, అజ్ఞానమును వదలినవాడును వివేకముగలవాడును, ఇతరులసహాయము కోరనివాడును, కూటస్థచైతన్యమందు నిశ్చయముగలవాడును తనువర్ణమునకుదగిన సత్ప్రవర్తనగాని అసత్ప్రవర్తనగాని గల్గియుండుటచేనైన మనోవికారములేనివాడును, బ్రహ్మచర్యాశ్రమముయొక్క సదాచారదురాచారములచే మనోవికారము లేనివాడును దూషణ భూషణములు మానాభిమానములుమున్నగు వివిధమనోవికారములు లేనివాడును, స్త్రీల యందునను ధనమునందునను కీర్తియందును, శాస్త్రాధ్యయనమునందు, పుణ్యతీర్థముల కేగు కోరిక, కీర్తికై యజ్ఞయాగాదు లొనరించువాంఛ తానెల్లకార్యముల నేయుచుంటినను కర్తృత్వము భోక్తృత్వము మున్నగు వాసనలయం దభిలాషలేనివాడును నేను బ్రహ్మము నెఱుంగుదు నను గర్వముగలవాడును పరిశుద్ధుడును, శాంతియుతుండును, పచ్చికతీగెలు మున్నగువాని వలె స్నేహద్వేషములు లేనివాడును, ప్రపంచవిలక్షణుడును, ప్రకృతితోగూడినదియు, త్రిగుణములుగల యహంకారయుతమయినదియు, పంచతన్మాత్రతోగూడినదియు 5 భూత

ములతోఁగూడినదియునగు నసత్యగంధర్వపట్టణమున కాశ్రియమయినవాఁడును, తనకు నరి యొక ఆధారములేనివాఁడును, కేవలజ్ఞానమను నాకాశము స్వరూపముగా గలవాఁడును, సచ్చిదానందమే ముఖ్యమయిన యాకృతిగాఁగలవాఁడును, తిరస్కరింపబడిన జీవభావము గలవాఁడును, శరీరములకును, ఇంద్రియములకును, త్రిగుణములకును విలక్షణుఁడును బ్రహ్మాదులుఁగోరదగిన సంచారముగలవాఁడును, ఆశాపాశముల విడచినవాఁడును, రాజ సతామసాహారముల గోరనివాఁడును, నిద్రనుజయించినవాఁడును ఆత్మబ్రహ్మమును పూజింప నాసక్తిగలవాఁడును, మౌనయుతసుఁత్రావృత్తి స్థానముగాగలవాఁడును పర బ్రహ్మముయొక్క సమాధినుండువాఁడును, వాంఛింపకుండఁగల్గు సుఖమున నాసక్తిగల వాఁడును, పరమాత్మయే స్తుతింపదగిన వస్తువుగాఁగలవాఁడును, పరబ్రహ్మమునందు ప్రవర్తనగలవాఁడును, తానే బ్రహ్మమను నైక్యముగలవాఁడును 14 యింద్రియముల వ్యాపారములు పరమాత్మస్వరూపమనువాఁడును తనకు పరమాత్మకు భిన్నముగాదోఁచిన నామరూపాదికములవిడచి నిర్వికల్పకసమాధియందుండువాఁడును జగమను యింద్రజాలము నకు సాక్షియును, పురుషార్థములపొందినవాఁడును విడువబడినదుఃఖములుఁగలవాఁడును, సంధి హోయిగలవాఁడును, మనస్సును స్వాధీనమునందుంచుకొనువాఁడును, మితభాషియు, దయ గలవాఁడును, యెల్లరకు స్నేహితుండును, సరళమయిన ఆచారాదులచే మనోహరుఁడును, మితాహారియు, యోగాభ్యాసమున గడితేరినవాఁడును, ద్వంద్వసహనుఁడును, జనసంచారము లేనిచోట నుండువాఁడును, కపటము ఆశలేనివాఁడును, ప్రారబ్ధముచేఁగల్గిన శరీరేంద్రియ వ్యాపారరూపములగు పుణ్యపాపములందు కర్తృత్వములేనివాఁడును, ప్రసన్నుఁడును, నవ్వు గల మోమువాఁడును, దుర్జనదూరుఁడును పండితగోష్ఠినుండువాఁడును సర్వపదార్థములయందు నీరసబుద్ధిగలవాఁడును, మేలుకీళ్లగు పనులకు దూరమయినవాఁడును వేదాంతశాస్త్రవిచార ముచే నీరు గావింపబడినవేదములు శాస్త్రములు ఆగమములు, పురాణములు నుపదేశించు గురువులు ఆగురూపదేశముచే దెలియబడిన యీశ్వరుఁడును శాస్త్రమందు విధింపబడిన కర్మములను వేదములచే నిషేధింపబడిన కర్మములు మొదలగువానియొక్క వాసనయగు అరణ్యముఁగల వాఁడును, దెలియబడనిదేహాదిచిహ్నములు గలవాఁడును, తెలియని నడవడి గలవాఁడును, ఒంటరిగా సంచరించువాఁడును, ఇల్లు లేనివాఁడును కొండగుహలసంచరించు వాఁడును, మృత్యుభయములేనివాఁడును, పరలోక భయరహితుఁడును, కపటరహితమయిన శుద్ధసత్వయుతుండును బుద్ధియుతుఁడును, ఆరోపాపవాదముల ఆశలేనివాఁడును, ప్రణవా తీతమయినదియు, సర్వత్ర నిండియుండునదియు నిరుపమానమయినదియు నగు పరమా త్మ ప్రకాశమే స్వరూపము గాఁగలవాఁడును నై ప్రకాశించును.

క. శాంతి వరకామధేనువు
సంతోషమె కల్పలత విషయవిరతి యగుఁ
జింతామణి యని నెమ్మదిఁ
జింతించు నతండు సుఖముఁ జెందు బుధేంద్రా.

తా. ఆంజనేయా! చిత్తవిశ్రాంతి కామధేనువుగను, బ్రహ్మానందము కల్పకముగను ఇంద్రియవ్యాపారములం దిచ్ఛలేకుండుట చింతామణిగను హృదయమున పరిగణించు పురుషుడు మోక్షమును బొందును.

తే. పరమతృష్ణను భయద వైతరణి గాఁగఁ
గామమును ఘోరతరనరకంబు గాఁగఁ
దారుణక్రోధమును దండధరుని గాఁగఁ
జూచు నాతండు నిర్వాణసుఖము నొందు.

తా. ఎవ్వడు ఆశను దాటనశక్యమైన వైతరణిగను, విషయసుఖాభిలాషలు నరకముగాను కోపమును యమునిగను నెంచునో యాతఁడు మోక్షమునొందును.

సీ. తతవియన్నీలవితానభూషిత మగ్ని
రవిచంద్రదీపవిరాజితంబు
నతులభూచక్రసింహాసనాలంకృతం
బనిలవ్యజనమరుద్వ్యాపితంబు
ధనికసేవకసేవితం బై తనర్చు జ
గత్పురంబున వివేకప్రకాశ
మానేంద్రియతురంగమానసప్రగ్రహ
బుద్ధిసారథియుక్తపురుశరీర
తే. మంజులరథాధిరూఢుఁ డై మహిమతోడ
నమరు బ్రజ్ఞాంగనాయుక్తుఁ డగుచు నిత్య
విభవుఁ డై సర్వజనము సేవించు చుండ 186
రాజయోగీశ్వరుం డలరారు ననఘ.

తా. ఆంజనేయా! విశాలమైన నాకాశమను మేల్కట్టుచే నలంకృతమైనదియు సూర్యచంద్రులను దీపములచే ప్రకాశించునదియు సెనలేనిభూమియను గద్దెగల్గినదియు, వాయువను విసనకర్రగాలి గల్గినదియు, సర్వత్రనిండియుండునదియు, దనయులగు భటులచే సేవింపబడునదియు,నై ప్రకాశించు లోకమను పట్టణమందు బ్రహ్మవేత్తప్రజ్ఞానముచే ప్రకాశించుచున్న యింద్రియములను హయములతోను మనస్సను పగ్గములతోను, ప్రజ్ఞయను రథచోదకునితోను గూడియున్న శరీరమను చక్కని రథమెక్కినవాడును మహిమాన్వితయగు నపరోక్షజ్ఞానమను తరుణీమణితుండైనవాడును, బ్రహ్మమను సంపదగలవాడును నై ప్రకాశించును.

## జీవన్ముక్తుని లక్షణము.

మ. అనపేక్షుం డసమానుఁ డై ధనికదీనాలాపముల్ వీనులన్
విన కే గర్మత దేహచేష్టల నొగిన్ వీక్షింపకే నిత్యముం
దనుఁ దాఁ జూచుచుఁ బావనాత్మకసుతీర్థ శ్రేణినత్యంతపా
వనముం గా నొనరించుచుం జెలఁగు జీవన్ముక్తుఁ డానందుఁ డై.

తా. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు సదా ఆనందముగలవాడును ఇహపరలోకభోగములందు వాంఛలేనివాడును, దీనుల ధనవంతులపల్కు లాదరింపక, యజ్ఞాదుల దిలకింపక సర్వదా ప్రత్యగాత్మమైన దన్ను దాను వీక్షించుకొనుచు మలినరహితములగు నిడాపింగళా సుషుమ్నాది నాడీమయములగు గంగాదిపుణ్యతీర్థ శ్రేణిని గడుంగడుపవిత్రమైనవిగా జేయుచుండును.

సీ. ఒకవేళ తనయందు సకలప్రపంచంబు
కల్పితం బని యెంచి కాంచి నవ్వు
నొకవేళ సర్వభూతోపాధితతియందుఁ
దనుఁ జూచి మిగుల సంతసముఁ జెందు
నొకవేళ దేహాదు లొప్పుగా విహరింప
సర్వసాక్షి నటంచు సంభ్రమించు
నొకవేళ నన్య మించుక లే దొకండ నే
నని నిర్వికల్పసమాధి నొందు

తే. నతులవైరాగ్యబోధోపరతుల గతులు
నతనిమహిమలు గణుతించి యభినుతింప
హరిహరహిరణ్యగర్భులకైనఁ దరమె
యపరిమితసద్గుణనికాయ యాంజనేయా. 188

తా. ఆంజనేయా ! బ్రహ్మవిద్వరిష్ఠుఁడు ఒకప్పుడు తనయందే విశ్వమంతయు సృజింపబడినదనితలంచి నవ్వును, ఒకపుడు పాంచభౌతికమగు శరీరముల సమూహమునందు నిండియున్న తన్ను గనుంగొని యానందమొందును. ఒకప్పుడు శరీరేంద్రియములు తమ వ్యాపారములందు సంచరించుచుండ వానినన్నిటిని దిలకించుచుంటినని దలంచి సంతసించు చుండును. ఒకప్పుడు తనకంటె నితరమగు వస్తువులేదనియు సర్వము తానై యుంటినని యు నిర్వికల్పనిష్ఠనుబొంది యసమానమగు వైరాగ్యమును, చిత్తవిశ్రాంతిని, అపరోక్ష జ్ఞానమును బొందును. కావున నాతని నభినుతింప బ్రహ్మవిష్ణుమహేశ్వరులకైన నలవి గాదు.

సీ. తనపాదధూళి సోఁకిన జరాచరము ల
త్యంతపావనములై యలరుచుండఁ
దనదునెమ్మేను సందర్శించుజనములు
నిష్పాపులై కడునెలయుచుండఁ
దను నిరంతర ముపాసనము సేయు మహాత్ము
లతులితైశ్వర్యంబు లనుభవింపఁ
దనయనుగ్రహము నొందిన భక్తులకు ముక్తి
కరతలామలకంబుకరణిఁ దోఁపఁ

తే. దనదువంశ్యులు మున్నేడుతరమువారు
స్వర్గమున దివ్యసుఖ మొంది సంతసింప
నార్యులు నుతింప బ్రిభువనాచార్యుఁ డగుచు
నెలమి విహరించు రాజయోగీశ్వరుండు. 189

తా. రాజయోగి తన పాదధూళిసోకినంతమాత్రమున సకలచరాచరంబులును మలిన రహితంబులగును. తనశరీరమునుజూచు మానవులు పాపరహితులై లోకమున నిండియుండు

ను, తన్ను సర్వకాలములనుపాసించువారు యణిమాద్యష్టైశ్వర్యముల ననుభవించుచుండు ను, తనయనుగ్రహము బడసినవారికి మోక్షమరచేతనుండగను తనవంశమందలి 21 తరముల వారు స్వర్గమున మహాభోగము లనుభవించుచుండగను, బ్రహ్మవేత్తలెల్లరును సంస్తుతింప ను ముల్లోకములకు జ్ఞానము నుపదేశించువాడే సచ్చిదానందము నందుచు సంచరించు చుండును.

వ. అట్టి జీవన్ముక్తుండు ప్రారబ్ధభోగావసానసమయంబున జలంబున జలంబు క్షీరంబున క్షీరంబు ఘృతంబున ఘృతంబు దేజంబున దేజం బాకాశం బునం దాకాశంబు పొందినచందంబున భూతకార్యంబు లైన చతు ర్వింశతితత్త్వంబు లాయా కారణంబులఁ గలయుచుండఁ దా వానితో దాదాత్మ్యంబు లేమింజేసి తమంబు దేజంబు గాక కేవలంబు దతంబు స్తిమితంబు గంభీరం బనాఖ్యం బనభివ్యక్తం బవాచ్యం బచింత్యంబు నిర్గుణంబు నిర్వికల్పంబు నిష్ప్రపంచానందమాత్రంబు సర్వశూన్యంబు సనాతనం బప్రమేయం బాదిమధ్యాంతవిరహితం బపర్యంతంబు హేతుదృష్టాంతవివర్జితంబు సర్వాధిష్ఠానం బీశ్వరావ్యాకృతహిరణ్య గర్భవిరాట్ప్రాజ్ఞతైజసవిశ్వరూపచిత్ప్రతిబింబప్రకాశభూతంబు బింబ ప్రతిబింబభావకల్పనావిరహితంబు పరిపూర్ణంబు నైన పరమమోక్ష స్వరూపంబునం బొందు సందేహంబు లేదు నీ విప్పు డట్టి మోక్ష స్వరూపమాత్రుండవుగావే యని యానతిచ్చి వెండియు నిట్లనియె.

తా. అట్టివాఁడు ప్రారబ్ధమంతయు నశించినపిమ్మట నీటియందున నీరును, పాల యందు పాలును, నేతిని నేయియు తేజమున తేజస్సును ఆకాశమున నాకాశమును చేరిన యట్లు పంచభూతముల కార్యములైన 24 తత్త్వములును అది జనించిన తత్త్వములందు జేరగా తన కా కార్యకారణములతో సంబంధము లేనందున ప్రకృతియు, జ్ఞానమును గాక ప్రధానమైనదియు, సర్వత్రనిండియున్నదియు, చలింపనిదియు, కేవలము అదృష్టము పై నాధారపడియుండునదియును, నామరూపరహితమైనదియును, ఇట్టి దట్టిదని వచింపరాని దియును, ఆలోచింప నసాధ్యమైనదియు, గుణరహితమైనదియు, సంకల్పములు వికల్పము లు లేనిదియును, జగద్విలక్షణమైన పరబ్రహ్మముయొక్క సుఖరూపమైనదియును, ప్రకృ తిరహితమైనదియును, నిత్యమైనదియును, ప్రమాణములచే దెలియదగినదియును, ప్రణవ

రూపంబగు విశ్వంబునకు ఆధారమైనది ఉత్పత్తిస్థితిలయములులేనిదియును, హద్దునతిక్ర మించినదియును, అనుమానప్రమాణముల దెలియదగినదియు, జీవేశ్వరులయొక్కయు పా ధులవలనగల్గిన విశ్వవ్యాకృతహిరణ్యగర్భుల జ్ఞానప్రకాశముయొక్క ప్రతిబింబములకు ప్ర కాశమును గలుగజేయునదియును, తనకంటె నితరములేనిదియు, పరిపూర్ణమైనదియు నగు విదేహకైవల్యమును పొందును. సంశయములేదు. ఇట్టి సమయమునందు నీవుకూడ నట్టిమో క్షమునే పొందగలవు.

శా. ఏవేళన్ భువి నెట్టిచోట మఱి యేయేబాధలం బొందుచున్
జీవన్ముక్తుఁడు దేహము న్విడిచినన్ సిద్ధంబనాద్యంతమున్
భావాతీతము నిర్వికల్పము పరబ్రహ్మాత్మకం బైన యా
కైవల్యంబును బొందు సత్య మనహంకారాత్మతత్త్వాత్మకా. 191

తా. ఆంజనేయా ! బ్రహ్మవిద్వరిష్ఠుడు భూమిపై దాననుభవింపవలసిన సుఖదుఃఖ ములన్నిటిని యనుభవించిన పిమ్మట నీస్థూలదేహమునువదలినపిమ్మట నిత్యమైనదియును, జననమరణములులేనిదియును వాక్కునకును మనస్సునకు అందనిదియును,సంకల్పవికల్పాదిక ములులేనిదియును ప్రకృతినతిశయించినదియును ఆత్మస్వరూపమైనదియును నగు మోక్ష మును బొందగలడు. ఇందున కెంతమాత్రమును సందేహములేదు.

వ. అని యుపదేశించి. 192

ఉత్సాహ. ఇదియె వేదశాస్త్రసార మిది యనంతసౌఖ్యదం
బిదియె రాజయోగశాస్త్ర మిదియె బ్రహ్మవిద్య మ
ద్హృదయ మిదియె దీని నిరత మెవ్వఁడేని భక్తితో
సదమలాత్ముఁ డగుచు మిగులఁ జదువ వినిన వ్రాసినన్. 193

తా. ఇట్లుపదేశించియు మరల నిట్లు జెప్పుచున్నాడు. వత్సా! నీకు నేనిపు డుపదే శించినదే వేదములయొక్కయు శాస్త్రములయొక్కయు సారము, దీనివలననే శాశ్వత మగు బ్రహ్మానందము చేకూరును. ఇదియే వేదాంతము, ఇదియే రాజయోగము, ఈగ్రం థము నెవ్వడు నిర్మలచిత్తుడై పఠించునో వ్రాయునో వినునో యాతడు (ముందుపద్యము తో నన్వయము.)

సుందరీవృత్తము. యుక్తియు నస్మ,ద్భక్తియు జీవ
న్ముక్తియు సాక్షా,న్ముక్తియుఁ గలుగున్. 194

తా. పరబ్రహ్మము నెఱుంగదగుమార్గమును, నాయందభిమానముగు, విదేహకైవల్య మును పొందును.

వ. అట్లు గావునఁ బరమేశ్వరుం డైన నా నెమ్మనంబునఁ బరమనిక్షేపం బుగాఁ బ్రకాశించు సర్వోపనిషత్సారభూతం బైన యీదివ్యజ్ఞానం బును మద్భక్తుండవు మత్పూజాపరుండవు మదర్పితమనోబుద్ధివి మ త్పరాయణుండవు నగుటం జేసి నీ కుపదేశించితి నింతకంటె నతిరహ స్యం బైన యర్థంబు నాడెందంబున లే దట్లగుట నిప్పరమార్థ తాత్ప ర్యంబు దెలిసి తమఃకూర్మంబు రజోమీనంబు క్రోధనక్రంబు గామ శైవాలంబు జన్మమరణతరంగంబు రోగబుద్బుదంబు లోభ ఫేనంబు మోహవేలయు దుఃఖాగాధజలప్రవాహగంభీరం బైన సంసారపారా వారంబు దరించి మోక్షపారంబు గాంచి కృతకృత్యుండ వై మత్స్వ రూపసమాధినిష్ఠుండ వై యానందింపు మని పలికిన నప్పవననంద నుండు సీతాదేవి లక్ష్మీదేవి యనియు లక్ష్మణుండు శేషుం డనియు భరతశత్రుఘ్నులు పాంచజన్యసుదర్శనంబు లనియు సింహాసనంబు సుపర్ణుం డనియు శ్రీరామచంద్రుం డాదినారాయణుం డనియు నిప్పు డుపదేశించిన పరబ్రహ్మతత్త్వజ్ఞానంబు సకలవేదశాస్త్రపురాణాగ మేతిహాసస్మృతిసారం బనియు నెఱింగి పరమానందకందళితహృద యారవిందుం డై యా శ్రీసీతారామాచార్యుల చరణారవిందంబుల కనేకవందనంబులు గావించి నిలువఁబడి కరకమలంబులు ముకుళించి నిరతిశయవినయపూర్వకంబుగా ని ట్లనియె. 195

తా. కావున నామనస్సున గొప్పదగు నిధివలె ప్రకాశించు వేదవేదాంతసారమగు యీపరోక్షజ్ఞానమును నాకు పరమభక్తుడవును ననుబూజించుట యందాసక్తి గలడవాడ వును నాయందే సమర్పింపబడిన మనోబుద్ధులుగలవాడవును నాయందే స్థిరమైన స్థానము గలవాడవును అగుటవలన నీకు జెప్పియుంటిని. ఇంతకంటె నీకు జెప్పవలసినదిలేదు. కా వున తమోగుణమను తాబేళ్లుగలదియును, రజోగుణమను చేపలుగలదియును వాంఛలను పాచిగలదియును మడ్వ్విధవికారములను కెరటములుగలదియును రోగములను బుద్బుదం

బులు గలదియును లోభమను సుడుగు, భ్రమయనుగట్టు, దుఃఖములను నీటివెల్లువలు గలదియు సాతాళమును అంటెకులోతు గలదియు అగు సంసారమను సముద్రమును దాటి మోక్షమనుగట్టును బొందును అట్లగుటచే ధన్యుడవును, నాయందునికి గలవాడవును, నై సంతోషింపుము. అని వివరింపగా నాంజనేయుఁడు సీతలక్ష్మియనియు, లక్ష్మణుఁడు శేషువనియు, భరతశత్రుఘ్నులు శంఖచక్రములనియు, సింహాసనము గరుత్మంతుఁడనియు శ్రీరాముఁడు పరబ్రహ్మమనియు తనకుపదేశింపబడిన సకలవేదాంతసారము, సమస్తపురాణసారమనియు సమస్తేతిహాససారమనియు, 28 ఆగమములసారమనియు, పదునెనిమిది స్మృతులసారమనియు తెలిసి మిక్కిలిగా సంతోషించినవాడై సీతారాముల చరణారవిందములకు పెక్కుసాష్టాంగ నమస్కరించి అంజలిబద్ధుడై యిట్లనియెను.

ఆంజనేయుఁడు శ్రీరాముని వినుతించుట.

క. శ్రీరామ రామ రామ ర
మారామామణిమనోరమారమణా శ్రీ
నారాయణ నారాయణ
నారాయణ నిజసహస్రనామస్తుత్యా. 196

తా. బ్రహ్మవిద్యతో క్రీడించువాఁడా! విశ్వోత్పత్తిస్థితిలయములే విలాసములగు క్రీడలు గాఁగలవాఁడా! సమస్తయోగులహృదయాంతరముల నీవును నీయందు సమస్తయోగులును క్రీడించువాడా, లక్ష్మీమనఃకమలమున విహరించువాఁడా! నరజన్యములగు యవ్యక్తాదులకు నీవును నీకు తత్త్వములును పరస్పరాశ్రయముగలవాడా! అపరోక్షజ్ఞానమునకు స్థానమైనవాడా శబ్దగమ్యుడా! నిజనామసహస్రముచే పూజింపదగినవాడా!

శ్లో. దేహబుద్ధ్యాస్మి దాసోఽహం, జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వ మేవాహ, మితి మే నిశ్చితామతిః. 197

తా. రామచంద్రా! నేను శరీరమని తలంచుటచే నీకు సేవకుడనైతిని, జరామరణములుగూడిన జీవుడనను తలంపున నీయంశము గలవాడనైతిని. నేను పరబ్రహ్మమనెడి బుద్ధిచే నీవే నేనైతిని, అని తనమనోగతంబును పావని ప్రకటించెను:

వ. అని పల్కి సాదరంబుగా ననుజ్ఞాతుండై నిజాశ్రమంబున కరిగి యా హనుమంతుం డొక్కపరమైకాంతస్థలంబున సుఖాసీనుండై శ్రీరామ చరణకమలభక్తి యుక్తుండును శ్రీరామనామజపపరాయణుండును

శ్రీరామబ్రహ్మతత్త్వావలోకననిరతిశయనిర్వికల్పసమాధినిష్ఠుండు నై
జీవన్ముక్తిసుఖం బనుభవించుచు నిమ్ముహూర్తంబున నున్నవాఁ డని
పలికి శ్రీమహాదేవుం డప్పార్వతీదేవి కిట్లనియె. 198

తా. ఇట్లుపల్కి ఆంజనేయుఁడు సీతారాములచే సెలవుగైకొని తన యాశ్రమమునకేగి యాతఁడొక యేకాంతస్థలమున నాసీనుఁడై శ్రీరామపాదసరసీజములయందు భక్తిగలవాడును, శ్రీరామమంత్రమును జపించువాడును, సీతారాములయొక్క తత్త్వంపదములను పదములందు విశ్వాసముగలవాడును, రామమంత్రసంస్మరణమునం దాసక్తిగలవాడును, శ్రీరామచంద్రుడను పరబ్రహ్మముయొక్క యథార్థావలోకనమందు చలింపనిదగు నిష్ఠగలవాడును, నేను జీవుడనుగాను పరమాత్మనాదునని తలంచి యానందముతో నిప్పుడున్నాడు. అని శంకరుఁడు పార్వతికి జెప్పియుండెను.

ఆ. మంత్రమంత్రార్థమంత్రాభిమానదేవ
తాస్వరూపంబులను నీకు దెల్పఁ గేను
నెఱుఁగ నుపదేశ మిచ్చితి నింతకంటె
ఘననిధానంబు లేదు నామనమునందు. 199

తా. పార్వతీ! నే నిపుడు నీకు రామమంత్రముయొక్కయు రామమంత్రాభిప్రాయముయొక్కయు మంత్రాధిదేవతయగు రామచంద్రునియొక్కయుఁ పరబ్రహ్మముయొక్కయు, స్వభావములను సవిస్తరముగా నెఱింగించితిని నాయందింతకంటె నెక్కుడగు నిక్షేపమేదియునులేదు అని శంకరుఁడు పల్కెను.

క. నిఖిలకలుషసంక్షయకర
మఖిలాభీష్టప్రదం బనంతావ్యయచి
త్సుఖదము జగదధిపత్యాభి
ముఖకర మగు మంత్రరాజము మహాదేవీ. 200

తా. పార్వతీ! అన్నిటను త్తమమగు నీరామమంత్రము సమస్తజననమరణకారణములగు ఘోరపాపముల నశింపజేయును. వాంఛితముల నొసంగును, ఇంతంతనరానిదియు నాశనరహితమైనదియు, అగు బ్రహ్మజ్ఞానానందముల నిచ్చునదియు వివయేంద్రియముల కధిదేవతారూపములగు ముల్లోకములకు ప్రభువగు పరమాత్మసాక్షాత్కార మొసంగునదియు నై యున్నది.

సీ. బహుజన్మసంచితపాపంబులు నశించు
విమలధర్మము లభివృద్ధి నొందు
నాయురారోగ్యంబు లధికంబులై యొప్పఁ
బటుతరైశ్వర్యసంప్రాప్తి యగును
ధృతియును గీర్తియుఁ దేజంబు బలమును
శాంతిదాంతిక్షమార్జవము లబ్బు
ధనధాన్యపుత్రపౌత్రకళత్రబాంధవ
పశుగజాశ్వాదిసంపదలు గలుగుఁ

తే. బుడమిలో నెన్నిసద్గుణంబులు చెలంగు
నన్నిగుణములు బ్రాపించు నార్తితోడ
సతత మీరామహృదయంబు చదువుకొనుచుఁ
దద్విచారంబు గావించు ధన్యులకును. 201

తా. శ్రద్ధాభక్తులతో నీరామహృదయమును చదువుట తదర్థనిచారణ సేయుట సేయువారలకు అనేకజన్మములనార్జించిన పాపము పటాపంచలగును, నిర్మలమగు పుణ్యకర్మములు లభించును,ఆయురారోగ్యములు గల్గును. సంపద, ధైర్యము, కీర్తి, భక్తి, చిత్తోపరతి, ఇంద్రియనిగ్రహము ఓర్పు, సత్ప్రవర్తనము, లభించును, ధనధాన్యము, పుత్రమిత్ర, కళత్రాదులు, పాడిపంటలు లభించును, ఇవియేగాక ఇహలోకసంబంధములగు సుగుణములన్నియు లభించును.

క. శ్రీరామహృదయమును బ
ల్మారు నీక్షించు బుధసమాజంబుసకుఁ
శ్రీరామతత్త్వసాక్షా
త్కారం బగుఁ గలుగుఁ బరమకైవల్యంబున్. 202

తా. ఈశ్రీరామహృదయమును పఠించినవారికి శ్రీరామమంత్రముయొక్క యథార్థస్వరూపమెఱుక బడును. ఇంతియెగాక కైవల్యముగూడ లభించును.

క. ఆతతముగ నెఱిఁగించితి
సీతారామాంజనేయ కేచిత్సంవాదం
బీతత్త్వామృత మాని ని
రాతంకసుఖాబ్ధి నోలలాడుము గిరిజా.. 203

తా. పార్వతీ! చిచ్ఛక్తిరూపిణియగు సీతకును పరబ్రహ్మమగు శ్రీరామునకును ప్రత్యగాత్మమైన పావనికిని జరిగిన ఐక్యజ్ఞానరూపమగు సంభాషణ నెఱింగించితిని. ఈ బ్రహ్మానందామృతమును గ్రావి యానందసముద్రమునఁ దేలి యాడుము.

వ. అని పలికి యయ్యనాదిదంపతులు రామబ్రహ్మానందామృతరసపాన మదపరవశులై యన్యోన్యాలింగనంబులు గావించి పరమసుఖైకస్వరూపులై నిజచరణకమలసేవాసక్తులైన భక్తుల రక్షించుచుఁ బ్రకాశించు చుండి రంత. 204

తా. అని శంకరుఁడుబల్కి యాగౌరీశంకరులు రామపరబ్రహ్మము స్మరించినంతనె గల్గు ఆనందామృతమును గ్రావి మత్తతచే పరవశులై పరస్పరాలింగనము లాచరించుచు బ్రహ్మానందస్వరూపమాత్రులై తమపాదపద్మములసేవించు భక్తుల సంరక్షించుచుండిరి.

మత్తకోకిల.

నీవు నాహృదయాంబుజంబున నిల్చి భానునిఁ బోలె నిర్మలంబుగ నెల్లప్పుడున్ ...

నీవు నాహృదయాంబుజంబున నిల్చి భానునిక్రైవడిం
గేవలాత్మవివేకమున్ వెలిఁగించుచుం బ్రకటింపఁగాఁ
బావనం బగు రాజయోగము పల్కితిం దగ శ్రీమహా
దేవ సద్గురురాయ కావుము దీని నీయిల రంజిల్లన్. 205

తా. శ్రీమహాదేవగురురాయా! నీవు నాహృదయమునందుండి సూర్యునివలె నఖండమైన బ్రహ్మజ్ఞానమును ప్రకాశింపజేయుచుండగా నీజీవబ్రహ్మైక్యజ్ఞానమును జెప్పితిని గాన యియ్యది పుడమిపై శాశ్వతముగనుండి వ్యాప్తమగునట్లు గావింపుము.

శా. దత్తాత్రేయగురుస్వరూప నిజభక్తాంత స్తమోదీప స
చ్చిత్తానందకరానులాప ఖమరుచ్చిత్రాంశువాహ్యాప ధీ
వృత్తిత్యాగకలాప నిత్యముఖసంవిద్వ్యాప శుద్ధాత్మశ
శ్వత్తేజోభిహతాదిపాప సుజనేష్టప్రాపకా వ్యాపకా. 206

తా. దత్తాత్రేయుని యాకారముగలవాఁడా! భక్తజనుల యజ్ఞానమను చీకటికి దీపమువంటివాఁడా! జ్ఞానదాయకముగను, ఆనందదాయకముగను సంభాషించువాఁడా! పంచభూతములను రక్షించువాఁడా! బుద్ధివ్యాపారములను వదలుటయే యాభరణముగా గలవాఁడా! శాశ్వతముగు బ్రహ్మానందమందు జ్ఞానముచే వ్యాప్తినొందువాఁడా! ప్రత్య గాత్మయొక్క వెలుంగుచున్న జ్ఞానమున నశింపబడిన జననమను పాపముగలవాఁడా! సజ్జనవాంఛితార్థముల నొసగూర్చువాఁడా! సర్వత్ర నిండియుండువాఁడా!

క. ప్రణవాత్మక సదసత్కా
రణ సంపూర్ణప్రభాభిరామ సగుణని
ర్గుణనిర్వికారనారా
యణసీతారామగురుమహాదేవ శివా. 207

తా. ఓంకారస్వరూపుడా! లోకోత్పత్తి స్థితిలయకారణా సర్వత్రా వ్యాపించి నదివ్యకాంతిగలవాఁడా! అనంతకళ్యాణగుణములతోఁగూడినవాఁడా! ప్రకృతి గుణరహితుఁ డా మడ్విధవికారములును లేనివాఁడా! పరమాత్మస్వరూపా నిత్యమంగళ స్వరూపుఁడగు సీతారామస్వరూపముగలవాఁడా!

మాలినీ. ఘనతరసువివేకా కల్పితాశేషలోకా
వినమితబుధలోలా విశ్వవిఖ్యాతలీలా
జననుతగుణతంత్రా సర్వతంత్రస్వతంత్రా
మునిసరసిజమిత్రా మోక్షలక్ష్మీకళత్రా. 208

తా. ఉత్తమమైన యపరోక్షజ్ఞానముగలవాఁడా! లోకముల సృజించినవాఁడా! వినమ్రులగు పండితులయెడ నాదరముగలవాఁడా! విశ్వమునఁ బాదర్శకమైన ప్రవర్తనగల

వాఁడా! జనులచే నభినుతింపదగు త్యాగభోగాదికములే పరివారముగా గలవాఁడా! శాస్త్రములయందు కర్తృత్వముగలవాఁడా! ముక్తికాంతయే భార్యగాఁగలవాఁడా!

గద్యము.

ఇది శ్రీమన్నారాయణమహాదేవగురుకరుణాకటాక్షవీక్షణవిమలీకృత నిజ హృదయకమలకర్ణికాంతస్సంవర్ధితాఖండసచ్చిదానందరసైక స్ఫూర్తి షట్చక్రసీతారామమూర్తి పరశురామపంతు లలింగమూర్తి గురుమూర్తి ప్రణీతం బైన శ్రీసీతా రామాంజనేయసంవాదం బను యోగశా స్త్రంబునం దమనస్కయోగానుభవ విచారం బనునది తృతీయాశ్వాసము.

సంపూర్ణము.



